# భారతదేశ చరిత్ర

## శివాజీ

**మధ్యయుగ భారతదేశ చరిత్రలో ప్రముఖ స్థానాన్ని అలంకరించిన కొద్దిమంది వ్యక్తుల్లో శివాజీ ఒకరు. ఇతడు కొత్త మరాఠా రాజ్యం 'స్వరాజ్యం' స్థాపనకు కారకుడు. శివాజీ జున్నార్ సమీపంలోని శివనేర్ దుర్గంలో 1627లో జన్మించాడు. షాజీభోంస్లే, జిజాబాయి ఇతడి తల్లిదండ్రులు. తల్లి వైపు నుంచి యాదవ వంశానికి, తండ్రి వైపు నుంచి మేవాడ్‌ను పాలించిన శిషోదయ వంశానికి చెందినవాడు.**

షాజీభోంస్లే అహ్మద్‌నగర్‌ను పాలించిన నిజాంషాహీ పాలకుడి వద్ద సైన్యాధ్యక్షుడిగా పనిచేశాడు. మొగలులు అహ్మద్‌నగర్‌ను ఆక్రమించిన తర్వాత షాజీ బీజాపూర్ రాజ్యానికి వచ్చాడు. ఈ కాలంలో షాజీ తన మొదటి భార్య జిజాబాయిని, కొడుకు శివాజీని నిర్లక్ష్యం చేశాడు. కర్ణాటక ప్రాంతంలో ఒక జాగీరును ఏర్పాటుచేశాడు. శివాజీ, అతడి తల్లి పూనా జాగీర్‌లో ఉండేవారు.

★ జిజాబాయి అసామాన్యమైన తెలివితేటలున్న మహిళ. ఆమె శివాజీకి భారతం, రామాయణాల్లోని వీరోచిత గాథలను వర్ణిస్తూ, హిందూ మతానికి జరిగిన నష్టాన్ని వివరించేది. ఈ విధంగా తల్లి ద్వారా, సమకాలీన మతబోధకుల ద్వారా ప్రభావితమైన శివాజీ హిందూ మత రక్షణ కోసం దీక్ష వహించాడు.

★ శివాజీ చిన్నతనం నుంచే గొప్ప ధైర్యసాహసాలు కలిగి ఉండేవాడు. జిజాబాయితోపాటు పూనా జాగీరు పాలకుడు దాదాజీ కొండదేవ్ శివాజీ బాల్య జీవితంలో కీలకపాత్ర పోషించాడు. ఇతడు శివాజీకి పరిపాలన, యుద్ధ విద్యల్లో శిక్షణ ఇచ్చాడు.

★ శివాజీ తన మతగురువైన సమర్ధ రామదాసు నుంచి స్ఫూర్తి పొందాడు. ఇతడు 'కన్నతల్లి, జన్మభూమి స్వర్గం కంటే గొప్పవ'ని శివాజీకి బోధించాడు.

★ శివాజీ మావళీల సహాయంతో ఒక శక్తిమంతమైన సంచార సైన్యాన్ని రూపొందించాడు. దక్కన్ సుల్తానుల బలహీనత, ఉత్తర భారతదేశంలో మొగలుల నిరంతర దండయాత్రలు శివాజీ తన బలాన్ని పెంచుకోవడానికి అవకాశం కల్పించాయి.

★ పూనా దగ్గరలోని తోరణ, కొండనే, రాయగఢ్ గిరి దుర్గాలను శివాజీ ఆక్రమించుకున్నాడు. దాదాజీ కొండదేవ్ మరణం తర్వాత శివాజీ పూనా జాగీరుకు యజమాని అయ్యాడు. జావళి కోట ఆక్రమణతో 1646 లో శివాజీ తన నిజమైన దండయాత్రల పర్వాన్ని ప్రారంభించాడు.

★ జావళి కోట లోపల దాచిన నిధులను స్వాధీనం చేసుకోవడం ద్వారా శివాజీ ఆర్థిక పరిస్థితి మెరుగుపడింది. ఈ సందర్భంగా శివాజీ మావళీ పదాతిదళ బలాన్ని పెంచి, బీజాపూర్ రాజ్యంలో అంతర్భాగంగా ఉన్న పూనా పరిసర ప్రాంతాల్లోని అనేక గిరి దుర్గాలను ఆక్రమించాడు. దీంతో బీజాపూర్ సుల్తాన్ శివాజీ దూకుడుకు కళ్లెం వేయాలని నిర్ణయించాడు. తన కొలువులో పనిచేస్తున్న శివాజీ తండ్రి షాజీని అరెస్టు చేసి, నిర్బంధించాడు.

★ దీనికి ప్రతిగా శివాజీ దక్కన్‌లో మొగల్ వైస్రాయి అయిన మురాద్‌ని కలిసి మొగల్ సర్వీసులో చేరడానికి తన సంసిద్ధతను వ్యక్తం చేశాడు. దీన్ని గమనించిన బీజాపూర్ సుల్తాన్ శివాజీ తండ్రిని నిర్బంధం నుంచి విడిపించాడు.

★ 1649 నుంచి 1655 వరకు ఆరు సంవత్సరాలపాటు శివాజీ ఎలాంటి ఆక్రమణలకు పాల్పడలేదు. ఈ కాలంలో శివాజీ తన పరిపాలనను, సైన్యాన్ని పునర్వ్యవస్థీకరించడం ద్వారా తన అధికారాన్ని సుస్థిరం చేసుకున్నాడు. 1655 తర్వాత మళ్లీ బీజాపూర్ రాజ్యంపై దండయాత్రలు ప్రారంభించాడు. దీన్ని సహించలేని బీజాపూర్ సుల్తాన్ శివాజీని కట్టడి చేయాలని నిర్ణయించుకున్నాడు. అఫ్జల్ ఖాన్ అనే సేనాని ఆధ్వర్యంలో పెద్దసంఖ్యలో సైన్యాన్ని పంపి శివాజీని సజీవంగా కానీ, శవంగా కానీ తీసుకురమ్మన్నాడు.

★ అఫ్జల్ ఖాన్ శివాజీని నేరుగా కలవడానికి ఆహ్వానం పంపాడు. తద్వారా బీజాపూర్ సుల్తాన్ శివాజీకి క్షమాభిక్ష ప్రసాదించేలా చేస్తానని ప్రమాణం చేశాడు. దీనిలో ఏదో కుట్ర ఉందని భావించిన శివాజీ ముందు జాగ్రత్తతో వ్యవహరించి, అఫ్జల్ ఖాన్‌ను సంహరించాడు. ఈ విజయంతో ఉత్తేజం పొందిన శివాజీ, అతడి మావళీ సైనికులు శక్తిమంతమైన పన్హాలా కోట, దక్షిణ కొంకణ్, కొల్హాపూర్‌లను ఆక్రమించారు. దీంతో శివాజీ మరాఠా ప్రజల దృష్టిలో నిజమైన నాయకుడయ్యాడు.

★ శివాజీ సైన్యంలో చేరడానికి వివిధ ప్రాంతాల నుంచి ప్రజలు ముందుకు వచ్చారు. బీజాపూర్ సుల్తాన్ సైన్యంలో పనిచేస్తున్న అఫ్గన్‌లు సైతం శివాజీ వైపు చేరారు. బీజాపూర్ సుల్తాన్ శివాజీని అడ్డుకోవడానికి మూడుసార్లు విఫలయత్నం చేశాడు. చివరికి శివాజీతో సంధి కుదుర్చుకుని అతడు ఆక్రమించిన భూభాగాలకు పాలకుడిగా అతడిని గుర్తించాడు.

### మొగలులతో వైరం..

శివాజీ భూభాగాలపై దాడి చేయమని దక్కన్‌లోని మొగల్ వైస్రాయ్ షయిస్తఖాన్‌ను ఔరంగజేబ్ ఆదేశించాడు. ఈ విషయంలో షయిస్తఖాన్‌కు తోడ్పడమని బీజాపూర్ సుల్తాన్‌ను కోరాడు. బీజాపూర్, మొగల్ సైన్యాలు కలిసి పన్హాలాపై దాడిచేసి ఆక్రమించుకున్నాయి. ఈ దశలో శివాజీ బీజాపూర్ సుల్తాన్‌తో ఒక అవగాహనకు రావడంతో అతడీ దండయాత్రపై పెద్దగా శ్రద్ధ చూపలేదు. అయినా శివాజీకి ఎదురుదెబ్బలు తప్పలేదు.

- ★ పూనా మొగలుల వశమైంది. తర్వాత శివాజీకి చెందిన కొంకణ్ ప్రాంతాన్ని మొగలులు ఆక్రమించారు. ఈ దశలో శివాజీ ధైర్యంగా అర్ధరాత్రి షయిస్తఖాన్ విడిదిపై మెరుపుదాడి చేశాడు. ఈ దాడిలో బొటనవేలు పోగొట్టుకున్న షయిస్తఖాన్ ప్రాణాలతో బయటపడ్డాడు. అతడి కుమారుడు దాడిలో మరణించాడు. ఈ దాడితో శివాజీ ప్రతిష్ఠ బాగా పెరిగింది.
- ★ తర్వాత శివాజీ పశ్చిమ తీరంలో సంపన్నమైన సూరత్ ఓడరేవుపై దాడిచేసి విలువైన ఆస్తిని కొల్లగొట్టాడు. స్థానిక ఆంగ్లేయ, డచ్ స్థావరాలు శివాజీ దండయాత్రను విజయవంతంగా ఎదుర్కొన్నారు.

### పురంధర్ సంధి

ఔరంగజేబ్ దక్కన్ వైస్రాయ్‌గా ఉన్న షయిస్తఖాన్‌ను బెంగాల్ వైస్రాయ్‌గా పంపాడు. అంబర్‌కు చెందిన రాజా జైసింగ్‌ను శివాజీని నియంత్రించేందుకు నియమించాడు. జైసింగ్ తన తెలివితేటలతో శివాజీ రాజ్యంపై అన్నివైపుల నుంచి శత్రువులు దాడి చేసేలా ఏర్పాట్లు చేశాడు. పురందర్ కోటను ముట్టడించాడు. మొగలులు శివాజీ రాజధాని రాయగఢ్‌ను దిగ్బంధం చేశారు. గత్యంతరం లేక శివాజీ 1665 లో జైసింగ్‌తో పురందర్ సంధిని కుదుర్చుకున్నాడు.

### సంధి షరతులు

- ★ శివాజీ తన అధీనంలోని 35 కోటల్లో 23 కోటలతోపాటు వాటి పరిసర ప్రాంతాల్లో సంవత్సరానికి 4 లక్షల హన్నుల ఆదాయం వచ్చే భూభాగాన్ని మొగలులకు ఇవ్వడానికి అంగీకరించాడు.
- ★ దీనికి బదులు సంవత్సరానికి 4 లక్షల హన్నుల ఆదాయం వచ్చే బీజాపూర్ - కొంకణ్ ప్రాంతంలోని భూభాగాన్ని, బాలాఘాట్ ప్రాంతంలో సంవత్సరానికి 4 లక్షల హన్నుల ఆదాయం వచ్చే భూభాగాన్ని మొగలులు శివాజీకి ఇచ్చారు. దాని కోసం శివాజీ కంతులవారీగా 40 లక్షల హన్నులు మొగలులకు చెల్లించాలి.
- ★ శివాజీ కుమారుడు శంభాజీ ఔరంగజేబ్ కొలువులో మున్సబుదారుగా చేరడానికి అంగీకారం కుదిరింది.
- ★ ఈ సంధి షరతుల్లో అంతర్భాగంగా శివాజీ మొగల్ దర్బారును సందర్శించడానికి అంగీకరించాడు. మొగల్ దర్బారులో ఏవిధమైన అగౌరవం జరగకుండా చూస్తానని, ఔరంగజేబ్‌కి సిఫారసు చేసి, దక్కన్ వైస్రాయ్‌గా నియమించేలా చూస్తానని రాజా జైసింగ్ శివాజీకి హామీ ఇచ్చాడు. శివాజీ ఔరంగజేబ్ దర్బార్ వైభవాన్ని, మొగలుల బలాబలాలను స్వయంగా చూడాలని భావించి ఈ షరతుకు ఒప్పుకున్నాడని ప్రొఫెసర్ సర్దేశాయ్ పేర్కొన్నారు.
- ★ శివాజీ తన కుమారుడు శంభాజీతోపాటు 1666 మే 9 న మొగల్ దర్బారును సందర్శించాడు. అయితే దర్బార్‌లో చక్రవర్తి శివాజీకి తగిన గౌరవం ఇవ్వలేదు. దీంతో ఆగ్రహానికి గురైన శివాజీ చక్రవర్తిని దూషించాడు. ఔరంగజేబ్ శివాజీని అరెస్టు చేయించి, ఆగ్రా కోటలో నిర్బంధించాడు. తగిన సలహా కోసం రాజా జైసింగ్‌కు లేఖ రాశాడు. దీనిపై ఒక నిర్ణయం తీసుకునేలోపే శివాజీ నిర్బంధం నుంచి తప్పించుకున్నాడు.

### శివాజీ పట్టాభిషేకం..

- ★ శివాజీ 1666 నుంచి 1669 మధ్య మూడేళ్లపాటు ఎలాంటి కార్యక్రమాలు చేపట్టలేదు. తర్వాత మొగలులతో వైరాన్ని పునరుద్ధరించి సూరత్‌పై రెండోసారి దాడిచేసి 66 లక్షల రూపాయల విలువైన సంపదను స్వాధీనం చేసుకున్నాడు. పురందర్ సంధి షరతుల ప్రకారం మొగలులకు ఇచ్చిన 23 కోటలను వారి నుంచి తిరిగి ఆక్రమించుకున్నాడు.
- ★ మొగల్ సామ్రాజ్యంలోని వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో అఫ్గన్‌లు జరిపిన తిరుగుబాటు శివాజీ స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించడానికి బాగా దోహదపడింది. దక్కన్‌లోని మొగల్ సైన్యంలోని కొంతభాగాన్ని వాయవ్య సరిహద్దు రాష్ట్రానికి తరలించారు. దీంతో శివాజీ బీరార్, ఖాందేష్‌లను మొగలుల నుంచి, పన్హాలా, సతారాలను బీజాపూర్ సుల్తాన్ నుంచి తిరిగి స్వాధీనం చేసుకున్నాడు.
- ★ 1674 జూన్ 16 న రాయగఢ్ దుర్గంలో శివాజీ పట్టాభిషేక మహోత్సవం ఎంతో వైభవంగా జరిగింది. ఈ సందర్భంగా శివాజీ ఛత్రపతి బిరుదును స్వీకరించాడు. ప్రముఖ విద్వాంసుడు, కాశీ పండితుడైన గార్గభట్టు అధ్యక్షతన ఎనిమిది మంది పురోహితుల సమక్షంలో ఈ పట్టాభిషేకం జరిగింది. శివాజీ తన స్థానాన్ని బలోపేతం చేసుకోవడానికి ఇతర మరాఠా సర్దారులతో వివాహ సంబంధాలను ఏర్పరచుకున్నాడు.

### దక్షిణదేశ దండయాత్రలు

మొగలులు వాయవ్య భాగంలో తిరుగుబాట్లతో సతమతమవడం శివాజీకి కలిసొచ్చింది. శివాజీ గోల్కొండ సుల్తాన్ అబ్దుల్ హసన్ సహాయంతో బీజాపూర్, కర్ణాటకలపై దండయాత్ర చేశాడు. కర్ణాటకలో లభించే ఆదాయాన్ని రెండు రాజ్యాలు పంచుకునే నిబం

ధన ప్రకారం అబ్దుల్ హసన్ శివాజీకి సైనిక సహకారం అందించాడు. అనంతరం శివాజీ తన సోదరుడు వెంకోజీ ఆధీనంలోని జింజీ, వెల్లూరులను ఆక్రమించాడు.

ఈ దండయాత్రలో స్వాధీనం చేసుకున్న సంపదను పంచుకునే విషయంలో శివాజీకి, గోల్కొండ సుల్తాన్‌కి మధ్య విభేదాలు తలెత్తాయి. శివాజీ 1680 లో మరణించాడు. శివాజీ రాజ్యం పశ్చిమతీరంలో కల్యాణ్ నుంచి గోవా వరకు విస్తరించింది. దక్షిణాన బెల్గాం నుంచి తుంగభద్రా నదీతీరం వరకు, మద్రాసు రాష్ట్రంలోని వెల్లూరు, జింజీ వరకు విస్తరించింది.

**నమూనా ప్రశ్నలు**

**1.** శివాజీ ఎవరిని తన గురువుగా పరిగణించాడు?

ఎ) దాదాజీ కొండదేవ్ బి) సమర్థ రామదాసు సి) తుకారాం డి) ఏకనాథ్

**2.** గొరిల్లా యుద్ధ విధానాన్ని మరాఠాలు ఎవరి నుంచి గ్రహించారు?

ఎ) మీర్‌జుమ్లా బి) మాలిక్ అంబర్ సి) మాలిక్ కపూర్ డి) మీర్జాఫర్

**3.** కిందివారిలో శివాజీపై ఎక్కువ ప్రభావం చూపిన వ్యక్తి ఎవరు?

ఎ) షాజీభోన్‌స్లే బి) జిజాబాయి సి) దాదాజీ కొండదేవ్ డి) జాదవరావ్

**4.** 1674 లో శివాజీ పట్టాభిషేకం ఎక్కడ జరిగింది?

ఎ) రాయగఢ్ బి) పురంధర్ సి) ప్రతాపగఢ్ డి) సూరత్

**5.** శివాజీని సంహరించడానికి బీజపూర్ సుల్తాన్ పంపిన సైన్యాధికారి?

ఎ) ఖఫీఖాన్ బి) అఫ్జల్‌ఖాన్

సి) షయిస్తఖాన్ డి) సమీర్‌ఖాన్

**6.** శివాజీ పూనాను ఏ సంవత్సరంలో ఆక్రమించాడు?

ఎ) 1660 బి) 1662 సి) 1664 డి) 1666

**7.** శివాజీ మొదటిసారి సూరత్‌పై దాడి సమయంలో మొగల్ ఫౌజ్‌దార్?

ఎ) ఇనాయత్‌ఖాన్ బి) షయిస్తఖాన్

సి) హుసేన్‌ఖాన్ డి) జమీల్‌ఖాన్

**8.** శివాజీని ఓడించిన మొగల్ సైన్యాధికారి?

ఎ) రాజా మాన్‌సింగ్ బి) రాజా జైసింగ్

సి) రాజా భగవాన్‌సింగ్ డి) రాజా కున్వర్‌సింగ్

**9.** శివాజీ ఆగ్రాను సందర్శించిన సంవత్సరం?

ఎ) 1660 బి) 1662 సి) 1664 డి) 1666

**10.** ఔరంగజేబ్ కాలంలో బెనారస్‌లో ధ్వంసమైన ప్రసిద్ధ దేవాలయం?

ఎ) విశ్వేశ్వర్ బి) శ్రీకృష్ణ సి) విష్ణు డి) దుర్గ

**జవాబులు**

1-బి; 2-బి; 3-బి; 4-ఎ; 5-బి; 6-ఎ; 7-ఎ; 8-బి; 9-డి; 10-ఎ.

**- భాస్కర్ వేడియం**

# భారతదేశ చరిత్ర

## అలెగ్జాండర్ దండయాత్ర - ఫలితాలు

**అలెగ్జాండర్ గ్రీకు దేశంలోని మాసిడోనియా రాజు ఫిలిప్ కుమారుడు. గ్రీకు వేదాంతి అరిస్టాటిల్ శిష్యుడు. ప్రముఖ విజేతలైన హెర్క్యులస్, సైరస్‌ల మాదిరి గొప్ప విజేత, సామ్రాజ్యాధినేత కావాలన్నది అలెగ్జాండర్ ఆశయం. క్రీపూ. 336లో తండ్రి ఫిలిప్ మరణానంతరం 20 సంవత్సరాల యుక్త వయసులో సింహాసనం అధిష్ఠించాడు. పటిష్ఠమైన సైన్యాన్ని ఏర్పాటు చేసుకుని గ్రీకు, పర్షియా, ఈజిప్ట్, ఆసియా మైనర్ లాంటి ప్రాంతాలను జయించాడు.**

అలెగ్జాండర్ క్రీ.పూ. 334-330 మధ్య కాలంలో పర్షియాతో యుద్ధాలు చేశాడు. అప్పటి పర్షియా రాజు డేరియస్ బలహీనుడు. యుద్ధంలో నేర్పరి కూడా కాకపోవడంతో అలెగ్జాండర్ పురోగమనాన్ని అడ్డుకోలేకపోయాడు. ఆసియా మైనర్, సిరియా, ఈజిప్ట్‌లను ఆక్రమించి క్రీ.పూ. 331 లో అర్బేలా యుద్ధంలో డేరియస్‌ను ఓడించాడు. అలెగ్జాండర్ పెర్సిపోలిస్ నగరాన్ని ధ్వంసం చేశాడు.

★ తన విజయాలకు చిహ్నంగా అలెగ్జాండ్రియా అనే పట్టణాన్ని నిర్మించాడు. పర్షియా పరిసర ప్రాంతాలన్నిటినీ ఆక్రమించి, అఫ్గనిస్థాన్, బాక్ట్రియాలను కూడా ఓడించి 'ఘనత వహించిన పర్షియా చక్రవర్తి' అనే బిరుదు స్వీకరించాడు.

*భారతదేశంపై దండయాత్ర (క్రీ.పూ. 327):*

అలెగ్జాండర్ భారతదేశంపై చేసిన దండయాత్ర వివరాలను తెలుసుకోవడానికి గ్రీకు రచనలే ఆధారం. ఈ రచయితల్లో కొందరు అలెగ్జాండర్‌తో వచ్చినవారైతే, మరికొందరు అతడి సమకాలీకులు. అలెగ్జాండర్ తర్వాత అతడి దండయాత్రపై అనేక రచనలు వెలువడ్డాయి.

★ ఏరియన్ కర్టియస్ తను రాసిన 'అనాబాసిస్ ఆఫ్ అలెగ్జాండర్' అనే గ్రంథంలో ఈ దండయాత్రను ఘనమైన విజయంగా వర్ణించాడు.

★ బనిసిక్రిటిస్ అనే రచయిత అలెగ్జాండర్ జీవితచరిత్ర రచించాడు.

★ అలెగ్జాండర్‌తోపాటు భారతదేశానికి వచ్చిన గ్రీకు శాస్త్రవేత్తలు, తత్త్వవేత్తలు, సైనికాధికారులు కూడా అలెగ్జాండర్ చేసిన ప్రతి యుద్ధాన్ని వివరణాత్మకంగా వర్ణించారు.

*అలెగ్జాండర్ దండయాత్రకు కారణాలు:*

అలెగ్జాండర్‌కు సామ్రాజ్య విస్తరణకాంక్ష అధికం. ప్రపంచమంతా జయించి, విశ్వ విజేత కావాలనేది అతని ఆశయం. దానికి అవసరమైన చొరవ, సాహసం, ధైర్యం అతడికి అపారంగా ఉండటంతో దండయాత్రకు సిద్ధమయ్యాడు.

★ తూర్పు, పశ్చిమ దేశాలతో సాగుతున్న వ్యాపారాన్ని సురక్షితం చేయాలనేది అలెగ్జాండర్ అభిలాష.

★ భారతదేశంలోని ప్రకృతి వనరులు, సిరిసంపదలు దోచుకోవాలనే కోరిక కూడా దండయాత్రకు ముఖ్య కారణం.

★ పర్షియా సామ్రాజ్యంలో అత్యంత సుసంపన్నమైన రాష్ట్రంగా పేరుగాంచిన వాయవ్య భారతదేశాన్ని జయించకపోతే తన పర్షియా సామ్రాజ్య విజయం పరిపూర్ణం కాదని అలెగ్జాండర్ భావించాడు.

★ గ్రీకు దేశ ప్రతినిధిగా, గ్రీకు నాగరికతను తూర్పు దేశాలకు వ్యాపింపజేయడం తన ప్రధాన లక్ష్యంగా నిర్ణయించుకున్నాడు.

★ అలెగ్జాండర్ నాటి ప్రముఖ గ్రీకు తత్త్వవేత్త అరిస్టాటిల్ శిష్యరికంలో అనేక వినూత్న భావాలను సంతరించుకున్నాడు. ప్రపంచంలోని గొప్ప వీరుల్లా సాహసకృత్యాలు చేయాలని, విశ్వవిజేతగా ఘనకీర్తి పొందాలనే కోరిక వల్ల భారతదేశంపై దండయాత్రకు సిద్ధమయ్యాడు.

### హైడాస్పస్ యుద్ధం (క్రీపూ. 326)

ఈ యుద్ధానికి మరో పేరు 'జీలం' యుద్ధం. జీలం - చినాబ్‌ల మధ్య ఉన్న పోరస్ రాజ్యంపై క్రీ.పూ. 326 లో అలెగ్జాండర్ దాడి చేశాడు. ఈ సమయంలో తక్షశిల రాజైన అంభి అలెగ్జాండర్‌కు స్వాగతం పలికాడు. జీలం నది అవతల పంజాబ్ రాజ్యం ఉండేది. ఈ రాజ్యానికి రాజు పురుషోత్తముడు. పురుషోత్తముడికి, అలెగ్జాండర్‌కు స్వాగతం పలికిన అంభికి మధ్య శత్రుత్వం ఉండేది. పురుషోత్తముడి మీద పగ తీర్చుకోవడానికే అంభి అలెగ్జాండర్‌తో రాజీపడి, లొంగిపోయాడు.

★ అలెగ్జాండర్ సైనికులు జీలం నదిని దాటి పురుషోత్తముడి సేనలతో తలపడ్డారు. ఈ యుద్ధాన్నే హైడాస్పస్ యుద్ధం అంటారు. ఈ భీకర యుద్ధంలో చివరకు అలెగ్జాండర్ గెలిచాడు. పురుషోత్తముడిని బందీగా పట్టుకుని తన ముందు తల వంచమని ఆదేశించాడు. పౌరుషానికి మారుపేరైన పురుషోత్తముడు అందుకు అంగీకరించలేదు. అలెగ్జాండర్ అతడి ధైర్యసాహసాలను మెచ్చుకుని అతడి రాజ్యాన్ని అతడికే ఇచ్చేశాడు.



R-28-05-16

★ ఆ తర్వాత అలెగ్జాండర్ కొన్ని చిన్న రాజ్యాలను, గణ రాజ్యాలను కూడా జయించాడు. అయితే వరుస యుద్ధాలతో అతడి సైనికుల్లో అసంతృప్తి రగిలింది. చివరికది అలెగ్జాండర్ ఆదేశాన్ని ధిక్కరించే స్థితికి చేరుకుంది. దాడులకు స్వస్తి చెప్పి స్వదేశం బయలుదేరాలని సైనికులు చేసిన సూచనను అలెగ్జాండర్ అంగీకరించి స్వదేశానికి వెనుదిరిగాడు. దారి మధ్యలో జ్వరపీడితుడైన అలెగ్జాండర్ క్రీ.పూ. 323 లో బాబిలోనియాలో కన్నుమూశాడు.

*భారతీయుల ఓటమికి కారణాలు:*

అలెగ్జాండర్ భారతదేశం మీద దండెత్తే నాటికి వాయవ్య భారతదేశంలో అనేక చిన్న రాజ్యాలు ఉండేవి. వీటిలో కొన్ని గణ తంత్ర, మరికొన్ని స్వతంత్ర రాజ్యాలు. ఈ రాజ్యాల మధ్య నిరంతరం యుద్ధాలు, శత్రుత్వాలు ఉండేవి. వీరు పరస్పర అసూయ, ద్వేషాల వల్ల సమైక్యంగా విదేశీ శత్రువులను ఎదుర్కోలేకపోయారు.

★ సంఖ్యాబలం అధికంగా ఉన్నప్పటికీ విదేశీ సైనికుల యుద్ధ నైపుణ్యం, వ్యూహ రచన, క్రమశిక్షణ భారతీయుల ఓటమికి కారణమ య్యాయి. భారతీయ సైనికులకు సరైన నాయకత్వం లేకపోవడం కూడా ఒక కారణమే.

★ పంజాబ్ ప్రాంతంలోని చిన్నచిన్న తెగలకు చెందిన రాజ్యాలు తెగువ, ధైర్యసాహసాలతో పోరాడినప్పటికీ, వారికి తగిన వ్యూహ రచన, యుద్ధతంత్ర నిర్వహణ లోపించడంతో ఓటమి పొందక తప్పలేదు. తెగల రాజ్యాల వారికి సంఘటితమైన సైనిక వ్యవస్థ లేకపోవడం వల్ల ఎవరికి వారే అన్నట్లు శత్రువులను ఎదుర్కొని ఓటమి పాలయ్యారు.

★ వాయవ్య భారతదేశంలోని రాజ్యాలు, గణతంత్ర రాజ్యాల పాలకుల్లో సమష్టిగా వ్యవహరించాలనే భావన లేదు. మాతృదేశాన్ని విదేశీయుల దాడి నుంచి కాపాడాలనే ఉద్దేశం కొరవడింది.

★ భారతీయుల ఓటమికి సైనిక వ్యవస్థలో లోపాలు ప్రధాన కారణంగా కనిపిస్తాయి. భారతీయ సైన్యాలు యుద్ధ నిర్వహణలో గజ దళాలకు ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చాయి. గ్రీకుల అశ్విక దళం మెరుపు దాడుల నిర్వహణలో చురుకుగా పనిచేస్తూ గజ సైన్యా లను చికాకుపరిచింది. అందువల్ల భారతీయ సైనిక దళంలో చురుకుదనం లోపించి, శత్రువుల వ్యూహాలను ఛేదించలేకపోయారు. ఇది గ్రీకు సైనికుల విజయాన్ని సులభం చేసింది.

★ గ్రీకులు వినియోగించిన ఆయుధాలు, విల్లంబులు తేలికగా ఉండేవి. భారతీయ సైనికుల ఆయుధాలు, విల్లంబులు పరిమాణంలో పెద్దవిగా, బరువుగా ఉండటం కూడా ఒక ప్రధాన లోపంగా పేర్కొనవచ్చు.

★ గ్రీకు సైనికులు అనుభవజ్ఞులు. యుద్ధనైపుణ్యం ఉన్న సైనికాధికారులు నాయకత్వం వహించారు. ముఖ్యంగా అలెగ్జాండర్ స్వయంగా యుద్ధాల్లో పాల్గొని, సైనికులకు నాయకత్వం వహించి, విజయమే తన ఆశయంగా, దైవనిర్ణయంగా ప్రకటించేవాడు. ఇది సైన్యంలో మానసిక, నైతిక స్థైర్యం కలిగించి, వారి విజయానికి ముఖ్య కారణమైంది.

**క్రీ.పూ. 6వ శతాబ్దంలో ఉన్న షోడశ మహా జనపదాలు - వాటి రాజధానులు**

| మహా జనపదం | | రాజధాని | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. అంగ రాజ్యం | - | చంపానగర్ | 6. కాశి | - | వారణాసి | 11. మత్స్య | - | విరాట్ నగరం |
| 2. అస్సక (లేదా) అశ్మక | - | పోతన్(బోధన్) | 7. కోసల | - | శ్రావస్తి | 12. మగధ | - | రాజగృహ |
| 3. అవంతి | - | ఉజ్జయిని | 8. కాంభోజ | - | రాజపురం | 13. మల్ల | - | కుశి నగరం, పావ |
| 4. చేది | - | శుక్తిమతి | 9. కురు | - | ఇంద్రప్రస్థం | 14. శూరసేన | - | మధురా నగరం |
| 5. గాంధార | - | తక్షశిల | 10. పాంచాల | - | అహిచ్ఛత్ర (కపిలవస్తు) | 15. వత్స | - | కోశాంబి |
| | | | | | | 16. వజ్జి | - | వైశాలి |

**అలెగ్జాండర్ దండయాత్ర ఫలితాలు**

అలెగ్జాండర్ దండయాత్ర వల్ల నూతన భౌగోళిక మార్గాల అన్వేషణకు అవకాశం ఏర్పడింది. ఫలితంగా ప్రాచీన యూరప్, ప్రాచీన భారత దేశాల మధ్య సన్నిహిత సంబంధాలకు మార్గం ఏర్పడింది.

★ భారతదేశానికి, పశ్చిమ దేశాలకు మధ్య సముద్రయానాలు, భూతల మార్గయానాలు ప్రారంభమయ్యాయి.

★ గ్రీకు రచనల ఆధారంగా చంద్రగుప్త మౌర్యుడు అలెగ్జాండర్ సమకాలీకుడని తెలుస్తోంది. గ్రీకు పర్యటకుల రచనలు భారతదేశ చరిత్ర రచనకు తోడ్పడ్డాయి.

★ భారతదేశంలో రంగస్థలం, శిల్పం, ఖగోళ శాస్త్రం లాంటివి అభివృద్ధి చెందాయి.

★ గ్రీకులతో సంబంధాల వల్ల భారతదేశంలో నాణేల ముద్రణ స్థాయి పెరిగింది.

★ భారతీయ, గ్రీకు శిల్ప రీతుల సమ్మేళనంతో గాంధారశైలి అనే ఒక నూతన శిల్ప శైలి ఆవిర్భవించింది.

**- సి. రామాంజులు**

# భారతదేశ చరిత్ర

## నూతన మతోద్యమాల ఆవిష్కరణ - జైన, బౌద్ధ మతాలు

**క్రీస్తు పూర్వం 6వ శతాబ్దంలో భారతదేశంలో అనేక మత ఉద్యమాలు ఆవిర్భవించాయి. అందులో ముఖ్యమైనవి జైన మతం, బౌద్ధ మతం. ఈ రెండు మతాలు భారతదేశ ఆచార, సంప్రదాయాలను, సంస్కృతిని గణనీయంగా ప్రభావితం చేశాయి. భారతదేశంలోనే కాకుండా చైనా, పర్షియా, గ్రీకు దేశాల్లో కూడా ఈ కాలంలోనే తీవ్రమైన చింతనలు, అన్వేషణలు కొనసాగాయి.**

భారతదేశంలో వర్ధమాన మహావీరుడు, గౌతమ బుద్ధుడు, పర్షియాలో జోరాస్టర్, గ్రీక్ దేశంలో సోక్రటీస్, చైనాలో కన్ఫ్యూషియస్, లావోట్జ్‌లు మత ఉద్యమాలకు నాయకత్వం వహించారు.

*జైన, బౌద్ధ మతాలు ఆవిర్భవించడానికి కారణాలు:*

★ వైదిక మతంలోని లోపాలు క్రీ.పూ. 6వ శతాబ్దం నాటికి క్లిష్టంగా మారాయి. ఆర్యుల మతాన్ని సామాన్యులు పాటించడానికి, అర్థం చేసుకోడానికి సాధ్యం కాలేదు.

★ యజ్ఞాలు, యాగాలు, ఇతరేతర కర్మకాండలు హిందూ మతంలోకి ప్రవేశించి మతాన్ని మరింత సంక్లిష్టంగా మార్చాయి.

★ మత కర్మకాండ నిర్వహించడం ఖర్చుతో కూడిన పనిగా మారింది. కుల వ్యవస్థ పటిష్టం అయ్యింది.

★ సమాజంలో బ్రాహ్మణులు, పురోహితులు ప్రత్యేక సౌకర్యాలు అనుభవించేవారు. సామాన్య ప్రజల్లో వారి పట్ల అసంతృప్తి పెరిగింది.

★ ఆర్యుల నియమ నిబంధనలు సంస్కృతంలో ఉండేవి. ఆ రోజుల్లో సంస్కృతం సామాన్యుల భాష కాదు.

★ నిమ్నకులాల వారిని బ్రాహ్మణులు, క్షత్రియులు చిన్నచూపు చూసేవారు.

ఈ పరిస్థితుల నుంచి ఏదో ఒక ఉపశమనం కోసం ప్రజలు వేచి చూస్తున్న సమయంలో జైన, బౌద్ధ మతాలు ఆవిర్భవించాయి.

### జైన మతం

జైనమతం చాలా పురాతన కాలం నుంచి ఉందని చారిత్రక ఆధారాలను బట్టి తెలుస్తోంది. జైన సాహిత్యం ప్రకారం జైన మతంలో 24 మంది తీర్థంకరులు ఉన్నారు. వీరిలో తొలి 22 మంది తీర్థంకరులు పౌరాణిక వ్యక్తులు. కానీ 23వ తీర్థంకరుడైన పార్శ్వ నాథుడు, 24వ తీర్థంకరుడైన వర్ధమాన మహావీరుడు చారిత్రక పురుషులు.

★ చారిత్రకంగా జైన మత స్థాపకుడు పార్శ్వనాథుడు. ఇతడు కాశీ రాజైన అశ్వసేనుడి కుమారుడు. 30 ఏళ్ల గృహస్థ జీవనం గడిపిన తర్వాత సన్యాసం స్వీకరించి, 83 రోజులు కఠోర తపస్సు చేసి జ్ఞానాన్ని పొందాడు. పార్శ్వనాథుడు నాలుగు సిద్ధాంతాలను ప్రతిపాదించాడు. అవి...

**1. అహింస 2. సత్యం 3. అస్తేయం (దొంగతనం చేయరాదు) 4. అపరిగ్రహం (ఆస్తి ఉండకూడదు)**

ఈ నాలుగు సూత్రాలకు అదనంగా అయిదో సూత్రమైన బ్రహ్మచర్యాన్ని మహావీరుడు జోడించాడు.

### వర్ధమాన మహావీరుడు

24 మంది తీర్థంకరులలో చివరివాడు వర్ధమానుడు. ఇతడు వైశాలి సమీపంలోని కుంద అనే గ్రామంలో జ్ఞాత్రిక క్షత్రియ వంశంలో జన్మించాడు. మహావీరుడికి యుక్త వయసులోనే యశోదతో వివాహం జరిగింది.

★ మహావీరుడు తన 30వ ఏట సన్యాసం స్వీకరించాడు. ఆరేళ్లు దిగంబర యోగిగా తపస్సు చేసి విఫలుడై గోసాలుని శిష్యత్వం స్వీకరించాడు. మరో ఆరేళ్లు గడిచిన తర్వాత రిజుపాలిక నదీ తీరాన జృంభక గ్రామం వద్ద సాల వృక్షం కింద తపస్సు ప్రారంభించాడు. మహావీరుడు తన 42వ ఏట జ్ఞానోదయం పొంది జినుడయ్యాడు. జినుడు అంటే పంచేంద్రియాలను జయించినవాడు అని అర్థం.

★ జ్ఞానోదయం పొందిన తర్వాత వర్ధమాన మహావీరుడు ఏడాదిలో ఎనిమిది మాసాలు దేశాటన చేస్తూ తన సిద్ధాంతాలను ప్రజలకు బోధించాడు. మిగిలిన మాసాల్లో వైశాలి, చంప, రాజగృహ, శావస్తి, మిథిల పట్టణాలలో కాలం గడిపేవాడు. ఈ నగరాలు జైనమత వ్యాప్తిని సూచిస్తాయి. తన 72వ ఏట పట్నా జిల్లాలోని పావాపురిలో హస్తిపాలుడనే రాజు గృహంలో మహావీరుడు నిర్యాణం పొందాడు.

### మహావీరుని ముఖ్య బోధనలు

★ మానవ జీవితానికి, దాని సాఫల్యానికి మహావీరుడు మూడు ముఖ్యాంశాలను సూచించాడు. అవి 1) సరైన విశ్వాసం. 2) సరైన

జ్ఞానం. 3) సరైన నడవడిక. వీటినే త్రిరత్నాలుగా పేర్కొన్నాడు. మొదటిది మహావీరుని బోధనలను విశ్వసించడం, రెండోది మహావీరుని బోధనలను సరిగ్గా అర్థం చేసుకోవడం, మూడోది జైనమతంలో చెప్పిన పంచ సూత్రాలను తప్పనిసరిగా పాటించడం.

★ మహావీరుడు భగవంతుని నమ్మలేదు.

★ కర్మ సిద్ధాంతాన్ని నమ్మాడు. ఆత్మకు పునర్జన్మ ఉందని కూడా గాఢంగా విశ్వసించాడు.

★ సామాజిక సమానత్వానికి ప్రాధాన్యం ఇచ్చాడు.

★ మహావీరుడు వేదాల ప్రామాణికతను నిరాకరించాడు.

★ ప్రపంచంలో జీవ, ఆత్మ ఉన్నాయి. జీవుని అంతిమ లక్ష్యం పునర్జన్మ నుంచి బయటపడి నిర్యాణం పొందటమే.

## బౌద్ధ మతం

బౌద్ధ మత స్థాపకుడు గౌతమ బుద్ధుడు. ఇతడు క్రీ.పూ. 563 లో లుంబిని గ్రామంలో (ప్రస్తుత నేపాల్‌లో) జన్మించాడు. ఇతడి తండ్రి శాక్య తెగ అధిపతి శుద్ధోదనుడు, తల్లి కోలియాల తెగకు చెందిన మాయాదేవి. గౌతమ బుద్ధుడి తొలిపేరు సిద్ధార్థుడు. పుట్టిన కొద్దిరోజుల్లోనే తల్లి మరణించడం వల్ల మహా ప్రజాపతి గౌతమి చేతుల్లో పెరిగాడు. అందుకే గౌతముడనే పేరు వచ్చింది.

★ బుద్ధుడికి యుక్త వయసులోనే యశోధర అనే రాకుమార్తెతో వివాహం జరిగింది. వీరికి రాహులుడనే కుమారుడు జన్మించాడు.

★ గౌతముడు కొంత కాలం గృహస్థ జీవితం గడిపి, ప్రపంచంలో ప్రజలు అనుభవించే కష్టాలను చూసి కరిగిపోయాడు. అతడి మనసు ప్రపంచంలోని దుఃఖం, వృద్ధాప్యం, మరణంవంటి కష్టాలవైపు మళ్లింది. ఒక వ్యాధిగ్రస్తుడిని, వృద్ధుడిని, అనాథను, శవాన్ని చూసిన తర్వాత అతడిలో మానసిక ఆందోళన, అశాంతి పెరిగాయి.

★ తన 29వ ఏట భార్యను, కుమారుడిని, కుటుంబాన్ని వదలి కష్టాలను నివారించే సత్యాన్వేషణ కోసం సన్యాసం స్వీకరించాడు. ఉరువేల అనే ప్రదేశంలో అన్నపానాదులు మానేసి కఠోర తపస్సు చేశాడు. అతడి అన్వేషణ ఫలించలేదు. అందువల్ల సన్యాసం నిరర్థకమని భావించి దాన్ని వదలివేశాడు.

★ తర్వాత ధ్యాన నిమగ్నుడై ప్రపంచంలోని దుఃఖాలకు కారణాలను, పరిష్కార మార్గాలను అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాడు. ఒక రోజు గయ ప్రాంతంలో నిరంజన నదిలో స్నానం చేసి రావి చెట్టు కింద ధ్యాన నిమగ్నుడై ఉండగా బుద్ధుడు జ్ఞానోదయం పొందాడు. తర్వాత కాలంలో ఆ ప్రాంతం 'బుద్ధగయ' పేరుతో ప్రసిద్ధ బౌద్ధ క్షేత్రంగా మారింది.

★ జ్ఞానోదయం పొందిన తర్వాత బుద్ధుడు సారనాథ్ వద్ద మృగవనంలో అయిదుగురు శిష్యులకు తన మొట్టమొదటి సందేశాన్ని అందించాడు. ఈ ప్రవచనాన్ని ధర్మచక్ర పరివర్తన అంటారు.

★ తర్వాత 5 ఏళ్లు తాను కనుక్కున్న సత్యమార్గాన్ని బోధించాడు. ఈ కాలంలో బుద్ధుడు ఉత్తర, మధ్య భారతదేశంలోని అనేక ప్రాంతాల్లో పర్యటించి తాను పొందిన సత్యమార్గాన్ని బోధించాడు. వేలాదిమంది ప్రజలు ఇతనికి శిష్యులయ్యారు. కుశి నగరంలో తన 80వ ఏట తనువు చాలించాడు.

## బుద్ధుడి బోధనలు..

బుద్ధుడు నాలుగు ఆర్య సత్యాలు ప్రవచించాడు. అవి...

1. ప్రపంచమంతా దుఃఖమయం.
2. దుఃఖానికి కారణం కోరిక లేదా తృష్ణ.
3. దుఃఖ నివారణ - అంటే కోరికలను జయించటం.
4. దుఃఖ నివారణ మార్గం.

★ దుఃఖ నివారణను సాధించడానికే దుఃఖానికి కారణమైన కోరికను త్యజించాలనీ, అందుకు అష్టాంగ మార్గాలను పాటించాలనీ బుద్ధుడు బోధించాడు.

అష్టాంగ మార్గంలో 8 సూత్రాలు ఉన్నాయి. అవి

1) సమ్యక్ వాక్కు 2) సమ్యక్ క్రియ 3) సమ్యక్ జ్ఞానం 4) సమ్యక్ శ్రమ
5) సమ్యక్ ఆలోచన 6) సమ్యక్ ధ్యానం 7) సమ్యక్ నిశ్చయం 8) సమ్యక్ దృష్టి.

★ ఈ 8 సూత్రాలను బాగా అర్థం చేసుకుని, వాటిని పాటించడంద్వారా మనశ్శాంతిని, జ్ఞానాన్ని పొందవచ్చని బౌద్ధమతం చెబుతుంది.

## బౌద్ధ మతం ప్రధాన లక్షణాలు

★ బౌద్ధ మతం భగవంతుడి ఉనికిని గుర్తించదు. భారతీయ మతచింతన చరిత్రలో ఇది నిజంగానే విప్లవం లాంటిది.

★ బుద్ధుడు ఆత్మ ఉనికిని కూడా అంగీకరించలేదు. వేదాల ప్రామాణికతను నిరాకరించాడు.

★ బౌద్ధ మతం సమానత్వాన్ని ప్రతిపాదించింది.

★ కుల వ్యవస్థను నిరాకరించింది. ముఖ్యంగా నిమ్న కులాల వారికి కూడా ఆశ్రయమిచ్చింది.

★ స్త్రీలను గౌరవించింది.

★ అహింసకు ప్రాధాన్యం ఇవ్వడంతో ముఖ్యంగా స్త్రీలు, నిమ్న కులాలవారు ఆకర్షితులయ్యారు.

★ బుద్ధుడు పాళీ భాషకు ప్రాధాన్యం ఇచ్చాడు. పాళీ భాషలోనే మత సిద్ధాంతాలను బోధించాడు. ఆనాటి సామాన్య ప్రజల భాష పాళీ. సంస్కృతంతో పోలిస్తే పాళీ భాష సామాన్య ప్రజలకు సులభంగా అర్థమవుతుంది.

### జైన, బౌద్ధమతాల మధ్య పోలికలు

★ ఈ రెండూ విప్లవ మతాలు. వైదిక మతంలోని కర్మకాండలకు, జంతుబలులకు, మూఢ విశ్వాసాలకు వ్యతిరేకంగా ఉద్యమాలు నిర్వహించాయి.

★ సత్యం, అహింస, దయ మొదలైన సుగుణాలను పాటించడం ద్వారా మానవుడికి ఆత్మ సంస్కారం, జ్ఞాన సముపార్జన; జీవ కారుణ్యం ద్వారా మోక్షం లభిస్తాయని బోధించాయి.

★ జైన, బౌద్ధ మతాలు వేదాలు ప్రామాణిక గ్రంథాలు కావనీ, యజ్ఞయాగాది క్రతువుల వల్ల మోక్షం లభించదనీ విశ్వసించాయి. వర్ణ వ్యత్యాసాలను ఖండిస్తూ సర్వ మానవ సమానత్వ సిద్ధాంతాన్ని ప్రవచించాయి.

★ జైన, బౌద్ధ మతాలకు దేవుడి ఉనికిపై విశ్వాసం లేదు. అందువల్ల ఆడంబరాలతో కూడిన పూజలను ప్రోత్సహించలేదు.

★ ఉపనిషత్తులు చెప్పిన కర్మ, పునర్జన్మ, మోక్ష సిద్ధాంతాలను అంగీకరించాయి.

★ ఈ మతాలు తమ సిద్ధాంతాలను ప్రజలకు అర్థమయ్యే పాళీ, అర్ధ మాగధి వంటి స్థానిక భాషల్లోనే బోధించాయి.

★ జైన, బౌద్ధమతాలు ఉత్తర భారతదేశంలోనే ఆవిర్భవించాయి.

★ నైతిక విలువలకు అత్యంత ప్రాధాన్యం ఇచ్చాయి.

### జైన, బౌద్ధ మతాల మధ్య తేడాలు

| జైన మతం | బౌద్ధ మతం |
|---|---|
| 1. జైనమతం ప్రతి ప్రాణితోపాటు ప్రతి జడ పదార్థానికి కూడా ఆత్మ ఉంటుందని విశ్వసించింది. | 1. బౌద్ధ మతం ఆత్మ ఉనికిని గుర్తించలేదు. |
| 2. కఠినమైన అహింసా వ్రతాన్ని అనుసరించింది. తీవ్ర ఉపవాసాలు, సల్లేఖనం మోక్షానికి మార్గాలుగా సూచించింది. | 2. బౌద్ధ మతం ప్రబోధించిన అహింసా సిద్ధాంతం సాధారణమైంది. ఆచరణ యోగ్యమైంది. |
| 3. జైనమతం శ్వేతాంబరులు, దిగంబరులు అనే శాఖలుగా విడిపోయింది. | 3. మహాయానం, హీనయానం అనే రెండు విభాగాలుగా విడిపోయింది. |
| 4. జైనులు మోక్ష సాధనకు త్రిరత్నాలు, పంచమహా వ్రతాలు మార్గాలుగా సూచించారు. | 4. అష్టాంగ మార్గం ద్వారా మోక్షం సాధించవచ్చు. |
| 5. జైనమతం సనాతన సాంప్రదాయాలలో ఎలాంటి మార్పులు లేకుండా కొనసాగింది. | 5. కాలానుగుణంగా మార్పులు చెందుతూ, అవసరాలకు అనుగుణంగా చేర్పులు చేస్తూ విశేషమైన ప్రజాదరణ పొందింది. |
| 6. జైనమతానికి రాజుల పోషణ అధికంగా లభించలేదు. అందువల్ల విదేశాల్లో వ్యాపించలేదు. | 6. ఈ మతానికి రాజుల పోషణ అధికంగా ఉంది. అందువల్ల విదేశాల్లో కూడా విస్తరించి 'అంతర్జాతీయ మతం'గా గుర్తింపు పొందింది. |
| 7. జైనమతం వ్యక్తి ఔన్నత్యం మీద ఆధారపడింది. | 7. బౌద్ధ మతం సమాజ విశిష్టత మీద దృష్టిని కేంద్రీకరించింది. |

- సి. రామాంజులు

# భారతదేశ చరిత్ర

## బ్రిటిష్ గవర్నర్ జనరల్స్

**క్రీ.శ. 1750 నుంచి 1857 వరకు భారతదేశ చరిత్ర తూర్పు ఇండియా కంపెనీ చరిత్రతో ముడిపడి ఉంది. ఈ కాలంలో అనేక మంది గవర్నర్ జనరల్స్ భారతదేశాన్ని పాలించారు. వీరికాలంలోనే భారతదేశంలో అనేక రాజకీయ, సామాజిక పాలనాపరమైన సంస్కరణలు జరిగాయి. బ్రిటిష్ గవర్నర్ జనరల్స్ పాలనా కాలంలో జరిగిన ముఖ్య సంఘటనలను సంక్షిప్తంగా తెలుసుకుందాం.**

### రాబర్ట్ క్లైవ్

రాబర్ట్ క్లైవ్ క్రీ.శ. 1757 నుంచి 1760 వరకు, తిరిగి 1765 నుంచి 1767 వరకు బెంగాల్ గవర్నర్‌గా వ్యవహరించాడు.

★ 1765 లో బెంగాల్‌లో ద్వంద్వ పాలనను ప్రవేశపెట్టాడు. తూర్పు ఇండియా కంపెనీ ఉద్యోగులు ప్రైవేట్ వ్యాపారాలు చేయడాన్ని నిషేధించాడు.

★ తెల్ల సైనికులను అరెస్ట్ చేయడం ద్వారా అలహాబాద్, మోంఘిర్‌లలో తిరుగుబాట్లను అణచివేశాడు.

### వారన్ హేస్టింగ్స్ (1772-85)

బెంగాల్‌లో 1772 లో ద్వంద్వ పాలనను రద్దు చేశాడు.

★ రెగ్యులేటింగ్ చట్టం ద్వారా 1773 లో బెంగాల్ గవర్నర్ జనరల్‌గా నియమితుడయ్యాడు.

★ కలెక్టర్లు, ఇతర రెవెన్యూ అధికారులను నియమించాడు. జిల్లా స్థాయిలో దివాని, ఫౌజ్‌దారి కోర్టులను ప్రారంభించాడు. కలకత్తా (కోల్‌కతా)లో సాదర్ దివాని, నిజామత్ కోర్టులను ప్రారంభించాడు. రెగ్యులేటింగ్ చట్టం ద్వారా కలకత్తాలో సుప్రీంకోర్టును స్థాపించాడు. దీనికి ఎలిజా ఇంఫే మొదటి ప్రధాన న్యాయమూర్తిగా నియమితుడయ్యాడు.

★ బ్రిటిష్ వారి సహాయంతో అవధ్ నవాబు రోహిల్‌ఖండ్‌ను తన రాజ్యంలో విలీనం చేశాడు.

★ నందకుమార్ విచారణ, బెనారస్‌కు చెందిన చైత్‌సింగ్ ఉదంతం, 1774 లో రోహిల్లా యుద్ధం, మొదటి మరాఠా యుద్ధం (1778-82), సల్బాయ్ సంధి (1782), రెండో ఆంగ్లో-మైసూరు యుద్ధం (1780-84), టిప్పు సుల్తాన్‌తో మంగళూరు సంధి (1785) ఈయన కాలంలో జరిగిన ముఖ్య ఘటనలు.

★ రఘునాధరావు, వారన్ హేస్టింగ్స్ మధ్య 1775 లో సూరత్ సంధి జరిగింది. అయితే కలకత్తా కౌన్సిల్ ఈ సంధిని తిరస్కరించింది.

★ ఆంగ్లేయులు, పీష్వా మధ్య పురంధర్ సంధి (1776) కుదిరింది.

★ 1780 లో జేమ్స్ అగస్ట్ హికే బెంగాల్ గెజిట్ అనే వారపత్రికను ప్రారంభించాడు.

★ 1784 లో విలియం జోన్స్ సహాయంతో ఆసియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్‌ను స్థాపించాడు.

★ విల్కిన్స్ భగవద్గీతను ఆంగ్లంలోకి అనువదించాడు.

★ 1785 లో ఇంగ్లండ్‌కు తిరిగి వెళ్లాడు. లార్డ్స్ సభలో ఇతనిపై అవిశ్వాస తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. ఏడు సంవత్సరాల విచారణ తర్వాత నిర్దోషిగా బయటపడ్డాడు.

### కారన్ వాలీస్ (1786-93)

జొనాథన్ డంకన్ 1791 లో బెనారస్‌లో సంస్కృత కళాశాలను ప్రారంభించాడు. 1791 రెగ్యులేషన్ ద్వారా కొత్త పోలీస్ విధానాన్ని ప్రవేశపెట్టాడు.

★ 1793 లో శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతిని ప్రవేశపెట్టాడు.

★ భారతీయ న్యాయమూర్తుల అధ్యక్షతన ఏర్పాటుచేసిన జిల్లా ఫౌజ్‌దారి అదాలత్‌లను రద్దుచేసి, వాటిస్థానంలో నాలుగు సర్క్యూట్ కోర్టులను ఏర్పాటు చేశాడు.

★ అధికార విభజన ఆధారంగా కారన్ వాలీస్ కోడ్‌ను ప్రవేశపెట్టాడు. కారన్ వాలీస్ భారతదేశంలో సివిల్ సర్వీసెస్ పితామహుడిగా పేరుపొందాడు. కలెక్టర్‌కున్న న్యాయాధికారాలను తొలగించి, రెవెన్యూ పరిపాలనకు మాత్రమే పరిమితం చేశాడు.

★ జిల్లాస్థాయిలో న్యాయవ్యవస్థకు అధిపతిగా జిల్లా జడ్జిని నియమించాడు.

★ మూడో మైసూర్ యుద్ధంలో టిప్పు సుల్తాన్ ఓటమి పొందాడు. 1792 లో శ్రీరంగపట్నం సంధి కుదిరింది.

### సర్ జాన్ షోర్ (1793-98)

నిజాం, మరాఠాలకు మధ్య 1795 లో ఖర్దా యుద్ధం జరిగింది. ఇందులో నిజాం ఓడిపోయాడు.

★ 1793 లో ప్రవేశపెట్టిన శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతిలో సర్ జాన్ షోర్ ముఖ్యపాత్ర పోషించాడు.



R-13-07-16

★ జోక్య రహిత విధానాన్ని అవలంబించాడు.

**లార్డ్ వెల్లసీ (1798-1805)**

లార్డ్ వెల్లస్లీ తనను తాను 'బెంగాల్ పులి'గా పేర్కొన్నాడు.

★ తంజావూరు, కర్ణాటక రాజ్యాల విలీనం తర్వాత మద్రాసు ప్రెసిడెన్సీని ఏర్పాటు చేశాడు. సైన్య సహకార పద్ధతిని ప్రవేశపెట్టాడు.

★ సైన్య సహకార విధానంపై సంతకం చేసిన మొదటి రాజ్యం - హైదరాబాద్. తర్వాత మైసూరు, తంజావూరు, అవధ్, జోధ్‌పూర్, జయపుర (జైపూర్), బుండి, భరత్‌పూర్, బీరర్ రాజ్యాలు ఇందులో చేరాయి.

★ 1799 లో నాలుగో ఆంగ్లో-మైసూరు యుద్ధం జరిగింది. టిప్పు సుల్తాన్ మరణించాడు.

★ 1802 లో పీష్వాతో బస్సెన్ సంధి కుదుర్చుకున్నాడు. రెండో ఆంగ్లో-మరాఠా యుద్ధంలో సింధియా, భోన్స్లే, హోల్కార్‌లను ఓడించాడు. లార్డ్ లేక్, ఢిల్లీ, ఆగ్రాలను ఆక్రమించాడు. మొగలు చక్రవర్తిని కంపెనీ రక్షణ కింద ఉంచాడు.

**జార్జ్ బార్లో (1805-07)**

వెల్లూర్‌లో 1806 లో సిపాయిల తిరుగుబాటు జరిగింది.

★ సింధియా, హోల్కార్‌లతో శాంతిని నెలకొల్పడానికి ప్రయత్నించాడు.

★ రెండో ఆంగ్లో-మరాఠా యుద్ధం ముగిసింది.

**లార్డ్ మింటో-I (1807-13)**

రంజిత్‌సింగ్‌తో 1809 లో అమృత్‌సర్ సంధిపై సంతకాలు చేశాడు.

★ 1808 లో మాల్కంను పర్షియాకు, ఎల్ఫిన్‌స్టన్‌ను కాబూల్‌కు రాయబారులుగా పంపాడు.

**లార్డ్ హేస్టింగ్స్ (1813-23)**

ఆంగ్లో - నేపాలీ యుద్ధంలో విజయం సాధించినందుకు మార్క్వెస్ ఆఫ్ హేస్టింగ్స్‌గా బిరుదు పొందాడు.

★ 1816 లో గూర్ఖా నాయకుడు అమర్‌సింగ్‌తో సగౌలి సంధిపై సంతకం చేశాడు.

★ 1817-18 మధ్య పిండారి యుద్ధం జరిగింది.

★ 1818 లో మూడో ఆంగ్లో-మరాఠా యుద్ధం తర్వాత పీష్వా పదవిని రద్దుచేసి, పీష్వా భూభాగాలను బొంబాయి ప్రెసిడెన్సీలో విలీనం చేశాడు.

★ 1817 లో పీష్వాతో పూనా సంధి చేసుకున్నాడు.

★ మద్రాసు గవర్నర్ థామస్ మన్రో 1820 లో మద్రాసు ప్రెసిడెన్సీలో రైత్వారీ విధానాన్ని ప్రవేశపెట్టాడు.

★ జోక్యరహిత విధానానికి స్వస్తి చెప్పి, భారతీయ స్వదేశీ రాజుల విషయాల్లో జోక్యం చేసుకోవడం ప్రారంభించాడు. రాజపుత్రులను సహజమిత్రులుగా పరిగణించాడు.

★ జేమ్స్ థామ్సన్ వాయవ్య రాష్ట్రంలో మహల్వారి రెవెన్యూ విధానాన్ని ప్రవేశపెట్టాడు.

**లార్డ్ అమ్‌హెర్స్ట్ (1823-28)**

సమానత్వ ప్రాతిపదికపై (1827 లో) మొగలు చక్రవర్తి రెండో అక్బర్ సాదరంగా ఆహ్వానించాడు.

★ మలయ ద్వీపకల్పంలోని భూభాగాలను వశపరచుకున్నాడు. సియామ్‌తో సంధి చేసుకున్నాడు.

★ ఇతడి కాలంలోనే మొదటి బర్మా యుద్ధం (1824-26) జరిగింది.

★ 1826 లో దిగువ బర్మాతో యాండబు సంధి చేసుకోవడం ద్వారా బ్రిటిష్ వర్తకులు బర్మా దక్షిణ తీరం, రంగూన్‌లలో నివాసం ఏర్పరుచుకోవడానికి అంగీకరించేలా చేశాడు.

**లార్డ్ విలియం బెంటింక్ (1828-35)**

విలియం బెంటింక్ 1833 చార్టర్ చట్టం ద్వారా భారతదేశ మొట్టమొదటి గవర్నర్ జనరల్‌గా నియమితుడయ్యాడు. ఇతడు ఉదారవాద గవర్నర్ జనరల్‌గా ప్రసిద్ధి చెందాడు.

★ 1829 లో సతీసహగమన విధానాన్ని నిషేధించాడు.

★ 1830 లో థగ్గులను విలియం స్లీమేన్ సహాయంతో అణచివేశాడు. ఆడపిల్లలను చంపే దురాచారాన్ని నిషేధించాడు.

★ 1834 లో ఆగ్రా రాష్ట్రాన్ని ఏర్పాటు చేశాడు. ఉన్నత న్యాయస్థానాల్లో ఆంగ్లాన్ని ప్రవేశపెట్టాడు. దిగువ న్యాయస్థానాల్లో పర్షియన్ భాష వాడకాన్ని కొనసాగించాడు.

★ 1835 లో భారతదేశ అధికార భాషగా ఆంగ్లాన్ని ప్రకటించాడు.

★ 1830 లో చచర్ విలీనం.

★ 1831 లో టిటు మీర్, కోల్ తిరుగుబాటు జరిగింది. అదే సంవత్సరంలో మైసూర్‌ను విలీనం చేశాడు.

★ రంజిత్‌సింగ్‌తో స్నేహపూర్వక సంధి.

★ సర్క్యూట్ న్యాయస్థానాలను రద్దు చేశాడు. అలహాబాద్‌లో ప్రత్యేక సదర్ దివానీ అదాలత్‌ను, ఢిల్లీలో సదర్ నిజామత్ అదాలత్‌ను స్థాపించాడు. మెకాలేను పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ కమిటీ అధ్యక్షుడిగా నియమించి, విద్యారంగంలో సంస్కరణలకు నాంది పలికాడు.

**సర్ ఛార్లెస్ మెట్‌కాఫ్ (1835-36)**

పత్రికలపై నియంత్రణను ఎత్తివేయడం ద్వారా పత్రికా స్వాతంత్ర్య పితామహుడిగా సర్ చార్లెస్ మెట్‌కాఫ్ పేరుపొందాడు.

**లార్డ్ అక్లాండ్ (1836-42)**

తూర్పు ఇండియా కంపెనీ, రంజిత్‌సింగ్, షా షుజా మధ్య త్రైపాక్షిక సంధి జరిగింది.

★ మొదటి అఫ్గన్ యుద్ధం (1836-42) ప్రారంభమైంది. మాండవి రాజ్యాన్ని బ్రిటిష్ సామ్రాజ్యంలో విలీనం చేశాడు.

**లార్డ్ ఎల్లెన్‌బరో (1842-44)**

అఫ్గన్ యుద్ధం ముగిసింది. 1843 లో సింధ్ రాష్ట్రాన్ని బ్రిటిష్ సామ్రాజ్యంలో విలీనం చేశాడు.

★ సింధ్ రాష్ట్ర రెసిడెంట్‌గా నేపియర్ స్థానంలో మేజర్ ఔట్రామ్ నియమితుడయ్యాడు.

★ బానిసత్వాన్ని నిషేధించాడు.

★ 1843 లో గ్వాలియర్‌కు చెందిన సింధియాను అవమానకర షరతులతో కూడిన సంధిపై సంతకాలు చేసేలా చేశాడు.

**లార్డ్ హార్డింజ్ -I (1844-48)**

ఖోండులు ఆచరించే మానవ వధను నిషేధించాడు. ఆంగ్ల పరిజ్ఞానం ఉన్నవారికి ఉద్యోగాల్లో ప్రాధాన్యం ఇచ్చేలా ప్రోత్సహించాడు.

★ మొదటి ఆంగ్లో-సిక్కు యుద్ధం, లాహోర్ సంధి (1846) ఇతడి కాలంలోనే జరిగాయి.

**లార్డ్ డల్హౌసీ (1849-56)**

డల్హౌసీ రాజ్య సంక్రమణ సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టాడు. దీనిద్వారా సతారా (1848), జైత్‌పూర్, సంభల్‌పూర్ (1849), భగత్ (1850), ఉదయ్‌పూర్ (1852), ఝాన్సీ (1853), నాగ్‌పూర్ (1854) రాజ్యాలు బ్రిటిష్ సామ్రాజ్యంలో విలీనమయ్యాయి.

★ బోర్డ్ ఆఫ్ కంట్రోల్ అధ్యక్షుడైన ఛార్లెస్ ఉడ్స్ రూపొందించిన ఉడ్స్ తాఖీదు (Wood's Dispatch) ను 1854 లో ఆమోదించాడు.

★ భారతదేశంలో రైల్వేల అభివృద్ధికి తోడ్పడ్డాడు. 1853 లో ముంబయి నుంచి థానే వరకు మొదటి రైల్వే లైన్‌ను, కలకత్తా నుంచి రాణిగంజ్ వరకు రెండో లైన్‌ను నిర్మించాడు.

★ ఇతడి కాలంలో మొదటి టెలిగ్రాఫ్ లైన్ కలకత్తా నుంచి ఆగ్రా వరకు వేశారు. ప్రజా పనుల శాఖను ఏర్పాటు చేశాడు.

★ సిమ్లాను వేసవి రాజధానిగా, సైనిక పాలనకు కేంద్రంగా మార్చాడు.

★ 1856 లో హిందూ పునర్వివాహ చట్టాన్ని రూపొందించాడు. అదే సంవత్సరంలో పరిపాలన సక్రమంగా లేదన్న సాకుతో అవధ్‌ను బ్రిటిష్ సామ్రాజ్యంలో విలీనం చేశాడు.

★ సివిల్ సర్వెంట్లను పోటీపరీక్షల ద్వారా ఎంపిక చేసే విధానాన్ని 1853 లో ప్రారంభించాడు.

★ 1854 లో తపాలా కార్యాలయ చట్టాన్ని రూపొందించాడు. మొదటిసారిగా తపాలా బిళ్లలను జారీ చేశాడు.

★ కర్ణాటక నవాబు బిరుదును రద్దు చేశాడు.

★ రెండో ఆంగ్లో-సిక్కు యుద్ధం తర్వాత 1849 లో మొత్తం పంజాబ్‌ను విలీనం చేశాడు.

★ రెండో బర్మా యుద్ధం తర్వాత 1853 లో దిగువ బర్మాను విలీనం చేశాడు.

**లార్డ్ కానింగ్ (1856-62)**

★ 1857 తిరుగుబాటు జరిగింది.

★ ఇతడే చివరి గవర్నర్ జనరల్, మొదటి వైస్రాయ్ కూడా.

**- భాస్కర్ వేడియం**

# భారతదేశ చరిత్ర

## సిపాయిల తిరుగుబాటు

**ఆధునిక భారతదేశ చరిత్రలో అత్యంత ప్రాధాన్యాన్ని సంతరించుకున్న చరిత్రాత్మక సంఘటనగా 1857 తిరుగుబాటును పేర్కొంటారు. ప్లాసీ యుద్ధం ముగిసిన వందేళ్ల తర్వాత జరిగిన ఈ తిరుగుబాటులో ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యంలో పనిచేస్తున్న భారతీయ సిపాయిలు ప్రముఖ పాత్ర పోషించారు.**

భారతీయ సమాజంలో ఈస్ట్ ఇండియా కంపెనీ మోసపూరిత, స్వార్థ విధానాల వల్ల క్రమంగా బలపడిన వ్యతిరేకతే 1857 తిరుగుబాటుకు ప్రధాన కారణం. ఇది భారత దేశంలో బ్రిటిష్ సామ్రాజ్య పునాదులను తాత్కాలికంగా కదిలించింది. భారతదేశంలో పాలనా స్వభావాన్ని మార్చడమే కాకుండా ఈస్ట్ ఇండియా కంపెనీ పాలనకు చరమగీతం పాడింది.

### *తిరుగుబాటు స్వభావం:*

ప్రసిద్ధ విప్లవకారుడు వి.డి. సావర్కర్ లండన్‌లో 1909 లో 'భారతదేశ స్వాతంత్ర్య సంగ్రామం - 1857' అనే పుస్తకాన్ని ప్రచురించారు. అప్పటి నుంచి 1857 తిరుగుబాటు స్వభావం గురించి జాతీయవాదులు, చరిత్రకారుల్లో తీవ్ర చర్చ మొదలైంది.

★ భారతదేశాన్ని ఆక్రమించడానికి సహాయం చేసిన భారతీయ సైనికులే బ్రిటిష్‌వారి మీద తిరుగుబాటు చేయడం వల్ల ఈ తిరుగుబాటును బ్రిటిష్ చరిత్రకారులు 'సిపాయిల పితూరీ' అని పేర్కొన్నారు.

★ 'ఎ హిస్టరీ ఆఫ్ ది సిపాయ్ వార్' రచయిత, ప్రసిద్ధ బ్రిటిష్ చరిత్రకారుడు జె. డబ్ల్యూ. కేయ్ 1857 తిరుగుబాటును సిపాయిల పితూరీ అని, ఇతర వర్గాలు ఇందులో పాల్గొనలేదని అభిప్రాయపడ్డాడు.

★ బ్రిటిష్ చరిత్రకారులైన జాన్ లారెన్స్, సిలీ, గ్రాంట్ డఫ్, మాలిసన్, టి.ఆర్. హోమ్స్ మొదలైనవారు కేయ్ అభిప్రాయంతో దాదాపు ఏకీభవించారు. బెంజమిన్ డిజ్రేలీ దీన్ని ఒక జాతీయ తిరుగుబాటుగా పేర్కొన్నాడు.

★ హిందూ - ముస్లింల కుట్ర ఫలితమే 1857 తిరుగుబాటు అని డబ్ల్యూ టేలర్ అభిప్రాయపడ్డాడు.

★ దీనికి భిన్నంగా భారతదేశ జాతీయోద్యమంలో ముఖ్యపాత్ర పోషించిన వినాయక్ దామోదర్ సావర్కర్ 1857 తిరుగుబాటును 'ప్రణాళికాబద్ధమైన ప్రథమ జాతీయ స్వాతంత్ర్య సమరమ'ని పేర్కొన్నారు.

★ ఆధునిక భారతదేశ చరిత్రకారుడైన ఎస్.ఎన్. సేన్ 1857 తిరుగుబాటును 'సిపాయిల పితూరీగా ప్రారంభమై స్వాతంత్ర్య యుద్ధంగా ముగిసింద'ని వర్ణించారు.

★ జవహర్‌లాల్ నెహ్రూ తన 'ది డిస్కవరీ ఆఫ్ ఇండియా'లో 1857 తిరుగుబాటును ప్రస్తావిస్తూ ఇది కేవలం భూస్వాముల తిరుగుబాటు, దీనిలో సూక్ష్మ స్థాయిలో జాతీయత కనిపించినా అనేకమంది స్వదేశీ రాజులు, వివిధ వర్గాల ప్రజలు ఈ తిరుగుబాటులో పాల్గొనలేదు. కాబట్టి అది ప్రథమ స్వాతంత్ర్య పోరాటం కాదని పేర్కొన్నారు.

★ మొత్తం మీద ఇది ప్రధానంగా సిపాయిల తిరుగుబాటే. కానీ ఇది తర్వాత ప్రారంభమైన భారత జాతీయోద్యమానికి నాందిగా చెప్పవచ్చు.

**కారణాలు**

### *రాజకీయ కారణాలు:*

బ్రిటిష్ సామ్రాజ్య విస్తరణలో భాగంగా డల్హౌసీ రాజ్య సంక్రమణ సిద్ధాంతాన్ని అమలుచేశాడు. ఇది భారతీయ స్వదేశీ రాజుల్లో అనుమానాలకు, అభద్రతకు, తీవ్ర అసహనానికి కారణమైంది.

★ బ్రిటిష్‌వారు భారతదేశంలో సామ్రాజ్య స్థాపనకు ముందు స్వదేశీ రాజులతో మంచి సంబంధాలు కలిగి ఉండేవారు. 1850 దశకంలో ఏదో ఒక నెపంతో స్వదేశీ రాజ్యాలను తమ సామ్రాజ్యంలో విలీనం చేయడానికి ప్రయత్నాలు చేశారు.

★ రాజ్య సంక్రమణ సిద్ధాంతం అమలు ద్వారా సతారా, సంబల్‌పూర్, ఝాన్సీ, నాగ్‌పూర్ రాజ్యాలు బ్రిటిష్ సామ్రాజ్యంలో విలీనమయ్యాయి. పీష్వా బాజీరావు దత్తపుత్రుడైన నానాసాహెబ్‌కు చెల్లించాల్సిన పింఛను ఆపేశాడు.

★ కర్ణాటక, తంజావూరు నవాబుల రాజరిక బిరుదులను రద్దు చేశాడు. గవర్నర్ జనరల్ లార్డ్ కానింగ్ బహదూర్ షా-II తర్వాత మొగలులు తమ రాజరిక బిరుదులను, ప్రాసాదాలను కోల్పోతారని ప్రకటించాడు.

★ పంజాబ్, పెగు, సిక్కింలను బ్రిటిష్ సామ్రాజ్యంలో విలీనం చేశారు. పరిపాలన సక్రమంగా లేదన్న నెపంతో 1856 లో అయోధ్య నవాబును పదవీచ్యుతుని చేశారు. ఇది ఈ ప్రాంతానికి చెందిన బ్రిటిష్ ఇండియా సైనికుల్లో తీవ్ర అసంతృప్తికి కారణమైంది. అయోధ్య ఆక్రమణ వల్ల సిపాయిల బంధువులు ఎక్కువ భూమి శిస్తు చెల్లించాల్సి రావడంతో అది సిపాయిలపై ఆర్థిక భారాన్ని మోపింది. బ్రిటిష్ వారి సామ్రాజ్యవాద విధానాల వల్ల మధ్యయుగపు రాజ్యాల మనుగడకు భంగం ఏర్పడింది. దీంతో అనేక మంది పాలకులు ఈ తిరుగుబాటులో పాల్గొన్నారు.

*పరిపాలన, ఆర్థిక కారణాలు:*

ఈస్ట్ ఇండియా కంపెనీ తన స్వార్థపూరిత విధానాల ద్వారా భారత ఆర్థిక వ్యవస్థను చిన్నాభిన్నం చేసింది. తూర్పు ఇండియా కంపెనీ ప్రవేశపెట్టిన నూతన భూమిశిస్తు విధానాల వల్ల భూస్వామ్య వర్గాలు పేదరికం అనుభవించాల్సి వచ్చింది. రైతులు దోపిడీకి గురై, అప్పుల పాలయ్యారు. దీంతో, వారు తమ భూములను వడ్డీ వ్యాపారులకు అమ్మేశారు.

★ బ్రిటిష్ విధానాల వల్ల కళాకారులు, చేతివృత్తులవారు ఉపాధిని కోల్పోయారు. దేశంలోని గ్రామీణ ఆర్థిక వ్యవస్థకు పట్టుగొమ్మలైన సంప్రదాయ కుటీర పరిశ్రమలు, చేతివృత్తులవారు బ్రిటిష్ పారిశ్రామిక ఉత్పత్తుల నుంచి పోటీని తట్టుకోలేకపోయారు.

★ భారతదేశ సహజ వనరులు ముఖ్యంగా పత్తి, జనుము, నీలిమందు, పొగాకును కంపెనీ బ్రిటన్‌కు ఎగుమతి చేసి అపార లాభాలను ఆర్జించింది.

*సాంఘిక, మత కారణాలు:*

1813 లో బ్రిటిష్ పార్లమెంట్ చేసిన చార్టర్ చట్టం ద్వారా బ్రిటిష్ అధికారులు భారతీయుల సామాజిక, మత విషయాల్లో జోక్యం చేసుకోవడం ప్రారంభించారు. 1829 లో విలియం బెంటింక్ ప్రభుత్వం బెంగాల్, బిహార్‌లలో సతీసహగమనాన్ని నిషేధించడం హిందువుల్లో తీవ్ర అలజడికి కారణమైంది. క్రైస్తవ మిషనరీలు కొనసాగిస్తున్న మత ప్రచారాన్ని కంపెనీ ప్రభుత్వం పూర్తిగా సమర్థించి, సహకరించింది.

★ 1850 లో చేసిన చట్టం ద్వారా క్రైస్తవ మతంలోకి మారినా కుమారుడికి తండ్రి ఆస్తి సంక్రమిస్తుందని పేర్కొన్నారు. ఈ చట్టం ద్వారా క్రైస్తవ మతంలోకి మారడాన్ని ప్రభుత్వం ప్రోత్సహిస్తున్నట్లు హిందువులు భావించారు. లార్డ్ కానింగ్ భారతీయులను క్రైస్తవ మతంలోకి మార్చడానికే ఇవన్నీ చేస్తున్నట్లు కొత్త పుకార్లు వ్యాపించాయి.

★ క్రైస్తవ మిషనరీలు బాలికా విద్యను ప్రోత్సహించడాన్ని బ్రిటిష్ వారు తమ విషయాల్లో అనవసరంగా జోక్యం చేసుకుంటున్నట్లు సనాతన హిందువులు భావించారు. 1856 లో రూపొందించిన హిందూ వితంతు పునర్వివాహ చట్టం సనాతన హిందూ మత పెద్దల ఆగ్రహానికి కారణమైంది.

*సైనిక కారణాలు*

భారతీయ సైనికులు, బ్రిటిష్ సైనికుల మధ్య జీతభత్యాల్లో, పదోన్నతుల్లో, ఉద్యోగ నిబంధనల్లో వ్యత్యాసం ఉండేది. లార్డ్ కానింగ్ 1856 లో ప్రవేశపెట్టిన 'సామాన్య సేనా నియుక్త చట్టం' భారతీయ సిపాయిలు విదేశాల్లో సైతం కంపెనీ తరఫున యుద్ధాల్లో పాల్గొనడానికి సిద్ధంగా ఉండాలని పేర్కొనడంతో సిపాయిలు మరింత అసంతృప్తి చెందారు.

★ లార్డ్ కానింగ్ సైన్యంలో కొత్త రకం ఎన్‌ఫీల్డ్ రైఫిళ్లను ప్రవేశపెట్టి, ఆవు కొవ్వు, పంది కొవ్వు పూసిన తూటాలను పంపిణీ చేయడం ఈ తిరుగుబాటుకు తక్షణ కారణం. భారతీయ సైనికులను క్రైస్తవ మతంలోకి మార్చడానికే బ్రిటిష్‌వారు ఉద్దేశపూర్వకంగా ఈ తూటాలను వినియోగించేలా చేశారని పుకార్లు వ్యాపించాయి.

**తిరుగుబాటు వ్యాప్తి**

1857 ఫిబ్రవరిలో బెర్హాంపూర్‌లోని సైనికులు తూటాలను వాడటాన్ని వ్యతిరేకించారు. ఈ అసంతృప్తి తీవ్ర రూపం దాల్చక ముందే బ్రిటిష్ ప్రభుత్వం ఆ సైనిక దళాన్ని రద్దు చేసింది. 1857 మార్చిలో మంగళ్‌పాండే బారక్‌పూర్‌లో తన అధికారిని గాయపరిచాడు. దీంతో మంగళ్‌పాండేను ఉరితీయడమే కాకుండా, ఆ సైనిక దళాన్ని కూడా రద్దు చేశారు. 1857 మే 9 న మీరట్‌లోని బ్రిటిష్ సైనికాధికారి 90 మంది సైనికులను వరుసలో నిలబెట్టి ఉపన్యాసం ఇచ్చి, తూటాలను పంపిణీ చేశారు. అయితే వారిలో అయిదుగురు మినహా మిగిలినవారు ఈ తూటాలను తీసుకోవడానికి నిరాకరించారు. వారికి క్రమశిక్షణ ఉల్లంఘన కింద ఎక్కువ కాలం కఠిన కారాగార శిక్ష విధించడంతో మరుసటి రోజు (మే 10) మీరట్‌లో తిరుగుబాటు ప్రారంభమైంది.

★ తర్వాతి రోజు సిపాయిలు దిల్లీ చేరుకుని మొగలు చక్రవర్తి రెండో బహాదూర్‌షాను తమకు నాయకత్వం వహించాల్సిందిగా కోరి, సఫలీకృతులయ్యారు.

★ తిరుగుబాటు కార్చిచ్చులా ఉత్తర, మధ్య, పశ్చిమ భారతదేశంలోని కాన్పూర్, వారణాసి, అలహాబాద్, ఝాన్సీ నగరాలకు వ్యాపించింది. అయితే, బ్రిటిష్ ప్రభుత్వం తన శక్తియుక్తులన్నింటినీ ఉపయోగించి అనతికాలంలోనే ఈ తిరుగుబాటును అణిచివేసింది.

## వైఫల్యానికి కారణాలు

తిరుగుబాటుదారులకు సరైన ప్రణాళిక, వ్యూహం, నిధులు లేవు. పంజాబ్, రాజస్థాన్, తూర్పు భారతదేశం, దక్షిణ భారతదేశంలో తిరుగుబాటు ప్రభావం పూర్తిగా కనిపించలేదు. సిక్కులు, మరాఠీలు, రాజపుత్రులు, తూర్పు భారతదేశంలోని పాలకులు తిరుగుబాటులో పాల్గొనలేదు.

★ భారతదేశంలోని స్వదేశీ రాజుల్లో కొందరు తిరుగుబాటును అణిచి వేయడానికి ఆంగ్లేయులకు తోడ్పడ్డారు. నభ, పాటియాలా, కపుర్తలాకు చెందిన సిక్కు రాకుమారులు, హైదరాబాద్, గ్వాలియర్ పాలకులు ప్రత్యక్షంగా బ్రిటిష్ వారికి సహాయం అందించారు.

★ హోల్కార్, సింధియాలు బ్రిటిష్ వారికి విధేయులుగా వ్యవహరించారు. వడ్డీ వ్యాపారులు, విద్యావంతులు బ్రిటిష్ వారికి తోడ్పాటునందించారు. తిరుగుబాటుదారులకు రాజకీయ నాయకత్వం, సైనిక అనుభవం లేదు. సైనిక సంపద, వనరుల్లో తిరుగుబాటుదారులు బ్రిటిష్ వారితో సరితూగలేకపోయారు.

## తిరుగుబాటు ఫలితాలు

1857 తిరుగుబాటు విఫలమైనా ఇది బ్రిటిష్ పాలనకు మొదటి ప్రత్యక్ష ఎదురుదెబ్బ. తిరుగుబాటులో పాల్గొన్న సిపాయిలు, నాయకులు ప్రాణాలు కోల్పోయారు. తిరుగుబాటులో పాల్గొన్న గ్రామాలను పూర్తిగా ధ్వంసం చేశారు. అయితే ఈ తిరుగుబాటు బ్రిటిష్ పాలనలో మౌలిక మార్పులకు దారితీసింది.

★ విక్టోరియా రాణి ప్రకటనను 1858 నవంబరు 1 న అలహాబాద్‌లో లార్డ్ కానింగ్ చదివి వినిపించారు. దీని ప్రకారం ఈస్ట్ ఇండియా కంపెనీ పాలన అంతమైంది.

★ భారతదేశం బ్రిటిష్ ప్రభుత్వ ప్రత్యక్ష పాలనలోకి వచ్చింది. కానింగ్ మొదటి గవర్నర్ జనరల్, వైస్రాయ్ అయ్యారు. ఈ ప్రకటన బ్రిటిష్ సామ్రాజ్య విస్తరణకు చరమగీతం పాడింది. అదేవిధంగా భారత ప్రజల మత విషయాల్లో ప్రభుత్వ జోక్యం ఉండదని స్పష్టం చేసింది. సైన్యంలో ఐరోపావారి ప్రాతినిధ్యాన్ని పెంచుతూ సైన్యాన్ని పునర్వ్యవస్థీకరించారు. విభజించి పాలించు సూత్రాన్ని పాటిస్తూ ముస్లింలను తృప్తిపరిచే ప్రయత్నం చేశారు.

★ స్వదేశీ సంస్థానాధీశుల పట్ల ఉదార వైఖరిని అవలంబించారు. బ్రిటిష్ సామ్రాజ్య శ్రేయస్సు దృష్ట్యా రాజులు, జమిందారులు, భూస్వాములు, వర్తక వర్గాలను ప్రోత్సహించారు.

**- భాస్కర్ వేడియం**

# భారతదేశ చరిత్ర

## మత సంస్కరణోద్యమాలు

**పంతొమ్మిదో శతాబ్దంలో ఆధునిక ఆంగ్ల విద్యావ్యాప్తి, క్రైస్తవ మిషనరీల మత ప్రచారం, ఐరోపాలో ప్రారంభమైన ఉదార, హేతువాద, మానవతా ఉద్యమాలు తమ సామాజిక, మత వ్యవస్థల గురించి భారతీయులు పునరాలోచించేలా చేశాయి. ఈ ప్రభావంతో తలెత్తిన సాంఘిక, మత సంస్కరణ ఉద్యమాలు భారతీయుల జీవన విధానాన్ని మార్చాయి. వారిలో ఐకమత్యాన్ని, దేశభక్తిని పెంపొందించాయి.**

భారత స్వాతంత్ర్యోద్యమం మొదట బెంగాల్‌లో, తర్వాత పశ్చిమ భారతదేశంలో ప్రారంభమైంది. భారతదేశంలో పునరుజ్జీవన ఉద్యమ పితగా రాజా రామమోహన్‌రాయ్‌ను పేర్కొంటారు.

- బ్రహ్మ సమాజం: బ్రహ్మ సమాజ స్థాపకుడైన రాజా రామమోహన్‌రాయ్ 1772 లో బెంగాల్‌లోని బర్ద్వాన్ జిల్లా రాధానగర్‌లో జన్మించారు. ఈయన 1815 లో ఆత్మీయసభ అనే సంస్థను స్థాపించారు. భగవంతుడు ఒక్కడే అనే సిద్ధాంతాన్ని ప్రచారం చేయడమే దీని లక్ష్యం. ఆ తర్వాత 1828 లో బ్రహ్మ సమాజాన్ని ప్రారంభించారు. హిందూ మతంలోని దురాచారాలను రూపుమాపడం, సంస్కరించడం దీని ఉద్దేశం.
- రాజా రామమోహన్‌రాయ్ ఆధునిక విద్యా వ్యాప్తి కోసం విశేష కృషి చేశారు. ఈయన మరణం తర్వాత దేవేంద్రనాథ్ ఠాగూర్, కేశవ చంద్రసేన్ బ్రహ్మ సమాజ వ్యాప్తి కోసం పాటుపడ్డారు.
- దేవేంద్రనాథ్ ఠాగూర్ 1831 లో కోల్‌కతా (కలకత్తా)లో తత్వబోధిని సభను స్థాపించారు. 1843 లో బ్రహ్మ సమాజంలో చేరి, బెంగాలీ భాషలో 'తత్వ బోధిని' అనే పత్రికను ప్రారంభించారు.
- 1857 లో బ్రహ్మ సమాజంలో చేరిన కేశవ చంద్రసేన్ దేవేంద్రనాథ్ ఠాగూర్ కుడి భుజంగా పేరుపొందారు. అయితే కులాంతర వివాహాలు, వితంతు పునర్వివాహాలు, పరదా పద్ధతి తొలగింపు లాంటి కార్యక్రమాలు పాతతరం వారికి నచ్చలేదు. దీంతో బ్రహ్మ సమాజంలో చీలిక ఏర్పడింది.
- మన్నవ బుచ్చయ్య పంతులు, రఘుపతి వెంకటరత్నం నాయుడు, కందుకూరి వీరేశలింగం పంతులు మొదలైనవారు దక్షిణ భారతదేశంలో బ్రహ్మ సమాజ వ్యాప్తికి ఎంతగానో కృషి చేశారు.

### ఆర్య సమాజం

ఆర్య సమాజ స్థాపకుడు స్వామి దయానంద సరస్వతి. ఈయన అసలుపేరు మూల్‌శంకర్. ఈయన 1824 లో గుజరాత్‌లోని మోర్వి సమీపంలో ఉన్న టంకారా అనే ప్రదేశంలో జన్మించారు. దయానందుడు ఉత్తర్ ప్రదేశ్‌లోని మధురలో విరజానందుడు అనే అంధ సన్యాసి వద్ద వేదాలు, ధర్మశాస్త్రాలు, స్మృతులను అభ్యసించారు.

- దయానందుడు 1875 ఏప్రిల్ 10 న బొంబాయిలో ఆర్యసమాజాన్ని స్థాపించారు. 'వేదాలకు తిరిగి వెళదాం' అనేది ఈయన నినాదం. తర్వాతి కాలంలో పంజాబ్‌లోని లాహోర్ ఆర్య సమాజ ప్రధాన కేంద్రంగా మారింది.
- దయానందుడు 1882 లో గోరక్ష ఉద్యమాన్ని చేపట్టారు. ఇతర మతాల్లో చేరిన హిందువులను తిరిగి హిందూ మతంలోకి తీసుకురావడానికి దయానంద సరస్వతి శుద్ధి ఉద్యమాన్ని ప్రారంభించారు.

### రామకృష్ణ మిషన్, రామకృష్ణ మఠం

వివేకానందుడు 1897 లో పశ్చిమ్ బంగ (పశ్చిమ బెంగాల్)లోని బేలూరు కేంద్రంగా రామకృష్ణ మిషన్‌ను స్థాపించారు. సమాజ సేవ చేయడం దీని ముఖ్య ఉద్దేశం. ఈ మిషన్ అనేక పాఠశాలలు, కళాశాలలు, వైద్యశాలలు, అనాథ శరణాలయాలను స్థాపించి, పేద ప్రజలకు సహాయం అందిస్తోంది.

- 1887 లో వివేకానందుడు పశ్చిమ్ బంగలోని బారానగర్‌లో రామకృష్ణ మఠాన్ని స్థాపించారు. తన గురువైన రామకృష్ణ పరమహంస బోధనలను ప్రచారం చేయడానికి దీన్ని ప్రారంభించారు.
- 1898 నుంచి రామకృష్ణ మిషన్, రామకృష్ణ మఠం రెండింటికీ బేలూరు ప్రధాన కేంద్రమైంది.
- రామకృష్ణ అసలు పేరు గదాధర చటోపాధ్యాయ. ఈయన 1836 లో పశ్చిమ్ బంగలోని హుగ్లీ జిల్లా కామర్‌పుకుర్ అనే గ్రామంలో జన్మించారు. మానవసేవే మాధవసేవ అనేది రామకృష్ణుడి నినాదం.

### స్వామి వివేకానంద

వివేకానందుడి అసలు పేరు నరేంద్రనాథ్ దత్తా. ఈయన 1863 లో కలకత్తాలో జన్మించారు. వివేకానందుడు 1881 లో మొదటి



R-23-08-16

సారి రామకృష్ణ పరమహంసను కలుసుకున్నారు. ఈయన భారతదేశం మొత్తం కాలినడకన ప్రయాణించి, ప్రజల వాస్తవ స్థితిగతులను తెలుసుకున్నారు.

- 1893 లో అమెరికాలోని చికాగోలో జరిగిన ప్రపంచ మతాల సదస్సుకు హాజరైన వివేకానందుడు హిందూమత ఔన్నత్యాన్ని ప్రపంచ దేశాలకు చాటిచెప్పారు. ఈయన అనారోగ్యం కారణంగా అతిచిన్న వయసులో (1902) మరణించారు.
- వివేకానందుడు మానవులందరిలో దైవత్వం ఉందనీ, ప్రతి వ్యక్తిలో శక్తిసామర్థ్యాలు ఉన్నాయని, ఎవ్వరినీ తక్కువగా చూడరాదని బోధించారు.
- 'నీవు భారతీయుడవని గర్వించు. ప్రతి భారతీయుడు నా సోదరుడని సగర్వంగా ప్రకటించు'అని పేర్కొన్నారు.

## దివ్యజ్ఞాన సమాజం

రష్యాకు చెందిన హెచ్.పి. బ్లావట్ స్కీ, అమెరికాకు చెందిన హెచ్.ఎస్. ఆల్కాట్ 1875 లో న్యూయార్క్‌లో దివ్యజ్ఞాన సమాజాన్ని స్థాపించారు. 1879 లో భారతదేశానికి వచ్చిన ఈ ఇద్దరూ 1882 లో మద్రాసు సమీపంలోని అడయారు వద్ద దివ్యజ్ఞాన సమాజం ప్రధాన కార్యాలయాన్ని నెలకొల్పారు.

- ఐర్లాండ్‌కు చెందిన అనిబిసెంట్ లండన్‌లోని దివ్యజ్ఞాన సమాజంలో సభ్యురాలిగా చేరారు. ఈమె 1893 లో భారతదేశానికి వచ్చారు. 1907 లో ఆల్కాట్ మరణం తర్వాత దివ్యజ్ఞాన సమాజానికి అధ్యక్షురాలయ్యారు.
- విశ్వమానవులందరిలో సోదర భావాన్ని పెంపొందించడం, ప్రాచీన మతాల అధ్యయనాన్ని ప్రోత్సహించడం ఈ సమాజ ప్రధాన లక్ష్యాలు.
- 1898 లో అనిబిసెంట్ హిందూ మత సూత్రాలను బోధించడానికి వారణాసిలో సెంట్రల్ హిందూ స్కూల్‌ను ప్రారంభించారు. ఆ తర్వాతి కాలంలో మదన్‌మోహన్ మాలవీయ కృషి ఫలితంగా ఈ స్కూల్ బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంగా (1916) అభివృద్ధి చెందింది.
- **అలీగఢ్ ఉద్యమం:** ఉత్తర్ ప్రదేశ్‌కు చెందిన సర్ సయ్యద్ అహ్మద్‌ఖాన్ ఈ ఉద్యమానికి నాయకత్వం వహించారు. హేతువాదం ప్రాతిపదికగా ఇస్లాం మతాన్ని సమర్థిస్తూనే, ముస్లిం సమాజంలోని బహు భార్యత్వాన్ని, బానిస వ్యవస్థను విమర్శించారు.
- ముస్లింలకు ఆధునిక శాస్త్ర విజ్ఞానాన్ని అందించాలనే లక్ష్యంతో 1875 లో అలీగఢ్‌లో మహమ్మదన్ ఆంగ్లో ఓరియంటల్ కళాశాలను స్థాపించారు. ఇది 1920 లో అలీగఢ్ ముస్లిం విశ్వవిద్యాలయంగా అభివృద్ధి చెందింది.

## సాంఘిక సంస్కరణ ఉద్యమాలు

సంఘ సంస్కర్తలు ప్రధానంగా ఆ కాలంలోని దురాచారాలైన బాల్య వివాహాలు, బహు భార్యత్వం, సతీసహగమనం, దేవదాసి విధానం, అంటరానితనాన్ని రూపుమాపడానికి కృషి చేశారు.

- రాజా రామమోహన్‌రాయ్ కృషి ఫలితంగా 1829 లో అప్పటి వైస్రాయ్ విలియం బెంటింక్ సతీసహగమన నిషేధ చట్టాన్ని రూపొందించారు.
- బెంగాలీలు, రాజపుత్రుల్లో బాలికలను చిన్నప్పుడే చంపేసే దురాచారం ఉండేది. 1795 లో రూపొందించిన బెంగాల్ రెగ్యులేషన్ XXI చట్టం, 1804 లో చేసిన రెగ్యులేషన్ III చట్టం ఈ దురాచారం చట్ట విరుద్ధమైందని ప్రకటించాయి.
- పండిట్ ఈశ్వరచంద్ర విద్యాసాగర్ వితంతు పునర్వివాహాల కోసం పోరాడారు. ఈయన కృషి ఫలితంగా బ్రిటిష్ ప్రభుత్వం 1856 లో హిందూ వితంతు పునర్వివాహ చట్టాన్ని రూపొందించింది.
- విద్యాసాగర్ బాల్యవివాహాలను, బహు భార్యత్వాన్ని వ్యతిరేకించారు. స్త్రీ విద్య కోసం ప్రచారం చేశారు.
- మహారాష్ట్రలో డి.కె. కార్వే, ఆంధ్రరాష్ట్రంలో కందుకూరి వీరేశలింగం పంతులు వితంతు పునర్వివాహాల కోసం కృషి చేశారు.
- వితంతు పునర్వివాహాలను ప్రోత్సహించాలనే లక్ష్యంతో వీరేశలింగం 1878 లో రాజమండ్రి సాంఘిక సంస్కరణ సంస్థను స్థాపించారు.
- కార్వే 1899 లో పుణెలో వితంతు సదన్‌ను స్థాపించారు. 1916 లో భారతదేశంలో మొట్టమొదటి మహిళా విశ్వవిద్యాలయాన్ని ప్రారంభించారు.
- లోకహితవాదిగా ప్రసిద్ధి చెందిన గోపాల హరిదేశ్‌ముఖ్ మహారాష్ట్రలో సంఘ సంస్కరణకు నాందిపలికారు.

- మహదేవ గోవింద రనడే ప్రార్థనా సమజంలో ప్రముఖ సభ్యుడు. ఈయన స్ఫూర్తితోనే గోపాల గణేష్ అగార్కర్ 1884 లో పుణెలో దక్కన్ ఎడ్యుకేషనల్ సొసైటీని స్థాపించారు. రనడేను గోపాల కృష్ణ గోఖలే తన గురువుగా పేర్కొన్నారు.
- జ్యోతిబా పూలే అగ్రవర్ణాల ఆధిపత్యానికి వ్యతిరేకంగా జీవితాంతం పోరాడారు. ఈయన 1873 లో సత్యశోధక సమాజాన్ని స్థాపించి, స్త్రీ విద్య, వితంతు పునర్వివాహాల కోసం కృషి చేశారు.
- 1905 లో గోపాలకృష్ణ గోఖలే బొంబాయిలో సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీని స్థాపించారు. మాతృభూమికి సేవ చేయడానికి వీలుగా భారతీయులకు వివిధ రంగాల్లో శిక్షణ ఇవ్వడం ఈ సంస్థ ప్రధాన లక్ష్యం.
- 1872 లో రూపొందించిన స్వదేశీ వివాహ చట్టం కనీస వివాహ వయసు బాలికలకు 14 ఏళ్లు, బాలురకు 18 ఏళ్లుగా నిర్ణయించింది. అయితే ఈ చట్టం హిందువులు, ముస్లింలు, ఇతర గుర్తింపు పొందిన మతాల వారికి వర్తించకపోవడంతో పెద్దగా ప్రభావాన్ని చూపలేకపోయింది.
- పార్శీ సంఘ సంస్కర్త బి.ఎం. మలబారి కృషి వల్ల 1891 లో Age of Consent Act ను రూపొందించారు. ఈ చట్టం 12 సంవత్సరాల కంటే తక్కువ వయసున్న బాలికలకు వివాహం చేయడాన్ని నిషేధించింది.
- 1849 లో జె.ఇ.డి. బెత్యూన్ కలకత్తాలో బాలికల పాఠశాలను స్థాపించారు. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ కూడా కలకత్తాలో 35 బాలికల పాఠశాలలను ఏర్పాటుచేశారు.
- గాంధీజీ దిల్లీలో హరిజన్ సేవక్ సంఘ్ అనే సంస్థను స్థాపించి, అంటరానితనాన్ని నిర్మూలించేందుకు కృషి చేశారు.
- 1945 లో అంబేడ్కర్ 'అంటరాని వారికోసం కాంగ్రెస్, గాంధీ చేసిందేమిటి? ' అనే గ్రంథాన్ని రచించారు. దళితులు హిందూ మతాన్ని విడిచిపెట్టి, బౌద్ధాన్ని స్వీకరించాలని ఆయన సూచించారు.

## మాదిరి ప్రశ్నలు

**1.** క్రైస్తవ మత ప్రచారకుడైన అలెగ్జాండర్ డఫ్ చేసిన హిందూమత వ్యతిరేక ప్రచారాన్ని సమర్థవంతంగా తిప్పికొట్టింది ఎవరు?

ఎ) దేవేంద్రనాథ్ ఠాగూర్ బి) కేశవ చంద్రసేన్
సి) దయానంద సరస్వతి డి) రాజా రామమోహన్‌రాయ్

**2.** 'గులాంగిరీ' గ్రంథ రచయిత ఎవరు?

ఎ) అంబేడ్కర్ బి) గాంధీజీ సి) జ్యోతిబా పూలే డి) గోఖలే

**3.** శుద్ధి ఉద్యమాన్ని ప్రారంభించింది ఎవరు?

ఎ) రాజా రామమోహన్‌రాయ్ బి) వివేకానందుడు
సి) దయానంద సరస్వతి డి) కేశవ చంద్రసేన్

**4.** యంగ్ బెంగాల్ ఉద్యమ స్థాపకుడు ఎవరు?

ఎ) ఎం.జి. రనడే బి) ఆనంద మోహన్ బోస్
సి) హెన్రీవివియన్ డిరోజియో డి) ఎవరూకాదు

**5.** ఆర్యసమాజ ప్రభావం ఏ రాష్ట్రంపై ఎక్కువగా ఉంది?

ఎ) ఆంధ్రప్రదేశ్ బి) మహారాష్ట్ర
సి) పంజాబ్ డి) గుజరాత్

**6.** రామకృష్ణ పరమహంస భార్య పేరేమిటి?

ఎ) శారదా ప్రియ బి) శారదా మణి సి) శ్రీలత డి) పార్వతి

**జవాబులు**

1-ఎ; 2-సి; 3-సి; 4-సి; 5-సి; 6-బి.

- భాస్కర్ వేడియం

# భారతదేశ చరిత్ర

## భారత స్వాతంత్రోద్యమం – ముఖ్య సంఘటనలు

★ 1885 డిసెంబరు 28 న భారత జాతీయ కాంగ్రెస్‌ను స్థాపించారు.

★ 1885 - 1905 మధ్య కాలాన్ని మితవాద దశగా పేర్కొంటారు.

★ 1905-20 మధ్య కాలాన్ని అతివాద దశగా పేర్కొంటారు.

★ 1905 జులై 20 న బెంగాల్ విభజన ప్రకటన వెలువడింది.

★ 1906 డిసెంబరు 31 న ముస్లిం లీగ్ పార్టీని స్థాపించారు.

★ 1907 లో సూరత్‌లో కాంగ్రెస్ సమావేశం జరిగింది. ఈ సమావేశంలోనే కాంగ్రెస్ నాయకులు అతివాదులు, మితవాదులుగా విడిపోయారు.

★ 1908 ఏప్రిల్ 30 న ఖుదీరాంబోస్‌ను ఉరి తీశారు.

★ 1909 మే 21 న మింటోమార్లే సంస్కరణలను ప్రవేశపెట్టారు.

★ 1911 లో బెంగాల్ విభజనను రద్దు చేశారు.

★ 1912 లో రాజధానిని కోల్‌కతా (నాటి కలకత్తా) నుంచి దిల్లీకి మార్చారు.

★ 1913 నవంబరు 1 న శాన్‌ఫ్రాన్సిస్కోలో గదర్ పార్టీని స్థాపించారు.

★ 1914-18 మధ్య కాలంలో మొదటి ప్రపంచ యుద్ధం జరిగింది.

★ 1915 జనవరిలో గాంధీజీ దక్షిణాఫ్రికా నుంచి భారత్‌కు తిరిగి వచ్చారు.

★ 1916 లో గాంధీజీ సబర్మతి ఆశ్రమాన్ని స్థాపించారు.

★ 1915 ఫిబ్రవరి 19 న గోపాలకృష్ణ గోఖలే మరణించారు.

★ 1916 లో లఖ్‌నవూ (లక్నో) ఒడంబడిక జరిగింది.

★ 1916 లో హోమ్ రూల్ ఉద్యమం ప్రారంభమైంది.

★ 1917 లో చంపారన్ సత్యాగ్రహం జరిగింది.

★ 1917 లో అనిబిసెంట్ భారత జాతీయ కాంగ్రెస్‌కు తొలి మహిళా అధ్యక్షురాలిగా (కోల్‌కతా) ఎన్నికయ్యారు.

★ 1918 అహ్మదాబాద్‌లో నూలు మిల్లుల సందర్శన జరిగింది.

★ 1919 లో ఖిలాఫత్ ఉద్యమం ప్రారంభమైంది.

★ 1919 ఏప్రిల్ 6 న రౌలట్ చట్టం చేశారు.

★ 1919 ఏప్రిల్ 13 న జలియన్ వాలాబాగ్ ఉదంతం చోటుచేసుకుంది.

★ 1919 లో హంటర్ కమిషన్ ఏర్పాటైంది.

★ 1919 డిసెంబరు 5 న మాంటేగ్ ఛెమ్స్‌ఫర్డ్ సంస్కరణలను ప్రకటించారు.

★ 1920 లో ఎం.ఎన్. రాయ్ కమ్యూనిస్ట్ పార్టీ ఆఫ్ ఇండియాను స్థాపించారు.

★ 1920 లో బాలగంగాధర తిలక్ మరణించారు.

★ 1920-47 మధ్య కాలాన్ని గాంధీజీ దశగా పేర్కొంటారు.

★ 1920-22 మధ్య సహాయ నిరాకరణోద్యమం జరిగింది.

★ 1922 ఫిబ్రవరి 5 న చౌరీ-చౌరా ఉదంతం చోటుచేసుకుంది.

★ 1922 లో కేరళలో మోప్లాల తిరుగుబాటు జరిగింది.





R-31-08-16

★ 1923 లో స్వరాజ్ పార్టీని స్థాపించారు.

★ 1925 లో కకోరీ కుట్ర కేసు నమోదైంది.

★ 1927 లో బట్లర్ కమిషన్, సైమన్ కమిషన్‌లను ఏర్పాటుచేశారు.

★ 1928 లో మోతీలాల్ నెహ్రూ ఒక రిపోర్ట్‌ను రూపొందించారు.

★ 1928 లో లాలాలజపతిరాయ్ మరణించారు.

★ 1928 లో చంద్రశేఖర్ ఆజాద్ హిందూస్థాన్ సోషలిస్ట్ రిపబ్లికన్ అసోసియేషన్‌ను స్థాపించారు.

★ 1929 ఏప్రిల్ 8 న భగత్‌సింగ్, భతుకేశ్వర్ దత్ దిల్లీలోని కేంద్ర శాసనసభపై బాంబులు వేశారు.

★ 1929 డిసెంబరు 31 న లాహోర్‌లో జరిగిన కాంగ్రెస్ సమావేశానికి నెహ్రూ అధ్యక్షత వహించారు.

★ 1929 లో శారదా వివాహ చట్టాన్ని రూపొందించారు.

★ 1929 అక్టోబరు 31 న భారత్‌కు డొమినియన్ ప్రతిపత్తి కల్పించారు.

★ 1930 మార్చి 12 న ఉప్పు సత్యాగ్రహం జరిగింది.

★ 1931 ఫిబ్రవరి 27 న చంద్రశేఖర్ ఆజాద్ ఎన్‌కౌంటర్ జరిగింది.

★ 1931 మార్చి 23 న భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖ్‌దేవ్‌లను ఉరి తీశారు.

★ 1930 నవంబరు 30 న మొదటి రౌండ్ టేబుల్ సమావేశం జరిగింది.

★ 1931 సెప్టెంబరు 7 న రెండో రౌండ్‌టేబుల్ సమావేశం జరిగింది.

★ 1932 నవంబరు17 న మూడో రౌండ్ టేబుల్ సమావేశం జరిగింది.

★ 1931 మార్చి 5 న గాంధీ - ఇర్విన్ ఒప్పందం కుదిరింది.

★ 1932 ఆగస్టు 16 న కమ్యూనల్ అవార్డును ప్రకటించారు.

★ 1932 లో పూనా ఒడంబడిక జరిగింది.

★ 1935 లో భారత ప్రభుత్వ చట్టాన్ని రూపొందించారు.

★ 1937 లో 1935 చట్టం ప్రకారం ఎన్నికలు జరిగాయి.

★ 1938 హరిపుర కాంగ్రెస్ సమావేశంలో సుభాష్‌చంద్రబోస్‌ను అధ్యక్షుడిగా ఎన్నుకున్నారు.

★ 1939 లో త్రిపురలో జరిగిన కాంగ్రెస్ సమావేశంలో సుభాష్‌చంద్రబోస్ అధ్యక్షుడిగా ఎన్నికయ్యారు. ఈ ఎన్నికల్లో భోగరాజు పట్టాభి సీతారామయ్య ఓడిపోయారు.

★ 1939 - 45 మధ్య కాలంలో రెండో ప్రపంచయుద్ధం జరిగింది.

★ 1939 లో నేతాజీ ఫార్వర్డ్ బ్లాక్ పార్టీని స్థాపించారు.

★ 1939 కాంగ్రెస్ మంత్రివర్గాలు రాజీనామా చేశాయి.

★ 1940 ఆగస్టు 10 న ఆగస్టు ప్రతిపాదనలకు సంబంధించిన ప్రకటన వెలువడింది.

★ 1940 అక్టోబరు 17 వ్యక్తి సత్యాగ్రహ ఉద్యమం ప్రారంభమైంది.

★ 1942 మార్చి 11 క్రిప్స్ రాయబారం

★ 1942 ఆగస్టు 8 క్విట్ ఇండియా ఉద్యమం మొదలైంది.

★ 1946 క్యాబినెట్ మిషన్ ప్రణాళికను రూపొందించారు.

★ 1946 లో నెహ్రూ అధ్యక్షతన తాత్కాలిక ప్రభుత్వం ఏర్పాటైంది.

★ 1947 మార్చి 24 న మౌంట్ బాటన్ గవర్నర్ జనరల్‌గా నియమితులయ్యారు.

★ 1947 ఆగస్టు 15 న భారతదేశానికి స్వాతంత్ర్యం లభించింది.

## ప్రముఖుల సమాధులు

| | | |
|---|---|---|
| ★ మహాత్మాగాంధీ | - | రాజ్‌ఘాట్ |
| ★ జవహర్‌లాల్ నెహ్రూ | - | శాంతిస్థల్ |
| ★ బి.ఆర్. అంబేడ్కర్ | - | చైత్యభూమి |
| ★ లాల్ బహదూర్‌శాస్త్రి | - | విజయ్ ఘాట్ |
| ★ గుల్జారీలాల్ నందా | - | నారాయణ్ ఘాట్ |
| ★ ఇందిరాగాంధీ | - | శక్తి స్థల్ |
| ★ మొరార్జీ దేశాయ్ | - | అభయ్ ఘాట్ |
| ★ చరణ్‌సింగ్ | - | కిసాన్ ఘాట్ |
| ★ జగ్జీవన్‌రామ్ | - | సమతాస్థల్ |
| ★ రాజీవ్‌గాంధీ | - | వీర్‌భూమి |
| ★ పి.వి. నరసింహారావు | - | జ్ఞాన్‌భూమి |
| ★ దేవీలాల్ | - | సంఘర్ష్ స్థల్ |
| ★ జ్ఞానీ జైల్‌సింగ్ | - | ఏక్తా స్థల్ |

## సంస్థలు - స్థాపకులు

| | | |
|---|---|---|
| ★ భూస్వామ్య సంస్థ | - | ద్వారకానాథ్ ఠాగూర్ |
| ★ బ్రిటిష్ ఇండియా అసోసియేషన్ | - | దేవేంద్రనాథ్ ఠాగూర్ |
| ★ బాంబే అసోసియేషన్ | - | జగన్నాథ శంకర సేఠ్ |
| ★ ఈస్టిండియా అసోసియేషన్ | - | దాదాభాయ్ నౌరోజీ |
| ★ పూనా సార్వజనీక సభ | - | ఎం.జి. రనడే, జి.వాసుదేవ జోషి, ఎస్.హెచ్. చిప్లూకర్ |
| ★ ఇండియన్ అసోసియేషన్ | - | సురేంద్రనాథ్ బెనర్జీ, ఆనందమోహన్ బోస్ |
| ★ మద్రాస్ మహాసభ | - | సుబ్రమణ్యం అయ్యర్, వీరరాఘవాచారి, పి.ఆనందాచార్యులు, రంగయ్య నాయుడు |
| ★ బొంబాయి ప్రెసిడెన్సీ అసోసియేషన్ | - | ఫిరోజ్ షా మెహతా, కె.టి.తెలాంగ్ |
| ★ భారత జాతీయ కాంగ్రెస్ | - | ఎ.ఒ.హ్యూమ్ |

## ప్రముఖులు - బిరుదులు

| | | |
|---|---|---|
| ★ దాదాభాయ్ నౌరోజీ | - | గ్రాండ్ ఓల్డ్ మ్యాన్ ఆఫ్ ఇండియా |
| ★ సురేంద్రనాథ్ బెనర్జీ | - | ఇండియన్ బర్క్స్, ఇండియన్ సిసిరో, ఇండియన్ డెమోస్తనీస్, సిల్వర్ టంగ్ ఆరేటర్ |
| ★ గోపాలకృష్ణ గోఖలే | - | మహారాష్ట్ర సోక్రటీస్, మహారాష్ట్ర రత్నం, భారతదేశ వజ్రం |
| ★ బాలగంగాధర తిలక్ | - | లోకమాన్య, ముంబయి పులి, భారతదేశానికి కిరీటం లేని రాజు, దేశభక్తుల్లో రాజు |
| ★ లాలాలజపతిరాయ్ | - | పంజాబ్ కేసరి |
| ★ బిపిన్ చంద్రపాల్ | - | బెంగాల్ డాంటన్, బెంగాల్ విప్లవ పిత |
| ★ రవీంద్రనాథ్ ఠాగూర్ | - | గురుదేవ్, విశ్వకవి |
| ★ చిత్తరంజన్ దాస్ | - | దేశబంధు |
| ★ గాంధీజీ | - | జాతిపిత, మహాత్మ, బాపూజీ, కైజర్-ఇ-హింద్, హిందూదేశ సింహం |
| ★ జవహర్‌లాల్ నెహ్రూ | - | చాచా, నవభారత నిర్మాత, పండిట్ |

★ సర్దార్ వల్లభాయ్ పటేల్ - ఇండియన్ బిస్మార్క్
★ సరోజినీ నాయుడు - భారత కోకిల
★ సుభాష్ చంద్రబోస్ - నేతాజీ
★ జయప్రకాశ్ నారాయణ్ - లోక్‌నాయక్

## పత్రికలు - స్థాపకులు

★ బెంగాల్ గెజిట్ - జేమ్స్ అగస్టస్ హిక్కీ
★ సంవాద కౌముది, మిరాతుల్ అక్బర్ - రాజా రామమోహన్ రాయ్
★ బంగ దర్శన్ - బంకించంద్ర ఛటర్జీ
★ అమృత్ బజార్ - శిశిర్‌కుమార్ ఘోష్
★ ది బెంగాలీ, సంజీవిని - సురేంద్రనాథ్ బెనర్జీ
★ కేసరి, మరాఠా - బాలాగంగాధర తిలక్
★ ఇండియన్ మిర్రర్ - కేశవచంద్ర సేన్
★ ది హిందూ - సుబ్రమణ్యం అయ్యర్
★ ఈస్ట్ ఇండియన్ - హెన్రీడిరోజియో
★ సోమ ప్రకాశ - ద్వారకానాథ్ విద్యాభూషణ్
★ వందేమాతరం - అరవింద్ ఘోష్
★ న్యూ ఇండియా, కామన్ వీల్ - అనిబిసెంట్
★ అల్‌హిలాల్, అల్ బలాగ్ - మౌలానా అబుల్ కలాం ఆజాద్
★ ద లీడర్ - మదన్‌మోహన్ మాలవీయ
★ తల్వార్ - బీరేంద్రనాథ్ ఛటోపాధ్యాయ
★ ఫ్రీ హిందూస్థాన్ - తారక్‌నాథ్‌దాస్
★ ది వర్కర్ - ఎం.ఎన్. రాయ్
★ హిందూస్థాన్ టైమ్స్ - శ్యామ్‌జీ కృష్ణవర్మ
★ సంధ్య - బి.బి. ఉపాధ్యాయ
★ బహిష్కృత భారత్, మూక్ నాయక్ - బి.ఆర్. అంబేడ్కర్
★ యంగ్ ఇండియా, హరిజన్, నవజీవన్, ఇండియన్ ఒపీనియన్ - గాంధీజీ
★ నేషనల్ హెరాల్డ్ - జవహర్‌లాల్ నెహ్రూ
★ ఆంధ్ర ప్రకాశిక - ఎ.పి. పార్థసారథి నాయుడు
★ కృష్ణా పత్రిక - కొండా వెంకటప్పయ్య
★ ఆంధ్ర పత్రిక - కాశీనాథుని నాగేశ్వరరావు
★ సతీహితబోధిని - కందుకూరి వీరేశలింగం
★ బాల పత్రిక - న్యాయపతి రాఘవరావు

## మాదిరి ప్రశ్నలు

**1.** ఇండియన్ అసోసియేషన్‌ను స్థాపించింది ఎవరు?

1) మహదేవ గోవింద రనడే
2) బాలగంగాధర తిలక్
3) సురేంద్రనాథ్ బెనర్జీ
4) గోపాలకృష్ణ గోఖలే

**2.** అమృత్‌బజార్ పత్రికను ఎవరు స్థాపించారు?

1) సుబ్రమణ్య అయ్యర్
2) శిశిర్‌కుమార్ ఘోష్
3) జేమ్స్ అగస్టస్ హిక్కీ
4) సురేంద్రనాథ్ బెనర్జీ

**3.** ముస్లిం లీగ్ పార్టీని ఏ సంవత్సరంలో స్థాపించారు?

1) 1905
2) 1906
3) 1907
4) 1909

**4.** జలియన్ వాలాబాగ్ దురంతం ఎప్పుడు జరిగింది?

1) 1919 ఏప్రిల్ 12
2) 1919 ఏప్రిల్ 13
3) 1919 ఏప్రిల్ 16
4) 1919 ఏప్రిల్ 23

**5.** ఇండియన్ సిసిరోగా ప్రసిద్ధిగాంచిన వ్యక్తి ఎవరు?

1) సురేంద్రనాథ్ బెనర్జీ
2) గోపాలకృష్ణ గోఖలే
3) లాలాలజపతిరాయ్
4) రవీంద్రనాథ్ ఠాగూర్

**6.** లోక్‌నాయక్ అనే బిరుదు ఎవరిది?

1) సర్దార్ వల్లభాయ్ పటేల్
2) జవహర్‌లాల్ నెహ్రూ
3) జయప్రకాశ్ నారాయణ
4) సుభాష్ చంద్రబోస్

**7.** పంజాబ్ కేసరి అనే బిరుదు ఎవరిది?

1) బాలగంగాధర తిలక్
2) లాలాలజపతిరాయ్
3) సుభాష్ చంద్రబోస్
4) దాదాభాయ్ నౌరోజీ

**8.** వందేమాతరం పత్రికను ఎవరు స్థాపించారు?

1) శిశిర్‌కుమార్ ఘోష్
2) అనిబిసెంట్
3) అరవింద్ ఘోష్
4) జవహర్‌లాల్ నెహ్రూ

**జవాబులు:** 1-3; 2-2; 3-2; 4-2; 5-1; 6-3; 7-2; 8-3.

**- అమరనేని కృష్ణ**

# భారతదేశ చరిత్ర

## ఐరోపావారి రాక

**క్రీ.శ 1453 లో తురుష్కులు కాన్‌స్టాంటినోపుల్‌ను ఆక్రమించడంతో పాశ్చాత్యులు తూర్పుదేశాలకు సముద్ర మార్గాన్ని అన్వేషించాల్సి వచ్చింది. పోర్చుగల్‌కు చెందిన ప్రిన్స్ హెన్రీ నూతన సముద్ర మార్గాన్ని అన్వేషించడం ప్రారంభించాడు. అదే దేశానికి చెందిన బార్తులో మ్యూడియాజ్ 1487 లో అట్లాంటిక్ మహాసముద్రం మీదుగా ప్రయాణించి, ఆఫ్రికాలోని గుడ్‌హోప్ అగ్రాన్ని చేరుకున్నాడు.**

★ వాస్కోడిగామా 1498 మే 21 న మలబార్ తీరంలోని కాలికట్ నగరాన్ని చేరుకున్నాడు. ఈ సంఘటన భారతదేశంలో ఐరోపావారి వర్తక కార్యకలాపాలు విస్తరించడానికి మాత్రమే కాకుండా, భారత్‌పై ఇంగ్లండ్ ఆధిపత్యానికి కూడా దారితీసింది.

★ కాలికట్‌కు చెందిన హిందూ రాజు జమోరిన్ వాస్కోడిగామాను సాదరంగా ఆహ్వానించాడు. వాస్కోడిగామా 1499 లో పోర్చుగల్‌కు తిరిగి వెళ్లాడు. తర్వాత క్రీ.శ 1500 లో అల్వారెజ్ కాబ్రాల్ భారతదేశానికి వచ్చాడు. ఇతడు అరబ్బులకు చెందిన నౌకలను స్వాధీనం చేసుకుని, జమోరిన్‌కు బహుమతిగా ఇచ్చాడు.

★ కాబ్రాల్ కాలంలో అరబ్బులు పోర్చుగీసు వర్తక స్థావరాన్ని ధ్వంసం చేశారు. అయితే ఇతడికి కన్ననూరు, కొచ్చిన్ పాలకుల మద్దతు లభించింది. 1502 లో వాస్కోడిగామా రెండోసారి భారతదేశానికి వచ్చాడు. పోర్చుగీసు వారి మొదటి రాజధాని కొచ్చిన్.

★ 1505 లో ఫ్రాన్సిస్కో డి అల్మైడా భారతదేశంలో మొదటి పోర్చుగీసు గవర్నరుగా నియమితుడయ్యాడు. ఇతడు 1508 లో జరిగిన చౌల్ యుద్ధంలో ఈజిప్టు, టర్కీ, గుజరాత్ పాలకుల కూటమి చేతిలో ఓడిపోయాడు. అల్మైడా 1509 లో ఈ కూటమిని డయ్యూ యుద్ధంలో ఓడించి, తన ఆధిపత్యాన్ని నిలుపుకున్నాడు.

★ 1509 లో అల్బూకర్క్ గవర్నరుగా నియమితుడయ్యాడు. బీజాపూర్ సుల్తాన్ ఆదిల్‌షా నుంచి 1510 లో గోవాను ఆక్రమించాడు. మనదేశంలో స్థిరపడిన పోర్చుగీసువారు భారతీయ స్త్రీలను వివాహమాడేలా ప్రోత్సహించాడు. తన కాలంలో విజయనగర రాజులతో స్నేహ సంబంధాలను కొనసాగించాడు.

★ 1529 లో గవర్నరుగా నియమితుడైన నునోడా కన్హా గుజరాత్ సుల్తాన్ బహదూర్‌షా నుంచి డయ్యూను ఆక్రమించాడు. ఇతని కాలంలో చెన్నై దగ్గర శాన్‌థామ్, బెంగాల్‌లోని హుగ్లీ వద్ద వర్తక స్థావరాలు ఏర్పాటయ్యాయి.

★ భారతదేశంలో చివరి గొప్ప పోర్చుగీసు గవర్నర్ డి కాస్ట్రో. ఇతడి కాలంలో పోర్చుగీసువారి రాజధాని కొచ్చిన్ నుంచి గోవాకు మారింది. ప్రసిద్ధి చెందిన క్రైస్తవ మత ప్రచారకుడు సెయింట్ ఫ్రాన్సిస్ జేవియర్ 1542 లో గోవాకు వచ్చాడు.

### పోర్చుగీసువారి పతనం

★ క్రీ.శ. 16 వ శతాబ్దం చివరినాటికి పోర్చుగీసు వారి పతనం ప్రారంభమైంది. వారు భారతదేశంలో తమ వర్తక స్థావరాలను క్రమంగా కోల్పోయారు. క్రీ.శ. 1631 లో బెంగాల్‌లోని హుగ్లీ మొగలుల వశమైంది. క్రీ.శ. 1661 లో పోర్చుగల్ రాజు సోదరిని ఇంగ్లండ్ రాజు రెండో చార్లెస్ వివాహమాడాడు. పోర్చుగల్ రాజు కట్నం కింద చార్లెస్‌కి బొంబాయిని ఇచ్చాడు.

★ 1739 లో మరాఠాలు సాల్‌శెట్టి, బస్సైన్‌లను ఆక్రమించారు. చివరికి పోర్చుగీసువారికి భారతదేశంలో గోవా, డయ్యూ, డామన్ మాత్రమే మిగిలాయి.

*కారణాలు*

★ 1580 లో పోర్చుగల్ స్పెయిన్ వశమైంది. స్పెయిన్ రాజు రెండో ఫిలిప్ భారతదేశంలో పోర్చుగీసు భూభాగాలపై శ్రద్ధవహించలేదు. పరమత ద్వేషం, పరిపాలనలో అవినీతి, ఇంగ్లిష్, ఫ్రెంచి, డచ్ వర్తక కంపెనీల విస్తరణ మొదలైన అంశాలు పోర్చుగీసు వారి పతనానికి దారితీశాయి.

### డచ్చివారు

★ క్రీ.శ. 1602 లో యునైటెడ్ ఈస్టిండియా కంపెనీ ఆఫ్ నెదర్లాండ్స్ ఏర్పాటైంది. ఈ కంపెనీకి వ్యాపారం, యుద్ధాలు చేయడానికి, భూభాగాలను ఆక్రమించడానికి, సంధి కుదుర్చుకోవడానికి, కోటలను నిర్మించడానికి అనుమతి లభించింది.

★ డచ్చివారు మొదటి శాశ్వత వర్తక స్థావరాన్ని 1605 లో మచిలీపట్నంలో ఏర్పాటు చేశారు. చంద్రగిరి రాజు నుంచి అనుమతి పొంది 1610 లో పులికాట్‌లో మరో వర్తక స్థావరాన్ని ఏర్పాటు చేశారు. 1617 లో పులికాట్ డచ్‌వారి ప్రధాన కేంద్రమైంది. వీరు తర్వాత బొంబాయి, అహ్మదాబాద్, బుర్హాన్‌పూర్, బ్రోచ్‌లలో వర్తక స్థావరాలను ఏర్పాటు చేశారు. బెంగాల్‌లోని పిప్లీలో డచ్చివారు తమ మొదటి స్థావరాన్ని స్థాపించారు.

★ పోర్చుగీసువారిని భారతదేశ సముద్ర వ్యాపారం నుంచి తప్పించిన ఘనత డచ్చివారికే దక్కింది. భారతీయ వస్త్రాల ఎగుమతిని

పెంపొందించడంలో డచ్చివారు ప్రముఖ పాత్ర పోషించారు. దేవానాం పట్నంలోని వీరి స్థావరం ఆంగ్లేయుల కాలంలో సెయింట్ డేవిడ్ కోటగా ప్రసిద్ధి చెందింది.

*పతనానికి కారణాలు*

డచ్చివారి పతనానికి ప్రధాన కారణాలుగా కింది అంశాలను పేర్కొనవచ్చు

★ డచ్చివారికి వ్యతిరేకంగా ఆంగ్లేయుల నౌకాబలం అభివృద్ధి చెందడం.

★ వీరు అనుసరించిన కేంద్రీకృత అధికార విధానం, వీరికి భారతదేశంలో ప్రధాన కేంద్రం లేకపోవడం.

★ డచ్చి కంపెనీ అధికారుల్లో అవినీతి పెరగడం.

★ 1623 లో అంబోయిను వద్ద ఆంగ్లేయులపై దురాగతం.

## ఆంగ్లేయులు

★ మొదటి ఎలిజబెత్ పాలన చివరి నాటికి భారతదేశంలో వ్యాపారం చేయడానికి ఇంగ్లండ్ వర్తకులు ఈస్టిండియా కంపెనీని స్థాపించారు.

★ ఈ కంపెనీకి 15 ఏళ్లపాటు తూర్పు దేశాల్లో వర్తకం చేయడానికి ఎలిజబెత్ రాణి నుంచి అనుమతి లభించింది.

★ దీనికి సంబంధించిన చార్టర్‌ను 1600 డిసెంబరు 31 న జారీచేశారు. ప్రారంభంలో కంపెనీ సుగంధ ద్రవ్యాల వ్యాపారంపై దృష్టిసారించింది.

★ ఇంగ్లండ్ రాజు మొదటి జేమ్స్ కాలంలో విలియం హాకిన్స్ మొగల్ చక్రవర్తి జహంగీర్ ఆస్థానానికి వచ్చి, 1608 - 11 వరకు అక్కడే ఉన్నాడు.

★ సూరత్‌లో ఈస్టిండియా కంపెనీ వ్యాపారం చేయడానికి 1611 లో మిడిల్‌టన్ మొదటిసారిగా అనుమతి పొందాడు.

★ గుజరాత్‌లో కంపెనీ వ్యాపారం చేసుకోవడానికి జహంగీర్ నుంచి అనుమతి పొందడంలో సర్ థామస్ రో సఫలీకృతుడయ్యాడు.

*మొగలులతో విరోధం*

★ 1688 లో ఎర్ర సముద్రంలో మొగలులకు చెందిన కొన్ని నౌకలను సముద్రపు దొంగలు ఆక్రమించారు. దీంతో సూరత్‌లోని మొగల్ గవర్నర్ కంపెనీ అధికారి సర్‌జాన్ చైల్డ్‌పై ఆగ్రహం వ్యక్తం చేశాడు.

★ మొగల్ చక్రవర్తి ఔరంగజేబు ఆంగ్లేయులను విరోధులుగా గుర్తించాలని ప్రకటన చేశాడు. అనేక మంది ఆంగ్లేయులను నిర్బంధించి అవమానించారు.

★ ఈ సంధి ప్రకారం ఆంగ్లేయులు మొగలులకు జరిగిన నష్టానికి పరిహారం చెల్లించాలి. సంధి షరతుల్లో భాగంగా సర్‌జాన్ చైల్డ్ భారతదేశం వదిలి వెళ్లాలి.

*వర్తక స్థావరాల ఏర్పాటు*

**పశ్చిమతీరం:** ఆంగ్లేయులు 1619 నాటికి ఆగ్రా, అహ్మదాబాద్, బరోడా, బొంబాయిల్లో వర్తక స్థావరాలను ఏర్పాటు చేశారు.

★ ఇవి సూరత్ నియంత్రణలో ఉండేవి. 1668 లో ఈస్టిండియా కంపెనీ రెండో చార్లెస్ నుంచి బొంబాయిని లీజుకు తీసుకుంది.

★ గెరాల్డ్ ఆంగియర్ 1669-1677 వరకు బొంబాయి మొదటి గవర్నరుగా పని చేశాడు. 1687 లో పశ్చిమ తీర ప్రధాన కేంద్రాన్ని సూరత్ నుంచి బొంబాయికి మార్చారు.

**ఆగ్నేయ తీరం:** మచిలీపట్నంలో, పులికాట్ దగ్గర ఆర్మగాన్‌లో స్థావరాలను ఏర్పాటు చేశారు.

★ 1639 లో చంద్రగిరి రాజు నుంచి ఫ్రాన్సిస్‌డే మద్రాసును కొనుగోలు చేశాడు. అక్కడ సెయింట్ జార్జి కోటను నిర్మించారు. ఆ తర్వాత తూర్పుతీర ప్రధాన కేంద్రాన్ని మచిలీపట్నం నుంచి మద్రాసుకు మార్చారు.

★ 1658 లో తూర్పు తీరంలోని అన్ని స్థావరాలను (బెంగాల్, బిహార్, ఒరిస్సా) సెయింట్ జార్జి కోట ఆధీనంలో ఉంచారు.

**తూర్పు ఇండియా:** బెంగాల్, ఒరిస్సాల్లోని హరిహరపూర్, బాలాసోర్, హుగ్లీ, పట్నా, ఢాకా, కాసిం బజార్‌లలో స్థావరాలను ఏర్పాటు చేశారు.

★ 1690 లో జాన్ చార్నాక్ సుతమతి వద్ద వర్తక స్థావరాన్ని ఏర్పాటు చేశారు. 1698 లో సుతమతి, కాలికట్, గోవిందపూర్ గ్రామాల జమీందారీ హక్కులను కంపెనీ పొందింది. ఈ మూడు గ్రామాలే తర్వాత కలకత్తా నగరంగా అభివృద్ధి చెందాయి.

★ సుతమతి వద్ద విలియం కోటను నిర్మించారు. 1700 లో బెంగాల్, బిహార్, ఒరిస్సాల్లోని స్థావరాలను విలియం కోట ఆధీనం

లోకి తీసుకువచ్చారు.

**ఫ్రెంచివారు**

★ ఫ్రెంచి చక్రవర్తి 14 వ లూయీ తన మంత్రి కోల్బర్ట్ ప్రోత్సాహంతో 1664 లో ఫ్రెంచి ఈస్టిండియా కంపెనీని స్థాపించాడు. ఇంగ్లిష్ కంపెనీ ప్రైవేట్‌ది కాగా, ఫ్రెంచి కంపెనీ ప్రభుత్వానికి చెందింది.

★ 1667 లో సూరత్‌లో ఫ్రాంకోయిస్ కారన్ మొదటి ఫ్రెంచి వర్తక స్థావరాన్ని స్థాపించాడు. ఫ్రాంకోయిస్ మార్టిన్ వలికొండాపురం గవర్నర్ అయిన షేర్‌ఖాన్ లోడి నుంచి పాండిచ్చేరిని పొందాడు. 1690 లో బెంగాల్‌లోని చంద్రనగర్‌ను మొగల్ గవర్నర్ నుంచి పొందాడు.

★ ఫ్రాంకోయిస్ మార్టిన్ భారతదేశంలో మొదటి డైరెక్టర్ జనరల్‌గా నియమితుడయ్యాడు. పాండిచ్చేరిలో లూయిస్ కోటను నిర్మించాడు. క్రీ.శ. 1706-20 మధ్య భారత్‌లో ఫ్రెంచివారి అధికారం క్షీణించింది. దీంతో 1720 లో ఫ్రెంచి కంపెనీని పునర్వ్యవస్థీకరించారు.

★ లెనాయిర్ డ్యూమాస్ క్రీ.శ. 1720-42 మధ్య తిరిగి ఫ్రెంచివారి అధికారాన్ని పునరుద్ధరించాడు. వీరు మలబారు తీరంలోని యానాం, తమిళనాడులో కరైకాల్‌ను ఆక్రమించారు.

★ 1742 లో ఫ్రెంచి గవర్నర్‌గా డూప్లేను నియమించడంతో ప్రారంభమైన ఆంగ్లో-ఫ్రెంచి యుద్ధాలు ఫ్రెంచి వారి ఓటమితో ముగిశాయి.

**మాదిరి ప్రశ్నలు**

**1.** కాన్‌స్టాంటినోపుల్‌ను తురుష్కులు ఏ సంవత్సరంలో ఆక్రమించారు?

ఎ) క్రీ.శ. 1453 బి) క్రీ.శ 1543 సి) క్రీ.శ. 1354 డి) క్రీ.శ. 1553

**2.** నీలి నీటి విధానాన్ని అనుసరించిన పోర్చుగీసు వైస్రాయ్ ఎవరు?

ఎ) అల్ఫోన్సో డి అల్బూకర్క్ బి) వాస్కోడిగామా సి) ఫ్రాన్సిస్ డి అల్మైడా డి) కాబ్రాల్

**3.** భారతదేశంలో డచ్చివారి మొదటి వర్తక స్థావరం ఏది?

ఎ) సూరత్ బి) కాశింబజార్ సి) పట్నా డి) మచిలీపట్నం

**4.** భారతదేశంలో పోర్చుగీసు వారి మొదటి రాజధాని ఏది?

ఎ) గోవా బి) కొచ్చిన్ సి) డయ్యూ డి) బొంబాయి

**5.** భారతదేశంలో స్థిరపడిన పోర్చుగీసువారు భారతీయ స్త్రీలను వివాహం చేసుకునేలా ప్రోత్సహించిన పోర్చుగీసు గవర్నర్ ఎవరు?

ఎ) నునోడా కన్హా బి) కాబ్రాల్ సి) అల్ఫోన్సో డి అల్బూకర్క్ డి) వాస్కోడిగామా

**6.** విలియం హాకిన్స్‌ను జహంగీర్ ఆస్థానానికి రాయబారిగా పంపించిన ఇంగ్లండ్ పాలకుడు ఎవరు?

ఎ) రెండో చార్లెస్ బి) మొదటి జేమ్స్ సి) రెండో జేమ్స్ డి) మొదటి చార్లెస్

**7.** 1542 లో గోవాను సందర్శించిన ప్రసిద్ధ క్రైస్తవ మత ప్రచారకుడు ఎవరు?

ఎ) సెయింట్ ఫ్రాన్సిస్ జేవియర్ బి) సెయింట్ థామస్

సి) సెయింట్ సైమన్ డి) సెయింట్ లూయిస్

**8.** ఫ్రాన్సిస్‌డే చంద్రగిరి రాజప్రతినిధి నుంచి మద్రాసును ఏ సంవత్సరంలో పొందాడు?

ఎ) క్రీ.శ. 1639 బి) క్రీ.శ. 1641 సి) క్రీ.శ. 1369 డి) క్రీ.శ. 1469

**9.** ఆంగ్లేయులు సెయింట్ డేవిడ్ కోటను నిర్మించిన ప్రదేశం ఏది?

ఎ) మద్రాసు బి) బొంబాయి సి) కలకత్తా డి) కడలూరు

**10.** కిందివాటిలో ఫ్రెంచి వర్తక స్థావరం కానిది ఏది?

ఎ) సూరత్ బి) యానాం సి) చంద్రనగర్ డి) బొంబాయి

**11.** ఇంగ్లిష్ ఈస్టిండియా కంపెనీని ఏ తేదీన స్థాపించారు?

ఎ) 1600 డిసెంబరు 1 బి) 1600 డిసెంబరు 31 సి) 1600 డిసెంబరు 15 డి) 1600 డిసెంబరు 20

**జవాబులు: 1-ఎ; 2-సి; 3-డి 4-బి; 5-సి; 6-బి; 7-ఎ; 8-ఎ; 9-డి 10-డి 11-బి.**

**- భాస్కర్ వేడియం**

# భారతదేశ చరిత్ర

1. స్వామి దయానంద సరస్వతి గురువు ఎవరు?
ఎ) స్వామి సహజానంద  బి) స్వామి అగ్నివేష్
సి) స్వామి విరజానంద  డి) స్వామి పరిపూర్ణానంద

2. స్వామి దయానంద సరస్వతి రచించిన గ్రంథం?
ఎ) సత్యార్థ ప్రకాశ్  బి) వేద భాష్య భూమిక  సి) వేద భాష్య  డి) పై మూడు

3. యంగ్ బెంగాల్ సంస్థ స్థాపకుడు ఎవరు?
ఎ) మేడం బ్లావట్‌స్కీ  బి) హెన్రీ వివియన్ డిరోజియో
సి) డి.కె. కార్వే  డి) విష్ణుశాస్త్రి

4. కిందివారిలో ప్రార్థనా సమాజంతో సంబంధం లేని వ్యక్తి?
ఎ) ఎం.జి. రనడే  బి) ఆత్మారాం పాండురంగ
సి) ఆర్.జి. భండార్కర్  డి) శ్రీధరులు నాయుడు

5. శుద్ధి ఉద్యమ నాయకుడు ఎవరు?
ఎ) రాజా రామమోహన్‌రాయ్  బి) స్వామి శ్రద్ధానంద  సి) ఎం.జి. రనడే  డి) ఆల్కాట్

6. రాధాస్వామి ఉద్యమ స్థాపకుడు ఎవరు?
ఎ) తులసీరామ్  బి) రఘునాథరావు  సి) ఎన్.ఎం. జోషి  డి) రాధాకాంత్ దేవ్

7. కిందివారిలో రహనుమయ్ మజ్ దయసనన్ సభలో సభ్యుడు కాని వ్యక్తిని గుర్తించండి.
ఎ) దాదాభాయ్ నౌరోజీ  బి) జె.బి. వాచా  సి) ఎస్.ఎస్. బంగాలీ  డి) ఎం. మలబారి

8. సోషల్ సర్వీస్ లీగ్ స్థాపకుడు ఎవరు?
ఎ) శివనారాయణ అగ్నిహోత్రి  బి) అనిబిసెంట్
సి) నారాయణ్ మల్హార్‌జోషి  డి) గోపాలకృష్ణ గోఖలే

9. లోకహితవాదిగా ప్రసిద్ధి చెందిన సంఘ సంస్కర్త ఎవరు?
ఎ) రాజా రామమోహన్‌రాయ్  బి) గోపాలహరి దేశ్‌ముఖ్  సి) బాలక్ సింగ్  డి) మలబారి

10. నిరంకారి ఉద్యమ స్థాపకుడు ఎవరు?
ఎ) బాబా దయాళ్‌దాస్  బి) ఠాకూర్ సింగ్  సి) షేక్ మహ్మద్ అబ్దుల్లా  డి) జినరాజదాస

11. ఆల్ ఇండియా ఉమెన్స్ కాన్ఫరెన్స్‌ను ప్రారంభించింది ఎవరు?
ఎ) మార్గరెట్ కజిన్స్  బి) రమాబాయి  సి) సుబ్బలక్ష్మి  డి) ముత్తులక్ష్మి రెడ్డి

12. ప్రజా మిత్రమండలి స్థాపకుడు ఎవరు?
ఎ) శ్రీనారాయణ గురు  బి) మన్నత్ పద్మనాభ  సి) భాస్కర్‌రావ్ జాదవ్  డి) సి.ఆర్. రెడ్డి

13. సత్య శోధక సమాజం స్థాపకుడు ఎవరు?
ఎ) జ్యోతిబా పూలే  బి) టి.ఎం. నాయర్  సి) పెరియార్  డి) అంబేద్కర్

14. కుడి అరసు పత్రిక స్థాపకుడు ఎవరు?
ఎ) పానగల్ రాజా  బి) త్యాగరాజ శెట్టి  సి) బాబా రాంసింగ్  డి) పెరియార్

15. అంబేద్కర్‌కు సంబంధం లేని ఉద్యమం/ సంస్థ ఏది?
ఎ) బహిష్కృత్ హితకారిణి సభ  బి) సమాజ్ సమతాసంస్థ
సి) మహద్ సత్యాగ్రహం  డి) వైకోం సత్యాగ్రహం

**16.** హరిజన్ సేవక్ సంఘ్‌ను ఎవరు స్థాపించారు?
ఎ) గాంధీజీ  బి) అంబేడ్కర్  సి) జ్యోతిబా పూలే  డి) పెరియార్

**17.** పశ్చిమ భారతదేశ సాంస్కృతిక పునరుజ్జీవన ప్రవక్తగా పేరుగాంచిన వ్యక్తి?
ఎ) ఆత్మారాం పాండురంగ  బి) మహదేవ గోవింద రనడే
సి) ఆర్.జి. భండార్కర్  డి) కేశవ చంద్రసేన్

**18.** విష ప్రయోగం వల్ల మరణించిన మత సంస్కర్త ఎవరు?
ఎ) రాజా రామమోహన్ రాయ్  బి) స్వామి దయానంద సరస్వతి
సి) రామకృష్ణ పరమహంస  డి) వివేకానందుడు

**19.** కిందివారిలో కర్మయోగిగా పేర్కొనదగిన వ్యక్తి ఎవరు?
ఎ) అనిబిసెంట్  బి) వివేకానందుడు  సి) శివనారాయణ అగ్నిహోత్రి  డి) వీరేశలింగం

**20.** హెస్పెరస్ పత్రిక సంపాదకుడు ఎవరు?
ఎ) హెన్రీ వివియన్ డిరోజియో  బి) శ్యాంజీ వర్మ
సి) కేశవ చంద్రసేన్  డి) జె.ఇ. బెత్యూన్

**21.** 'దరిద్ర నారాయణ' అనే భావనకు నాంది పలికిన వ్యక్తి ఎవరు?
ఎ) మహాత్మాగాంధీ  బి) స్వామి వివేకానందుడు
సి) జవహర్‌లాల్ నెహ్రూ  డి) వినోభా బావే

**22.** భారతదేశంలో మొదటి మహిళా విశ్వవిద్యాలయాన్ని పుణెలో స్థాపించింది ఎవరు?
ఎ) దోండో కేశవ్ కార్వే  బి) ఎన్.టి. రామారావు  సి) సావిత్రిబాయి పూలే  డి) ఎం.జి. రనడే

**23.** మద్రాసు విధాన పరిషత్‌లో సభ్యురాలిగా నియమితురాలైన మొదటి మహిళ?
ఎ) ముత్తులక్ష్మి రెడ్డి  బి) శ్రీలతా రెడ్డి  సి) హర్షితా రెడ్డి  డి) దుర్గాబాయి దేశ్‌ముఖ్

**24.** పుణెలో ఫెర్గుసన్ కళాశాలను స్థాపించిన సంస్థ?
ఎ) దక్కన్ ఎడ్యుకేషనల్ సొసైటీ  బి) ఆర్య మహిళా సమాజ్
సి) స్త్రీ జర్దోస్తి మండల్  డి) శారదా సదన్

**25.** 19వ శతాబ్దంలో ఉత్తర భారతదేశ హిందూ లూథర్‌గా ప్రసిద్ధి గాంచిన వ్యక్తి?
ఎ) ఈశ్వరచంద్ర విద్యాసాగర్  బి) స్వామి దయానంద సరస్వతి
సి) రాధాకాంత్ దేవ్  డి) కేశవ చంద్రసేన్

**26.** బెంగాల్‌లో ముస్లిం పునరుజ్జీవన పితామహుడు?
ఎ) సర్ సయ్యద్ అహ్మద్‌ఖాన్  బి) అమీర్ అలీ
సి) నవాబ్ అబ్దుల్ లతీఫ్‌ఖాన్  డి) నవాబ్ సమీయుల్లాఖాన్

**27.** కిందివారిలో వితంతు పునర్వివాహాల కోసం కృషి చేసిన వ్యక్తి?
ఎ) బెహ్రాంజి మలబారి  బి) కల్నల్ స్లీమన్
సి) ఈశ్వరచంద్ర విద్యాసాగర్  డి) రాజా రామమోహన్‌రాయ్

**28.** 'భారతదేశం భారతీయులకే' అనే నినాదాన్ని ప్రాచుర్యంలోకి తెచ్చిన ఉద్యమం?
ఎ) బ్రహ్మ సమాజం  బి) ప్రార్థనా సమాజం
సి) ఆర్య సమాజం  డి) సత్యశోధక సమాజం

**29.** దయానంద ఆంగ్లో వేదిక్ కళాశాల స్థాపకుడు ఎవరు?

ఎ) దయానంద సరస్వతి
బి) లాలా మున్షీరాం
సి) శివనారాయణ అగ్నిహోత్రి
డి) లాలా హన్సరాజ్

**30.** కిందివాటిలో సరిగ్గా జతపరిచింది-

ఎ) గోఖలే - బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్
బి) నారాయణ మల్హార్ జోషి - ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్
సి) అనిబిసెంట్ - సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ
డి) దాదాభాయ్ నౌరోజీ - హోమ్ రూల్ లీగ్

**31.** కుమరన్ అసన్‌కు ఏ రాష్ట్ర సాంఘిక పునరుజ్జీవనంతో సంబంధం ఉంది?

ఎ) కేరళ
బి) తమిళనాడు
సి) ఆంధ్రప్రదేశ్
డి) ఏదీకాదు

**32.** 1893 లో చికాగోలో జరిగిన ఎన్నో ప్రపంచ మత సభల్లో వివేకానందుడు పాల్గొన్నాడు?

ఎ) మొదటి
బి) రెండో
సి) మూడో
డి) నాలుగో

**33.** మానవులందరికీ 'ఒకే మతం, ఒకే కులం, ఒకే దేవుడు' అని పేర్కొన్నది ఎవరు?

ఎ) శ్రీనారాయణ గురు
బి) రామస్వామి నాయకర్
సి) జ్యోతిబా పూలే
డి) మహాత్మా గాంధీ

**34.** ఆధునిక భారతదేశ పితగా ఎవరిని పేర్కొంటారు?

ఎ) గాంధీజీ
బి) కేశవ చంద్రసేన్
సి) రాజా రామమోహన్‌రాయ్
డి) ఎం.జి. రనడే

**35.** మహారాష్ట్రలో 19 వ శతాబ్దంలో కుల వ్యవస్థకు, బ్రాహ్మణులకు వ్యతిరేకంగా ఉద్యమాన్ని ప్రారంభించిన వ్యక్తి?

ఎ) ఎం.జి. రనడే
బి) కె.టి. తెలాంగ్
సి) గోపాలకృష్ణ గోఖలే
డి) జ్యోతిబా పూలే

**36.** ప్రసిద్ధిగాంచిన 'సారే జహాన్ సే అచ్చా' గీత రచయిత ఎవరు?

ఎ) సయ్యద్ అహ్మద్‌ఖాన్
బి) హసరత్ మొహాని
సి) అబ్దుల్‌కలాం ఆజాద్
డి) మహ్మద్ ఇక్బాల్

**37.** కిందివాటిలో స్త్రీల అభ్యున్నతి కోసం కార్యక్రమాలు చేపట్టిన సంస్థ?

ఎ) ఆత్మీయ సభ
బి) థియోసోఫికల్ సొసైటీ
సి) బ్రహ్మ సమాజం
డి) దేవ్ సమాజం

**38.** కలకత్తాలో 1791 లో మదర్సాను స్థాపించిన గవర్నర్ జనరల్ ఎవరు?

ఎ) వారన్ హేస్టింగ్స్
బి) కారన్ వాలీస్
సి) విలియం బెంటింక్
డి) డల్హౌసీ

**39.** బెనారస్‌లో 1791 లో సంస్కృత కళాశాలను స్థాపించిన ఆంగ్లేయుడు ఎవరు?

ఎ) మెకాలే
బి) ప్రిన్సెప్
సి) జొనాథన్ డంకన
డి) విలియం కేరీ

**40.** ఏ గవర్నర్ జనరల్ కాలంలో ఆంగ్ల మాధ్యమంలో బోధన ప్రవేశపెట్టారు?

ఎ) కర్జన్
బి) వెల్లస్లీ
సి) విలియం బెంటింక్
డి) డఫ్రిన్

**41.** రిప్పన్ కాలంలో ఎవరి ఆధ్వర్యంలో విద్యా కమిషన్‌ను ఏర్పాటు చేశారు?

ఎ) డబ్ల్యు.డబ్ల్యు. హంటర్
బి) ఛార్లెస్ ఉడ్
సి) ర్యాలీగ్
డి) సాడ్లర్

**42.** భారతదేశంలో మొదటి ముద్రణా యంత్రాన్ని స్థాపించింది ఎవరు?

ఎ) పోర్చుగీసు వారు   బి) డచ్చివారు   సి) ఆంగ్లేయులు   డి) ఫ్రెంచి వారు

**43.** భారతదేశంలో ప్రచురితమైన మొదటి పత్రిక?

ఎ) బాంబే గెజిట్   బి) బెంగాల్ గెజిట్   సి) మద్రాస్ గెజిట్   డి) దిల్లీ గెజిట్

**44.** బాలగంగాధర తిలక్ స్థాపించిన పత్రిక ఏది?

ఎ) మరాఠా   బి) కేసరి   సి) ఎ, బి రెండూ   డి) ఏదీకాదు

**45.** కామన్వెల్త్, న్యూ ఇండియా పత్రికలను స్థాపించింది ఎవరు?

ఎ) సి.వై. చింతామణి   బి) ఎన్.ఎన్. సేన్   సి) అనిబిసెంట్   డి) లాలా హరదయాళ్

**46.** సంవాద కౌముది పత్రిక స్థాపకులు ఎవరు?

ఎ) కృష్ణకుమార్ మిత్ర   బి) రాధాకాంత్ దేవ్   సి) రాజా రామమోహన్‌రాయ్   డి) బకించంద్ర

**47.** మద్రాస్ కొరియర్ పత్రికను ఏ సంవత్సరంలో స్థాపించారు?

ఎ) 1786   బి) 1785   సి) 1789   డి) 1788

**48.** నిర్బంధ ప్రాథమిక విద్యను అందించే బాధ్యతను చేపట్టాలని ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చిన జాతీయ నాయకుడు ఎవరు?

ఎ) గోపాలకృష్ణ గోఖలే   బి) బాలగంగాధర తిలక్   సి) గాంధీజీ   డి) మోతీలాల్ నెహ్రూ

**49.** ఆసియాటిక్ సొసైటి ఆఫ్ బెంగాల్ సంస్థ స్థాపకుడు ఎవరు?

ఎ) హెచ్.హెచ్. విల్సన్   బి) ఛార్లెస్ విల్కిన్స్   సి) విలియం జోన్స్   డి) స్మిత్

**50.** అశోకుడి శాసనాలపై అధ్యయనం చేసిన ఆంగ్లేయుడు ఎవరు?

ఎ) ప్రిన్సెప్   బి) ఎల్ఫిన్‌స్టోన్   సి) ఫెర్గుసన్   డి) కీత్

**51.** కిందివాటిలో దేన్ని భారతదేశంలో ఆంగ్ల విద్యకు సంబంధించిన మాగ్నాకార్టాగా పేర్కొంటారు?

ఎ) ర్యాలీగ్ కమిషన్   బి) హంటర్ కమిషన్   సి) కొఠారి కమిషన్   డి) ఉడ్ తాఖీదు

**52.** యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ ఏర్పాటును ప్రతిపాదించింది?

ఎ) హంటర్ కమిషన్   బి) రాధాకృష్ణన్ కమిషన్

సి) హార్టాగ్ కమిషన్   డి) ఏదీకాదు

**53.** భారతీయులు ఆంగ్ల భాషలో ప్రచురించిన మొదటి పత్రిక?

ఎ) పేట్రియాట్   బి) హిందూ   సి) యంగ్ ఇండియా   డి) టైమ్స్ ఆఫ్ ఇండియా

**54.** స్వదేశీ భాషా పత్రికల చట్టాన్ని ఎప్పుడు రూపొందించారు?

ఎ) 1884   బి) 1875   సి) 1882   డి) 1878

**55.** 'మోక్ష ముల్లర్'గా పేరుగాంచిన మాక్స్‌ముల్లర్ ఏ దేశానికి చెందిన పండితుడు?

ఎ) ఇంగ్లండ్   బి) ఫ్రాన్స్   సి) పోర్చుగల్   డి) జర్మనీ

**జవాబులు**

1-సి; 2-డి; 3-బి; 4-డి; 5-బి; 6-ఎ; 7-డి; 8-సి; 9-బి; 10-ఎ; 11-ఎ; 12-డి; 13-ఎ; 14-డి; 15-డి; 16-ఎ; 17-బి; 18-బి; 19-బి; 20-ఎ; 21-బి; 22-ఎ; 23-ఎ; 24-ఎ; 25-బి; 26-బి; 27-సి; 28-సి; 29-డి; 30-బి; 31-ఎ; 32-ఎ; 33-ఎ; 34-సి; 35-డి; 36-డి; 37-సి; 38-ఎ; 39-సి; 40-సి; 41-ఎ; 42-ఎ; 43-బి; 44-సి; 45-సి; 46-సి; 47-డి; 48-ఎ; 49-సి; 50-ఎ; 51-డి; 52-బి; 53-ఎ; 54-డి; 55-డి.

- భాస్కర్ వేడియం

# జనరల్ స్టడీస్

భారతదేశ చరిత్ర

★ **కార్తికేయుడి దేవాలయాన్ని రెండో యుద్ధమల్లుడు నిర్మించారు.**

★ **పురుషార్థ సారం గ్రంథ రచయిత శివదేవయ్య.**

★ **సహజ పండితుడు అనే బిరుదున్న కవి పోతన.**

★ **తళ్లికోట యుద్ధం 1565 లో జరిగింది.**

★ **పురిటి సుంకం విధించిన కొండవీటిరెడ్డి రాజు రాచ వేమారెడ్డి.**

**1.** సింధూ నాగరికతకు చెందిన అతిపెద్ద డాక్‌యార్డ్ ఎక్కడ ఉంది?

ఎ) హరప్పా బి) లోథల్ సి) రంగపూర్ డి) రూపార్

**2.** సింధూ నాగరికతకు చెందిన తవ్వకాల్లో తామ్ర లోహంతో చేసిన బండి బొమ్మను ఏ ప్రాంతంలో కనుక్కున్నారు?

ఎ) రూపార్ బి) దైమాబాద్ సి) చన్హుదారో డి) లోథల్

**3.** ప్రాచీన భారతీయ వైద్యానికి (ఆయుర్వేదం) సంబంధించిన మూలాలు ఏ వేదంలో ఉన్నాయి?

ఎ) రుగ్వేదం బి) యజుర్వేదం సి) సామవేదం డి) అధర్వణవేదం

**4.** హరప్పా సంస్కృతికి చెందిన మట్టితో చేసిన గుర్రం బొమ్మ కింది ఏ ప్రాంతంలో దొరికింది?

ఎ) లోథల్ బి) రూపార్ సి) హరప్పా డి) చన్హుదారో

**5.** వేదకాలం నాటి ప్రజాపతి ఎవరు?

ఎ) మత పెద్ద బి) కుటుంబానికి పెద్ద

సి) పచ్చిక బయళ్లపై అధికారి డి) గ్రామానికి పెద్ద

**6.** ఉపనిషత్తులకున్న మరో పేరు ఏమిటి?

ఎ) వేదాంతాలు బి) నిరుక్తకాలు సి) కల్ప డి) శిక్ష

**7.** తథాగతుడు, శాక్యముని అనేవి ఎవరి బిరుదులు?

ఎ) వర్థమాన మహావీరుడు బి) గౌతమ బుద్ధుడు సి) కనిష్కుడు డి) ఉపగుప్తుడు

**8.** భారతదేశంపై మొదటిగా దండెత్తింది?

ఎ) అరబ్బులు బి) పారశీకులు సి) శకులు డి) కుషాణులు

**9.** శూన్యవాదాన్ని ఎవరు ప్రతిపాదించారు?

ఎ) ఆచార్య నాగార్జునుడు బి) మహావీరుడు సి) జీవకుడు డి) అశ్వఘోషుడు

**10.** కథా సరిత్సాగరం ఎవరి రచన?

ఎ) సోమదేవుడు బి) కౌటిల్యుడు సి) మనువు డి) హాలుడు

**11.** వాసుదేవ మతానికి ప్రధాన కేంద్రం ఏది?

ఎ) పాటలీపుత్రం బి) మధుర సి) కళింగ డి) అమరావతి

**12.** చంద్రగుప్తుడు తన చివరి రోజులను ఎక్కడ గడిపాడు?

ఎ) శ్రావణ బెళగొళ బి) మస్కి సి) నాగార్జునకొండ డి) అమరావతి

**13.** శాతవాహనుల రాజధాని ఏది?

ఎ) ధాన్యకటకం బి) నాగార్జునకొండ సి) విజయపురి డి) విజయవాడ

**14.** కనిష్కుడి ఆస్థానంలోని సుప్రసిద్ధ వైద్యుడు ఎవరు?

ఎ) శుశ్రుతుడు బి) వాగ్భటుడు సి) చరకుడు డి) నాగసేనుడు

**15.** నాట్యదర్పణం గ్రంథ రచయిత ఎవరు?

ఎ) శూద్రకుడు బి) రామచంద్రుడు సి) కాళిదాసు డి) రాజశేఖరుడు

**16.** గుప్త యుగానికి చెందిన తామ్ర విగ్రహం (81 అడుగుల ఎత్తు) ఎక్కడ ఉంది?

ఎ) నలందా బి) ప్రయాగ సి) మధుర డి) ఢిల్లీ

**17.** రంజిత్ సింగ్‌కు బ్రిటిషర్లకు మధ్య అమృత్‌సర్ సంధి ఎప్పుడు జరిగింది?

ఎ) 1805 బి) 1808 సి) 1809 డి) 1811

**18.** బెంగాల్‌లో అతి ముఖ్యమైన ఫ్రెంచ్ స్థావరం ఏది?

ఎ) ఢాకా బి) హుగ్లీ సి) చందర్‌నగర్ డి) ముర్షిదాబాద్

**19.** భూమారాలోని శివాలయం, నాచ్నా కుతారాలోని పార్వతీ దేవాలయం ఏ కాలానికి చెందినవి?

ఎ) గుప్త బి) చోళ సి) శాతవాహన డి) మౌర్య

**20.** షేర్‌షా సమాధి ఎక్కడ ఉంది?

ఎ) సికందర్ బి) ససారం సి) లాహోర్ డి) ఆగ్రా

**21.** సిక్కుల పవిత్ర గ్రంథం ఆది గ్రంథ్‌ను రచించిన సిక్కు గురువు ఎవరు?

ఎ) గురు నానక బి) గురు రామదాసు సి) గురు అర్జున్‌సింగ్ డి) తేజ్ బహదూర్ సింగ్

**22.** నరసాంబుధి తటాకం (చెరువు) ఏ కాలానికి చెందింది?

ఎ) విజయనగర బి) కాకతీయ సి) చోళ డి) హొయసల

**23.** ప్రతాపరుద్ర యశోభూషణం ఎవరి రచన?

ఎ) జాయప సేనాని బి) విద్యానాథుడు

సి) ప్రతాపరుద్రుడు డి) పాల్కురికి సోమనాథుడు

**24.** అక్బర్ (1556-1605) అమోఘత్వ ప్రకటనను ఎప్పుడు జారీ చేశాడు?

ఎ) 1575 బి) 1570 సి) 1579 డి) 1580

**25.** బులంద్ దర్వాజాను అక్బర్ ఎక్కడ నిర్మించాడు?

ఎ) ఫతేపూర్ సిక్రీ బి) ఢిల్లీ సి) లాహోర్ డి) కాబూల్

**26.** సర్వేశ్వర శతకం ఎవరి రచన?

ఎ) యథావాక్కుల అన్నమయ్య బి) శ్రీనాథుడు సి) పోతన డి) బద్దెన

**27.** భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్ష పదవిని చేపట్టిన మొదటి మహిళ ఎవరు?

ఎ) దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ బి) అనిబిసెంట్ సి) విజయలక్ష్మి పండిట్ డి) ఇందిరాగాంధీ

**28.** కన్నెగంటి హనుమంతు పాల్గొన్న ఉద్యమం ఏది?

ఎ) తెనాలి బాంబు కేసు ఉదంతం బి) రంప విప్లవం

సి) పల్నాడు సత్యాగ్రహం డి) మోప్లా తిరుగుబాటు

**29.** సరిహద్దు గాంధీ అని ఎవరిని పిలుస్తారు?

ఎ) ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ బి) మౌలానా అబుల్ కలాం ఆజాద్

సి) జిన్నా డి) మౌలానా అహమ్మద్ ఖాన్

**30.** సర్ థామస్‌రో ఎవరి కాలంలో మొగలుల ఆస్థానానికి వచ్చాడు?

ఎ) ఔరంగజేబ్ బి) జహంగీర్ సి) అక్బర్ డి) షాజహాన్

**31.** కుమారగిరి రెడ్డి ఆస్థాన నర్తకి ఎవరు?

ఎ) లకుమా దేవి బి) మాచల దేవి సి) ముద్దు పళని డి) చెల్లవ్వ

**32.** గదర్ పార్టీని లాలా హరదయాల్ ఎప్పుడు స్థాపించారు?

ఎ) 1911 బి) 1913 సి) 1915 డి) 1914

**33.** స్వతంత్ర రాష్ట్రకూట రాజ్య స్థాపకుడు ఎవరు?

ఎ) గోవిందుడు బి) కృష్ణుడు సి) దంతిదుర్గుడు డి) ధ్రువుడు

**34.** అశోకుడి ఎన్నో శిలాశాసనం ఆంధ్రుల గురించి పేర్కొంటుంది?

ఎ) 5 వ శిలాశాసనం బి) 10 వ శిలాశాసనం

సి) 9 వ శిలాశాసనం డి) 13 వ శిలాశాసనం

**35.** నౌకా చిహ్నం ఉన్న నాణేలు వేయించిన శాతవాహన రాజు ఎవరు?

ఎ) మొదటి శాతకర్ణి బి) యజ్ఞశ్రీ శాతకర్ణి సి) హాలుడు డి) గుణాఢ్యుడు

**36.** తెలుగు భాషలో లభించిన మొదటి శాసనాలు ఏ రాజుల కాలానికి చెందినవి?

ఎ) కాకతీయులు బి) పల్లవులు సి) రేనాటి చోళులు డి) విజయనగర రాజులు

**37.** శాతవాహన రాజుల్లో గౌతమీపుత్ర శాతకర్ణి ఎన్నో చక్రవర్తి?

ఎ) 23 బి) 22 సి) 25 డి) 21

**38.** ఏ శాతవాహన రాజును బాణ మహాకవి త్రిసముద్రాధీశ్వరుడని పేర్కొన్నాడు?

ఎ) శివశ్రీ శాతకర్ణి బి) యజ్ఞశ్రీ శాతకర్ణి సి) రెండో పులోమావి డి) హాలుడు

**39.** కిందివాటిలో కాతంత్ర సంస్కృత వ్యాకరణం ఎవరి రచన?

ఎ) శర్వవర్మ బి) హాలుడు సి) నాగార్జునుడు డి) బాణుడు

**40.** శాతవాహనుల కాలంలో సార్థవాహులు అంటే ఎవరు?

ఎ) విదేశాలతో వ్యాపారం చేసేవారు బి) ప్రముఖ విద్వాంసులు

సి) దారిదోపిడి దొంగలు డి) పట్టణాల్లో వ్యాపారం చేసేవారు

**41.** మహా మేఘవాహన అనే బిరుదున్న రాజు ఎవరు?

ఎ) నహపాణుడు బి) అశోకుడు

సి) ఖారవేలుడు డి) యజ్ఞశ్రీ శాతకర్ణి

**42.** భారతదేశపు ఐన్‌స్టీన్, రెండో బుద్ధుడు అని ఎవరిని అంటారు?

ఎ) హాలుడు బి) నాగార్జునుడు సి) ఖారవేలుడు డి) గౌతమీ బాలశ్రీ

**43.** కాలకాసూరి ప్రబంధం ఏ మత గ్రంథం?

ఎ) సిక్కు మతం బి) బౌద్ధ మతం సి) జైన మతం డి) హిందూ మతం

**44.** పచ్చల సోమేశ్వరాలయం ఎక్కడ ఉంది?

ఎ) శ్రీశైలం బి) మంగళగిరి సి) పానగల్లు డి) ఆలంపూర్

**45.** ఆంధ్రాలో తొలి వితంతు పునర్వివాహం ఎప్పుడు జరిగింది?

ఎ) 1880 బి) 1885 సి) 1889 డి) 1881

**46.** ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని మొదట ఏ పట్టణంలో నెలకొల్పారు?

ఎ) విజయవాడ బి) గుంటూరు సి) కాకినాడ డి) విశాఖపట్టణం

**47.** ఇక్ష్వాకుల రాజధాని ఏది?

ఎ) అమరావతి బి) వేములవాడ సి) విజయపురి డి) వేంగి

**48.** మచిలీపట్నం జాతీయ కళాశాలను ఎప్పుడు స్థాపించారు?

ఎ) 1919 బి) 1905 సి) 1909 డి) 1907

**49.** ఆంధ్ర రాష్ట్రం ఏర్పడినప్పుడు (1953) హైకోర్టును ఎక్కడ ఏర్పాటు చేశారు?

ఎ) కర్నూలు బి) విజయవాడ సి) గుంటూరు డి) విశాఖపట్టణం

**50.** కవి వృషభుడు అనే బిరుదున్న భట్ట వామనుడు ఎవరి ఆస్థానంలో ఉండేవారు?

ఎ) విమలాదిత్యుడు బి) మొదటి చాళుక్య భీముడు

సి) రాజరాజ నరేంద్రుడు డి) రెండో శక్తివర్మ

**జవాబులు**

1-బి; 2-సి; 3-బి; 4-ఎ; 5-సి; 6-ఎ; 7-బి; 8-బి; 9-ఎ; 10-ఎ; 11-బి; 12-ఎ; 13-ఎ; 14-సి; 15-బి; 16-ఎ; 17-సి; 18-సి; 19-ఎ; 20-బి; 21-సి; 22-ఎ; 23-బి; 24-సి; 25-ఎ; 26-ఎ; 27-బి; 28-సి; 29-ఎ; 30-బి; 31-ఎ; 32-బి; 33-సి; 34-డి; 35-బి; 36-సి; 37-ఎ; 38-బి; 39-ఎ; 40-ఎ; 41-సి; 42-బి; 43-సి; 44-సి; 45-డి; 46-ఎ; 47-సి; 48-బి; 49-సి; 50-బి.

**- సి. రామాంజులు**

# భారతదేశంలో స్థానిక స్వపరిపాలనా సంస్థలు

**స్థానిక ప్రభుత్వం అనే పదం మొదట ఇంగ్లండ్‌లో (1871) వాడుకలోకి వచ్చింది. స్థూలంగా చెప్పాలంటే స్థానిక ప్రభుత్వం అంటే - స్థానిక ప్రజలు ఎన్నుకోగా, వారికి బాధ్యత వహించి, వారి ముఖ్యావసరాలను తీరుస్తూ, ద్రవ్యసేకరణ కోసం ప్రజలపై పన్నులు, సుంకాలు విధించే హక్కు కలిగి, శాసన పరిమితిలో స్వయం పాలనాధికారం ఉన్న ప్రభుత్వ సంస్థ. ఒక భావనగా (Concept) గా చెప్పాలంటే స్థానిక ప్రభుత్వం బహుముఖోన్ముఖమైంది. ఒక నిర్ణీత భౌగోళిక ప్రాంతంలో నివసించే సంఘటిత ప్రజా సమూహం తామంతా ఒకటే అన్న భావనను పెంపొందించుకోవాలంటే కొన్ని విశిష్ట ఆర్థిక, సాంఘిక, రాజకీయ, భౌగోళిక, పాలన లక్షణాలు ఆధారంగా ఉంటాయి.**

స్థానిక ప్రభుత్వాలు సార్వభౌమాధికారం లేని, ఉత్పన్నమైన (derivative) సంస్థలు.

★ ఇవి నిర్ణీత ప్రాంతంలోనే తమ కార్యకలాపాలను నిర్వహిస్తాయి. కేవలం స్థానిక ప్రజలకు ఉపయోగపడతాయి. స్థానిక అవసరాలను సమకూర్చే పనులను మాత్రమే చేస్తాయి.

★ స్థానిక ప్రభుత్వాలపై పైస్థాయి ప్రభుత్వాల నిర్దిష్ట బాహ్యనియంత్రణ ఉంటుంది.

★ తమ కార్యకలాపాలను నిర్వహించుకోవడానికి అవసరమైన పన్నులను విధించుకుంటాయి. వార్షిక బడ్జెట్‌ను ఆమోదిస్తాయి. దీని కోసం ప్రజలు ఎన్నుకున్న, ప్రజలకు బాధ్యత వహించే 'కౌన్సిల్' లేదా 'బోర్డు' ఉంటుంది.

★ స్థానిక ప్రభుత్వం అందించే సేవలకయ్యే వ్యయంలో కొంత భాగాన్ని స్థానిక ప్రజలు పన్నుల ద్వారా చెల్లిస్తారు. పన్నులు విధించే అధికారం స్థానిక ప్రభుత్వాల ముఖ్య లక్షణాల్లో ఒకటి.

*ప్రాచీనకాలంలో స్థానిక ప్రభుత్వాలు..*

స్థానిక స్వపరిపాలనా సంస్థలు భారతదేశానికి కొత్త కాదు. ప్రముఖ చరిత్రకారుడు డాక్టర్ రాధాకుమార్ ముఖర్జీ అభిప్రాయం ప్రకారం - నేడు అనేక నాగరిక దేశాల్లో కేంద్ర ప్రభుత్వం (లేదా రాష్ట్ర ప్రభుత్వం) ఉద్దేశపూర్వకంగా తన కార్యకలాపాలను సంక్రమణం (Devolution), పరిమితి నిర్ణయం (Delimitation) చేసి స్వయం పరిపాలనా సంస్థలను ఏర్పాటు చేస్తోంది. కానీ ప్రాచీన భారతదేశంలో సాముదాయక సంస్థలు (Communal institutions) శ్రేణులు (Guilds), స్థానిక సంస్థలు (Local bodies) అప్పటి అనిశ్చిత అసంపూర్ణ పరిస్థితుల వల్ల వాటంతట అవే ఆవిర్భవించి వృద్ధి చెందాయి.

★ వేదాలు ముఖ్యంగా రుగ్వేదం ప్రజలు తమతమ సమస్యల పరిష్కారానికి సమష్టి దృక్పథం అవలంబించారని పేర్కొంది. కె.పి. జయస్వాల్ అనే చరిత్రకారుడు 'ఆనాడు జాతీయ జీవన కార్యకలాపాలు ప్రజల ఆమోదం పొందిన సభలు, సంస్థల ద్వారా వ్యక్తమయ్యేవి' అని పేర్కొన్నారు.

★ ప్రాచీన కాలంలో కూడా గ్రామాన్ని అతిచిన్న పరిపాలన యూనిట్‌గా పరిగణించేవారు. ఆ కాలంలో ప్రజలు ఎక్కువగా గ్రామాల్లోనే నివసించేవారు. రామాయణ, మహాభారతాల్లో ఘోష (Ghosha), గ్రామం (Grama) అనే ప్రస్తావన కనిపిస్తుంది. 'ఘోష' గ్రామం కంటే కొంచెం చిన్నది. సాధారణంగా అడవులకు దగ్గరగా ఉండేది.

★ గ్రామాధికారిని 'గ్రామణి' అనేవారు. పదిగ్రామాలకు ఉండే అధికారిని 'దశగ్రామణి' అనేవారు. నాడు ప్రతి గ్రామంలో 'గ్రామ పెద్దలు' (Village elders) అనే గ్రామ సంఘం ఉండేదని, వారి సలహా సంప్రదింపులతో గ్రామణి నడచుకోవాల్సి ఉండేదని డాక్టర్ ఎ.ఎస్. ఆల్టేకర్ వివరించారు.

★ న్యాయనిర్వహణ గ్రామ సంఘాల అతి ముఖ్యమైన కర్తవ్యం. కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో గ్రామిక, గ్రామకూట అనే గ్రామాధికారుల గురించి ప్రస్తావించాడు. జాతక కథలు, స్మృతులు, శుక్రనీతి, అర్థశాస్త్రం లాంటి గ్రంథాల్లో పేర్కొన్నట్లు గ్రామాల్లో తలెత్తే తగాదాలు, వ్యాజ్యాలను గ్రామస్థులే పరిష్కరించుకునేవారు. యజ్ఞవల్క్యుడు పూగ, శ్రేణి, కుల అనే మూడు రకాల న్యాయస్థానాలు ఉన్నట్లు పేర్కొన్నాడు.

*ప్రాచీన కాలంలో నగర పాలన*

గ్రామం (Village), పురం (Town), నగరం (City) ఈ మూడింటికి ఉండే భేదాన్ని మనువు (Manu) గుర్తించాడు. వాటిలో కూడ స్థానిక స్వపరిపాలనా సంస్థలు ఉన్నాయని చెప్పడానికి తగిన ఆధారాలు లభించాయి. పట్టణాలు, నగరాల్లో సభలు (Assemblies), సమితులు (Committees) లేదా బోర్డు (Boards) లాంటి స్థానిక ప్రభుత్వ వ్యవస్థలు ఉండేవి. రాజు నియమించిన 'నగరక' లేదా పురపాలకునికి కూడా తగిన అధికారం ఉండేది. మౌర్య చక్రవర్తి చంద్రగుప్తుడి ఆస్థానాన్ని సందర్శించిన గ్రీకు రాయబారి మెగస్తనీస్ క్రీ.పూ. 300 లో ఇండికా (Indica) అనే గ్రంథాన్ని రచించాడు. అప్పటి మౌర్యుల రాజధాని నగరమైన పాటలీపుత్రంలోని పాలనా వ్యవస్థ గురించి వర్ణించాడు. మౌర్యులు నగర పాలనా వ్యవస్థను ఒక్కొక్కదానిలో అయిదుగురు సభ్యులుండే 6 బోర్డులుగా విభజించారు. ఈ 30 మంది



R-11-09-16

సభ్యులు సమష్టిగా ప్రజలందరి అవసరాలకు (ధరలను అదుపులో పెట్టడం, మార్కెట్ల నిర్వహణ) బాధ్యత వహించేవారు.

★ గ్రామాలు, పట్టణాలు స్వయం సమృద్ధి సాధించాయని ఛార్లెస్ మెట్‌కాఫ్ 1830 లో రాసిన 'గ్రామ సంఘాలు' అనే గ్రంథంలో పేర్కొన్నారు. ప్రాచీన కాలంలో స్థానిక స్వపరిపాలన బ్రిటిష్ పాలన కంటే ప్రజారంజకంగా, సమర్థవంతంగా ఉండేదని ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య తాను రచించిన Local Government in India అనే గ్రంథంలో వివరించారు.

*చోళుల గ్రామ స్వపరిపాలన*

చోళుల కాలంలో గ్రామ స్వపరిపాలన ఉన్నత స్థాయిని చేరుకుందని చెప్పడానికి పలు శాసనాధారాలు లభించాయి. చెంగల్‌పట్ జిల్లాలోని ఉత్తర మేరూర్ (Uttaramerur) అనే అగ్రహారంలో రెండు శాసనాలు (రాగి) బయటపడ్డాయి. ఇవి చోళ చక్రవర్తి ఒకటో పరాంతకుడి కాలానికి చెందినవి (క్రీ.శ. 919, 921). ఉత్తర మేరూర్ శాసనం ప్రకారం తాటి ఆకులను బ్యాలెట్ పత్రాలుగా, కుండలను బ్యాలెట్ బ్యాంకులుగా ఉపయోగించి స్థానిక సంస్థలకు పాలకులను ఎంపిక చేసినట్లు తెలుస్తోంది. అర్హత ఉన్నవారి పేర్లున్న చీట్లను కుండలో ఉంచి వాటిలో అయిదింటిని చిన్నపిల్లలతో తీయించే పద్ధతి కూడా అనుసరించేవారు. నాటి స్థానిక ప్రభుత్వాల్లో మూడు రకాలు ఉండేవి - 1) ఉర్ 2) సభ 3) నగరం. గ్రామీణ ప్రాంతాల్లో స్థానిక సమస్యల పరిష్కారం కోసం 'పంచాస్' అనే అయిదుగురు సభ్యులతో కూడిన ఒక మండలి ఉండేది. 'పంచాస్' అనే పదమే తర్వాత 'పంచాయతీ'గా మారిందనేది ఒక ప్రతీతి.

*మధ్యయుగంలో స్థానిక పాలన*

మధ్యయుగంలో అంటే మొగల్ సామ్రాజ్యంలో స్థానిక స్వపరిపాలన సంస్థలు ఉండేవి. పట్టణ పరిపాలనను ప్రభుత్వ అధికారి 'కొత్వాల్' చూసుకునేవాడు. ఇతడు న్యాయసంబంధమైన, శాంతిభద్రతలు, విత్త వ్యవహారాలు, పురపాలనకు సంబంధించిన విధులు నిర్వహించేవాడు. 'మున్సబ్' అనే అధికారి కొత్వాల్‌కు అధికార విధుల్లో సహాయం చేసేవాడు.

★ మహ్మదీయ పాలకులు గ్రామాల్లో స్థానిక స్వపరిపాలనా సంస్థలను పటిష్ఠం చేయడంపై శ్రద్ధ వహించలేదు. పట్టణ, నగర ప్రభుత్వాలపైనే వారి దృష్టి ఉండేది. అబుల్ ఫజల్ తాను రచించిన అయిన్-ఇ-అక్బరీ (Ain-i-Akbari) గ్రంథంలో నాటి పట్టణ ప్రభుత్వాల గురించి వివరించాడు. గ్రామపాలనకు తగినంత ప్రోత్సాహం లభించలేదు. షేర్షా కాలంలో మాత్రం గ్రామస్థాయిలో స్థానిక సంస్థలు పనిచేసేవి. మొగల్ సామ్రాజ్యం పతనమై బ్రిటిష్ వారి పాలన ప్రారంభమయ్యేసరికి పూర్వకాలం నుంచి వస్తున్న గ్రామ పరిపాలనా వ్యవస్థ పూర్తిగా క్షీణించింది.

## బ్రిటిష్ వారి కాలంలో...

ఆధునిక భారతదేశంలో స్థానిక స్వపరిపాలనా వ్యవస్థకు, దాని పాలనా పద్ధతికి బ్రిటిష్‌వారు వేసిన పునాదులే ఆధారం. మొదట్లో యూరోపియన్లకు సౌకర్యాలు కల్పించడానికి, అంటువ్యాధులు ప్రబలకుండా చూడటానికి వీటిని ఏర్పాటు చేశారు. తర్వాత ఆర్థిక వికేంద్రీకరణ కోసం (కేంద్ర ప్రభుత్వ వ్యయ భారాన్ని తగ్గించేందుకు) స్థానిక ప్రభుత్వాలను ఏర్పాటు చేశారు. బ్రిటిష్ వారి కాలంలో స్థానిక స్వపరిపాలనా సంస్థల స్థితిగతులను నాలుగు దశల్లో అధ్యయనం చేయొచ్చు.

*మొదటి దశ (1687–1881)*

భారతదేశానికి గవర్నర్ జనరల్‌గా పనిచేసిన మెట్‌కాఫ్ భారతదేశ గ్రామీణ సమాజాలను లిటిల్ రిపబ్లిక్‌గా అభివర్ణించారు. భారతదేశంలో బ్రిటిష్‌వారు మొట్టమొదటిసారిగా మద్రాసు నగరంలో క్రీ.శ. 1687 లో నగరపాలక సంస్థను (మున్సిపల్ కార్పొరేషన్) స్థాపించారు. రెండో జేమ్స్ చక్రవర్తి దీనికి చార్టర్ (Charter) ప్రకటించాడు. తర్వాత 1726 లో బొంబాయి, కలకత్తా నగరాల్లో 'మేయర్ కోర్టులను' ఏర్పాటు చేశారు. 1842 లో మొట్టమొదటిసారిగా మున్సిపాలిటీలకు సంబంధించిన చట్టాన్ని ఆమోదించారు. ఇది బెంగాల్ రాష్ట్రానికి మాత్రమే వర్తించేది. బ్రిటిష్ ఇండియాలో 1850 లో ఈ చట్టాన్ని అమలు చేశారు. 1858 వరకు భారతదేశం తూర్పు ఇండియా కంపెనీ ఆధీనంలో ఉంది. మద్రాసు, బొంబాయి, కలకత్తా నగరాల్లో నగరపాలక వ్యవస్థలను ఏర్పాటు చేయడం మినహా ఎలాంటి చర్యలూ లేవు.

★ బ్రిటిష్ వారు జిల్లాను ఒక పరిపాలనా యూనిట్‌గా తీసుకుని 1772 లో కలెక్టర్ అనే పదవిని సృష్టించారు. చార్టరు చట్టం 1793 మద్రాసు, కలకత్తా, బొంబాయి నగరాల్లో స్థానిక ప్రభుత్వాల ఏర్పాటుకు చట్టబద్ధత కల్పించింది. చార్టరు చట్టం 1813 ద్వారా స్థానిక సంస్థలకు పన్నులు విధించే, పన్ను చెల్లించనివారిపై చర్యలు తీసుకునే అధికారాలను కల్పించారు.

★ 1861 లో భారత కౌన్సిళ్ల చట్టాన్ని ప్రవేశపెట్టారు. ఈ చట్టం స్థానిక అవసరాలను తీర్చే బాధ్యతను రాష్ట్ర ప్రభుత్వాలకు అప్పగించింది. 1864 లో అప్పటి గవర్నర్ జనరల్ లార్డ్ లారెన్స్ ప్రవేశపెట్టిన తీర్మానం స్థానిక స్వపరిపాలనా సంస్థల ప్రగతికి మరింత ప్రోత్సాహం ఇచ్చింది. ఈ తీర్మానం ముఖ్య ఉద్దేశం - ఆర్థిక వికేంద్రీకరణ.

*మేయో తీర్మానం (1870)*

భారతదేశంలో స్థానిక స్వపరిపాలనా సంస్థల చరిత్రలో లార్డ్ మేయో తీర్మానానికి ప్రముఖ స్థానం ఉంది. ఈయన 1869

నుంచి 1872 వరకు వైస్రాయిగా పని చేశాడు. ఈయన తీర్మానం 'ఆర్థిక వికేంద్రీకరణ' తీర్మానంగా ప్రసిద్ధిగాంచింది. బ్రిటిష్ వారి పాలనా బాధ్యతను ఆర్థికంగా, పాలనాపరంగా తొలగించాలి. పురపాలక, ఇతర స్థానిక సేవా సంస్థలను వికేంద్రీకరించాలి. తద్వారా ఆ బాధ్యతను స్థానిక సంస్థలకే అప్పగించాలి అనేది ఈ తీర్మాన ఉద్దేశం. ఈ తీర్మానం ద్వారా పట్టణ, గ్రామీణ ప్రాంతాల్లో మొట్టమొదటిసారిగా స్థానిక స్వపరిపాలనా సంస్థలను ఏర్పాటు చేయడానికి వీలు కలిగింది.

*రెండో దశ (1882–1919)*

**రిప్పన్ తీర్మానం:** భారతదేశ స్థానిక స్వపరిపాలనా చరిత్రలో 1882 మే 18 న లార్డ్ రిప్పన్ జారీచేసిన తీర్మానానికి చాలా ప్రాధాన్యం ఉంది. అప్పటి వరకు ప్రభుత్వ విధానం ఆర్థిక వికేంద్రీకరణకు అనుగుణంగా ఉండేది (అంటే కేంద్ర ప్రభుత్వ వ్యయ భారాన్ని తగ్గించడా నికి విద్య, ఆరోగ్యం లాంటి స్థానిక సేవల నిర్వహణకు స్థానిక ప్రభుత్వాలను ఏర్పాటు చేశారు). కేంద్ర ప్రభుత్వ పరిపాలనా సౌలభ్యం కోసం స్థానిక ప్రభుత్వాలను ఏర్పాటు చేశారే తప్ప వాటిని నిజమైన స్థానిక స్వపరిపాలనా సంస్థలుగా భావించలేదు. అయితే రిప్పన్ తీర్మా నంలో కేవలం ప్రభుత్వ పరిపాలనను మెరుగుపరచడానికే కాకుండా రాజకీయ, లౌకిక విజ్ఞానాన్ని నేర్పడానికి స్థానిక ప్రభుత్వాన్ని ఒక పరికరంగా గుర్తించారు. ఇది ప్రభుత్వ విధానంలో వచ్చిన గొప్ప మార్పు. అందుకే రిప్పన్‌ను భారతదేశంలో స్థానిక స్వపరిపాలన పితగా (Father of Local Self Govt. in India) పేర్కొంటారు.

★ గ్రామీణ ప్రాంతాల్లో రెండు స్థాయిల్లో స్థానిక సంస్థలను ఏర్పరచడం రిప్పన్ చేసిన గొప్ప నవకల్పన (Innovation). ఇంగ్లండ్‌లో గ్రామీణ జిల్లా కౌన్సిళ్లు (Rural District Councils) ఏర్పాటు చేయడానికి ఆరేళ్ల ముందే భారతదేశంలో ఇది జరిగింది. అందుకే రిప్పన్ తీర్మానాన్ని భారతదేశ స్థానిక స్వపరిపాలనకు సంబంధించి 'మాగ్నా కార్టా' (Magna carta) గా భావిస్తారు. రిప్పన్‌కు భార తదేశ స్థానిక స్వపరిపాలన ప్రగతి మీద అచంచల విశ్వాసం ఉండేది. రిప్పన్ తీర్మానం ఫలితంగా 1882-84 మధ్య కాలంలో వివిధ రాష్ట్రాల్లో ఎన్నో చట్టాలను ఆమోదించారు. మద్రాసులో 1884 లో జిల్లా మున్సిపాలిటీల చట్టాన్ని, బెంగాల్‌లో 1885 లో బెంగాల్ స్థానిక ప్రభుత్వాల చట్టాలను ఆమోదించారు.

★ రిప్పన్ తర్వాత లార్డ్ కర్జన్ ప్రభుత్వ గవర్నర్ జనరల్‌గా బాధ్యతలు చేపట్టాడు. ఇతడి కాలంలో స్థానిక ప్రభుత్వాల ప్రగతి కుంటుపడింది. ఇతడు ప్రవేశపెట్టిన కేంద్రీకృత పరిపాలనా విధానం ఇబ్బందులకు దారితీసింది. 1907 లో అప్పటికి ఉన్న ధోర ణిపై పరిష్కారం సూచించడానికి రాయల్ వికేంద్రీకరణ సంఘాన్ని నియమించాడు. ఈ సంఘ అధ్యక్షుడు సర్ చార్లెస్ హాబ్ హౌస్. ఈ సంఘం 1909 లో తన నివేదికను సమర్పించింది. ఈ కమిషన్ సూచనల మేరకు మింటో మార్లే సంస్కరణల చట్టంలో (1909) స్థానిక సంస్థల ప్రతినిధులను ప్రత్యక్షంగా ఎన్నుకునే పద్ధతిని ప్రవేశపెట్టారు.

★ 1917 లో అప్పటి ఇండియా సెక్రటరీ ఆఫ్ స్టేట్ లార్డ్ మాంటేగ్ బ్రిటిష్ కామన్స్ సభలో ఒక ముఖ్య ప్రకటన చేశాడు. ప్రభుత్వ పరిపాలనలో ప్రతి రంగంలో భారతీయులు ఇంకా ఎక్కువగా పాల్గొనేలా చేయడం, భారతదేశం బ్రిటిష్ సామ్రాజ్యంలో సమగ్ర భాగం గానే ఉంటూ, భారతదేశంలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని నెలకొల్పడానికి స్వపరిపాలనా సంస్థలను క్రమక్రమంగా విస్తరిం పజేయడం బ్రిటిష్ ప్రభుత్వ విధానమని పేర్కొన్నాడు. అప్పటి గవర్నర్ జనరల్ లార్డ్ ఛెమ్స్‌ఫర్డ్ కూడా స్థానిక స్వపరిపాలనా సంస్థలు శిక్షణా సంస్థల లాంటివని, రాజకీయ ప్రగతి, బాధ్యతాయుత ప్రభావం అక్కడి నుంచే ప్రారంభమవుతాయని పేర్కొ న్నాడు. దీని కోసం భారత ప్రభుత్వం 1918 లో ఒక తీర్మానాన్ని జారీ చేసింది.

★ 1919 మాంట్‌ఫర్డ్ సంస్కరణల వల్ల రాష్ట్రాల్లో ద్వంద్వ ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. స్థానిక స్వపరిపాలనా అంశాన్ని రాష్ట్ర జాబితాలోకి చేర్చారు. స్థానిక స్వపరిపాలన ఎన్నికైన మంత్రుల ఆధీనంలోకి వచ్చింది. దీంతో స్థానిక సంస్థల పరిధిలో కార్యక్రమాలను రూపొం దించుకోవడానికి రాష్ట్రాలకు వీలు కలిగింది.

*మూడో దశ (1920–1937)*

మాంట్‌ఫర్డ్ సంస్కరణలు (1919) ప్రవేశపెట్టిన తర్వాత 'బాధ్యతాయుత ప్రభుత్వం' గమ్యాన్ని చేరడానికి ఇంకా ఎలాంటి చర్యలు తీసుకోవాలో సిఫారసు చేసేందుకు 1927 లో సైమన్ కమిషన్‌ను నియమించాడు. ఇది 1920 నుంచి స్థానిక స్వపరిపాలన లో సాధించిన ప్రగతిని పరిశీలించి లోపాలను వెల్లడించింది. 1935 భారత ప్రభుత్వ చట్టాన్ని అనుసరించి రాష్ట్రాల్లో ద్వంద్వ ప్రభుత్వానికి స్వస్తి చెప్పి, పూర్తి బాధ్యతాయుత ప్రభుత్వాలను ఏర్పాటు చేశారు. స్థానిక ప్రభుత్వ పాలన పూర్తిగా మంత్రుల చేతిలోకి వచ్చింది.

*నాలుగో దశ (1938–1947)*

ఈ దశలో స్థానిక స్వపరిపాలనా సంస్థల ప్రగతి చాలావరకు కుంటుపడింది. రెండో ప్రపంచ యుద్ధం వల్ల కొత్త సంస్క రణలకు అవకాశం లేకుండా పోయింది. పాత సంస్కరణలు కూడా అమలుకి నోచుకోలేదు. దేశంలో ఏర్పడిన రాజ్యాంగ ప్రతిష్టంభన, ప్రజలు స్వాతంత్ర్య ఉద్యమంలో నిమగ్నమై ఉండటంతో స్థానిక సంస్థల గురించి ఎవరూ పట్టించుకోలేదు.

**- షేక్ పీర్ సాహెబ్**

# క్రీ.శ. 11 - 15 శతాబ్దాల మధ్య భారతదేశ సంస్కృతి

## కాకతీయ యుగం

★ మైలాంబ బయ్యారం చెరువు శాసనం ప్రకారం వెన్న భూపతి వంశీయులే కాకతీయులని తెలుస్తోంది. కాకతీయులు మొదట రాష్ట్ర కూటుల వద్ద, తర్వాత కళ్యాణి చాళుక్యుల వద్ద సామంతులుగా పనిచేశారు. కాకతి అనే దేవతను పూజించడం వల్ల కూడా వీరికి కాకతీయులని పేరు వచ్చింది. వీరిని గుమ్మడితీగ సంతానం అని కూడా పేర్కొంటారు. కాకతీయులు కళ్యాణి చాళుక్యుల వరాహ లాంఛనాన్ని స్వీకరించారు.

★ కాకతీయ వంశ మూలపురుషుడు - కాకర్త్య గుండన అని తొలి చారిత్రక ఆధారాలు పేర్కొంటున్నాయి. కానీ, ఇటీవలి శాసనాలు, సాహిత్య ఆధారాల ప్రకారం కాకతీయ వంశ మూలపురుషుడు ధుర్జయుడు. సిద్దేశ్వర చరిత్ర గ్రంథం కాకతీయ వంశ మూలపురుషుడు మాధవవర్మ అని తెలియజేస్తోంది.

★ కాకతీయులను ఆంధ్రదేశాధీశ్వరులు, స్వయం భూ దేవతారాధకులుగా కూడా పిలిచేవారు. కాకతీయుల ఆరాధ్య దైవం స్వయంభూశివుడు.

## రాజకీయ చరిత్ర

**బేతరాజు (992–1052):** కాకతీయ వంశ ప్రతిష్ఠకు పునాది వేసిన పాలకుడు మొదటి బేతరాజు. ఇతడికి కాకతి పురాధినాథ అనే బిరుదు ఉంది. ఇతడు శనిగరం శాసనాన్ని వేయించాడు. బేతేశ్వరాలయాన్ని నిర్మించాడు. ఇతడి మంత్రి నారణయ్య శనిగరంలో యుద్ధమల్ల జినాలయాన్ని (జైన ఆలయం) నిర్మించాడు.

**మొదటి ప్రోలరాజు (1052–1076):** అరికేసరి / అరిగజకేసరి, కాకతి వల్లభ బిరుదులతో పరిపాలించాడు. ఓరుగల్లు సమీపంలో కేసరి తటాకాన్ని తవ్వించాడు. కళ్యాణి చాళుక్యరాజు మొదటి సోమేశ్వరుడికి కొప్పం యుద్ధంలో సహకరించి, అతడి నుంచి హనుమకొండ ప్రాంతాన్ని పొందాడు.

**రెండో బేతరాజు (1076–1108):** త్రిభువనమల్ల, విక్రమచక్ర లాంటి బిరుదులతో పరిపాలించాడు. అతని అనంతరం అతని కుమారుడు దుర్గరాజు (1108 – 1116) పరిపాలించాడు. మొదటి బేతరాజు నిర్మించిన బేతేశ్వరాలయానికి దుర్గరాజు తన గురువు రామేశ్వర పండితుడి పేరుమీద దానధర్మాలు చేసినట్లు ఖాజీపేట శాసనం తెలియజేస్తోంది.

**రెండో ప్రోలరాజు (1116–57):** తొలి కాకతీయుల్లో సుప్రసిద్ధుడు. అనేక విజయాలు సాధించాడు. మహామండలేశ్వర బిరుదుతో పాలించాడు. ఓరుగల్లు పట్టణ నిర్మాణాన్ని ప్రారంభించాడు. హనుమకొండలో పద్మాక్షి, సిద్దేశ్వర, కేశవ ఆలయాలను నిర్మించాడు. శ్రీశైలంలో విజయ స్తంభాన్ని నాటాడు.

★ ఇతడి భార్య ముప్పమాంబ దేవాలయాల నిర్మాణానికి విరివిగా భూములను దానం చేసిన కాకతీయ రాణిగా పేరొందింది. ఇతని మంత్రి - బేతన మంత్రి భార్య మైలమ హనుమకొండలో కడలాలయ జైన బసదిని నిర్మించింది. ఇతడి కాలం నుంచే వరాహం అధికార చిహ్నమయ్యింది. రెండో ప్రోలరాజు చందోలు పాలకుడైన రెండో గొంకరాజు చేతిలో మరణించినట్లుగా మంచన కేయూరబాహు చరిత్ర గ్రంథం తెలియజేస్తోంది.

**రుద్రదేవుడు/ కాకతి రుద్రుడు/ మొదటి ప్రతాప రుద్రుడు (1157–1195):** ఓరుగల్లుకోట నిర్మాణం పూర్తి చేశాడు. హనుమకొండలో వేయిస్తంభాల గుడిని కట్టించి, శాసనం రాయించాడు. హనుమకొండ శాసనాన్ని అచితేంద్రుడు అనే కవి రచించాడు. ప్రసిద్ధి చెందిన పల్నాటి యుద్ధం (1176 – 82) ఇతడి కాలంలోనే జరిగింది. రుద్రదేవుడు ఈ యుద్ధంలో నలగామరాజు పక్షం వహించాడు.

★ త్రిపురాంతకం, ద్రాక్షారామ శాసనాలు కూడా వేయించాడు. హనుమకొండలో రుద్రేశ్వరాలయాన్ని నిర్మించాడు. ఇతడి కాలంలోనే శైవ - జైన సంఘర్షణలు ప్రారంభమయ్యాయి. ఇతడికి విద్యాభూషణుడు అనే బిరుదు ఉన్నట్లు బీఎస్ఎల్ హనుమంతరావు పేర్కొన్నారు. 1195 నాటి బెక్కల్లు శాసనం ప్రకారం ఓరుగల్లు రుద్రదేవుడి రాజధాని.

★ రుద్రదేవుడు సంస్కృత భాషలో నీతిసారం అనే గ్రంథాన్ని రచించాడు. మల్లికార్జున పండితారాధ్యుడు ఇతడికి సమకాలీనుడు. రుద్రదేవుడు యాదవరాజు జైతుడి/జైత్రపాలుడి చేతిలో యుద్ధంలో మరణించినట్లు చతుర్వర్గసారం అనే గ్రంథం తెలియజేస్తోంది.

**మహాదేవుడు (1195–1199):** రుద్రదేవుడి అనంతరం రాజైన మహాదేవుడిని కూడా జైతుగి యుద్ధంలో చంపాడు. మహాదేవుడి కుమారుడైన గణపతిదేవుడిని యాదవ రాజ్యంలో ఖైదు చేశాడు. మహాదేవుడి గురువు ధృవేశ్వర పడింతుడు. అతి తక్కువకాలం పాలించిన కాకతీయ రాజు మహాదేవుడే.

**గణపతి దేవుడు:** ఆంధ్రదేశాన్ని అతి ఎక్కువకాలం పాలించిన రాజుగా గణపతిదేవుడు పేరొందాడు. ఇతడు 1199 నుంచి 1262 వరకు పరిపాలించాడు. వాస్తవానికి గణపతి దేవుడు 1202లో యాదవరాజైన సింఘనచేత విడుదల పొంది కాకతీయ రాజ్యానికి చక్రవర్తి అయ్యాడు. ఈ సమయంలో కాకతీయ రాజ్యాన్ని కాపాడి 'కాకతీయరాజ్య స్థాపనాచార్య' గా బిరుదు పొందిన సేనాని రేచర్ల రుద్రుడు.

★ తెలుగు భాష మాట్లాడే వారందరినీ ఏకంచేసి, పాలించిన తొలి పాలకుడు గణపతిదేవుడు. ఇతడిని సకలదేశ ప్రతిష్ఠాపనాచార్య, చోడ కటక చోరకార, పృథ్వీశ్వర శిరఃకందుక క్రీడా వినోద లాంటి బిరుదులతో ప్రస్తావించారు. క్రీ.శ.1254లో రాజధానిని హనుమకొండ నుంచి ఓరుగల్లుకు మార్చాడు (రాజధానిని పాక్షికంగా ఓరుగల్లుకు మార్చింది రుద్రదేవుడు కాగా, పూర్తిగా మార్చింది గణపతిదేవుడు).

★ గణపతిదేవుడి మరొక సేనాని జాయప చేబ్రోలు, గణపేశ్వరం శాసనాలు వేయించాడు. మనుమసిద్ధి ఆస్థానంలోని తిక్కన రాయబారం వల్ల మోటుపల్లి రేవుని పొందాడు. గణపతిదేవుడు మోటుపల్లి అభయశాసనాన్ని వేయించాడు. హనుమకొండలోని జైనులను గణపతిదేవుడు హింసించినట్లు సిద్ధేశ్వర చరిత్ర అనే గ్రంథం పేర్కొంటోంది.

**రుద్రమదేవి (1262–1289):** ఆంధ్రదేశాన్ని పాలించిన తొలి మహిళా పాలకురాలు. గణపతిదేవుడి కుమార్తె. ఈమెను రుద్రదేవ మహారాజు, రాయగజకేసరి, పట్టోద్ధృతి, ఆంధ్ర మహారాణి లాంటి బిరుదులతో ప్రస్తావించారు.

★ ఇటలీ (వెనిస్) యాత్రికుడు మార్కోపోలో ఈమె రాజ్యాన్ని సందర్శించాడు. ఈమె సేనాని రేచర్ల ప్రసాదిత్యుడికి రాయపితా మహాంక, కాకతీయ రాజ్య ప్రతిష్ఠాపనాచార్య అనే బిరుదులు ఉన్నాయి. రుద్రమదేవి ఓరుగల్లు కోటలోపల మెట్లను కట్టించింది. ఈమె కాలంనాటి మార్కాపురం శాసనం ప్రసూతి వైద్య కేంద్రాల గురించి పేర్కొంటోంది.

★ గణపతిదేవుడికి, రుద్రమదేవికి గురువు విశ్వేశ్వర శంభు/ విశ్వేశ్వర శివాచార్యుడు. రుద్రమదేవి విశ్వేశర శంభుకు మందడం అనే గ్రామాన్ని దానం చేసింది. రుద్రమదేవిని ఆమె సేనాని అయిన కాయస్థ అంబదేవుడు 1289 చందుప్పట్ల యుద్ధంలో వధించాడు. నల్గొండ జిల్లాలోని చందుప్పట్ల శాసనం రుద్రమ యుద్ధ భూమిలోనే చనిపోయినట్లు తెలియజేస్తోంది.

**రెండో ప్రతాపరుద్రుడు:** రుద్రమదేవి అనంతరం ఆమె మనుమడైన రెండో ప్రతాపరుద్రుడు 1289 నుంచి 1323 వరకు కాకతీయ రాజ్యాన్ని పాలించాడు. ఇతడే చివరి కాకతీయ చక్రవర్తి. ముస్లిం దండయాత్రలు నిరంతరం జరగడం వల్ల కాకతీయ సామ్రాజ్యం పతనమైంది.

★ శాసనాధారాలు ఎనిమిది ముస్లిం దండయాత్రలను పేర్కొంటుండగా, ముస్లిం రచనలు మాత్రం అయిదింటినే పేర్కొంటున్నాయి. క్రీ.శ.1303లో కాకతీయ, ఖిల్జీ సైన్యాల మధ్య కరీంనగర్ ప్రాంతంలోని ఉప్పరపల్లి వద్ద జరిగిన పోరులో ముస్లిం సేనలు ఓడిపోయాయి. 1309లో మాలిక్ కపూర్ కాకతీయ రాజ్యంపై దండెత్తి రెండో ప్రతాపరుద్రుడిని ఓడించి, కప్పం వసూలు చేశాడు.

★ 1323లో మహ్మద్ బిన్ తుగ్లక్ కాకతీయ రాజ్యంపై దండెత్తి, రెండో ప్రతాపరుద్రుడిని ఢిల్లీకి తీసుకుపోతుండగా నర్మదా నదిలోకి దూకి ఆత్మహత్య చేసుకున్నాడు. ఫలితంగా 1323లో కాకతీయ సామ్రాజ్యం అంతరించింది.

★ ఓరుగల్లుకు ముస్లింలు సుల్తాన్‌పూర్ అని పేరుపెట్టి, తమ సామ్రాజ్యంలో విలీనం చేసుకున్నారు. రెండో ప్రతాపరుద్రుడు నాయంకర పద్ధతి (సైనిక విధానం) ని పునర్‌నిర్మించాడు. పొలవాస రాజ్యంపై దాడిచేసి, సమ్మక్క–సారక్క–జంపన్నల మరణానికి కారణమైన చక్రవర్తి రెండో ప్రతాపరుద్రుడే. ఇతడి ఆస్థానంలోని కవి విద్యానాధుడు ప్రతాపరుద్ర యశోభూషణం (ప్రతాపరుద్రీయం) అనే గ్రంథాన్ని రచించాడు.

**పాలనా విశేషాలు**

★ బద్దెన – నీతిశాస్త్ర ముక్తావళి, శివదేవయ్య – పురుషార్థసారం, మొదటి ప్రతాపరుద్రుడు – నీతిసారం, మడికి సింగన – సకలనీతి సమ్మతం లాంటి గ్రంథాలు కాకతీయుల పాలనా విధానాలను వివరిస్తున్నాయి.

★ సప్తాంగ సిద్ధాంతాన్ని పాటించారు.

★ మహాప్రధాన, ప్రధాన, ప్రెగ్గడ, అమాత్య, మంత్రి అనే పేర్లు శాసనాల్లో కనిపిస్తున్నాయి.

★ సకలనీతి సమ్మతం గ్రంథం, 'అష్టాదశ తీర్థులు' అనే 18 మంది మంత్రుల గురించి పేర్కొంది. రాజోద్యోగులను 72 నియోగాలుగా (17 డిపార్ట్‌మెంట్లు) విభజించారు.

★ రాజ్యాన్ని నాడులు – స్థలాలు – గ్రామాలుగా విభజించారు. గ్రామంలో 12 మంది ఆయగాండ్రు అనే ఉద్యోగులు ఉండేవారు. గ్రామంలోని 12 మంది ఆయగాండ్రుల్లో రెడ్డి, కరణం, తలారి మాత్రమే ప్రభుత్వ ఉద్యోగులు.

★ ప్రతిష్ఠిత అనే శాశ్వత న్యాయస్థానాలు, అప్రతిష్ఠత అనే తాత్కాలిక న్యాయస్థానాలు ఉండేవి. న్యాయాధిపతిని సముద్రిత అనేవారు. న్యాయ విషయాల్లో ప్రాడ్వివాక్కులు అనే ఉద్యోగులు సలహాలిచ్చేవారు.

★ గ్రామాల్లో తగాదాలు పరిష్కరించడానికి ప్రత్యేక ఉద్యోగులను నియమించేవారని 'దుగ్గిరాల శాసనం' తెలియజేస్తోంది. ప్రత్యేక నేరాల విచారణకు నిపుణులతో ధర్మాసనాలను ఏర్పాటు చేసినట్లు 'క్రీడాభిరామం' గ్రంథం పేర్కొంటోంది. సైనిక వ్యవస్థలో దుర్గాలకు అధిక ప్రాముఖ్యం ఉండేదని 'పురుషార్థసారం' అనే గ్రంథం వివరిస్తోంది.

★ ప్రతాపరుద్ర చరిత్ర గ్రంథం (ఏకామ్రనాథుడు) ప్రకారం కాకతీయ సైన్యంలో వెలమలకు అధిక ప్రాధాన్యం ఉండేదని తెలుస్తోంది. రాజు అంగరక్షక దళమైన లెంకల గురించి 'సకల నీతిసమ్మతం' అనే గ్రంథం పేర్కొంటోంది. ప్రతాపరుద్ర చరిత్ర 72 మంది నాయంకరులను, నీతిశాస్త్ర ముక్తావళి 75 మంది నాయంకరులను పేర్కొంటున్నాయి.

## ఆర్థిక పరిస్థితులు

★ వ్యవసాయరంగ అభివృద్ధికి చెరువులను ఎక్కువగా తవ్వించారు. కేసరి తటాకాన్ని మొదటి ప్రోలరాజు, పాకాల చెరువును జగదళ ముమ్మడి, రామప్ప చెరువును రేచర్ల రుద్రుడు తవ్వించారు.

★ బయ్యారం, లక్నవరం, ఘనపురం చెరువులు కూడా కాకతీయ కాలంనాటివే. చెరువుపై అధిపతిని దశబంధ, చెరువు నీటిని వాడుకున్నందుకు వసూలు చేసే పన్నును (నీటి తీరువాను) దశబంధ మాన్యం అనీ పిలిచేవారు.

★ ఓరుగల్లు ప్రాంతంలో సువాసనలు వెదజల్లే బియ్యం పండించేవారు. భూములను సర్వే చేయడానికి కేసరి పాటిగడ, పెనుంబాకం మానదండం లాంటి పరికరాలను ఉపయోగించేవారు.

★ భూములను రాచపొలం, నీరుపొలం, తోటపొలం, వెలిపొలం అనే రకాలుగా విభజించేవారు.

★ ఆయగాండ్రు రైతుల నుంచి పండే పంటలో 1/3వ వంతు 'మేర'గా వసూలు చేసేవారు (భూమిశిస్తును 'మేర' అనేవారు). కౌలు రైతులను అర్థశిరి, వారు చెల్లించే కౌలును కోరు అనీ పేర్కొన్నారు.

★ పంటలు బాగా పండే వ్యసాయ భూములను అచ్చుకట్ల భూమి అనేవారు.

★ సన్నిగండ్ల శాసనం కొలగాండ్రు, కరణాలను గురించి ప్రస్తావించింది. రేవు పట్టణాలను కరపట్టణాలు, వడ్రంగులను తక్షక అని పిలిచేవారు. పన్ను వసూలుచేసే స్థలాలను ఘట్టాలు అనేవారు.

★ పాల్కురికి సోమనాథుడి పండితారాధ్య చరిత్రలో 20 కిపైగా వస్త్రాల రకాలను ప్రస్తావించారు.

★ మచిలీపట్నం వస్త్రాల గొప్పతనం, గోల్కొండ వజ్ర పరిశ్రమ (గనులు) తీర ప్రాంతంలో లభించే బుకారిమ్స్ వస్త్రాలు, మోటుపల్లి రేవు వాణిజ్యం లాంటి విషయాలను మార్కోపోలో తన గ్రంథం 'నా యాత్రలు' (My travels) లో వివరించాడు.

★ ఓరుగల్లులో రత్న కంబళ్లు, మఖమల్ వస్త్రాలను నేసేవారు. నిర్మల్ కత్తులు సిరియా రాజధాని డమాస్కస్‌కు ఎగుమతి అయ్యేవి.

★ వర్తకులు నకరం – స్వదేశీ – పరదేశీ నానాదేశీ పెక్కండ్రు లాంటి శ్రేణులుగా ఏర్పడేవారు. త్రిపురాంతకంలో అయ్యావళి అయినూరరు (500 మంది) అనే కన్నడ వర్తక శ్రేణి ఉండేది. చైనా నుంచి సిల్కు దిగుమతి గురించి మార్కోపోలో రాశాడు.

★ నాటి పెద్ద ప్రధాన బంగారు నాణెం గద్యాణం. దీన్నే నిష్క లేదా మాడ అనేవారు. ఒక మాడకు పది రూకలు (వెండి) అని బాపట్ల దేవాలయ శాసనం పేర్కొంది. ధన రూపంలో చెల్లించే పన్నును పట్టపహుండి, ధాన్య రూపంలో చెల్లించే పన్నును పట్టు కొలచు అని పిలిచేవారు.

## మాదిరి ప్రశ్నలు

**1.** కిందివాటిలో కాకతీయులకు సంబంధించని పదం ఏది?

1) రట్టడి  2) గుమ్మడి తీగ సంతానం
3) హారతీ పుత్రులు  4) ఆంధ్రరాజులు

**2.** నృత్య రత్నావళి గ్రంథాన్ని రచించింది ఎవరు?

1) పాల్కురికి సోమనాథుడు  2) రేచర్ల రుద్రుడు
3) జాయపసేనాని  4) రుద్రదేవుడు

**3.** కాకతీయుల కాలంనాటి ప్రధాన వినోదం ఏది?

1) తోలు బొమ్మలాట
2) పేరిణి నృత్యం
3) కోలాటం
4) చదరంగం

**4.** 'మాచల్దేవి' ఏ గ్రంథంలో ప్రధానమైన పాత్ర?

1) ప్రేమాభిరామం
2) మదనవిజయం
3) కాదంబరి
4) క్రీడాభిరామం

**5.** సమ్మక్క – సారక్క పొలవాస రాజ్యంపై దాడిచేసిన కాకతీయ చక్రవర్తి ఎవరు?

1) మొదటి ప్రతాపరుద్రుడు
2) గణపతి దేవుడు
3) రెండో ప్రతాపరుద్రుడు
4) రుద్రమదేవి

**జవాబులు**

1-3; 2-3; 3-1; 4-4; 5-3.

**రచయిత: బి. నాగరాజు**

# ఆధునిక భారతదేశ చరిత్ర - ఐరోపా వారి రాక

**ఐరోపావారి రాకతో భారతదేశంలో ఆధునికయుగం ప్రారంభమైంది. క్రీ.శ. 18వ శతాబ్దంలో ఆంగ్లేయులు రాజకీయాధికారాన్ని స్థాపించారు. ఆధునికయుగ ప్రధాన లక్షణం పెట్టుబడిదారీ విధానం. 1453లో తురుష్క రాజు రెండో మహ్మద్ కాన్‌స్టాంట్ నోపుల్‌ను ఆక్రమించడంతో తూర్పు, పశ్చిమ దేశాల మధ్య ఉన్న భూమార్గం మూసుకుపోయింది. దీంతో నూతన సముద్ర మార్గాలను కనుక్కోవాల్సి వచ్చింది. అందులో భాగంగానే పోర్చుగీసు నావికుడైన వాస్కోడిగామా 1498లో భారతదేశానికి సముద్రమార్గాన్ని కనుక్కున్నాడు.**

## పోర్చుగీసువారు

వాస్కోడిగామా 1498, మే 17న కేరళలోని కాలికట్ చేరి ఆ ప్రాంతపు రాజు జామోరిన్‌తో ఒప్పందం చేసుకున్నాడు. ఫలితంగా భారతదేశంలో పోర్చుగీసువారి తొలి వర్తక స్థావరంగా కాలికట్‌ను పేర్కొంటారు. అనంతరం కాబ్రల్ అనే గవర్నర్ కాలంలో కొచ్చిన్, క్రాంగనూర్‌లలో వర్తక స్థావరాలు స్థాపించారు. 1505 – 09 మధ్య పనిచేసిన డి-ఆల్మాడా నీలినీటి విధానాన్ని అవలంబించారు.

- 1510లో ఆల్బూకర్క్, శ్రీకృష్ణదేవరాయలతో సంధి చేసుకుని, బీజాపూర్ సుల్తాన్ ఆదిల్‌షాను ఓడించి, గోవాను పొందాడు. భారతదేశంలో పోర్చుగీసు వారి ప్రధాన వర్తక కేంద్రం గోవా. ఆల్బూకర్క్‌ను పోర్చుగీసు వలస సామ్రాజ్య నిర్మాతగా పేర్కొంటారు.
- క్రమంగా పోర్చుగీసువారు కొలంబో, డయ్యూ, డామన్, నాగపట్నం, చిట్టగాంగ్, హుగ్లీ, శాంథోమ్ మొదలైన ప్రాంతాల్లో స్థావరాలు ఏర్పాటు చేసుకున్నారు.
- భారతదేశంలో పొగాకు, మిరప, మొక్కజొన్న లాంటి పంటలను ప్రవేశపెట్టింది పోర్చుగీసువారే. కానీ క్రమంగా పోర్చుగీసువారు ఆంగ్లేయుల చేతిలో ఓడిపోయి, తమ వ్యాపార ఆధిపత్యాన్ని కోల్పోయారు.
- 16వ శతాబ్దంలో నౌకా వాణిజ్యంలో ఆధిపత్యాన్ని పొందింది పోర్చుగీసువారే. 1961 వరకు వీరు మన దేశంలోని గోవా, డయ్యూ, డామన్ ప్రాంతాలను తమ పాలనలోనే ఉంచుకున్నారు.
- 1961లో భారత ప్రభుత్వం ఆపరేషన్ విజయ్ పేరుతో సైనికచర్య జరిపి, ఆ ప్రాంతాలను భారత్‌లో విలీనం చేసింది. దీంతో భారతదేశానికి మొదట్లో వచ్చి, చివరిలో వెళ్లింది పోర్చుగీసువారే అయ్యారు.

## డచ్‌వారు

హాలెండ్ లేదా నెదర్లాండ్స్ దేశ ప్రజలనే డచ్‌వారుగా పేర్కొంటారు. 1602లో వీరు "డచ్ ఈస్ట్ ఇండియా కంపెనీ ఆఫ్ నెదర్లాండ్స్" పేరుతో ఒక సంస్థను ఏర్పాటుచేసి, సుగంధ ద్రవ్యాల వ్యాపారం కోసం మన దేశానికి వచ్చారు. ఆంధ్రదేశంలో తొలి వర్తక స్థావరం ఏర్పాటు చేసుకున్నది డచ్‌వారే. 1605లో వీరు గోల్కొండ సుల్తాన్ మహ్మద్ కులీకుతుబ్ షా అనుమతితో మచిలీపట్నంలో తొలి వర్తక కేంద్రాన్ని ఏర్పాటు చేసుకున్నారు. 1510లో పులికాట్‌ను తమ ప్రధాన వర్తక కేంద్రంగా మార్చుకున్నారు.

- 1623లో డచ్‌వారు పదిమంది ఆంగ్ల వర్తకులను అంబోయినా ప్రాంతంలో వధించారు. దీన్నే అంబోయినా వధ అంటారు. నాటి డచ్ గవర్నర్ వాన్‌స్పెల్ట్.
- డచ్‌వారు సూరత్, భీమునిపట్నం, చిన్సూర్ (బెంగాల్), కాశింబజార్, నాగపట్నం మొదలైన చోట్ల వర్తక కేంద్రాలను స్థాపించారు. 1690లో తమ ప్రధాన వర్తక కేంద్రాన్ని పులికాట్ నుంచి నాగపట్నానికి తరలించారు. వీరు కూడా ఆంగ్లేయుల చేతిలో ఓడిపోయి, ఇండోనేషియా వ్యాపారంపై దృష్టి సారించారు.
- సుగంధ ద్రవ్యాల వ్యాపారం నుంచి వస్త్ర వ్యాపారంలోకి ప్రవేశించిన తొలి ఐరోపా దేశం డచ్ నెదర్లాండ్స్.

## డెన్మార్క్

డెన్మార్క్ దేశీయులు మొదట తమిళనాడులోని ట్రాంక్విబార్ వద్ద 1616లో తమ తొలి వర్తక స్థావరాన్ని నెలకొల్పారు. తర్వాత బెంగాల్‌లోని సేరంపూర్‌ను తమ ప్రధాన వర్తక కేంద్రంగా మలచుకున్నారు.

- క్రైస్తవ మిషనరీల స్థాపన ద్వారా విద్యాభివృద్ధికి కృషి చేసిన ప్రధాన ఐరోపా దేశం డెన్మార్క్. 1845లో వీరు తమ వర్తక స్థావరాలను ఆంగ్లేయులకు విక్రయించారు.

## ఆంగ్లేయులు

క్రీ.శ. 1600లో ఇంగ్లిష్ ఈస్ట్ ఇండియా కంపెనీకి రాయల్ చార్టర్ చట్టం ద్వారా మొదటి ఎలిజబెత్ రాణి అనుమతిని మంజూరు చేసింది. అక్బర్ ఆస్థానానికి జాన్ న్యూబెరి, విలియం రీడ్స్, జేమ్స్ స్టోరీ, రాల్ఫ్ ఫిచ్ లాంటి అనేక మంది ఆంగ్లేయులు వచ్చారు.

- 1608లో విలియం హాకిన్స్ జహంగీర్ ఆస్థానాన్ని సందర్శించడానికి వచ్చినా అనుమతి లభించలేదు.
- 1615లో సర్ థామస్ రో జహంగీర్ ఆస్థానానికి వచ్చి, వ్యాపార అనుమతి పొందాడు. ఈయన 1616లో సూరత్‌లో తమ తొలి వర్తక కేంద్రాన్ని స్థాపించాడు.
- 1611లో కెప్టెన్ హిప్పన్ నాయకత్వంలో గ్లోబ్ నౌక మచిలీపట్నం వచ్చింది. మహ్మద్ కులీకుతుబ్ షా వారికి అనుమతి ఇచ్చినప్పటికీ 1622 లోనే వారు అక్కడ వర్తక స్థావరాన్ని స్థాపించారు.
- 1626 నాటికి గోవాలో స్థావరాన్ని ఏర్పాటు చేసుకున్నారు.
- 1639లో మచిలీపట్నం కౌన్సిల్ సభ్యుడైన ఫ్రాన్సిస్ డే అనే ఆంగ్లేయుడు చంద్రగిరి రాజు (విజయనగర రాజు) మూడో వెంకటపతి రాయల ఉద్యోగులైన దామెర్ల సోదరుల నుంచి రెండు గ్రామాలను కొనుగోలు చేసి, అక్కడ సెయింట్ జార్జి కోటను నిర్మించాడు. అక్కడ ఏర్పడిన పట్టణానికి చెన్నపట్నం అనే పేరు స్థిరపడింది (దామెర్ల సోదరుల తండ్రి అయిన చెన్నప్ప పేరు మీదుగా).
- 1641 నాటికి తూర్పుతీరంలో ఆంగ్లేయులకు ప్రధాన వర్తక కేంద్రంగా మద్రాస్ స్థిరపడింది. 1633లో రాల్ఫా కార్ట్‌రైట్ అనే ఆంగ్లేయ అధికారి ఒరిస్సాలోని హరిహరపురంలో వర్తక స్థావరం నెలకొల్పాడు.
- 1651లో బ్రిడ్‌మన్ అనే ఆంగ్లేయుడి కృషితో హుగ్లీలో స్థావరం ఏర్పాటైంది.
- గాబ్రియెల్ బౌటన్ అనే ఆంగ్ల వైద్యుడు షాజహాన్ నుంచి పొందిన ప్రాంతంలో జాబ్ చార్నాక్ పోర్టువిలియం కోటను కట్టించాడు. తర్వాతి కాలంలో ఇదే కలకత్తా నగరంగా అభివృద్ధి చెందింది.
- సుతనుతి, కాళీఘట్టం, గోవిందపూర్ గ్రామాలను మొగలుల నుంచి పొందిన ఆంగ్లేయులు వాటిని కలకత్తా నగరంగా అభివృద్ధి చేశారు.
- తమిళనాడులోని కడలూరు వద్ద సెయింట్ డేవిడ్ కోటను ఆంగ్లేయులు నిర్మించారు. 1682లో విశాఖపట్నంలో వర్తక స్థావరాన్ని నెలకొల్పారు.
- 1717లో విలియం హామిల్టన్ అనే ఆంగ్ల వైద్యుడు మొగల్ చక్రవర్తి ఫరూక్ షియర్‌కు వైద్యం చేసి, గోల్డెన్ ఫర్మానా పొందాడు.
- జెరాల్డ్ ఆంగియర్ అనే ఆంగ్లేయుడు బొంబాయి నగరాన్ని గొప్ప వాణిజ్య కేంద్రంగా అభివృద్ధి చేశాడు.
- ఆంగ్లేయులు క్రమంగా మిగిలిన ఐరోపా దేశాలను భారతదేశ వర్తకం నుంచి తరిమి వేసి, మొత్తం భారతదేశాన్ని ఆక్రమించి తమ వలస సామ్రాజ్యాన్ని నిర్మించారు.

## ఫ్రెంచివారు

ఫ్రాన్స్ దేశపు చక్రవర్తి 14వ లూయీ ఆర్థికమంత్రి జీన్ కోల్బర్ట్ 1664లో ఫ్రెంచి ఈస్ట్ ఇండియా కంపెనీని స్థాపించాడు. మిగిలిన ఐరోపా దేశాల కంపెనీలన్నీ ప్రయివేటు కంపెనీలైతే, ఫ్రెంచి కంపెనీ ప్రభుత్వమే స్వయంగా నెలకొల్పిన కంపెనీ.

- 1656లో బెర్నియార్ అనే ఫ్రెంచి యాత్రికుడు ఔరంగజేబ్ రాజ్యాన్ని సందర్శించాడు. ట్రావెర్నియర్ అనే మరో ఫ్రెంచి యాత్రికుడు గోల్కొండ కుతుబ్‌షాహీ రాజ్యాన్ని సందర్శించాడు.
- 1668లో ఫ్రాంకోయిస్ కారోన్ అనే వ్యక్తి ఔరంగజేబ్ అనుమతితో సూరత్‌లో తమ తొలి వర్తక స్థావరాన్ని స్థాపించాడు.
- 1669లో వీరు గోల్కొండ సుల్తాన్ అబ్దుల్ కుతుబ్‌షాహి అనుమతితో మచిలీపట్నంలో మరొక వర్తక స్థావరాన్ని స్థాపించారు. తర్వాత ఫ్రాంకోయిస్ మార్టిన్ అనే వ్యక్తి వలికొండాపురం ప్రాంతాన్ని పొంది, అక్కడ పుదుచ్చేరి నగరాన్ని నిర్మించాడు. అదే వారి ప్రధాన వర్తక కేంద్రంగా మారింది.
- ఫ్రెంచివారు షయిస్తాఖాన్ అనే భారతీయ పాలకుడి నుంచి అనుమతి పొంది, బాలాసోర్, కాశిం బజార్, చంద్రనగర్ (బెంగాల్) ప్రాంతాల్లో ఫ్యాక్టరీలు నిర్మించారు.

- ఫ్రాంకోయిస్ మార్టిన్ అనంతరం లెనాయర్, డ్యూమాస్, డూప్లే లాంటి వ్యక్తులు గవర్నర్లుగా పనిచేశారు.
- లెనాయర్ మాహే, యానాంల వద్ద వర్తక స్థావరాలను స్థాపించాడు.
- డ్యూమాస్ మొగల్ చక్రవర్తి నుంచి 'నవాబు' అనే బిరుదు పొందాడు.
- ఫ్రెంచివారు వ్యాపార ఆధిపత్యం కోసం ఆంగ్లేయులతో మూడు కర్ణాటక యుద్ధాలు చేశారు. చివరికి ఆంగ్లేయుల చేతిలో ఓడిపోయి 1763 నాటి పారిస్ సంధి ద్వారా యానాం, పాండిచ్చేరి తప్ప మిగిలిన అన్ని స్థావరాలను ఆంగ్లేయులకు కోల్పోయారు.
- 1954లో భారత ప్రభుత్వం ఫ్రెంచి సైన్యాలను ఓడించి యానాం, పాండిచ్చేరిలను స్వాధీనం చేసుకుంది.

## మాదిరి ప్రశ్నలు

**1.** వాస్కోడిగామా ఏ రోజున భారతదేశానికి చేరుకున్నాడు?

1) 1498, మే 21 2) 1498, మే 17 3) 1498, మే 23 4) 1498, ఆగస్టు 21

**2.** నీలి నీటి విధానాన్ని అమలు చేసిన గవర్నర్ ఎవరు?

1) డి-ఆల్మడా 2) లీకర్బూజియర్ 3) లెనాయర్ 4) ఆల్బూకర్క్

**3.** ఆంధ్ర దేశంలో తొలి వర్తక స్థావరం ఏర్పాటు చేసిన ఐరోపా దేశం?

1) ఫ్రాన్స్ 2) ఇంగ్లండ్ 3) పోర్చుగల్ 4) హాలెండ్

**4.** భారతదేశంలో ప్రవేశించిన చివరి ఐరోపా దేశం?

1) పోర్చుగల్ 2) డెన్మార్క్ 3) ఇంగ్లండ్ 4) ఫ్రాన్స్

**5.** సర్ థామస్ రోను జహంగీర్ ఆస్థానానికి పంపిన ఇంగ్లండ్ రాజు ఎవరు?

1) మొదటి జేమ్స్ 2) రెండో జేమ్స్ 3) మొదటి ఛార్లెస్ 4) రెండో ఛార్లెస్

**6.** అంబోయినా వధ ఏ రెండు దేశాల మధ్య జరిగిన సంఘటన?

1) ఇంగ్లండ్, ఫ్రాన్స్ 2) ఇంగ్లండ్, పోర్చుగల్
3) హాలెండ్, ఇంగ్లండ్ 4) ఫ్రాన్స్, హాలెండ్

**7.** భారతదేశంలో డచ్‌వారి తొలి ప్రధాన వర్తక కేంద్రం ఏది?

1) మచిలీపట్నం 2) నాగపట్నం 3) పులికాట్ 4) గోవా

**8.** 1845లో తమ వర్తక స్థావరాలను ఆంగ్లేయులకు విక్రయించిన దేశం ఏది?

1) పోర్చుగల్ 2) డెన్మార్క్ 3) ఫ్రాన్స్ 4) నెదర్లాండ్స్

**9.** భారతదేశంలో డెన్మార్క్ వారి తొలి వర్తక స్థావరం ఏ రాష్ట్రంలో ఉంది?

1) కేరళ 2) తమిళనాడు 3) బెంగాల్ 4) గోవా

**10.** 1682లో విశాఖపట్నంలో వర్తక స్థావరం నెలకొల్పిన దేశం?

1) ఫ్రాన్స్ 2) డెన్మార్క్ 3) ఇంగ్లండ్ 4) పోర్చుగల్

**11.** భారతదేశానికి వచ్చిన దేశాలను వరుసక్రమంలో అమర్చండి.

ఎ) ఇంగ్లండ్ బి) ఫ్రాన్స్ సి) పోర్చుగల్ డి) హాలెండ్

1) సి, ఎ, బి, డి 2) ఎ, బి, సి, డి 3) సి, బి, డి, ఎ 4) సి, డి, ఎ, బి

**12.** తూర్పు దేశాల సంపద గురించి పశ్చిమ దేశాలకు తెలియజేసిన వ్యక్తి?

1) కొలంబస్ 2) వాస్కోడిగామా 3) మార్కోపోలో 4) వాన్‌లిచ్‌టన్

**13.** మొగల్ చక్రవర్తి నుంచి 'నవాబు' అనే బిరుదు పొందిన ఫ్రెంచి గవర్నర్ ఎవరు?

1) డూప్లే 2) డ్యూమాస్ 3) గాడ్‌హ్యూ 4) లెనాయర్

**14.** సుతనుతి, కాళీఘట్టం, గోవిందపూర్ గ్రామాలు ఏ నగరంగా అభివృద్ధి చెందాయి?

1) కాశీ/వారణాసి 2) మద్రాస్ 3) కలకత్తా 4) పాండిచ్చేరి

**15.** 1556లో తొలి అచ్చు యంత్రాన్ని పోర్చుగీసువారు ఏ నగరంలో ప్రవేశపెట్టారు?

1) గోవా 2) కొచ్చిన్ 3) కాలికట్ 4) మలక్కా

**16.** పోర్చుగీసు వారి నుంచి చిట్టగాంగ్ ప్రాంతాన్ని ఆక్రమించిన మొగల్ చక్రవర్తి ఎవరు?

1) షాజహాన్ 2) ఔరంగజేబ్ 3) జహంగీర్ 4) ఫరూక్ షియర్

**17.** బొంబాయిని గొప్ప వ్యాపార కేంద్రంగా అభివృద్ధి చేసింది ఎవరు?

1) ఫ్రాన్సిస్ డే 2) ఫ్రాన్సిస్ డ్రేక్ 3) జాన్‌సుర్మన్ 4) జెరాల్డ్ ఆంగియర్

**18.** సుగంధ ద్రవ్యాల వ్యాపారం నుంచి వస్త్ర వ్యాపారంలోకి అడుగు పెట్టిన తొలి దేశం?

1) పోర్చుగల్ 2) ఇంగ్లండ్ 3) హాలెండ్ 4) డెన్మార్క్

**19.** 1608లో జహంగీర్ ఆస్థానానికి వచ్చిన ఆంగ్లేయుడు?

1) రాల్ఫ్ ఫిచ్ 2) విలియం హాకిన్స్ 3) సర్ థామస్ రో 4) సర్ థామస్ మన్రో

**20.** ఆంగ్లేయులకు గోల్డెన్ ఫర్మానా జారీ చేసిన మొగల్ చక్రవర్తి ఎవరు?

1) జహంగీర్ 2) షాజహాన్ 3) ఔరంగజేబ్ 4) ఫరూక్ షియర్

## జవాబులు

1-2; 2-1; 3-4; 4-4; 5-1; 6-3; 7-3; 8-2; 9-2; 10-3; 11-4; 12-3; 13-2; 14-3; 15-1; 16-2; 17-4; 18-3; 19-2; 20-4.

**రచయిత: బి. నాగరాజు**

# జనరల్ స్టడీస్

## భారతదేశ చరిత్ర

**1.** 1856 లో వితంతు పునర్వివాహ చట్టం గురించి కృషి చేసిన భారతీయుడు?

1) రాజా రామమోహన్‌రాయ్ 2) కేశవచంద్రసేన్
3) కందుకూరి వీరేశలింగం 4) ఈశ్వర చంద్ర విద్యాసాగర్

**2.** విలియం జోన్స్ అధ్యక్షతన ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్ ఎవరి కాలంలో ఏర్పడింది?

1) రాబర్ట్ క్లైవ్ 2) వారన్ హేస్టింగ్స్ 3) కారన్ వాలీస్ 4) విలియం బెంటింక్

**3.** వారన్ హేస్టింగ్స్‌పై నేరారోపణ చేసిన భారతీయుడు?

1) ఒమీచాంద్ 2) వాజిద్ అలీషా 3) ఎలిజా ఇంఫే 4) నందకుమార్

**4.** 1780 లో భారతదేశంలో వెలువడిన తొలి పత్రిక?

1) కామన్‌వీల్ 2) బెంగాల్ గెజిట్ 3) సత్యదూత 4) బెంగాల్ కొరియర్

**5.** భగవద్గీతను ఆంగ్లంలోకి అనువదించినవారు?

1) అనిబిసెంట్ 2) విలియం జోన్స్ 3) చార్లెస్ విల్కిన్స్ 4) మాక్స్ ముల్లర్

**6.** భారతీయులు అవినీతిపరులు కాబట్టి వారికి ఉన్నత ఉద్యోగాలు ఇవ్వరాదని పేర్కొన్న తొలి ఆంగ్లేయుడు?

1) రాబర్ట్ క్లైవ్ 2) వారన్ హేస్టింగ్స్ 3) లార్డ్ లిట్టన్ 4) లార్డ్ కారన్ వాలీస్

**7.** కారన్ వాలీస్‌కు సంబంధించి సరైన అంశం?

1) తొలిసారిగా కలెక్టర్ పదవిని ఏర్పాటు చేశాడు.
2) 1793 లో శాశ్వత శిస్తు విధానాన్ని ప్రవేశపెట్టాడు.
3) కారన్ వాలీస్ కోడ్ పేరుతో రెవెన్యూ సంస్కరణలు ప్రవేశపెట్టాడు.
4) అన్నీ సరైనవే

**8.** 1805 జులై - అక్టోబరు మధ్య గవర్నర్ జనరల్‌గా పనిచేసిన వ్యక్తి?

1) కారన్ వాలీస్ 2) సర్ జాన్‌షోర్
3) వెల్లస్లీ 4) సర్ జార్జిబార్లో

**9.** కంపెనీ అక్బర్‌గా పేరొందిన గవర్నర్ జనరల్?

1) కారన్ వాలీస్ 2) విలియం బెంటింక్ 3) వెల్లస్లీ 4) డల్హౌసీ

**10.** చార్లెస్ మెట్‌కాఫ్‌ను పంపించి రంజిత్‌సింగ్‌తో అమృత్‌సర్ సంధి (1809) చేసుకున్నవారు?

1) లార్డ్ వెల్లస్లీ 2) సర్ జార్జిబార్లో 3) లార్డ్ మింటో-I 4) లార్డ్ మింటో-II

**11.** దుష్పరిపాలన నెపంతో సూరత్, తంజావూరు, కర్ణాటకలను ఆక్రమించినవారు?

1) వెల్లస్లీ 2) డల్హౌసీ 3) విలియం బెంటింక్ 4) లార్డ్ మింటో-II

**12.** సామంత సంబంధ నిరోధక విధానం అనుసరించిన గవర్నర్ జనరల్?

1) వారన్ హేస్టింగ్స్ 2) కారన్ వాలీస్ 3) వెల్లస్లీ 4) లార్డ్ హేస్టింగ్స్

**13.** బానిసత్వాన్ని నిర్మూలించిన గవర్నర్ జనరల్?

1) లార్డ్ ఆక్‌లాండ్ 2) లార్డ్ అమ్హరెస్ట్
3) సర్ చార్లెస్ మెట్‌కాఫ్ 4) ఎలిన్‌బరో

**14.** పి.ఇ. రాబర్ట్స్ అనే చరిత్రకారుడి అభిప్రాయం ప్రకారం 'పాలిత ప్రజల క్షేమమే ఆంగ్లేయుల ప్రధాన విధి' అని తలచి పాలించిన తొలి గవర్నర్ జనరల్?

1) లార్డ్ రిప్పన్ 2) లార్డ్ కర్జన్
3) విలియం బెంటింక్ 4) సర్ థామస్ మన్రో

**15.** విలియం బెంటింక్ కాలానికి సంబంధించి సరికానిది?

1) 1835 మార్చి 7 న మెకాలే కమిటీ సూచన మేరకు ఆంగ్ల విద్యను ప్రవేశపెట్టాడు.
2) ఇంగ్లండ్, ఇండియాల మధ్య ఆవిరి నౌక ఏర్పాటు చేశాడు.
3) కథియవాడ్‌లో స్త్రీ, శిశు హత్యలను నిషేధించాడు.
4) థామస్ హిస్లాప్ నాయకత్వంలో థగ్గులు అనే దొంగలను నిర్మూలించాడు.

**16.** సతీ సహగమన నిషేధ చట్టాన్ని విలియం బెంటింక్ ప్రవేశపెట్టిన సంవత్సరం?

1) 1828 2) 1829 3) 1830 4) 1835

**17.** ఇండియన్ పీనల్ కోడ్ (IPC) ను రూపొందించిన ఆంగ్లేయుడు?

1) లార్డ్ మెకాలే 2) లార్డ్ కారన్ వాలీస్
3) విలియం బెంటింక్ 4) రాబర్ట్ బర్డ్

**18.** బారక్‌పూర్ సిపాయిల తిరుగుబాటు ఏ గవర్నర్ జనరల్ కాలంలో జరిగింది?

1) లార్డ్ హేస్టింగ్స్ 2) లార్డ్ అమ్హరెస్ట్ 3) లార్డ్ ఆక్‌లాండ్ 4) ఎలిన్‌బరో

**19.** దుష్పరిపాలన నెపంతో మైసూర్ రాజ్యాన్ని ఆక్రమించినవారు?

1) విలియం బెంటింక్ 2) లార్డ్ వెల్లస్లీ 3) లార్డ్ డల్హౌసీ 4) లార్డ్ రిప్పన్

**జవాబులు**

**1-4; 2-2; 3-4; 4-2; 5-3; 6-4; 7-2; 8-1; 9-3; 10-3; 11-1; 12-4; 13-4; 14-3; 15-4; 16-2; 17-1; 18-2; 19-1.**

రచయిత: ***బి. నాగరాజు***

# ఆంగ్ల సామ్రాజ్య విస్తరణ

## ఆంగ్ల - మరాఠా యుద్ధాలు

**శివాజీ స్థాపించిన స్వరాజ్యం అతడి కుమారుడు శంభాజీ, మనుమడు షాహూల కాలంలో క్రమంగా బలహీనపడుతూ వచ్చింది. షాహూ తన పీష్వా బాలాజీ విశ్వనాథ్‌కు పీష్వా పదవిని వంశపారంపర్యం చేయడంతో పీష్వాల యుగం ప్రారంభమైంది. ఫలితంగా మహారాష్ట్రులు నాలుగు ప్రధాన వర్గాలుగా విడిపోయారు. సింధియాలు గ్వాలియర్ కేంద్రంగా, హోల్కార్‌లు ఇండోర్ కేంద్రంగా, గైక్వాడ్‌లు బరోడా కేంద్రంగా, భాన్‌స్లేలు నాగ్‌పూర్ కేంద్రంగా పరిపాలన సాగించారు.**

మహారాష్ట్రుల్లో ఐక్యత కొరవడటంతో ఆంగ్లేయులు వారి వారసత్వ తగాదాల్లో జోక్యం చేసుకున్నారు. మూడు ముఖ్యమైన యుద్ధాల్లో వారిని ఓడించి, 1819 నాటికి మొత్తం మహారాష్ట్రను స్వాధీనం చేసుకున్నారు.

### మొదటి ఆంగ్ల - మరాఠా యుద్ధం (1775 - 82)

పీష్వా మొదటి మాధవరావు మరణానంతరం అతడి తమ్ముడు నారాయణరావు పీష్వా పదవిని చేపట్టాడు. నారాయణరావును అతడి పినతండ్రి రఘోబా (రఘునాథరావు) చంపి, పీష్వా పదవిని దక్కించుకున్నాడు. దీన్ని వ్యతిరేకించిన మహారాష్ట్రులు నానాఫడ్నవీస్ (బాలాజీ పండిట్) నాయకత్వంలో 'భారాబాయి' కూటమిగా ఏర్పడి రఘోబాపై యుద్ధానికి సిద్ధపడ్డారు. వీరు నారాయణరావు కుమారుడు రెండో మాధవరావును పీష్వాగా ప్రకటించారు.

- రఘోబా 1775లో బొంబాయి గవర్నర్‌తో సూరత్ సంధి చేసుకుని, ఆంగ్లేయుల సహాయం పొందాడు. కానీ నానాఫడ్నవీస్ నాయకత్వంలోని మహారాష్ట్రులు మద్రాస్ గవర్నర్‌తో పురంధర్ సంధి (1776) చేసుకుని, ఆంగ్లేయుల సహాయానికి హామీ పొందారు. కంపెనీ సూరత్ సంధినే అంగీకరించడంతో ఆంగ్లేయులు రఘోబాకి సహాయంగా సైన్యాన్ని నడిపి, మహారాష్ట్రులతో యుద్ధం చేశారు.
- ఈ యుద్ధంలో నానాఫడ్నవీస్ ఫ్రాన్స్ సేనాని సెయింట్ లూబిన్ సహాయంతో ఆంగ్లేయులను ఎదిరించాడు. ఆంగ్లేయుల చేతిలో ఓడిపోయిన మహారాష్ట్రులు 1782లో సాల్బే సంధి చేసుకుని, యుద్ధాన్ని విరమించారు. ఆంగ్లేయులు ఈ సంధి ద్వారా బేస్సిన్, సాల్‌సెట్టి ప్రాంతాలను పొందారు.

### రెండో ఆంగ్ల - మరాఠా యుద్ధం (1803 - 05)

పీష్వా రెండో బాజీరావు 1802లో ఆంగ్లేయులతో సైన్యసహకార సంధి కుదుర్చుకోవడం ఈ యుద్ధానికి కారణం. ఫలితంగా 1803లో ఆంగ్లేయులకు, మహారాష్ట్రులకు మధ్య రెండో ఆంగ్ల - మరాఠా యుద్ధం ప్రారంభమైంది. యుద్ధంలో ఓడిపోయిన సింధియాలు సిర్జిఅంజన్‌గావ్ సంధిని, భాన్‌స్లేలు దేవగాన్ సంధి కుదుర్చుకున్నారు.

- ఆంగ్లేయులు నాగ్‌పూర్‌లో మాన్‌స్టువర్ట్ ఎల్ఫిన్‌స్టోన్‌ను, గ్వాలియర్‌లో జాన్‌మాల్కంను బ్రిటిష్ రెసిడెంట్‌లుగా (ఆదివాసీలు) నియమించి, ఆ ప్రాంతాలపై ఆధిపత్యాన్ని పొందారు. 1805లో నాటి గవర్నర్ సర్ జార్జిబార్లో సింధియాతో మరొక ఒప్పందం చేసుకున్నాడు.

### మూడో ఆంగ్ల - మరాఠా యుద్ధం (1818)

గైక్వాడ్ (బరోడా) తన మంత్రి గంగాధరశాస్త్రిని పీష్వా రెండో బాజీరావు వద్దకు రాయబారిగా పంపించాడు. పీష్వా ప్రధాన మంత్రియైన త్రయంబక్‌జీ డాంగ్లియా గంగాధరశాస్త్రిని హత్య చేయించాడు. ఫలితంగా ఆంగ్లేయులు త్రయంబక్‌జీని పూనా/ ఠానేలో బంధించారు. పీష్వా 1817లో ఆంగ్లేయులతో పూనా ఒప్పందం చేసుకున్నాడు. ఆంగ్లేయులు భాన్‌స్లేతో నాగ్‌పూర్ సంధి, సింధియాతో గ్వాలియర్ సంధి కుదుర్చుకోవడంతో పీష్వా కోపగించి వారికి ఎదురు తిరిగాడు. అంతేకాకుండా నాగ్‌పూర్‌లో ఉన్న బ్రిటిష్ రెసిడెంట్ ఎల్ఫిన్‌స్టోన్‌ను నిర్బంధించి, కిర్కి ఆంగ్ల స్థావరాన్ని ముట్టడించాడు. నాటి ఆంగ్ల గవర్నర్ జనరల్ హెమ్మింగ్ హేస్టింగ్స్/ లార్డ్ హేస్టింగ్స్ 1818లో ఎరవాడ, కొరెగావ్, అష్టీ యుద్ధాల్లో పీష్వాను ఓడించి, ఆ పదవిని రద్దు చేశాడు.

- రెండో బాజీరావు (పీష్వా) 8 లక్షల భరణంతో కాన్పూర్‌లోని బితూర్‌లో ఆశ్రయం పొందాడు. త్రయంబక్‌జీకి చూనార్‌లో యావజ్జీవ కారాగార శిక్ష విధించారు. ఆంగ్లేయులు అప్పాసాహెబ్‌ను కూడా సీతాబ్దలి, నాగ్‌పూర్ యుద్ధాల్లో ఓడించారు. హోల్కార్ మహిద్‌పూర్ యుద్ధంలో ఓడిపోయి, ఆంగ్లేయులతో మందసోర్ సంధి చేసుకున్నాడు. ఆంగ్లేయులు మొత్తం మరాఠా

రాజ్యాన్ని ఆక్రమించుకుని, సతారా రాజధానిగా చిన్న మహారాష్ట్ర రాజ్యాన్ని ఏర్పాటుచేసి, శివాజీ వారసుడు ప్రతాప్‌సింగ్‌ను దానికి పాలకుడిగా నియమించారు.

## సిక్కు యుద్ధాలు

గురునానక్ స్థాపించిన సిక్కు మతం క్రమంగా రాజకీయరూపం సంతరించుకుంది. గురుగోవింద్ సింగ్ సిక్కులను ఖల్సా అనే సైనిక వ్యవస్థగా రూపొందించగా, పంజాబ్ కేసరిగా పేరొందిన రంజిత్‌సింగ్ స్వతంత్ర సిక్కు రాజ్యాన్ని స్థాపించాడు. చివరికి ఆంగ్లేయులు కూడా రంజిత్‌సింగ్‌తో 1809లో అమృత్‌సర్ సంధి చేసుకోవాల్సి వచ్చింది. కానీ రంజిత్‌సింగ్ మరణంతో సిక్కు రాజ్యం బలహీనమైంది. దీన్ని ఆసరాగా చేసుకుని ఆంగ్లేయులు రెండు సిక్కు యుద్ధాల ద్వారా పంజాబ్‌ను ఆక్రమించారు. యుద్ధాల ద్వారా ఆంగ్ల సామ్రాజ్యంలో విలీనమైన చివరి భారత స్వతంత్ర్య రాజ్యం సిక్కు రాజ్యం.

### మొదటి సిక్కు యుద్ధం 1845 – 46

1846లో తేజ్‌సింగ్, రంజూర్‌సింగ్‌ల నాయకత్వంలోని సిక్కులను సర్ హ్యూగో నాయకత్వంలోని ఆంగ్ల సైన్యం ముడ్కి వద్ద ఓడించి, లాహోర్ సంధి కుదుర్చుకుంది. ఈ సంధిని సిక్కులు సక్రమంగా అమలు చేయకపోవడంతో యుద్ధం కొనసాగింది. చివరికి 1846 డిసెంబరు 5న నాటి ఆంగ్ల గవర్నర్ జనరల్ మొదటి హార్డింజ్ సిక్కులతో భైరోవల్ సంధి చేసుకున్నాడు. రంజిత్‌సింగ్ కుమారుడు దిలీప్ సింగ్‌ను రాజుగా నియమించారు.

### రెండో సిక్కు యుద్ధం (1848 – 49)

సిక్కులు ముల్తాన్ గవర్నర్ మూల్‌రాజ్‌తో చేతులు కలపడంతో ఆంగ్లేయులు రెండో యుద్ధం చేశారు. నాటి ఆంగ్ల గవర్నర్ జనరల్ లార్డ్ డల్హౌసీ 1848 అక్టోబరులో సిక్కులపై యుద్ధం ప్రకటించాడు. 1849లో షేర్‌సింగ్, సర్ హ్యూగో మధ్య చిలియన్ వాలా వద్ద యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో ఓడిపోయిన సిక్కులు మార్చి 29న సంధి చేసుకున్నారు. దిలీప్‌సింగ్ భరణం పొంది, లండన్‌లో స్థిరపడ్డాడు. ఆంగ్లేయులు పంజాబ్ పాలనా వ్యవహారాలను పర్యవేక్షించేందుకు జాన్ లారెన్స్‌ను పంపించారు.

## విదేశాలతో యుద్ధాలు

ఆంగ్లేయులు భారతదేశంలోని రాజ్యాలతోనే కాకుండా, సరిహద్దు దేశాలను ఆక్రమించడానికి అనేక యుద్ధాలు చేశారు. సిక్కిం, అఫ్గనిస్థాన్, బర్మా దేశాలను కూడా ఆక్రమించి తమ సామ్రాజ్యంలో విలీనం చేశారు.

### బర్మా యుద్ధాలు

బర్మాను ఆక్రమించడానికి ఆంగ్లేయులు మూడు యుద్ధాలు చేశారు. 1824 – 26 మధ్య లార్డ్ అమ్హరెస్ట్ కాలంలో మొదటి బర్మా యుద్ధం జరిగింది. నాటి బర్మా పాలకుడు పాగ్యిదోవా యుద్ధంలో ఓడిపోయి, ఆంగ్లేయులతో యండబూ సంధి చేసుకున్నాడు. కాంప్‌బెల్ నాయకత్వంలోని ఆంగ్ల సైన్యం విజయాన్ని సాధించింది.

- రెండో బర్మా యుద్ధం 1852 – 53లో లార్డ్ డల్హౌసీ కాలంలో జరిగింది. లాంబర్ట్, గాడ్విన్ సేనానుల నాయకత్వంలోని ఆంగ్ల సైన్యం బర్మా రాజు పగన్/ పాగన్‌ను ఓడించి దిగువ బర్మాను భారతదేశంలో విలీనం చేశారు.
- మూడో బర్మా యుద్ధం 1885 – 86లో లార్డ్ డఫ్రిన్ కాలంలో జరిగింది. ఈ యుద్ధంలో ఓడిపోయిన బర్మా రాజు థీవా తన రాజ్యాన్ని ఆంగ్లేయులకు కోల్పోయాడు. ఆంగ్లేయులు 1935 చట్టం ద్వారా బర్మాను మళ్లీ భారత్ నుంచి వేరుచేశారు. 1948లో బర్మా స్వాతంత్ర్యాన్ని పొందింది.

### అఫ్గన్ యుద్ధాలు

భారతదేశానికి వాయవ్య సరిహద్దులో ఉన్న రాజ్యం అఫ్గనిస్థాన్. అహ్మద్ షా అనే పాలకుడు స్వతంత్ర అఫ్గన్ రాజ్యాన్ని స్థాపించాడు. రష్యా భారతదేశంపై దండెత్తి వస్తుందనే భయంతో ఆంగ్ల ప్రభుత్వం అఫ్గనిస్థాన్‌ను ఆక్రమించడం ద్వారా రక్షణను పెంచుకోవాలని భావించింది. ఫలితంగా ఇంగ్లండ్ ఆ దేశ వ్యవహారంలో జోక్యం చేసుకుని, మూడు అఫ్గన్ యుద్ధాల ద్వారా దాన్ని ఆక్రమించింది.

**మొదటి అఫ్గనిస్థాన్ యుద్ధం (1838 – 42)**

దోస్త్ మహ్మద్ అనే వ్యక్తి 1809లో షాషుజా అనే అఫ్గన్ పాలకుడిని తొలగించి, అధికారాన్ని కైవసం చేసుకున్నాడు. ఆంగ్లేయులు అలెగ్జాండర్ బర్నస్ అనే వ్యక్తిని దోస్త్ మహ్మద్ వద్దకు రాయబారిగా పంపారు. కానీ దోస్త్ మహ్మద్ ఆంగ్లేయులను కాదని రష్యా వారిని ఆహ్వానించాడు. ఫలితంగా ఆంగ్లేయులు నాటి పంజాబ్ పాలకుడు రంజిత్‌సింగ్, షాషుజాలతో సంధి చేసుకుని, 1838లో ప్రారంభమైన మొదటి అఫ్గన్ యుద్ధంలో దోస్త్ మహ్మద్‌ను ఓడించి, పదవి నుంచి తొలగించారు. షాషుజాను నూతన పాలకుడిగా నియమించారు. అఫ్గన్ ప్రజలకు ఇది నచ్చలేదు. వారు 1842లో అలెగ్జాండర్ బర్నస్‌ను 1650 మంది ఆంగ్లేయులను వధించారు. ఫలితంగా నాటి ఆంగ్ల గవర్నర్ జనరల్ లార్డ్ ఆక్‌లాండ్ తన పదవిని కోల్పోయాడు. తర్వాత గవర్నర్ జనరల్‌గా వచ్చిన ఎలిన్‌బరో పోలాక్, నాట్ అనే అధికారులను పంపించి, మొదటి అఫ్గన్ యుద్ధాన్ని పూర్తి చేశాడు. దోస్త్ మహ్మద్‌ను తిరిగి అఫ్గన్ పాలకుడిగా నియమించాడు.

**రెండో అఫ్గన్ యుద్ధం (1878 – 79)**

లార్డ్ లిట్టన్ కాలంలో 1878 – 79 మధ్య రెండో అఫ్గన్ యుద్ధం జరిగింది. నాటి ఇంగ్లండ్ ప్రధానమంత్రి డిస్రేలి అఫ్గన్‌లో ప్రాబల్యం సంపాదించాల్సిందిగా లార్డ్ లిట్టన్‌ను ఆదేశించాడు. దీంతో లిట్టన్ అఫ్గనిస్థాన్‌కు రాయబారిగా నైవేలీ చాంబర్లీన్‌ను పంపాడు. అఫ్గన్ పాలకుడు షేర్‌అలీ అతడిని ఆదరించకపోవడంతో ఆంగ్లేయులు రెండో అఫ్గన్ యుద్ధం చేశారు. రాబర్ట్, స్టువార్ట్ అనే సేనానుల నాయకత్వంలోని ఆంగ్ల సైన్యం చేతిలో ఓడిపోయిన షేర్‌అలీ రష్యాకు పారిపోయి, అక్కడే మరణించాడు. అతని కుమారుడైన యాకుబ్ ఖాన్‌తో లార్డ్ లిట్టన్ 1879, మే 26న గండమల్ సంధి చేసుకున్నాడు. 1892లో లాన్స్‌డౌన్ భారత్, అఫ్గనిస్థాన్ మధ్య డ్యూరాండ్ రేఖను సరిహద్దుగా నిర్ణయించాడు.

**మూడో అఫ్గన్ యుద్ధం (1918)**

అఫ్గనిస్థాన్ పాలకుడైన అమానుల్లాఖాన్ బ్రిటిష్ ఇండియాపై 1918లో దండయాత్రకు వచ్చాడు. నాటి భారత వైస్రాయ్ లార్డ్ చెమ్స్‌ఫర్డ్ అతడిని ఓడించి, అఫ్గనిస్థాన్‌ను పూర్తిగా ఆక్రమించాడు.

- ఆంగ్లేయులు ఇంకా సిక్కిం, టిబెట్, సింధు ప్రాంతాలను కూడా తమ సామ్రాజ్యంలో విలీనం చేశారు. మార్క్వెస్ ఆఫ్ హేస్టింగ్స్ 1814 – 16 సంవత్సరాల మధ్య నేపాల్/ గూర్ఖా యుద్ధం చేశాడు. డేవిడ్ ఆక్టర్‌లానీ నాయకత్వంలోని ఆంగ్ల సైన్యం పృథ్వీ నారాయణ నాయకత్వంలోని గూర్ఖాలను ఓడించి, సగౌలీ సంధి కుదుర్చుకుంది.
- గవర్నర్ జనరల్ ఎలిన్‌బరో కాలంలో చార్లెస్ నేపియర్ నాయకత్వంలోని ఆంగ్ల సైన్యం సింధు ప్రాంతంపై దండెత్తి 1843లో ఆ ప్రాంతాన్ని ఆక్రమించింది.
- డల్హౌసీ కాలంలో 1850లో సిక్కిం ప్రాంతాన్ని ఆంగ్లేయులు ఆక్రమించారు. కాంప్‌బెల్, జాన్ హుక్కర్ అనే ఆంగ్లేయులను సిక్కిం ప్రజలు హత్య చేయడంతో డల్హౌసీ 1850లో సిక్కిం యుద్ధం చేసి, ఆ ప్రాంతాన్ని భారతదేశంలో విలీనం చేశాడు.
- సర్ జాన్ లారెన్స్ కాలంలో భూటాన్‌పై యుద్ధంచేసి, వారినుంచి డ్యూరాల్ ప్రాంతాన్ని ఆక్రమించారు.
- లార్డ్ కర్జన్ కాలంలో కల్నల్ యంగ్ హజ్బెండ్ నాయకత్వంలో టిబెట్ పైకి సైన్యాన్ని పంపి, దలైలామాను ఓడించి లాసా సంధి (1904) ద్వారా ఆ ప్రాంతంపై ఆధిపత్యాన్ని పొందారు.
- రెండో హార్డింజ్ కాలంలో చైనా టిబెట్‌పై జరిపిన దాడిని అరికట్టి, ఇండియా, టిబెట్‌ల మధ్య మెక్ మోహన్ రేఖను సరిహద్దుగా నిర్ణయించారు.

**నమూనా ప్రశ్నలు**

**1.** మొదటి ఆంగ్ల – మరాఠా యుద్ధం ఏ సంధితో ముగిసింది?

1) పురంధర్ 2) సూరత్ 3) సాల్బే 4) బేస్సిన్

**2.** భారాభాయి కూటమిని ఏర్పాటు చేసింది ఎవరు?

1) ఆంగ్లేయులు 2) సిక్కులు 3) అఫ్గన్లు 4) మహారాష్ట్రులు

**3.** మూడో ఆంగ్ల – మరాఠా యుద్ధం కాలం నాటి గవర్నర్ జనరల్ ఎవరు?

1) లార్డ్ హేస్టింగ్స్ 2) వారన్ హేస్టింగ్స్ 3) డల్హౌసీ 4) వెల్లస్లీ

**4.** మొదటి సిక్కు యుద్ధం ఏ సంధితో ముగిసింది?

1) లాహోర్ 2) అమృత్‌సర్ 3) చిలియన్ వాలా 4) భైరోవల్

**5.** ఏ యుద్ధం యండబూ సంధితో ముగిసింది?

1) మొదటి బర్మా యుద్ధం
2) రెండో బర్మా యుద్ధం
3) మొదటి అఫ్గన్ యుద్ధం
4) రెండో అఫ్గన్ యుద్ధం

**6.** లార్డ్ లిట్టన్ ఎవరిని అఫ్గనిస్థాన్‌కు రాయబారిగా పంపాడు?

1) అలెగ్జాండర్ బర్న్స్
2) నైవేలీ చాంబర్లీన్
3) లారెన్స్
4) కాంప్‌బెల్

**7.** ఎల్ఫిన్‌స్టోన్స్ సైనిక దురంతం (Massacre of Elphinestones Army) ఏ యుద్ధకాలంలో జరిగింది?

1) మొదటి అఫ్గన్ యుద్ధం
2) రెండో అఫ్గన్ యుద్ధం
3) మూడో అఫ్గన్ యుద్ధం
4) ఏదీకాదు

**8.** ఏ గవర్నర్ జనరల్ కాలంలో డ్యూరాండ్ రేఖను ఏర్పాటు చేశారు?

1) లాన్స్‌డేన్
2) ఎలిన్‌బరో
3) ఆక్‌లాండ్
4) అమ్హరెస్ట్

**9.** మెక్‌మోహన్ రేఖ ఏ గవర్నర్ జనరల్ కాలంలో ఏర్పాటైంది?

1) లాన్స్‌డేన్
2) ఎలిన్‌బరో
3) మొదటి హార్డింజ్
4) రెండో హార్డింజ్

**10.** కల్నర్ యంగ్ హజ్బెండ్‌ను టిబెట్ పైకి పంపింది..?

1) డల్హౌసీ
2) ఆక్‌లాండ్
3) మార్క్వెస్ ఆఫ్ హేస్టింగ్స్
4) లార్డ్ కర్జన్

## జవాబులు

1-3; 2-4; 3-1; 4-4; 5-1; 6-2; 7-1; 8-1; 9-4; 10-4.

**రచయిత: బి.నాగరాజు**

# కుతుబ్‌షాహీ యుగం (1512 - 1687)

కుతుబ్ ‌షాహీలు గోల్కొండ రాజధానిగా క్రీ.శ.1512 నుంచి 1687 వరకు పరిపాలించారు. సుల్తాన్ కులీ 1512లో కుతుబ్‌షాహీ రాజ్యాన్ని స్థాపించాడు. మహ్మద్ కులీకుతుబ్‌షా గొప్పపాలకుడు. చివరి కుతుబ్‌షాహీ పాలకుడు అబుల్ హసన్ తానీషా.

★ క్రీ.శ.1687లో మొగల్ చక్రవర్తి కుతుబ్‌షాహీ రాజ్యాన్ని మొగల్ సామ్రాజ్యంలో విలీనం చేశాడు. కుతుబ్‌షాహీలు గొప్ప పరిపాలనా పద్ధతులను ప్రవేశపెట్టడమే కాకుండా తెలుగు భాషా వికాసానికి, సాంస్కృతిక అభివృద్ధికి ఎంతో కృషి చేశారు.

## రాజకీయ చరిత్ర

**సుల్తాన్‌కులీ కుతుబ్‌షా (1512 – 43):**

గోల్కొండ రాజధానిగా 1512లో స్వతంత్ర కుతుబ్‌షాహీ రాజ్యాన్ని స్థాపించాడు. ఇతను హంద వంశం, కారాకునీల్ (నల్ల గొర్రె) తెగకు చెందినవాడు. కుతుబ్ ఉల్‌ముల్క్, ఖవాస్‌ఖాన్, బడేమాలిక్ లాంటి బిరుదులు పొందాడు.

★ చాళుక్య యుగంలో మంగళవరంగా పేరుపొందిన గోల్కొండకు మహ్మద్‌నగర్ అని పేరు పెట్టాడు. జామా మసీదును నిర్మించాడు. గజపతుల సామంతుడైన చితాబ్‌ఖాన్ (సీతాపతిరావు)ను ఓడించాడు. 1543లో ఇతడి కుమారుడు జంషీద్ ఇతడిని హత్య చేయించాడు.

**జంషీద్ (1543 – 50):**

సుల్తాన్‌కులీ ఇతడిని దేవరకొండలో రాజప్రతినిధిగా నియమించాడు. మీర్ మహ్మద్ హందనీ అనే వ్యక్తితో తండ్రిని చంపించి, రాజయ్యాడు. చిన్న చిన్న నేరాలకు సైతం క్రూరమైన శిక్షలు విధించేవాడని ఫెరిస్టా పేర్కొన్నాడు. ఇతని సేనాని జగదేకరావు. జంషీద్ క్యాన్సర్ (రాజ క్షయ) వ్యాధితో మరణించాడు.

**ఇబ్రహీం కులీకుతుబ్‌షా (1550 – 1580):**

జంషీద్ పాలనాకాలంలో, విజయనగర సామ్రాజ్యంలో తలదాచుకున్నాడు. అళియ రామరాయల సాయంతో గోల్కొండ పాలకుడయ్యాడు. ఖాసా ఖైల్ అనే గూఢచారి దళాన్ని ఏర్పాటు చేశాడు. ఓరుగల్లు (వరంగల్) ను శాశ్వతంగా గోల్కొండ రాజ్యంలో విలీనం చేశాడు.

★ ఇతడి పాలనాకాలంలో గోల్కొండ రెండో ఈజిప్ట్‌గా పేరుపొందింది. అనేకమంది తెలుగు కవులను పోషించి, మల్కిభరాముడుగా కీర్తి పొందాడు. విజయనగర సామ్రాజ్యంతో తళ్లికోట యుద్ధం (1565) జరగడానికి ప్రధానకారకుడు.

★ పొన్నగంటి తెలగనార్యుడు, కందుకూరి రుద్రకవి, అద్దంకి గంగాధర కవి లాంటి తెలుగు కవులు ఇతడి ఆస్థానంలో ఉండేవారు.

★ హుస్సేన్‌సాగర్, మూసీనది వంతెన, పూల్‌బాగ్ వంతెన, ఇబ్రహీంపట్నం చెరువులను ఇతడి కాలంలోనే నిర్మించారు. గోల్కొండకు భగీరథీ నగరం అని పేరుపెట్టాడు. లంగరులు అనే వంటశాలలను (భిక్షా గృహాలు) నిర్మించాడు.

★ హుస్సేన్‌సాగర్ రూపశిల్పి హజరత్ హుస్సేన్‌షా వాలి. ఇబ్రహీం సేనాని మురహరిరావు అహోబిలం దేవాలయాన్ని ధ్వంసం చేశాడు. దక్కనీ ఉర్దూ భాషాభివృధికి కృషి చేశాడు. పెట్టెడు బంగారంతో వృద్ధురాలైనా గోల్కొండ నుంచి ఎక్కడికైనా ధైర్యంగా వెళ్లగలిగేదని ఫెరిస్టా ఇతని కాలం నాటి రక్షణ వ్యవస్థ గురించి పేర్కొన్నాడు.

**మహ్మద్ కులీకుతుబ్‌షా (1580 – 1612):**

ఇతడి కాలాన్ని గోల్కొండ చరిత్రలో స్వర్ణయుగంగా పేర్కొంటారు. తెలుగు భాషలో కవిత్వం చెప్పిన తొలి సుల్తాన్ మహ్మద్ కులీ. హైదరాబాద్ (భాగ్యనగం) నగరాన్ని, చార్మినార్‌ను నిర్మించాడు. చార్మినార్ ముఖ్య రూపశిల్పి మీర్ మోమిన్ హస్తరాబాదీ (మీర్ మునీమ్).

★ 1591లో అంటువ్యాధి (ప్లేగు వ్యాధి) నిర్మూలనకు గుర్తుగా చార్మినార్‌ను నిర్మించారు. జుమా మసీదు (ఫలక్‌నామా ప్యాలస్), దారుల్ షఫా (ప్రజా వైద్యశాల), దాడ్ మహల్ (న్యాయస్థాన భవనం) లను నిర్మించాడు.

★ మక్కామసీదు నిర్మాణాన్ని ప్రారంభించాడు (అనంతరం మహ్మద్ కుతుబ్‌షా పూర్తి చేశాడు). 1605లో డచ్చివారికి, 1611లో ఆంగ్లేయులకు మచిలీపట్నంలో వ్యాపార అనుమతి ఇచ్చాడు. మసూద్ బేగ్ అనే రాయబారిని అక్బర్ ఇతని ఆస్థానానికి పంపించాడు. ట్రావెర్నియర్, థేవ్‌నాట్ అనే ఫ్రెంచివారు ఇతడి ఆస్థానాన్ని సందర్శించారు.

★ వజీ మహ్మద్/ వజాహే/ మీర్జా మహ్మద్ అమీన్ అనే ఉర్దూకవి లైలా – మజ్నూ గ్రంథాన్ని రాశాడు. వైజయంతీ విలాసం అనే గ్రంథాన్ని రచించిన సారంగుతమ్మయ్య ఇతడి ఆస్థానంలోని వాడే.

**మహ్మద్ కుతుబ్‌షా (1612 – 26):**

ఇతడు మహ్మద్ కులీకుతుబ్‌షా అల్లుడు (హయత్ భక్షీబేగం భర్త). 1614లో పారశీక రాయబారి మీర్ జయనుల్ అబిదిన్ ఇతడి ఆస్థానాన్ని సందర్శించాడు. మొగల్ సేనాని మహబత్‌ఖాన్ చేతిలో మహ్మద్ కుతుబ్‌షా ఓడిపోయాడు. మక్కా మసీదు, ఖైరతాబాద్ మసీదులను నిర్మించాడు. మీర్ మహ్మద్ ముమీన్ తూనికలు, కొలతలపై రిసాలమిక్ధరీయ అనే గ్రంథాన్ని రాశాడు.

★ హకీం తకయుద్దీన్ మిజానుత్ తబాయీ కుతుబ్‌షాహీ అనే వైద్యశాస్త్ర గ్రంథాన్ని రాశాడు. హయత్ భక్షీబేగం, హయత్‌నగర్ మసీదును, మాసబ్ ట్యాంకును నిర్మించింది.

**అబ్దుల్లా కుతుబ్‌షా (1626 – 72):**

మహ్మద్ కుతుబ్‌షా కుమారుడు. ఇతడి కాలం నుంచే గోల్కొండ రాజ్య క్షీణదశ ప్రారంభమైంది. ఇతడు షాజహాన్, ఔరంగజేబు చేతిలో ఓడిపోయి, కప్పం చెల్లించాడు. 1636లో మొగల్ సేనాని అబ్దుల్ లతీఫ్‌తో సంధి చేసుకున్నాడు. 1632లో ఆంగ్లేయులకు గోల్డెన్ ఫర్మానా జారీ చేశాడు. శుక్రవారం ప్రార్థనలో పారశీక చక్రవర్తి పేరుకు బదులుగా మొగల్ చక్రవర్తి పేరును చేర్చాడు.

★ 1669లో ఫ్రెంచి వారికి, 1670లో పోర్చుగీసు వారికి ఆంధ్రదేశంలో వ్యాపార అనుమతి ఇచ్చాడు. ఇతడి కాలంలో లభించిన గోల్కొండ వజ్రం/ కోహినూర్ వజ్రాన్ని మంత్రి మహ్మద్ సయ్యద్ షాజహాన్‌కు ఇచ్చాడు.

★ ఉర్దూ భాషకు స్వర్ణయుగంగా ఇతడి కాలం పేరుపొందింది. మొవ్వ గోపాల పదాలు రచించిన క్షేత్రయ్య ఇతడి ఆస్థానాన్ని సందర్శించాడు.

**అబుల్ హసన్ తానీషా (1672 – 87):**

ఇతడు చివరి కుతుబ్‌షాహీ (గోల్కొండ) పాలకుడు (భోగి, విలాస పురుషుడు). మాదన్నను మీర్ జుమ్లాగా (ఆర్థికమంత్రి), అక్కన్నను సర్వ సైన్యాధ్యక్షుడిగా నియమించుకున్నాడు. కంచర్ల గోపన్న (భక్త రామదాసు)ను పాల్వంచ తహశీల్దార్‌గా నియమించాడు.

★ 1676లో మాదన్న ప్రోత్సాహంతోనే శివాజీ గోల్కొండ రాజ్యాన్ని సందర్శించి, సంధి చేసుకున్నాడు. 1686 మార్చి 24న అక్కన్న, మాదన్నలు హత్యకు (షేక్ మన్హజ్ కుట్ర కారణంగా) గురయ్యారు.

★ 1687 అక్టోబరులో గోల్కొండ సామ్రాజ్యాన్ని ఔరంగజేబు మొగల్ సామ్రాజ్యంలో విలీనం చేశాడు. కూచిపూడి గ్రామాన్ని కూచిపూడి భాగవతులకు తానీషానే దానంగా ఇచ్చాడు.

## పాలనా విధానాలు

రాజ్యాన్ని తరఫ్‌లు – సర్కారులు – సమితులు/ పరగణాలు – గ్రామాలుగా విభజించారు. అప్పటికాలంలో 6 తరఫ్‌లు, 37 సర్కారులు, 517 పరగణాలు ఉండేవి. సుల్తాన్‌కు మజ్లిస్ దివాన్‌దరి అనే మంత్రి పరిషత్తు పాలనలో సహాయపడేది.

★ ప్రధానమంత్రిని పీష్వా లేదా దివాన్, ఆర్థికమంత్రిని మీర్‌జుమ్లా, సైనిక మంత్రిని ఐనుల్‌ముల్క్, గణాంకాధ్యక్షుడిని మజుందార్ అని పిలిచేవారు.

★ రక్షక భటాధికారిని కొత్వాల్ (పోలీస్ కమిషనర్) అనేవారు. పీష్వా కింద దబీర్ అనే ఇద్దరు కార్యదర్శులు ఉండేవారు. రక్షకభట శాఖ సమర్థంగా పనిచేసేదని ట్రావెర్నియర్ పేర్కొన్నాడు. న్యాయ నిర్వహణ ఆదర్శప్రాయంగా ఉండేదని మీర్జా ఇబ్రహీం జుబేరి తన 'బసాటిన్ సలాతిన్' అనే గ్రంథంలో పేర్కొన్నాడు.

★ మహ్మద్‌కులీ దాడ్‌మహల్, అబ్దుల్లా కుతుబ్‌షా అమన్ మహల్ అనే న్యాయస్థానాలను ఏర్పాటు చేశారు. ఫర్మానాలను అమలుచేసే ఉద్యోగిని ఖతీల్ అనేవారు. అంగరక్షక దళాన్ని ఖాసాఖైల్, అశ్వ దళాన్ని నర్‌ఖైల్ అని పిలిచేవారు. ప్రధాన న్యాయాధికారిని షరియత్ పంచ్ అనేవారు.

★ కుతుబ్‌షాహీలకు అయిదు లక్షల సైన్యం ఉన్నట్లు థేవ్‌నట్ పేర్కొన్నాడు. తానీషా కాలంనాటి సైనికశక్తిని గురించి తారీఖీ జఫ్రా (గిరిథర్ లాల్ రచన) పేర్కొంటోంది. రేవు పట్టణాల్లో హవర్‌దార్, షాబందర్ అనే ఉద్యోగులు ఉండేవారు. వేలం పద్ధతి ద్వారా శిస్తు వసూలు అధికారం పొందినవారిని ముస్తజీర్లు అనేవారు.

## ఆర్థిక పరిస్థితులు

వ్యవసాయం, వాణిజ్యం, పరిశ్రమలు బాగా అభివృద్ధి చెందాయి. నాటి ప్రభుత్వ ఆదాయం 5 కోట్ల హన్నులనీ, అందులో 19 లక్షల నికర ఆదాయం ప్రభుత్వ ఖజానాలో చేరేదనీ మెథోల్డ్ పేర్కొన్నాడు. వీరి కాలంలోనే కోహినూర్ వజ్రం కొల్లూరు గనుల్లో (అంతులోల ప్రాంతం) లభించింది.

★ కొల్లూరు గనుల్లో 30 వేలమంది కార్మికులు పనిచేసేవారని మెథోల్డ్ పేర్కొన్నాడు. నిర్మల్, ఇందూర్, ఇందల్‌వాయ్ ప్రాంతాలు ఆయుధ పరిశ్రమకు ప్రధాన కేంద్రాలుగా ఉండేవి. మచిలీపట్నంలో కలంకారీ, తెరచాపగుడ్డ, తుపాకీ మందు, తూటాలు తయారయ్యేవి. మచిలీపట్నం, నరసాపురాల్లో నౌకల నిర్మాణం జరిగేది.

★ ఎగుమతి, దిగుమతి సుంకం 3 1/2 శాతంగా ఉండేది. పులికాట్ రేవులో మాత్రం 2% మాత్రమే సుంకం ఉండేది. నాటి ప్రధాన బంగారు నాణెం హొన్ను, దాన్నే పగోడా అనేవారు. ఫణం అనే వెండి; తార్, కాసు అనే రాగి నాణాలు చలామణిలో ఉండేవి. హొన్నులో 16వ వంతు ఫణం. ఫణంలో 32వ వంతు తార్. వెండి రూపాయి విలువ హొన్ను/ పగోడాలో నాలుగో వంతు ఉండేది.

## సాంఘిక, మత పరిస్థితులు

కుతుబ్‌షాహీ పాలకులు షియా మతస్థులైనప్పటికీ పరమత సహన విధానాన్ని పాటించారు. నాటి కులవ్యవస్థను గురించి 'హంసవింశతి' అనే గ్రంథం వివరిస్తోంది. హైదరాబాద్‌లో రెండు వేలమంది వేశ్యలు ఉండేవారనీ, సతీసహగమన ఆచారం ఉండేదనీ ట్రావెర్నియర్ అనే ఫ్రెంచి యాత్రికుడు తన గ్రంథంలో రాశాడు.

★ మసీదులను నిర్మించారు. హిందూ దేవాలయాలకు, బ్రాహ్మణులకు దానధర్మాలు చేశారు. మల్లేశ్వర స్వామి దేవాలయానికి భోగాపురం, చెరుకూరు, వీరన్న పట్టణాలను దానం చేశారు.

★ షేక్ ఫక్రుద్దీన్ అనే సూఫీ సన్యాసి పెనుగొండలో ఒక కంభాను (సార్థక మందిరం) స్థాపించాడు. గుల్బర్గా కేంద్రంగా బందెన వాజ్ గిసూథెరాజ్ సూఫీతత్వాన్ని ప్రచారం చేశాడు.

## సాంస్కృతిక అంశాలు

భాష, సాహిత్యాలు, లలిత కళలను బాగా అభివృద్ధి చేశారు. పారశీకం నాటి అధికార భాష. సైనిక భాషగా ఉర్దూ అభివృద్ధి చెందింది.

**నాటి ప్రసిద్ధ పారశీక, ఉర్దూ రచనలు:** తారిఖ్ ఎల్చి నిజాంషా – ఖుర్షా, లైలా–మజ్నూ – మీర్జామహ్మద్ అమీన్ (వజాహె), నసబ్ నామా కుతుబ్‌షాహీ – ఆలీవుర్మీ, హద్దై ఖుల్‌సలాతిన్ – అలీచిన్ తైపూర్, ఖుర్వాన్ ఖాటూన్ – మహ్మద్ ఇబన్ ఖాటూన్, సైపుల్ ముల్క్ నాబదియుల్ జమాల్ – గవాసీ

★ సుల్తాన్ కులీ గజల్ రచనలో సిద్ధహస్తుడు. ఇబ్రహీం కులీ ఉర్దూ భాషకు చాచర్ లాంటి వాడని షేర్వాణీ పండితుడు పేర్కొన్నాడు. అబ్దుల్లా కుతుబ్‌షా స్వయంగా ఉర్దూ భాషలో ద్విపదలు రచించాడు.

★ మాలిక్ మహ్మద్ జయసి రచించిన పద్మావత్ గ్రంథాన్ని గులాం అలీ ఉర్దూ భాషలోకి అనువదించాడు. తెలుగు భాషా సాహిత్యాలకు కుతుబ్‌షాహీ పాలకులు ఎంతో సేవ చేశారు. శంకర కవి తన 'హరిశ్చంద్రో పాఖ్యానం' గ్రంథాన్ని ఈడూరు ఎల్లయ్యకు అంకితమిచ్చాడు.

★ అద్దంకి గంగాధర కవి తన తపతీ సంవరణోపాఖ్యానాన్ని ఇబ్రహీంకులీకి అంకితం ఇచ్చాడు. కందుకూరి రుద్రకవి – సుగ్రీవ విజయం, నిరంకుశోపాఖ్యానం, జనార్దనాష్టకం లాంటి రచనలను చేశాడు. పొన్నగంటి తెలగనార్యుడు తన యయాతి చరిత్రను అమీన్‌ఖాన్‌కు అంకితమిచ్చాడు.

★ మహ్మద్‌కులీ తన ఆస్థానంలో గణేష పండితుడు, సారంగు తమ్మయ్యలను పోషించాడు. బిక్కనవోలు సంస్థానంలో మల్లారెడ్డి షట్చక్రవర్తి చరిత్ర, శివ ధర్మోత్తం లాంటి గ్రంథాలను రచించాడు. కంచర్ల గోపన్న దాశరథి శతకాన్ని, రాముడిపై 108 పద్యాలను రాశాడు.

★ ఆటవెలది వృత్తంలో పద్యాలు రచించిన వేమన ఈ కాలంలోనే జీవించాడు. వేదాలు వేశ్యల లాంటివనీ, ఎంగిలి విద్యలనీ వేమన పేర్కొన్నాడు. ఉద్యానవనాలు, పండ్ల తోటలతో పరివేష్ఠితమై ఉన్నందువల్ల హైదరాబాద్‌ను భాగ్ నగర్ (ఉద్యానవనాల నగరం)గా పిలిచేవారని థేవ్‌నట్ వ్యాఖ్యానించాడు.

★ షేర్వాణీ పండితుడు మక్కా మసీదును దిల్లీలోని జామా మసీదుతో పోల్చాడు. వీరి కాలంలో అభివృద్ధి చెందిన సూక్ష్మ చిత్రకళను దక్కనీ వర్ణచిత్రకళ అనేవారు.

★ దక్కనీ వర్ణచిత్రకళకు పితామహుడిగా పేరొందిన మీర్ హసీంను మొగలులు తమ ఆస్థానంలో నియమించుకున్నారు.

**మాదిరిప్రశ్నలు**

1. మల్కిభ రాముడిగా పేరొందిన సుల్తాన్ ఎవరు?

   1) సుల్తాన్ కులీ 2) మహ్మద్ కులీ 3) ఇబ్రహీం కులీ 4) అబ్దుల్లా కుతుబ్‌షా

2. తెలుగు భాషలో చాటువులు చెప్పిన సుల్తాన్ ఎవరు?

   1) సుల్తాన్ కులీ 2) మహ్మద్ కులీ 3) ఇబ్రహీం కులీ 4) అబ్దుల్లా కులీ

3. కోహినూర్ వజ్రం ఏ కుతుబ్‌షా పాలకుడి కాలంలో లభించింది?

   1) మహ్మద్ కులీ 2) మహ్మద్ కుతుబ్‌షా 3) అబ్దుల్లా కుతుబ్‌షా 4) తానీషా

4. తెలుగు భాషలో తొలి యక్షగానంగా పేరొందిన రచన ఏది?

   1) యయాతి చరిత్ర 2) సుగ్రీవ విజయం 3) సారంగధర చరిత్ర 4) సౌరభ చరిత్ర

**జవాబులు:** 1–3; 2–2; 3–3; 4–2.

**రచయిత: బి. నాగరాజు**

# ఆంగ్లేయుల పాలన - రాజకీయ, ఆర్థిక విధానాలు

**1.** బోర్డ్ ఆఫ్ కంట్రోల్‌ను ఏ చట్టం ద్వారా ఏర్పాటు చేశారు?

1) 1773 రెగ్యులేటింగ్ చట్టం
2) 1784 పిట్ ఇండియా చట్టం
3) 1853 చార్టర్ చట్టం
4) 1861 కౌన్సిళ్ల చట్టం

**2.** భారత రాజ్య కార్యదర్శి పదవిని ఏ చట్టం ద్వారా ఏర్పాటు చేశారు?

1) 1858 2) 1909 3) 1919 4) 1935

**3.** 'ది బైన్‌బాగ్ హత్యాకాండ' ఏ కాలంలో జరిగింది?

1) 1857 తిరుగుబాటు 2) ప్లాసీ యుద్ధం 3) రంప తిరుగుబాటు 4) ఏదీకాదు

**4.** 1857 తిరుగుబాటుకు ఢిల్లీలో నాయకత్వం వహించిన వ్యక్తి ఎవరు?

1) రెండో బహదూర్ షా
2) ఖాన్ బహదూర్‌ఖాన్
3) తుర్రేబాజ్ ఖాన్
4) భక్తఖాన్

**5.** కింది చట్టాలను, వాటి ముఖ్యాంశాలను జతపరచండి.

| | |
|---|---|
| i) 1853 | a) పరోక్ష ఎన్నిక విధానం |
| ii) 1909 | b) కేంద్ర శాసనసభ |
| iii) 1919 | c) రాష్ట్ర శాసనసభ |
| iv) 1892 | d) కేంద్రంలో ద్విసభా విధానం |
| v) 1861 | e) ప్రత్యక్ష ఎన్నిక విధానం |

1) i-a, ii-b, iii-c, iv-d, v-e
2) i-b, ii-e, iii-d, iv-a, v-c
3) i-e, ii-d, iii-b, iv-c, v-a
4) i-b, ii-c, iii-a, iv-d, v-e

**6.** రైత్వారీ పద్ధతిని మొట్టమొదట ఏ ప్రాంతంలో అమలు చేశారు?

1) రాయలసీమ
2) కోస్తా ఆంధ్రా
3) వాయవ్య భారతదేశం
4) బారామహల్

**7.** జమీందారీ విధానం లేదా శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతిని కారన్ వాలీస్ ఏ సంవత్సరంలో ప్రవేశపెట్టాడు?

1) 1786 2) 1791 3) 1789 4) 1793

**8.** 'ఆంగ్లేయుల భూమిశిస్తు విధానాల వల్ల బెంగాల్‌లో మూడోవంతు క్రూర మృగాలు సంచరించే అరణ్యసీమగా మారింది' అని పేర్కొన్నది ఎవరు?

1) విలియం బెంటింక్ 2) వారన్ హేస్టింగ్స్ 3) కారన్ వాలీస్ 4) లార్డ్ హేస్టింగ్స్

**9.** 'చేనేత పనివాళ్ల ఎముకలతో భారత సీమలు తెల్లబారాయి' అన్నదెవరు?

1) ఆర్.సి. దత్ 2) కారన్ వాలీస్ 3) విలియం బెంటింక్ 4) లార్డ్ వెల్లస్లీ

**10.** భారతదేశంలో తొలి జనపనార మిల్లును 1855లో ఏ ప్రాంతంలో స్థాపించారు?

1) బొంబాయి 2) మద్రాస్ 3) కలకత్తా 4) ఢిల్లీ

**11.** నీల్ దర్పణ్ అనే గ్రంథాన్ని రాసిందెవరు?

1) దీనబంధుమిత్ర 2) ఇర్ఫాన్ హబీబ్ 3) బుకానన్ 4) సుమలివాన్

**12.** భారతదేశంలో తొలి రైల్వేలైన్‌ను ఏ సంవత్సరంలో వేశారు?

1) 1852 2) 1854 3) 1853 4) 1858

**13.** బెనారస్ సంస్కృత కళాశాలను స్థాపించింది ఎవరు?

1) వారన్ హేస్టింగ్స్ 2) విలియం కేరీ

3) విలియం డిగ్బీ 4) జోనాథన్ డంకన్

**14.** విద్యాభివృద్ధికి సాలీనా లక్ష రూపాయలు కేటాయించిన చట్టం ఏది?

1) 1893 2) 1813 3) 1833 4) 1853

**15.** భారత విద్యా వ్యవస్థలో హక్కుల ప్రకటనగా పేర్కొనేది? (మాగ్నాకార్టా)

1) విక్టోరియా మహారాణి ప్రకటన 2) కొఠారీ కమిషన్

3) ఉడ్స్ నివేదిక 4) వేవెల్ ప్రణాళిక

**16.** హంటర్ విద్యా కమిషన్‌ను ఎవరి కాలంలో నియమించారు?

1) విలియం బెంటింక్ 2) లార్డ్ కర్జన్ 3) లార్డ్ డల్హౌసీ 4) లార్డ్ రిప్పన్

**17.** కలకత్తా, బొంబాయి, మద్రాస్ విశ్వవిద్యాలయాలను ఎప్పుడు స్థాపించారు?

1) 1861 2) 1858 3) 1856 4) 1857

**18.** గాంధీజీ 1837లో రూపొందించిన విద్యా విధానం?

1) వార్ధా ప్రణాళిక 2) బేసిక్ విద్యావిధానం

3) సేవాగ్రాం ప్రణాళిక 4) అన్నీ సరైనవే

**19.** కాళిదాసు రచించిన అభిజ్ఞాన శాకుంతలాన్ని ఆంగ్లంలోకి అనువదించింది ఎవరు?

1) చార్లెస్ విల్కిన్స్ 2) బెంజిమన్ షుల్జ్

3) విలియం బెంటింక్ 4) విలియం జోన్స్

**20.** భారతీయ వృత్తిపనివారి నిత్య జీవితాలను చిత్రించింది ఎవరు?

1) అమృతా షెర్గిల్ 2) రవివర్మ

3) రాజా రామ్మోహన్‌రాయ్ 4) నందాలాల్ బోస్

**21.** మొదటి భారతీయ వైద్య విద్యార్థి ఎవరు?

1) మహేంద్రసింగ్ లాల్ 2) పి.సి. సర్కార్

3) సి.వి.రామన్ 4) మహేంద్రలాల్ సర్కార్

**22.** కింది అంశాలను జతపరచండి.

i) బరేలి a) భక్తఖాన్

ii) ఢిల్లీ b) ఖాన్ బహదూర్‌ఖాన్

iii) లఖ్‌నవూ c) మౌల్వీ అహ్మదుల్లా

iv) బిహార్ d) కున్వర్‌సింగ్

1) i-b, ii-c, iii-a, iv-d 2) i-a, ii-b, iii-c, iv-d

3) i-b, ii-a, iii-d, iv-c 4) i-b, ii-a, iii-c, iv-d

**23.** తన పైఅధికారిని కాల్చి చంపిన మంగళ్‌పాండే ఏ దళానికి చెందినవాడు?

1) 47వ దేశీయ పటాలం
2) 19వ పదాతిదళం
3) 34వ పటాలం
4) 3వ అశ్వికదళం

**24.** 1857 తిరుగుబాటుకు సంబంధించి సరికాని అంశం?

1) తిరుగుబాటు ప్రారంభకుడు మంగళ్‌పాండే బారక్‌పూర్ సిపాయి
2) తిరుగుబాటుకు నాయకుడు రెండో బహదూర్‌షా జాఫర్
3) తిరుగుబాటు ఫలితంగా కంపెనీ గుత్తాధికారం రద్దయ్యింది
4) హిందువులు, మహ్మదీయులు పన్నిన కుట్ర అని జేమ్స్ ఔట్రామ్ పేర్కొన్నాడు

**25.** మద్రాస్ రాష్ట్రాన్ని ఏర్పాటు చేసిన గవర్నర్ జనరల్ ఎవరు?

1) విలియం బెంటింక్
2) వెల్లస్లీ
3) లార్డ్ హేస్టింగ్స్
4) డల్హౌసీ

**26.** ఇండియన్ పీనల్‌కోడ్ (IPC)ను రూపొందించింది ఎవరు?

1) లార్డ్ కారన్‌వాలీస్
2) లార్డ్ మెకాలే
3) వెల్లస్లీ
4) రాబర్ట్‌బర్డ్

**27.** గోండు తెగల్లో ఉన్న నరబలి ఆచారాన్ని అరికట్టింది ఎవరు?

1) లార్డ్ ఆక్‌లాండ్
2) లార్డ్ డల్హౌసీ
3) లార్డ్ అమ్హరెస్ట్
4) లార్డ్ హార్డింజ్ I

**28.** విక్టోరియా మహారాణి ప్రకటనను కానింగ్ ఎక్కడ చదివి వినిపించాడు?

1) ఢిల్లీ దర్బార్
2) అలహాబాద్ దర్బార్
3) కలకత్తా దర్బార్
4) మద్రాస్ దర్బార్

**29.** గవర్నర్ జనరల్‌గా నియమితుడైన తొలి సివిల్ ఉద్యోగి ఎవరు?

1) లార్డ్ కానింగ్
2) లార్డ్ డల్హౌసీ
3) సర్ జాన్‌లారెన్స్
4) లార్డ్ మేయో

**30.** 1878లో ప్రాంతీయ భాషా పత్రికల చట్టాన్ని రూపొందించిన వైస్రాయ్ ఎవరు?

1) లార్డ్ కానింగ్
2) లార్డ్ మేయో
3) లార్డ్ లిట్టన్
4) లార్డ్ కర్జన్

**31.** ఆర్.సి. మిత్తర్ అనే భారతీయుడిని కలకత్తా హైకోర్టు తాత్కాలిక ప్రధాన న్యాయమూర్తిగా నియమించింది ఎవరు?

1) విలియం బెంటింక్
2) లార్డ్ రిప్పన్
3) లార్డ్ లిట్టన్
4) లార్డ్ కర్జన్

**32.** హంటర్ విద్యా కమిషన్‌ను నియమించింది ఎవరు?

1) లార్డ్ రిప్పన్
2) లార్డ్ డల్హౌసీ
3) లార్డ్ కర్జన్
4) లార్డ్ మేయో

**33.** కేంద్ర, రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ కమిషన్‌లను ఏర్పాటు చేసిన వైస్రాయ్ ఎవరు?

1) లార్డ్ కానింగ్
2) లార్డ్ రిప్పన్
3) లార్డ్ డఫ్రిన్
4) లాన్స్‌డౌన్

**34.** భారత్ – అఫ్గనిస్థాన్ మధ్య డ్యూరాండ్ సరిహద్దు రేఖను ఏర్పాటు చేసిన వైస్రాయ్ ఎవరు?

1) లార్డ్ ఎల్గిన్
2) లార్డ్ కర్జన్
3) లార్డ్ లాన్స్‌డౌన్
4) లార్డ్ రెండో ఎల్గిన్

**35.** భారతదేశంలో సి.ఐ.డి. వ్యవస్థకు పునాది వేసింది ఎవరు?

1) లార్డ్ కర్జన్
2) లార్డ్ కారన్ వాలీస్
3) లార్డ్ రిప్పన్
4) లార్డ్ డఫ్రిన్

**36.** కిందివాటిని జతపరచండి.

i) కాంప్‌బెల్ కరవు నివారణ సంఘం — a) లార్డ్ లిట్టన్

ii) రిచర్డ్ స్ట్రాచీ క్షామ నివారణ సంఘం — b) జాన్ లారెన్స్

iii) మెక్ డొనాల్డ్ క్షామ నివారణ సంఘం — c) లార్డ్ కర్జన్

iv) జాన్ హుడ్‌హెడ్ క్షామ నివారణ సంఘం — d) లార్డ్ వేవెల్

1) i-a, ii-b, iii-c, iv-d   2) i-b, ii-a, iii-d, iv-c

3) i-d, ii-c, iii-b, iv-a   4) i-b, ii-a, iii-c, iv-d

**37.** ఇండియన్ లా కమిషన్‌ను ఏ సంవత్సరంలో నియమించారు?

1) 1838   2) 1883   3) 1884   4) 1861

**38.** పోర్ట్‌ఫోలియో విధానాన్ని ప్రవేశపెట్టిన భారత కౌన్సిళ్ల చట్టాన్ని ఏ సంవత్సరంలో రూపొందించారు?

1) 1892   2) 1909   3) 1861   4) 1919

**39.** భారత హైకమిషనర్ పదవిని ఏ చట్టం ద్వారా ఏర్పాటు చేశారు?

1) 1909   2) 1919   3) 1935   4) 1858

**40.** బ్రిటిష్ ఆర్థిక విధానాలను మూడు ముఖ్య దశలుగా వర్గీకరించింది ఎవరు?

1) రమేష్ చంద్రదత్   2) దాదాభాయ్ నౌరోజీ   3) ఆడంస్మిత్   4) డేనియల్ డెఫో

**41.** భారతదేశంలో ఆదాయపుపన్ను, బడ్జెట్ విధానాలను ఏ సంవత్సరంలో ప్రవేశపెట్టారు?

1) 1860   2) 1862   3) 1879   4) 1870

**42.** పారిశ్రామిక విప్లవ ఫలితంగా భారత్‌లో ఏర్పడిన మురికవాడల పరిస్థితులను తన నవలల్లో పేర్కొన్నది?

1) డేనియల్ డెఫో   2) ఛార్లెస్ డికెన్స్

3) విలియం షేక్‌స్పియర్   4) ఛాఛర్

**43.** ఆంగ్ల ఆర్థిక విధానం 'గంగ ఒడ్డున ఉన్న సంపదనంతా పీల్చేసి థేమ్స్ నది ఒడ్డున కక్కే స్పాంజి లాంటిది' అని పేర్కొన్న ఆంగ్లేయుడు ఎవరు?

1) ఛార్లెస్ గ్రాంట్   2) సుమలివాన్   3) సర్ జాన్‌షోర్   4) విలియం బెంటింక్

**44.** జమీందారులు ఆంగ్ల ప్రభుత్వానికి చెల్లించే శిస్తు భాగం?

1) ఖుద్‌ఖాస్త్   2) సర్ఫ్–ఎ–ఖాస్   3) పేష్కష్   4) దివానీ

**45.** కాటన్ ఆనకట్ట నిర్మాణంలో సర్ ఆర్థర్ కాటన్‌కు సహకరించిన ఆంధ్రా వ్యక్తి?

1) కాండ్రేగుల జోగిపంతులు   2) వీనం వీరన్న

3) బుద్ధరాజు గోపిరాజు   4) బుద్ధా రంగారావు

**46.** డొక్కల కరవు సంభవించిన సంవత్సరం?

1) 1870   2) 1940   3) 1877   4) 1788

**47.** 1883 నాటి ఫామిన్‌కోడ్‌ను ఏ కమిటీ నివేదిక ప్రకారం రూపొందించారు?

1) మెక్‌డొనాల్డ్ కమిషన్   2) స్ట్రాచీ కమిషన్

3) జాన్ హుడ్‌హెడ్ కమిషన్   4) ఏదీకాదు

**48.** కిందివాటిని జతపరచండి.

| | |
|---|---|
| i) తొలి వస్త్ర మిల్లు | a) 1853 |
| ii) తొలి ఉక్కు కర్మాగారం | b) 1855 |
| iii) తొలి జనపనార మిల్లు | c) 1907 |
| iv) తొలి బొగ్గు గని | d) 1845 |

1) i-b, ii-a, iii-d, iv-c
2) i-a, ii-b, iii-c, iv-d
3) i-a, ii-c, iii-b, iv-d
4) i-d, ii-c, iii-a, iv-b

**49.** 1818 సేరాంపూర్ బాప్టిస్ట్ మిషన్ కాలేజ్‌ను స్థాపించింది ఎవరు?

1) డేవిడ్ హేర్ 2) హెన్రీ డెరోజియో 3) విలియం కేరీ 4) ఛార్లెస్ గ్రాంట్

**50.** 'భారతీయులను విద్యావంతులను చేయడమంటే మనల్ని యూరప్‌కు తిరిగి పంపడమే' అన్నది ఎవరు?

1) డేవిడ్ హేర్ 2) హెన్రీ డెరోజియో 3) విలియం కేరీ 4) ఎల్ఫిన్‌స్టన్

**51.** 'ఇండియన్' అనే దినపత్రికను నిర్వహించింది ఎవరు?

1) డేవిడ్ హేర్ 2) హెన్రీ డెరోజియో 3) విలియం కేరీ 4) ఎల్ఫిన్‌స్టన్

**52.** ఆంగ్ల భాష నేర్చుకున్న భారతీయులకు ఉద్యోగావకాశాలు కల్పించేందుకు 1844లో ఉత్తర్వులు జారీ చేసింది ఎవరు?

1) హార్డింజ్ – I 2) హార్డింజ్ – II 3) మింటో – I 4) మింటో – II

**53.** గవర్నర్ జనరల్ కార్యనిర్వాహక సంఘంలో నియమితుడైన తొలి విద్యాశాఖ సభ్యుడు ఎవరు?

1) సర్ హెన్రీ బట్లర్ 2) లార్డ్ మెకాలే 3) లార్డ్ కిచ్‌నర్ 4) థామస్ రాలీ

**54.** విద్యా విషయమై సిమ్లా సమావేశాన్ని నిర్వహించిన వైస్రాయ్ ఎవరు?

1) లార్డ్ వేవెల్ 2) లార్డ్ రిప్పన్ 3) లార్డ్ కర్జన్ 4) ఎవరూ కాదు

**55.** రవీంద్రనాథ్ ఠాగూర్ శాంతినికేతన్ విద్యా సంస్థను ఏ సంవత్సరంలో స్థాపించారు?

1) 1920 2) 1921 3) 1922 4) 1923

**జవాబులు**

1-2; 2-1; 3-1; 4-4; 5-2; 6-4; 7-4; 8-3; 9-3; 10-3; 11-1; 12-3; 13-4; 14-2; 15-3; 16-4; 17-4; 18-1; 19-4; 20-4; 21-4; 22-4; 23-3; 24-3; 25-3; 26-2; 27-4; 28-2; 29-3; 30-3; 31-2; 32-1; 33-3; 34-3; 35-1; 36-4; 37-2; 38-3; 39-2; 40-1; 41-1; 42-2; 43-2; 44-3; 45-2; 46-3; 47-2; 48-3; 49-3; 50-3; 51-2; 52-1; 53-1; 54-3; 55-2.

**రచయిత: బి. నాగరాజు**

# చరిత్ర

**1.** నెల్లూరు రాజులతో పోరాటం చేసింది ఎవరు?

1) బ్రహ్మనాయుడు 2) బాలచంద్రుడు 3) కాటమరాజు 4) వీరరాజు

**2.** తెలుగులో మొదటి పద్య కావ్యం?

1) శ్రీమదాంధ్ర మహాభారతం 2) రామాయణం
3) మహాభాగవతం 4) ఏదీకాదు

**3.** పల్నాటి వీరులు ఎవరు?

1) బ్రహ్మనాయుడు 2) బాలచంద్రుడు
3) బ్రహ్మనాయుడు, బాలచంద్రుడు 4) కాటమరాజు

**4.** శ్రీమదాంధ్ర మహాభారతాన్ని మొదటి తెలుగు పద్య కావ్యంగా రచించిన వారు?

1) నన్నయ 2) తిక్కన 3) ఎర్రన 4) పై వారందరూ

**5.** తెలుగులో కవిత్రయం అని ఎవరినంటారు?

1) నన్నయ, తిక్కన, ఎర్రన 2) రన్న, పొన్న, పంప
3) నన్నయ, ఏకామ్రనాథ, పంప 4) విద్యానాథుడు, తిక్కన, వల్లభరాయుడు

**6.** ప్రతాపరుద్ర యశోభూషణం గ్రంథ రచయిత ఎవరు?

1) ఏకామ్రనాథ 2) వల్లభరాయుడు 3) విద్యానాథుడు 4) పంప

**7.** కాకతీయ వంశ మూల పురుషుడు ఎవరు?

1) మొదటి ప్రోలరాజు 2) మొదటి బేతరాజు 3) దుర్జయ 4) గంగయ

**8.** కాకతీయుల ఆస్థాన భాష?

1) తెలుగు 2) సంస్కృతం 3) ప్రాకృతం 4) అన్నీ

**9.** ఆంధ్ర రాజులుగా ప్రసిద్ధిగాంచిన వారు?

1) విజయనగర రాజులు 2) శాతవాహనులు
3) రేచర్ల పద్మనాయకులు 4) కాకతీయులు

**10.** కాకతీయులు మొదట ఎవరి వద్ద సైనికులుగా, సామంతులుగా పనిచేశారు?

1) రాష్ట్రకూటులు, చాళుక్యులు 2) రాష్ట్రకూటులు, చోళులు
3) రాష్ట్రకూటులు, పల్లవులు 4) రాష్ట్రకూటులు, కళ్యాణీ చాళుక్యులు

**11.** ఎవరి పతనానంతరం కాకతీయులు స్వతంత్ర పాలకులుగా ఆవిర్భవించారు?

1) రాష్ట్రకూటులు 2) పశ్చిమ చాళుక్యులు
3) విష్ణుకుండినులు 4) వేములవాడ చాళుక్యులు

**12.** రుద్రమదేవి పరిపాలనా కాలం ఏది? (క్రీ.శ.)?

1) క్రీ.శ. 1262 – 89 2) క్రీ.శ. 1262 – 1300
3) క్రీ.శ. 1262 – 82 4) క్రీ.శ. 1162 – 1262

**13.** రాజధానిని హనుమకొండ నుంచి ఓరుగల్లుకు మార్చిన కాకతీయ రాజు?

1) గణపతిదేవుడు 2) రుద్రదేవుడు 3) ప్రతాపరుద్రుడు 4) రెండో ప్రోలరాజు

**14.** హనుమకొండలో వేయిస్తంభాల గుడిని నిర్మించింది ఎవరు?

1) రెండో ప్రోలరాజు 2) ప్రతాపరుద్రుడు 3) రుద్రదేవుడు 4) గణపతిదేవుడు

**15.** రుద్రమదేవి కాలంలో కాకతీయ రాజ్యాన్ని సందర్శించిన ఇటలీ యాత్రికుడు ఎవరు?

1) ప్లీనీ 2) టాలమీ 3) ఫాహియాన్ 4) మార్కోపోలో

**16.** కాకతీయుల కాలంలో గ్రామ పెద్దను ఏమని వ్యవహరించేవారు?

1) రట్టడి 2) గ్రామజి 3) గ్రామణి 4) భద్రపాల

**17.** రుద్రదేవ మహారాజుగా పేరుగాంచింది ఎవరు?

1) రుద్రదేవుడు 2) గణపతిదేవుడు 3) రుద్రమదేవి 4) ప్రతాపరుద్రుడు

**18.** కాకతీయుల కాలంలో సామంత రాజుల తిరుగుబాటును సమర్థవంతంగా అణచివేసింది?

1) రుద్రమదేవి 2) ప్రతాపరుద్రుడు 3) గణపతిదేవుడు 4) రుద్రమదేవి, ప్రతాపరుద్రుడు

**19.** రుద్రమదేవి కాలంలో తిరుగుబాటు చేసింది ఎవరు?

1) రేచర్ల ప్రసాదిత్యుడు 2) జాయపసేనాని 3) గన్నయ 4) కాయస్థ అంబదేవుడు

**20.** రుద్రమదేవి ఎక్కడ జరిగిన యుద్ధంలో మరణించింది?

1) చందుపట్ల 2) దేవరకొండ 3) రాచకొండ 4) ఓరుగల్లు

**21.** గ్రామాల్లో శిస్తును వసూలు చేసేది ఎవరు?

1) నాయంకరులు 2) సామంతులు 3) ఇక్తాలు 4) మున్సబుదారులు

**22.** మోటుపల్లి అభయ శాసనం వేయించింది ఎవరు?

1) గణపతిదేవుడు 2) కాకతీయ రుద్రదేవుడు 3) మహాదేవుడు 4) రెండో ప్రోలరాజు

**23.** రెండో ప్రతాపరుద్రుడిని ఓడించి, కాకతీయ పాలనను అంతమొందించింది?

1) అల్లావుద్దీన్ ఖిల్జీ 2) మహమ్మద్‌బీన్ తుగ్లక్ 3) ఇబ్రహీం లోడీ 4) సికిందర్ లోడీ

**24.** ఏ సంవత్సరంలో కాకతీయ పాలన అంతమైంది?

1) క్రీ.శ. 1336 2) క్రీ.శ. 1323 3) క్రీ.శ. 1326 4) క్రీ.శ. 1347

**25.** పల్నాటి వీరుల చరిత్ర గ్రంథ రచయిత ఎవరు?

1) తిక్కన 2) విద్యానాథుడు 3) శ్రీనాథుడు 4) నన్నయ

**26.** పల్నాటి వీరుల చరిత్రలో ప్రధాన పాత్రధారుడు?

1) బాలచంద్రుడు 2) బ్రహ్మనాయుడు 3) నీలచంద్రుడు 4) కాటమరాజు

**27.** కిందివాటిలో దేన్ని కర్ణాటక సామ్రాజ్యంగా పిలిచేవారు?

1) బహమనీ రాజ్యం 2) విజయనగర సామ్రాజ్యం
3) కుతుబ్‌షాహీ సామ్రాజ్యం 4) అసఫ్‌జాహీ సామ్రాజ్యం

**28.** విజయనగరం అంటే అర్థం ఏమిటి?

1) విజయాల నగరం 2) విలాసాల నగరం
3) ధనిక నగరం 4) బంగారు నగరం

**29.** విజయనగర సామ్రాజ్యాన్ని ఏ సంవత్సరంలో స్థాపించారు?

1) క్రీ.శ. 1347 2) క్రీ.శ. 1326 3) క్రీ.శ. 1336 4) క్రీ.శ. 1356

**30.** విజయనగరం ఏ నది ఒడ్డున ఉంది?

1) కృష్ణ 2) కావేరి 3) తుంగభద్ర 4) గోదావరి

**31.** ఎవరి ఆశీస్సులతో విజయనగర సామ్రాజ్య స్థాపన జరిగింది?

1) విద్యారణ్యస్వామి 2) సుబ్రమణ్యస్వామి
3) రామానుజస్వామి 4) కుబేరస్వామి

**32.** విజయనగర రాజులు ఏ దేవుడిని కొలిచేవారు?

1) విరుదుడు 2) విశాలదుడు 3) విరూపాక్ష 4) విజయాక్ష

**33.** విజయనగర సామ్రాజ్యం సుమారు ఎన్ని సంవత్సరాలు వర్ధిల్లింది?

1) 250 2) 350 3) 150 4) 200

**34.** విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన వంశాలు (వరుస క్రమంలో) ఏవి?

1) సంగమ, సాళువ, తుళువ, అరవీటి 2) సంగమ, తుళువ, అరవీటి, సాళువ
3) సంగమ, సాళువ, అరవీటి, తుళువ 4) సంగమ, తుళువ, సాళువ, అరవీటి

**35.** శ్రీకృష్ణదేవరాయల పరిపాలన కాలం?

1) క్రీ.శ. 1506 – 29 2) క్రీ.శ. 1509 – 39
3) క్రీ.శ. 1509 – 29 4) క్రీ.శ. 1509 – 26

**36.** క్రీ.శ. 1420లో విజయనగరాన్ని మొదటగా సందర్శించింది?

1) నికోలోకాంటె 2) అబ్దుల్ రజాక్ 3) డొమింగో పేయిజ్ 4) న్యూనిజ్

**37.** అబ్దుల్ రజాక్ ఏ దేశానికి చెందిన వర్తకుడు?

1) ఇటలీ 2) ఇరాక్ 3) అఫ్గనిస్థాన్ 4) పర్షియా

**38.** విరూపాక్ష, పంపాదేవి ఆలయాలు ఏ నదీ తీరాన ఉన్నాయి?

1) తుంగభద్ర 2) కృష్ణ 3) కావేరి 4) గోదావరి

**39.** విజయనగరం ఏడు వలయాలతో ఏర్పడి, కోట గోడలు కలిగి ఉందని పేర్కొన్నది ఎవరు?

1) అబ్దుల్ రజాక్ 2) నికోలోకాంటె 3) డొమింగో పేయిజ్ 4) న్యూనిజ్

**40.** విజయనగర రాజులు దుర్భేధ్యమైన కోట గోడలు, గోపురాలతో నగరాన్ని నిర్మించినట్లు పేర్కొన్నది ఎవరు?

1) అబ్దుల్ రజాక్ 2) డోమింగో పేయిజ్ 3) న్యూనిజ్ 4) నికోలోకాంటె

**41.** విజయనగరాన్ని ఎన్ని భాగాలుగా విభజించారు?

1) రెండు 2) మూడు 3) నాలుగు 4) అయిదు

**42.** సామాన్య ప్రజలు ఎన్నో భాగంలో నివసించేవారు?

1) నాలుగు 2) మూడు 3) రెండు 4) అయిదు

**43.** విజయనగర రాజులు మేలురకం గుర్రాలను ఏ దేశాల నుంచి దిగుమతి చేసుకున్నారు?

1) రోమ్, ఇరాన్ 2) ఇరాక్, రోమ్ 3) అరేబియా, ఇరాన్ 4) అరేబియా, ఇరాక్

**44.** ముస్లిం పోరాట యోధులను సైన్యంలో నియమించిన విజయనగర రాజు?

1) రెండో దేవరాయలు 2) శ్రీకృష్ణదేవరాయలు 3) హరిహరరాయలు 4) బుక్కరాయలు

**45.** శ్రీకృష్ణదేవరాయల కాలంలో విజయనగరాన్ని సందర్శించిన యాత్రికుడు?

1) డోమింగ్ పేయిజ్ 2) అబ్దుల్ రజాక్ 3) నికోలోకాంటె 4) న్యూనిజ్

**46.** విజయనగర రాజుల కాలంలో సైనిక విధానంలో అమల్లో ఉన్నది?

1) నాయకర విధానం 2) మున్సబుదారీ విధానం

3) సైన్యసహకార విధానం 4) అమర నాయకర విధానం

**47.** నిర్ణీత ప్రాంతంపై రెవెన్యూ శిస్తు వసూలు చేసే అధికారాన్ని ఏమంటారు?

1) అమరం 2) నాయక 3) అమీర్ 4) జాగీర్

**48.** శ్రీకృష్ణదేవరాయల పరిపాలన కాలంలో పోర్చుగీస్ వారు తమ స్థావరాలను ఎక్కడ స్థాపించారు?

1) మచిలీపట్నం 2) నాగపట్నం 3) బొంబాయి 4) గోవా

**49.** శ్రీకృష్ణదేవరాయల కాలంలో ప్రతి సంవత్సరం పెద్ద ఎత్తున జరిగే పండుగ ఏది?

1) శివరాత్రి 2) ఉగాది 3) విజయదశమి 4) దీపావళి

**50.** ఆముక్తమాల్యద గ్రంథాన్ని శ్రీకృష్ణదేవరాయలు ఎవరి జీవితం ఆధారంగా రచించాడు?

1) ఉండాళ్ 2) తిరుక్కురళ్ 3) ఆండాళ్ 4) అచరాదేవి

**51.** రాక్షస తంగడి యుద్ధం ఏ సంవత్సరంలో జరిగింది?

1) క్రీ.శ. 1556 2) క్రీ.శ. 1566 3) క్రీ.శ. 1546 4) క్రీ.శ. 1565

**52.** కిందివాటిలో అరవీటి వంశస్థుల రాజధాని ఏది?

1) చంద్రగిరి 2) కొండవీడు 3) పెనుకొండ 4) కొండపల్లి

**జవాబులు**

1-3; 2-1; 3-3; 4-4; 5-1; 6-3; 7-3; 8-1; 9-4; 10-1; 11-2; 12-1; 13-2; 14-3; 15-4; 16-1; 17-3; 18-1; 19-4; 20-1; 21-1; 22-1; 23-2; 24-2; 25-2; 26-1; 27-2; 28-1; 29-3; 30-3; 31-1; 32-3; 33-1; 34-1; 35-1; 36-1; 37-4; 38-1; 39-1; 40-1; 41-3; 42-1; 43-3; 44-1; 45-1; 46-4; 47-1; 48-4; 49-3; 50-3; 51-4; 52-1.

**రచయిత: అమరనేని కృష్ణ**

# భారతదేశ చరిత్ర

**1.** ఆల్ ఇండియా కిసాన్ సభ మొదటి అధ్యక్షుడు ఎవరు?

ఎ) స్వామి సహజానంద
బి) బాబా రామచంద్ర
సి) స్వామి శ్రద్ధానంద
డి) ఎన్.జి. రంగా

**2.** 1935 భారత చట్టాన్ని బానిసత్వ చట్టంగా విమర్శించింది ఎవరు?

ఎ) మహాత్మాగాంధీ
బి) రాజేంద్రప్రసాద్
సి) జయకర్
డి) జవహర్‌లాల్ నెహ్రూ

**3.** అఖిల భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్ష పదవిని రెండుసార్లు చేపట్టిన బ్రిటిష్ జాతీయుడు ఎవరు?

ఎ) ఎ.ఒ. హ్యూమ్
బి) జార్జ్ యూల్
సి) సర్ హెన్రీ కాటన్
డి) విలియం వెడర్ బర్న్

**4.** 'పావర్టీ అండ్ అన్‌బ్రిటిష్ రూల్ ఇన్ ఇండియా' పుస్తక రచయిత ఎవరు?

ఎ) ఆర్.సి. దత్
బి) జయకర్
సి) దాదాభాయ్ నౌరోజీ
డి) ఆర్.సి. మజుందార్

**5.** భారతదేశంలో కమ్యూనిస్ట్ పార్టీని ఏ సంవత్సరంలో స్థాపించారు?

ఎ) 1929
బి) 1924
సి) 1925
డి) 1928

**6.** 1942 జూన్ 29 నాటి ప్రసిద్ధి గాంచిన 'కర్నూల్ సర్క్యులర్'ను ఎవరు విడుదల చేశారు?

ఎ) బెజవాడ గోపాలరెడ్డి
బి) కళా వెంకట్రావ్
సి) నీలం సంజీవరెడ్డి
డి) బూర్గుల రామకృష్ణారావు

**7.** 'ఇండియన్ ముసల్మాన్స్' అనే గ్రంథ రచయిత ఎవరు?

ఎ) సర్ విలియం హంటర్
బి) ఎం.ఎ. జిన్నా
సి) మౌలానా అబుల్ కలాం ఆజాద్
డి) వి.డి. సావర్కర్

**8.** ఏ నదీలోయ ప్రాంతంలో ఎక్కువ మహాజన పదాలు నెలకొన్నాయి?

ఎ) సింధూ లోయ
బి) నర్మదా లోయ
సి) గంగా లోయ
డి) గోదావరి లోయ

**9.** అక్బర్ 'బులంద్ దర్వాజా'ను ఎక్కడ నిర్మించాడు?

ఎ) లాహోర్
బి) ఢిల్లీ
సి) ఆగ్రా
డి) ఫతేపూర్ సిక్రీ

**10.** సమకాలీన భారతీయ సమాజంపై ఒక విమర్శగా వెలువడిన గులాంగిరి అనే గ్రంథ రచయిత ఎవరు?

ఎ) జ్యోతిబా పూలే
బి) ప్రేమ్‌చంద్
సి) ఈశ్వర చంద్ర విద్యాసాగర్
డి) ఆత్మారాం పాండురంగ

**11.** బానిసకు బానిసగా ఉన్న వ్యక్తి ఎవరు?

ఎ) బాల్బన్
బి) కుతుబుద్దీన్ ఐబక్
సి) ఇల్‌టుట్‌మిష్
డి) సుల్తానా రజియా

12. ఢిల్లీలో వైద్యశాలను స్థాపించిన ఢిల్లీ సుల్తాన్ ఎవరు?
ఎ) కుతుబుద్దీన్ ఐబక్ బి) మహ్మద్‌బిన్ తుగ్లక్
సి) ఫిరోజ్ తుగ్లక్ డి) అల్లాఉద్దీన్ ఖిల్జీ

13. బానిసల సంక్షేమం కోసం ప్రత్యేక శాఖను, శాశ్వత అధికార సిబ్బందిని నెలకొల్పిన ఢిల్లీ సుల్తాన్ ఎవరు?
ఎ) ఫిరోజ్ తుగ్లక్ బి) మహ్మద్‌బిన్ తుగ్లక్
సి) ఇల్‌టుట్‌మిష్ డి) బాల్బన్

14. విక్రమ శకం ఏ సంవత్సరంలో ప్రారంభమైంది?
ఎ) క్రీ.పూ. 324 బి) క్రీ.పూ. 261 సి) క్రీ.పూ. 58 డి) క్రీ.పూ. 78

15. మొగలుల కాలంలో రాజ భాష ఏది?
ఎ) తుర్కీ బి) అరబిక్ సి) హిందీ డి) పర్షియన్

16. సముద్రగుప్తుడి గురించి తెలియజేసే అలహాబాద్ స్తంభ శాసనాన్ని రచించింది ఎవరు?
ఎ) హరిసేనుడు బి) రవివర్మ సి) రవికీర్తి డి) భవభూతి

17. భారతదేశంపై తైమూర్ దండయాత్ర జరిగిన సంవత్సరం?
ఎ) 1375 బి) 1385 సి) 1398 డి) 1390

18. 'అలైదర్వాజా'ను నిర్మించిన ఢిల్లీ సుల్తాన్ ఎవరు?
ఎ) కుతుబుద్దీన్ ఐబక్ బి) అల్లాఉద్దీన్ ఖిల్జీ
సి) ఫిరోజ్ తుగ్లక్ డి) మహ్మద్‌బిన్ తుగ్లక్

19. మూడో పానిపట్టు యుద్ధం (1761) ఎవరెవరి మధ్య జరిగింది?
ఎ) మరాఠాలు, అహ్మద్‌షా అబ్దాలీ బి) బ్రిటిష్‌వారు, మరాఠాలు
సి) బ్రిటిష్‌వారు, ఫ్రెంచివారు డి) నిజామ్, బ్రిటిష్‌వారు

20. పూనాలో భారత మహిళా విశ్వవిద్యాలయాన్ని స్థాపించిన వ్యక్తి ఎవరు?
ఎ) ఎం.జి. రనడే బి) జ్యోతిబా పూలే
సి) దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ డి) డి.కె. కార్వే

21. భారతదేశ ప్రథమ రాజ ప్రతినిధి ఎవరు?
ఎ) వారన్ హేస్టింగ్స్ బి) లార్డ్ కానింగ్ సి) లార్డ్ కర్జన్ డి) లార్డ్ మేయో

22. 'లీలావతి పరిణయం' అనే ప్రాకృత రచనలో ఏ శాతవాహన రాజు వివాహానికి సంబంధించిన వర్ణన కనిపిస్తుంది?
ఎ) హాలుడు బి) యజ్ఞశ్రీ శాతకర్ణి
సి) గౌతమీపుత్ర శాతకర్ణి డి) మొదటి శాతకర్ణి

23. నలందా విశ్వవిద్యాలయాన్ని స్థాపించిన గుప్త చక్రవర్తి ఎవరు?
ఎ) భానుగుప్తుడు బి) కుమారగుప్తుడు
సి) సముద్రగుప్తుడు డి) చంద్రగుప్త విక్రమాదిత్యుడు

24. మొదటి పానిపట్ యుద్ధం జరిగిన సంవత్సరం ఏది?
ఎ) 1526 బి) 1527 సి) 1528 డి) 1530

**25.** జహంగీర్ పరిపాలన కాలంలో ఏర్పాటు చేసిన కొత్త రాష్ట్రం ఏది?

ఎ) బీజాపూర్ బి) ఒరిస్సా సి) సింధ్ డి) కాశ్మీర్

**26.** జ్యోతిష్యాన్ని, గ్రహబలాన్ని విపరీతంగా నమ్మిన మొగల్ చక్రవర్తి ఎవరు?

ఎ) హుమాయున్ బి) అక్బర్ సి) జహంగీర్ డి) షాజహాన్

**27.** పీష్వా పదవి ఏ సంవత్సరంలో రద్దయ్యింది?

ఎ) 1816 బి) 1818 సి) 1820 డి) 1824

**28.** వ్యవసాయం నిమిత్తం మేవాడ్‌లో ఉదయసాగర్ అనే చెరువును తవ్వించింది ఎవరు?

ఎ) షాజహాన్ బి) అక్బర్ సి) ఔరంగజేబ్ డి) హుమాయున్

**29.** బ్రాహ్మణులపై కూడా జిజియా పన్ను విధించిన ఢిల్లీ సుల్తాన్ ఎవరు?

ఎ) ఫిరోజ్ తుగ్లక్ బి) బాల్బన్

సి) మహ్మద్‌బిన్ తుగ్లక్ డి) ఇల్‌టుట్‌మిష్

**30.** శ్రీనగర్‌లోని షాలీమార్ గార్డెన్ నిర్మాత ఎవరు?

ఎ) బాబర్ బి) జహంగీర్ సి) అక్బర్ డి) ఔరంగజేబ్

**31.** నాదిర్షా దండయాత్ర (1739) కాలంలో మొగల్ చక్రవర్తి ఎవరు?

ఎ) మహ్మద్ షా బి) అలంగీర్ సి) అహ్మద్ షా డి) బహుదూర్ షా – I

**32.** 1891 లో జరిగిన ఏడో జాతీయ కాంగ్రెస్‌కు అధ్యక్షత వహించిన తొలి ఆంధ్రుడు ఎవరు?

ఎ) కల్లూరి సుబ్బారావు బి) పి. ఆనందాచార్యులు

సి) కొండా వెంకటప్పయ్య డి) దామోదరం సంజీవయ్య

**33.** "ఇండియన్ సోషియాలజిస్ట్" అనే మాసపత్రికను నిర్వహించింది ఎవరు?

ఎ) వి.డి. సావర్కర్ బి) శ్యాంజీ కృష్ణవర్మ సి) రాస్ బిహారీ బోస్ డి) మేడం కామా

**34.** భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చేనాటికి భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్షులు ఎవరు?

ఎ) జవహర్‌లాల్ నెహ్రూ బి) గాంధీజీ

సి) మౌలానా అబుల్ కలాం ఆజాద్ డి) జె.బి. కృపలానీ

**35.** 1885 లో జాతీయ కాంగ్రెస్ స్థాపన సమయంలో ఉన్న వైస్రాయి ఎవరు?

ఎ) లార్డ్ కర్జన్ బి) లార్డ్ రిప్పన్ సి) లార్డ్ డఫ్రిన్ డి) మింటో – I

**36.** 'మల్ల' మహాజనపద రాజ్య రాజధాని ఏది?

ఎ) కుశి నగరం బి) పాట్నా సి) మిథిల డి) రాజగృహం

**37.** రెండో జైన పరిషత్ ఎవరి అధ్యక్షతన, ఎక్కడ జరిగింది?

ఎ) ఖారవేలుడు, కటక్ బి) క్షమ శ్రమణ, వల్లభి

సి) చంద్రగుప్తుడు, శ్రావణ బెళగొళ డి) అమోఘవర్షుడు, మాన్య ఖేటం

**38.** సేతుబంధం అనే ప్రాకృత రచనకర్త?

ఎ) కాళిదాసు బి) ప్రవరసేనుడు

సి) విశాఖదత్తుడు డి) వరహామిహిరుడు

**39.** హర్షుడి సమకాలీనుడైన రెండో పులకేశి ఏ సంవత్సరంలో బాదామి చాళుక్య సింహాసనం అధిష్ఠించాడు?

ఎ) క్రీ.శ.605 బి) క్రీ.శ.608 సి) క్రీ.శ.609 డి) క్రీ.శ.610

**40.** వీర శైవానికి ఆంధ్రదేశంలో ప్రధాన కేంద్రం ఏది?

ఎ) ద్రాక్షారామం బి) శ్రీకాళహస్తి సి) అహోబిలం డి) శ్రీశైలం

**41.** 'రంగేళి రాజా'గా పేరుగాంచిన కడపటి మొగల్ చక్రవర్తి ఎవరు?

ఎ) మహ్మద్‌షా బి) రెండో షా అలమ్ సి) జహందర్ షా డి) అహ్మద్ షా

**42.** 'షాజహాన్ నామా'ను రచించింది ఎవరు?

ఎ) అబుల్ ఫజల్ బి) ఇనాయత్ ఖాన్ సి) దారాషుకోవ్ డి) కాఫీ ఖాన్

**43.** మశూచి సోకడం వల్ల మరణించిన సిక్కు గురువు ఎవరు?

ఎ) గురు హరికృష్ణ బి) గురు అంగద్ సి) గురు అర్జున్ డి) గురు హరరామ్

**44.** ఉద్యానవన, స్వీయ చరిత్రకారుల రాజు అని ఏ మొగల్ చక్రవర్తిని పిలుస్తారు?

ఎ) హుమయూన్ బి) అక్బర్ సి) బాబర్ డి) జహంగీర్

**45.** హుమయూన్, షేర్‌ఖాన్ మధ్య చౌసా యుద్ధం ఎప్పుడు జరిగింది?

ఎ) క్రీ.శ.1535 బి) క్రీ.శ.1539 సి) క్రీ.శ.1540 డి) క్రీ.శ.1533

**46.** అక్బర్ కాలంలో 'లీలావతి గ్రంథాన్ని' అనువదించింది ఎవరు?

ఎ) ఫైజీ బి) అబుల్ ఫజల్ సి) బదౌనీ డి) ఇబన్ బటూటా

**47.** ఏ మొగల్ చక్రవర్తి కాలంలో భారతదేశంలో పొగాకును ప్రవేశపెట్టారు.?

ఎ) హుమయూన్ బి) జహంగీర్ సి) అక్బర్ డి) షాజహాన్

**48.** ఔరంగజేబ్ సమాధి ఏ పట్టణ సమీపంలో ఉంది?

ఎ) న్యూఢిల్లీ బి) లాహోర్ సి) ఆగ్రా డి) దౌలతాబాద్

**49.** రెండో మరాఠా యుద్ధం ఏ సంవత్సరంలో జరిగింది?

ఎ) 1799 – 1800 బి) 1802 – 04 సి) 1804 – 06 డి) 1806 – 08

**50.** శివాజీ పరిపాలనలో విదేశీ వ్యవహారాలను నిర్వహించే అధికారి ఎవరు?

ఎ) పీష్వా బి) పండితరాయ్ సి) మంత్రి డి) సుమంత్

**51.** 'ద హిస్టరీ ఆఫ్ ఇండియన్ మ్యూటినీ' గ్రంథ రచయిత ఎవరు?

ఎ) జి.బి. మల్లెసన్ బి) టి.ఆర్. హామ్స్

సి) ఆర్.సి. మజుందార్ డి) అశోక్ మెహతా

**52.** కేరళలో క్రీ.శ.1899లో ప్రథమ ఆధునిక నవల 'ఇందులేఖ'ను రచించింది ఎవరు?

ఎ) రామన్ పిళ్లై బి) నారాయణ గురు సి) చందర్ మీనన్ డి) పద్మనాభ పిళ్లై

**53.** కలకత్తా సుప్రీం కోర్టు ప్రథమ ప్రధాన న్యాయమూర్తి ఎవరు?

ఎ) లార్డ్ మేయో బి) ఇంఫే సి) మెకాలే డి) కారన్ వాలీస్

**54.** ఆంగ్ల భాషను బోధన భాషగా ఏ సంవత్సరం నుంచి ప్రవేశపెట్టారు?

ఎ) 1813 బి) 1830 సి) 1835 డి) 1844

**55.** మానవ బలిని అరికట్టిన బ్రిటిషు గవర్నర్ జనరల్ ఎవరు?

ఎ) లార్డ్ హార్డింజ్ – I బి) లార్డ్ రిప్పన్ సి) లార్డ్ నార్త్ బ్రూక్ డి) లార్డ్ ఎల్గిన్ – II

**56.** ఇండియా, ఇంగ్లండ్‌లలో ఒకేసారి సివిల్ సర్వీస్ పరీక్షలు నిర్వహించడం ఏ సంవత్సరం నుంచి ప్రారంభమైంది?

ఎ) 1921 బి) 1922 సి) 1923 డి) 1925

**57.** క్రీ.శ. 1922లో చౌరీచౌరా సంఘటన జరిగినప్పుడు వైస్రాయ్‌గా ఉన్నదెవరు?

ఎ) లార్డ్ రీడింగ్ బి) లార్డ్ చెమ్స్‌ఫర్డ్ సి) లార్డ్ ఇర్విన్ డి) లార్డ్ ఎల్జిన్

**58.** స్వతంత్ర భారత ప్రథమ వైస్రాయ్ ఎవరు?

ఎ) లార్డ్ మౌంట్‌బాటన్ బి) లార్డ్ వేవెల్ సి) రాజగోపాలాచారి డి) లార్డ్ మేయో

**59.** 1940లో రాడికల్ డెమొక్రటిక్ పార్టీని ఎవరు స్థాపించారు?

ఎ) సుభాష్ చంద్రబోస్ బి) ఎం.ఎన్. రాయ్

సి) మజుందార్ డి) సత్యేంద్రనాథ్ ఠాగూర్

**60.** గాంధీజీ ఏ సంవత్సరంలో రౌలట్ సత్యాగ్రహాన్ని నిర్వహించారు?

ఎ) 1919 బి) 1922 సి) 1918 డి) 1920

## జవాబులు

**1–ఎ; 2–డి; 3–డి; 4–సి; 5–బి; 6–బి; 7–ఎ; 8–సి; 9–డి; 10–ఎ; 11–సి; 12–సి; 13–ఎ; 14–సి; 15–డి; 16–ఎ; 17–సి; 18–బి; 19–ఎ; 20–డి; 21–బి; 22–ఎ; 23–బి; 24–ఎ; 25–బి; 26–ఎ; 27–బి; 28–ఎ; 29–ఎ; 30–బి; 31–ఎ; 32–బి; 33–బి; 34–డి; 35–సి; 36–ఎ; 37–బి; 38–బి; 39–సి; 40–డి; 41–ఎ; 42–బి; 43–ఎ; 44–సి; 45–బి; 46–ఎ; 47–బి; 48–డి; 49–బి; 50–డి; 51–బి; 52–సి; 53–బి; 54–సి; 55–ఎ; 56–సి; 57–ఎ; 58–ఎ; 59–బి; 60–ఎ.**

**రచయిత: సి. రామాంజులు**

# స్వాతంత్రోద్యమం

## సైమన్ కమిషన్ (1927 – 28)

★ 1919 మాంటేగ్ చెమ్స్‌ఫర్డ్ చట్టంలోని లోపాలు, భారతీయుల సమస్యలను అధ్యయనం చేయడానికి ఆంగ్ల ప్రభుత్వం 1927లో ఇంగ్లండ్‌లో సైమన్ కమిషన్‌ను నియమించింది.

★ జాన్ సైమన్ అధ్యక్షతన ఏర్పాటైన ఈ సంఘంలో సైమన్‌తో కలిపి మొత్తం ఏడుగురు సభ్యులున్నారు. కానీ అందులో ఒక్క భారతీయుడికి కూడా స్థానం కల్పించలేదు. 1928, ఫిబ్రవరి 3న సైమన్ కమిషన్ బొంబాయిలో అడుగుపెట్టింది.

★ భారతీయులకు ప్రాతినిధ్యం కల్పించని కారణంగా భారత జాతీయ కాంగ్రెస్ సైమన్ కమిషన్ వ్యతిరేక ఉద్యమానికి పిలుపునిచ్చింది. ఆ రోజున మద్రాస్‌లో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు అధ్యక్షతన నిరసన సభ జరిగింది.

★ సైమన్ కమిషన్ ఆంధ్రాలోని గుంటూరు, ఒంగోలు ప్రాంతాల్లో పర్యటించడానికి సిద్ధమైంది. ఈ కమిషన్ మద్రాస్ పర్యటనకు వ్యతిరేకంగా 1928, ఫిబ్రవరి 26న టంగుటూరి ప్రకాశం పంతులు నాయకత్వంలో నిరసన ఉద్యమం జరిగింది. ఈ సందర్భంగా జరిగిన పోలీస్ కాల్పుల్లో పార్థసారథి అనే యువకుడు మరణించాడు. టంగుటూరి పోలీసుల తుపాకులకు ఎదురొడ్డి నిలిచారు. ఈ నేపథ్యంలోనే ఆయనకు ఆంధ్రకేసరి అనే బిరుదు వచ్చింది.

★ విజయవాడ రైల్వేస్టేషన్‌లో దిగిన సైమన్‌కు నాటి విజయవాడ మున్సిపల్ ఛైర్మన్ అయ్యదేవర కాళేశ్వరరావు 'సైమన్ గో బ్యాక్' అని రాసి ఉన్న చీటీని తన ఫ్యూన్ పేదారుతో పంపారు.

★ లాహోర్‌లో లాలాలజపతిరాయ్ నాయకత్వంలో సైమన్ కమిషన్ వ్యతిరేక ఉద్యమం జరిగింది. సైమన్ కమిషన్ భారతదేశంలో రెండుసార్లు పర్యటించి నివేదికను సమర్పించింది. లండన్‌లో అఖిలపక్ష సమావేశాలు (రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్సులు) ఏర్పాటు చేయాలని సైమన్ కమిషన్ సూచించింది. 1929లో గాంధీజీ ఆంధ్రాలో పర్యటించారు.

### లాహోర్ కాంగ్రెస్ సమావేశం

1929లో నెహ్రూ అధ్యక్షతన భారత జాతీయ కాంగ్రెస్ సమావేశం లాహోర్‌లో జరిగింది. ఈ సమావేశంలో సంపూర్ణ స్వరాజ్య తీర్మానాన్ని రూపొందించారు. అలాగే గాంధీజీ నాయకత్వంలో మరో ఉద్యమం చేయడానికి తీర్మానించారు. జనవరి 26 ను స్వాతంత్ర దినోత్సవంగా జరుపుకోవాలని నిర్ణయించారు.

### ఉప్పు సత్యాగ్రహ ఉద్యమం

★ గాంధీజీ 1930, మార్చి 12న సబర్మతి ఆశ్రమం నుంచి 78 మంది అనుచరులతో బయలుదేరి ఏప్రిల్ 6న దండి గ్రామానికి చేరుకుని, ఉప్పు సత్యాగ్రహాన్ని ప్రారంభించారు. ఈ యాత్రలో ఎర్నేని సుబ్రహ్మణ్యం అనే ఆంధ్రుడు కూడా పాల్గొన్నాడు.

★ యాత్రా సమయంలో ఆంధ్రులు గాంధీజీని గుజరాత్‌లోని జంబూసర్ ప్రాంతంలో కలుసుకున్నారు. ఆంధ్రాలో తొలి ఉద్యమాన్ని 1930, ఏప్రిల్ 6న తూర్పుగోదావరి జిల్లాలోని సీతానగరం ఆశ్రమవాసులు చొల్లంగి తీరంలో ప్రారంభించారు. తర్వాత ఏప్రిల్ 7న మచిలీపట్నంలో ప్రారంభించారు. రాష్ట్రమంతటా ఉద్యమం తీవ్రంగా జరిగింది.

★ కొండా వెంకటప్పయ్య ఆంధ్రాలో ఉద్యమ నాయకుడి (డిక్టేటర్)గా నియమితులయ్యారు. ప్రతీ జిల్లాలో ఒక నాయకుడిని, ఉద్యమ శిబిరాలను, సత్యాగ్రహ కేంద్రాలను ఏర్పాటు చేశారు.

★ నెల్లూరు జిల్లాలో పల్లిపాడు, కృష్ణా జిల్లాలో మచిలీపట్నం, పశ్చిమ గోదావరి జిల్లాలో ఏలూరు కళాశాల, తూర్పు గోదావరి జిల్లాలో సీతానగరం, విశాఖపట్నం జిల్లాలో, విజయనగరంలో ఉద్యమ శిబిరాలు ఏర్పాటయ్యాయి.

★ మైపాడు (నెల్లూరు), మచిలీపట్నం (కృష్ణా), మట్లపాలెం (పశ్చిమ గోదావరి), చొల్లంగి (తూర్పు గోదావరి), విశాఖ బీచ్ (విశాఖపట్నం) కొండా వెంకటప్పయ్య స్వగృహం (గుంటూరు) ఉద్యమ సత్యాగ్రహ కేంద్రాలుగా నిర్ణయించారు.

★ ఏప్రిల్ 9న కృష్ణా, గుంటూరు జిల్లాల్లో ఉన్నవ లక్ష్మీ బాయమ్మ, ఆచంట రుక్మిణీ లక్ష్మీపతి లాంటి మహిళలు సత్యాగ్రహం చేశారు.

★ ఏప్రిల్ 11న పశ్చిమ గోదావరి జిల్లాలో దండు నారాయణరాజు, నరహరిశర్మ, నెల్లూరులో బొమ్ము శేషారెడ్డి, ఓరుగంటి వెంకట సుబ్బయ్య, బెజవాడ గోపాలరెడ్డి లాంటి వారి నాయకత్వంలో ఉద్యమం నిర్వహించారు. ఓరుగంటి సుబ్బయ్య భార్య మహాలక్ష్మి పిల్లలతో కలిసి ఉద్యమంలో పాల్గొన్నారు.

★ రాయలసీమలో కల్లూరి సుబ్బారావు, మద్రాస్‌లో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, దుర్గాబాయ్ దేశ్‌ముఖ్, గద్దె రంగయ్యనాయుడు సత్యాగ్రహాలు నిర్వహించారు.

★ 1930, జనవరి 26న మచిలీపట్నంలో తోట నర్సయ్య జాతీయ జెండాను ఎగురవేశారు.

★ టంగుటూరి ప్రకాశం పంతులు, జోగయ్య తమ శాసనసభ సభ్యత్వాలకు రాజీనామా చేశారు.

★ రామదాసు పంతులు, వి. రామారావు కేంద్ర శాసనసభ నుంచి, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, కడప కోటిరెడ్డి, స్వామి వెంకటాచలం సెట్టి, వెంకటపతిరాజు, కామేశ్వరరావు శాసన మండలి నుంచి తప్పుకున్నారు (రాజీనామాలు సమర్పించారు.)

★ త్రిపురనేని రామస్వామి చౌదరి 'వీరగంధము తెచ్చినారము వీరులెవ్వరో తెల్పుడీ' అనే గీతాన్ని, గరికిపాటి మల్లావధాని 'ఉప్పోయమ్మ ఉప్పు' అనే గీతాన్ని బసవరాజు అప్పారావు 'కొల్లాయి కట్టితేమి, మా గాంధీ కోమటై పుట్టితేమి' అనే గీతాన్ని, గరిమెళ్ల సత్యనారయణ 'ఉప్పు పన్ను, పప్పు పన్ను, ఊరికెళితే పన్ను, కొప్పు కాస్త దేవుడికి మొక్కుకుంటే పన్ను' అనే గీతాన్ని రచించారు.

★ ఈ ఉద్యమ కాలంలోనే పెద్దాపురంలో దువ్వూరి సుబ్బమ్మ నాయకత్వంలో జరుగుతున్న వనభోజనాలపై లాఠీచార్జ్ జరిగింది.

★ ఈ ఉద్యమ సమయంలో జైలుశిక్ష అనుభవించిన తొలి మహిళగా ఆచంట రుక్మిణీ లక్ష్మీపతి పేరుగాంచారు.

★ గొల్లపూడి సీతారామశాస్త్రి నాయకత్వంలో మద్యపాన వ్యతిరేక ఉద్యమం జరిగింది.

★ గంజాంలోని నౌపాడ్ వద్ద, విశాఖపట్నంలోని బాలచెరువు వద్ద ఉన్న ఉప్పుకొఠారులపై దాడి జరిగింది.

★ 1931, మార్చి 30న వాడపల్లి వెంకటేశ్వరస్వామి ఉత్సవ సమయంలో జాతీయ నాయకుల పటాలను ఊరేగిస్తున్న సందర్భంలో పోలీసులు లాఠీచార్జ్ చేశారు.

★ బ్రహ్మ జోస్యుల సుబ్రహ్మణ్యం లాంటి నాయకులపై లాఠీచార్జి చేసిన సీఐ ముస్తఫాఅలీ ఖాన్‌ను చంపడానికి ప్రయత్నించిన ప్రతివాద భయంకరాచారిపై కాకినాడ బాంబు కేసు నమోదైంది.

★ 1932 మార్చిలో కృష్ణా జిల్లాలోని వెంట్రప్రగడ గ్రామంపై 6 వేలు జరిమానా విధించారు.

★ 'స్వరాజ్య పథకం' పేరుతో కరపత్రాలను ముద్రించిన కలగా సత్యనారాయణకు సంవత్సరం జైలుశిక్ష విధించారు.

★ వేదాంతం కమలాదేవి అధ్యక్షతన గుంటూరు అగ్రహారంలో రాష్ట్ర మహిళా సభ జరిగింది.

★ ఉద్యమ కాలంలోనే ఆంగ్లేయులు లండన్‌లో మూడు రౌండ్ టేబుల్ సమావేశాలు నిర్వహించారు.

★ 1931, మార్చి 5న జరిగిన గాంధీ-ఇర్విన్ ఒప్పందం ప్రకారం గాంధీజీ 1931లో రెండో రౌండ్ టేబుల్ సమావేశానికి హాజరయ్యారు.

★ 1933లో గాంధీజీ హరిజనోద్ధరణ లక్ష్యంగా ఆత్మశుద్ధి నిరాహారదీక్షను ప్రారంభించారు

★ 1934, మే 20న గాంధీజీ ఉప్పు సత్యాగ్రహ ఉద్యమాన్ని నిలిపివేశారు.

## 1934 – 42 మధ్య జరిగిన కొన్ని సంఘటనలు

★ 1934లో గాడిచర్ల హరిసర్వోత్తమరావు విజయవాడలో ఆంధ్రా స్వరాజ్ పార్టీని ప్రారంభించారు. ఈపార్టీ కార్యదర్శిగా జి.వి. సుబ్బారావు వ్యవహరించారు.

★ 1934లోనే విజయవాడలో ఎన్.జి. రంగా అధ్యక్షతన ఆంధ్రా కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ ఏర్పడింది. దీని కార్యదర్శిగా మద్దూరి అన్నపూర్ణయ్య వ్యవహరించారు.

★ 1934 – 35లో పుచ్చలపల్లి సుందరయ్యగారి నాయకత్వంలో ఆంధ్రా కమ్యూనిస్ట్ పార్టీ ఏర్పడింది.

★ రామ్‌మనోహర్ లోహియా, జయప్రకాశ్ నారాయణ్‌తో కలిసి ఢిల్లీలో అఖిల భారత సోషలిస్ట్ పార్టీని స్థాపించగా, ఆంధ్రాలో ఆ పార్టీ శాఖ అధ్యక్షుడిగా తెన్నేటి విశ్వనాథం నియమితులయ్యారు.

★ 1937 ఎన్నికల అనంతరం రాజగోపాలాచారి మద్రాస్ ముఖ్యమంత్రిగా, టంగుటూరి ప్రకాశం పంతులు, వి.వి.గిరి, బెజవాడ గోపాలరెడ్డి మంత్రులుగా, బులుసు సాంబమూర్తి స్పీకర్‌గా నియమితులయ్యారు.

★ గాంధీజీ వ్యక్తిగత సత్యాగ్రహ పిలుపుకు స్పందించి, ఆంధ్రాలో సుమారు 882 మంది అందులో పాల్గొన్నారు. ఆంధ్రాలో తొలి వ్యక్తిగత సత్యాగ్రహి వావిలాల గోపాలకృష్ణయ్య.

★ 1939 అక్టోబరులో భారతదేశంలోని కాంగ్రెస్ మంత్రివర్గాలు రాజీనామాలు చేశాయి.

## క్విట్ ఇండియా ఉద్యమం 1942

★ 1942లో క్రిప్స్ రాయబారం విఫలమవడంతో గాంధీజీ డూ ఆర్ డై నినాదంతో క్విట్ ఇండియా ఉద్యమన్ని ప్రారంభించారు.

★ ఈ ఉద్యమ ప్రారంభానికి ముందే ఆంధ్రాలో కర్నూలు సర్క్యులర్ / ఆంధ్రా సర్క్యులర్‌ను రూపొందించారు.

★ 1942, జులై 29న ఆంధ్రా కాంగ్రెస్ కమిటీ మచిలీపట్నంలో సమావేశమైంది.

★ నాటి ఆంధ్రా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు భోగరాజు పట్టాభిసీతారామయ్య, కార్యదర్శి కళా వెంకట్రావు.

★ కళా వెంకట్రావ్ రూపొందించిన ఉద్యమ ప్రణాళిక పత్రం కర్నూలు కాంగ్రెస్ కార్యాలయంలో దొరికింది. దీన్నే కర్నూలు సర్క్యులర్ అంటారు.

★ 1942, ఆగస్టు 8న క్విట్ ఇండియా ఉద్యమ తీర్మానం చేశారు.

★ రెండో ప్రపంచ యుద్ధ సమయంలో (1942) ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని వాల్తేరు నుంచి గుంటూరుకు మార్చారు.

★ క్విట్ ఇండియా ఉద్యమ కాలంలోనే దండు నారాయణరాజు జైల్లో మరణించారు.

★ వానమామలై వరదాచార్యులు 'పరదేశీయులు తొలగండి. ఈ భారతదేశం మా దేశం, వినండి వినండి విశ్వజనులు – విశ్వభారతి సందేశం' అనే ప్రసిద్ధ గీతాన్ని రాశారు.

★ 1942, ఆగస్టు 12న తెనాలి రైల్వేస్టేషన్‌లో ఉద్యమకారులపై పోలీసులు కాల్పులు జరపగా, ఆరుగురు చనిపోయారు. వారి సమాధులు/ స్మారక స్థూపాలు నేటి తెనాలిలోని మారీస్‌పేటలో ఉన్నాయి.

★ చీరాల, పాలకొల్లు, ఆకివీడు, గుంటూరు, భీమవరం లాంటి ప్రాంతాల్లో హింసాత్మక ఉద్యమం జరిగింది.

★ ఈ ఉద్యమ సమయంలోనే కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి - 'లేచిపోయినవి పోలీసుల టోపీలు వందలు వేలు రాబందులట్లు, కాలిపోయినవి సర్కారీ కచేరీలు ఖరదుషాణాదుల కాష్టమట్లు' అనే సుప్రసిద్ధ గీతాన్ని రాశారు.

★ మచిలీపట్నంలో వీరరాఘవయ్య, రాజమండ్రిలో వి.బి. నాగేశ్వరరావు, మదనపల్లిలో నరసింహారెడ్డి ఉద్యమాన్ని ప్రచారం చేశారు.

★ 1942, ఆగస్టు 17న కనపర్తి ఉప్పు కొఠారుపై దాడి జరిగింది. ఇంకా పెంటకోట, సూళ్లూరుపేట ఉప్పు కొఠారులపై దాడి చేశారు.

★ విజయవాడ, పాలకొల్లు పురపాలక సంఘాలను ప్రభుత్వం రద్దు చేసింది.

★ ఆంధ్రా రాడికల్ డెమొక్రటిక్ పార్టీ ప్రథమ సభ తెనాలిలో ఎం.ఎన్. రాయ్ అధ్యక్షతన జరిగింది.

★ 1942, సెప్టెంబరు 20న జగ్గయ్యపేటలో చింతామణి నాటకం తిలకిస్తున్న కృష్ణా జిల్లా మెజిస్ట్రేట్‌పై బాంబు దాడి జరిగింది.

★ 1944 నాటికి గాంధీజీ జైలు నుంచి విడుదలయ్యారు.

★ రెండో ప్రపంచ యుద్ధంలో విజయం సాధించిన ఇంగ్లండ్‌లో అట్లీ నాయకత్వంలో లేబర్ పార్టీ అధికారంలోకి వచ్చింది. అట్లీ భారతదేశానికి స్వాతంత్ర్యం ఇస్తామని ప్రకటించారు.

★ 1944లో రాజాజీ ప్రణాళిక, 1945లో వేవెల్ ప్రణాళిక, 1946లో మంత్రిత్రయ రాయబారం 1947, జూన్ 3 భారత విభజన ప్రణాళిక రూపకల్పన జరిగాయి. 1947, ఆగస్టు 15న స్వాతంత్ర్యం లభించింది.

## జమీందారీ వ్యతిరేక రైతు ఉద్యమాలు

★ 1923లో ఆచార్య ఎన్.జి. రంగా నిడుబ్రోలులో జిల్లా వ్యవసాయ కూలీల సమావేశం నిర్వహించారు. 1928లో విజయవాడలో ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘాన్ని స్థాపించారు.

★ 1929లో మాగంటి బాపినీడు రాష్ట్ర వ్యవసాయదారుల సంఘాన్ని స్థాపించారు.

★ నెల్లూరులోని వెంకటగిరి జమీందారుకు వ్యతిరేకంగా వెన్నెలకంటి రాఘవయ్య, నెల్లూరి వెంకట రామానాయుడు నాయకత్వంలో ఉద్యమం జరిగింది.

★ 1930లో వెంకట రామానాయుడు జమీన్‌రైతు పత్రికను ప్రారంభించారు. 'మా కొద్దీ జమీందారుల పొందు' అనే గీతాన్ని రాసి, స్వరపరిచింది ఆయనే.

★ మునగాల సంస్థానానికి వ్యతిరేకంగా 1931, జూన్ 11న 'మునగాల దినంగా' పాటించారు.

★ కాళీపట్నం (పశ్చిమగోదావరి జిల్లా) జమీందారుకు వ్యతిరేకంగా ఉద్యమం నడిపిన భోగరాజు పట్టాభి సీతారామయ్య జన్మభూమి అనే పత్రికను నిర్వహించారు.

★ చల్లపల్లి జమీందారుకు వ్యతిరేకంగా గొర్రెపాటి వెంకట సుబ్బయ్య ఉద్యమాన్ని నడిపారు.

★ బొబ్బిలి జమీందారుకు వ్యతిరేకంగా ఉద్యమాన్ని నిర్వహించిన గరిమెళ్ల కృష్ణమూర్తి ప్రజావాణి అనే పత్రికను నిర్వహించారు.

★ పలాస, మందస సంస్థానాల్లో రైతాంగ ఉద్యమాన్ని పూసునూరు గున్నమ్మ అనే మహిళ నిర్వహించగా 1940, ఏప్రిల్ 1న ఆమెను కాల్చి చంపారు.

★ గౌతు లచ్చన్న మందస కాల్పుల బాధితుల రక్షణ సంఘాన్ని ఏర్పాటు చేశారు.

★ 1938లో ఎన్.జి. రంగా ఇచ్ఛాపురం నుంచి మద్రాస్ వరకు రైతు పాదయాత్ర నిర్వహించారు.

★ 1948 అక్టోబరు 27న మద్రాస్ శాసన సభలో జమీందారీ విధానం రద్దు బిల్లును ప్రవేశపెట్టారు. 1949, సెప్టెంబరు 7న చట్టంగా రూపొందింది.

**రచయిత: బి. నాగరాజు**

# స్వాతంత్రోద్యమం

వందేమాతరం, హోంరూల్ ఉద్యమాలు అతివాదుల నాయకత్వంలో జరిగాయి. 1919లో భారతదేశ జాతీయోద్యమంలో చోటు చేసుకున్న కొన్ని పరిణామాలు గాంధీ యుగానికి నాంది పలికాయి. మాంటేగ్ – చెమ్స్‌ఫర్డ్ సంస్కరణలను 1919లో ప్రవేశపెట్టారు. రౌలట్ చట్టాన్ని 1919, ఏప్రిల్ 6న చేశారు. 1919, ఏప్రిల్ 13న జలియన్ వాలాబాగ్ దురంతం జరిగింది. ఇదే కాలంలో ముస్లింలు ఖిలాఫత్ ఉద్యమాన్ని ప్రారంభించారు.

★ తిలక్ మరణానంతరం (1920లో) గాంధీజీ కాంగ్రెస్‌కు నాయకుడయ్యాడు. గాంధీజీ నాయకత్వంలో సహాయ నిరాకరణ ఉద్యమం (1920 – 22), ఉప్పు సత్యాగ్రహం (1930 – 34) క్విట్ ఇండియా (1942) ఉద్యమాలు జరిగాయి.

★ ఆంధ్రదేశంలో ఈ ఉద్యమాలు పెద్ద ఎత్తున జరిగాయి. గాంధీ తొలిసారిగా 1919లో రౌలట్ సత్యాగ్రహంలో భాగంగా సికింద్రాబాద్, విజయవాడల్లో ప్రసంగించారు. విజయవాడ రాజా రామమోహన్ రాయ్ గ్రంథాలయంలో జరిగిన గాంధీ ప్రసంగాన్ని అయ్యదేవర కాళేశ్వర రావు తెలుగులోకి అనువదించారు. మద్రాసులో జరిగిన గాంధీ సభకు టంగుటూరి ప్రకాశం పంతులు అధ్యక్షత వహించారు.

### సహాయ నిరాకరణ ఉద్యమం (1920 – 22)

★ 1920 సెప్టెంబరులో కలకత్తాలో జరిగిన ప్రత్యేక కాంగ్రెస్ సమావేశంలో సహాయ నిరాకరణ ఉద్యమ తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. కానీ, కొండా వెంకటప్పయ్య ఈ తీర్మానాన్ని వ్యతిరేకించారు.

★ 1920 నాగ్‌పూర్ కాంగ్రెస్ సమావేశంలో ఉద్యమ తీర్మానం ఆమోదం పొందింది. గాంధీజీ కాంగ్రెస్ నాయకుడిగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు.

★ గాంధీజీ 1921, మార్చి 31, ఏప్రిల్ 1, 2 తేదీల్లో జరిగిన విజయవాడ కాంగ్రెస్ సమావేశాలకు హాజరయ్యారు. ఏలూరు, మచిలీపట్నం, చీరాల, నెల్లూరుల్లో పర్యటించారు.

★ 1921 అక్టోబరులో గాంధీజీ మళ్లీ ఆంధ్రాలో పర్యటించి, కర్నూలు, కడప, తిరుపతి, తాడిపత్రిల్లో ప్రసంగించారు.

★ విజయవాడ కాంగ్రెస్ సమావేశంలోనే కృష్ణాజిల్లా భట్లపెనుమర్రు గ్రామానికి చెందిన పింగళి వెంకయ్య, వీరంకి వెంకటశాస్త్రి సాయంతో త్రివర్ణ జాతీయ పతాకాన్ని రూపొందించాడు. గాంధీ ఆ జెండాలో కాషాయ రంగును, చరఖాను చేర్చారు.

★ విజయవాడ కాంగ్రెస్ సమావేశానికి తెలంగాణ నుంచి పరిశీలకుడిగా మాడపాటి హనుమంతరావు వచ్చారు.

★ తిలక్ స్వరాజ్య నిధికి యామినీ పూర్ణ తిలకం అనే ఆవిడ తన యావదాస్తిని, మాగంటి అన్నపూర్ణాదేవి తన నగలను నిలువు దోపిడీ ఇచ్చారు.

★ కూచిపూడి నృత్యకారుడైన అయ్యప్ప భాగవతార్ సహాయ నిరాకరణ ఉద్యమాన్ని ప్రచారం చేశాడు.

★ ఈ ఉద్యమ కాలంలోనే ఉన్నవ దంపతులు గుంటూరులో శారదానికేతన్‌ను స్థాపించారు.

★ మాడభూషి నరసింహాచారి 'అసహాయోద్యమ విజయం', చెరుకువాడ నరసింహం 'స్వరాజ్య దర్పణం', పీసుపాటి నరసింహ శాస్త్రి 'చీరాల – పేరాల వనవాసం' గ్రంథాలను రచించారు.

★ గుంటూరులోని తిలక్ నాటక సమాజం వారికి దామరాజు పుండరీకాక్షుడు స్వరాజ్య సోపానం, పాంచాల పరాభవం, స్వరాజ్య రథం లాంటి నాటకాలను రచించాడు.

★ అయ్యదేవర కాళేశ్వరరావు శాసనమండలికి, కొండా వెంకటప్పయ్య శాసనసభకు రాజీనామాలు చేశారు. గులాం మొహియుద్దీన్ తన మెజిస్ట్రేట్ పదవికి రాజీనామా చేశారు. వి. రామదాసు పంతులు మద్రాస విశ్వవిద్యాలయం సిండికేట్ పదవికి రాజీనామా చేశారు.

★ టంగుటూరి ప్రకాశం పంతులు, ఉన్నవ లక్ష్మీ నారాయణ, పోలిశెట్టి హనుమంతయ్య గుప్త, గొల్లపూడి సీతారామశాస్త్రి, శిష్టా పురుషోత్తమ్ లాంటివారు తమ న్యాయవాద వృత్తిని వదులుకున్నారు.

★ కొండాలి సుబ్బారావు, కల్లూరి సుబ్బారావు లాంటి 47 మంది ఉపాధ్యాయులు తమ ఉద్యోగాలను వదులుకున్నారు.

★ గరిమెళ్ల సత్యనారాయణ 'మాకొద్దీ తెల్లదొరతనం' లాంటి గీతాలను రాశారు.

★ కల్లు మానండోయ్ బాబు కళ్లు తెరవండోయ్ అంటూ మద్యపాన వ్యతిరేక ఉద్యమం జరిగింది.

## చీరాల – పేరాల ఉద్యమం

★ ఈ ఉద్యమాన్ని ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య నడిపించారు. చీరాల, పేరాల, వీర రాఘవపేట, జాంధ్రపేట గ్రామాలను ఆంగ్ల ప్రభుత్వం మున్సిపాలిటీగా ప్రకటించడంతో ఈ ఉద్యమం మొదలైంది.

★ 1921 ఫిబ్రవరిలో నాటి మద్రాసు ముఖ్యమంత్రి, పురపాలక శాఖా మంత్రి అయిన రాజా రామరాయణింగార్ చీరాలను సందర్శించారు. గాంధీజీ 1921, ఏప్రిల్ 6న చీరాలను సందర్శించి, శాంతియుత పన్నుల నిరాకరణ ఉద్యమాన్ని చేయమని సలహా ఇచ్చారు.

★ ఏప్రిల్ 25న గ్రామాలను ఖాళీచేసి, రామ్‌నగర్ అనే ఆవాసాన్ని ఏర్పాటు చేసుకున్నారు. రామదండు అనే వాలంటీర్ దళాన్ని ఏర్పాటు చేశారు.

★ 'హిమాచల్ నుంచి కన్యాకుమారి వరకు ఈ ఉద్యమం ప్రజల హృదయాలను ఆశ్చర్యపూరితం చేసింది' అని కొండా వెంకటప్పయ్య పేర్కొన్నారు.

## పల్నాడు పుల్లరి సత్యాగ్రహం (1921, సెప్టెంబరు 23)

★ అటవీ ఉత్పత్తుల వినియోగంపై ఆంగ్లేయులు పుల్లరి పన్ను విధించారు. గుంటూరు జిల్లా పల్నాడు తాలూకాలోని మాచర్ల, వెల్దుర్తి, రెంటచింతల ప్రాంత ప్రజలు ఇబ్బందులు పడ్డారు. 12 అణాల పన్నును 3 అణాలకు తగ్గించమని కోరారు.

★ మించాలపాడుకు చెందిన కన్నెగంటి హనుమంతు ఈ ఉద్యమాన్ని చేయడంతో ఆంగ్ల ప్రభుత్వం 1921, సెప్టెంబరు 23న హనుమంతును మించాలపాడు వద్ద కాల్చి చంపారు.

## పెదనందిపాడు పన్నుల నిరాకరణ ఉద్యమం

★ ఆంధ్రా శివాజీగా పేరొందిన పర్వతనేని వీరయ్య చౌదరి నాయకత్వంలో ఈ ఉద్యమం జరిగింది. వీరయ్య చౌదరి శాంతిసేన అనే వాలంటీర్ దళాన్ని ఏర్పాటు చేశాడు. అప్పటి గ్రామ ఉద్యోగుల సంఘం నాయకుడైన మాచిరాజు సత్యనారాయణ రాజు కూడా ఉద్యమంలో పాల్గొన్నాడు.

★ ఉద్యమాన్ని అణచివేయడానికి రూథర్‌ఫర్డ్‌ను ప్రత్యేక కమిషనర్‌గా ప్రభుత్వం నియమించింది. కానీ ఉద్యమం ఆగలేదు. ఇంగ్లండ్ పార్లమెంటులో కూడా ఈ ఉద్యమం చర్చకు వచ్చింది. నాటి మద్రాసు గవర్నర్ వెల్లింగ్‌టన్ 'ఆంగ్ల సామ్రాజ్య పునాదులనే కదిలించిన ఉద్యమం'గా పెదనందిపాడు ఉద్యమాన్ని అభివర్ణించాడు.

★ చివరకు ప్రభుత్వం రాజీ మార్గం కోసం రెవెన్యూ సంఘ సభ్యుడైన హేరిస్‌ను పంపింది. ఈ ఉద్యమాన్ని నిలిపివేయాల్సిందిగా గాంధీజీ కూడా కొండా వెంకటప్పయ్యకు లేఖ రాశారు. దీంతో ఉద్యమాన్ని నిలిపివేశారు.

★ 1922, ఫిబ్రవరి 5న చౌరీ – చౌరా సంఘటనతో గాంధీజీ సహాయ నిరాకరణ ఉద్యమాన్ని కూడా నిలిపివేయడంతో ఆంధ్రాలో ఈ ఉద్యమం ఆగిపోయింది.

## రంపా విప్లవం (అల్లూరి సీతారామరాజు)

★ 1922 – 24 మధ్య అల్లూరి సీతారామరాజు రంపా విప్లవాన్ని నిర్వహించాడు.

★ 1897, జులై 4న అల్లూరి విశాఖ జిల్లాలోని పాండ్రంకి గ్రామంలో మాతామహుల ఇంట జన్మించాడు. అతని స్వస్థలం పశ్చిమ గోదావరి జిల్లాలోని మోగల్లు.

★ చింతపల్లి తహశీల్దార్ బాస్టియన్, కాంట్రాక్టర్ సంతానం పిళ్లైల దౌర్జన్యాలకు వ్యతిరేకంగా సీతారామరాజు సాయుధ పోరాటాన్ని ప్రారంభించాడు.

★ రామరాజు తాండవ నదీతీరంలో నీలకంఠేశ్వరస్వామి ఆలయ ప్రాంగణంలో 'శ్రీరామ విజయనగరం' అనే ఆశ్రమాన్ని ఏర్పాటు చేసుకున్నాడు.

★ భట్టిపానుకుల గ్రామానికి చెందిన గాం మల్లుదొర, గాంగంటం దొరలతోపాటు ఎండుపడాల్, వీరయ్యదొర, అగ్గిరాజు లాంటి అనుచరులతో రంపా విప్లవాన్ని నడిపాడు.

★ అగ్గిరాజు అసలు పేరు పేరిచర్ల సూర్య నారాయణరాజు.

★ 1922, ఆగస్టు 22న చింతపల్లి పోలీస్‌స్టేషన్‌పై తొలి దాడి జరిపిన రామరాజు 1923, ఏప్రిల్ 18న అన్నవరం పోలీస్ స్టేషన్‌పై చివరి దాడి జరిపాడు.

★ రామరాజును అణచడానికి ఆంగ్ల ప్రభుత్వం బళ్లారి, మలబారు పోలీస్ దళాలను, అస్సాం రైఫిల్స్ దళాలను పంపించింది.

★ బళ్లారి పోలీసు దళానికి చెందిన స్కాట్ కోవార్డ్, హేటర్‌లను వంజేరిఘాట్, దామనపల్లి, గోకిరి మెట్ర ప్రాంతాల్లో ఎదిరించి వారిని చంపివేశారు.

★ తురుమామిడి, లక్కవరపుకోట, అడ్డతీగల, రంప చోడవరం ప్రాంతాల్లో రామరాజు దళం దాడులు జరిపింది.

★ సీతారామరాజుకు స్వాగతం పలికినందుకు అన్నవరం, శంఖవరం గ్రామాలపై ప్రభుత్వం రూ. నాలుగు వేల జరిమానా విధించింది.

★ మల్లుదొరను కీరన్స్ అనే అధికారి చంపాడు.

★ 1924, జనవరిలో రూథర్‌ఫర్డ్ నాయకత్వంలో అస్సాం రైఫిల్స్ దళం వచ్చింది.

★ 1924, మే 6న పాడేరు నదీతీరంలో సీతారామరాజును జమేదార్ కంచుమీనన్ బంధించాడు. 7న మేజర్ గుడాల్ సీతారామరాజును కాల్చి చంపాడు.

★ సీతారామరాజు సమాధి కృష్ణదేవి పేట (K.D.పేట)లో ఉంది.

★ గాంధీజీ యంగ్ ఇండియా పత్రికలో సీతారామరాజు గురించి.. 'నేను సాయుధ విప్లవాన్ని ఆమోదించలేను. కానీ ధైర్యవంతుడు, త్యాగపురుషుడు అయిన ఈ యువకుడికి జోహార్లు అర్పించకుండా ఉండలేను' అని రాశాడు.

## స్వరాజ్యపార్టీ స్థాపన

★ గాంధీజీ నిర్బంధంతో 1922 డిసెంబరులో జరిగిన కాంగ్రెస్ సమావేశంలో రెండు వర్గాలు బయలుదేరాయి.

★ 1922 గయ కాంగ్రెస్ సమావేశానికి అధ్యక్షుడు చిత్తరంజన్‌దాసు. గాంధీ అనుచరులైన రాజేంద్ర ప్రసాద్, సర్దార్ వల్లభాయ్ పటేల్ లాంటివారు మార్పుకు వ్యతిరేక వర్గంగా రూపొందగా, C.R. దాస్, మోతీలాల్ నెహ్రూ లాంటివారు మార్పుకు అనుకూల వర్గంగా రూపొంది, 1923లో స్వరాజ్యపార్టీని స్థాపించారు.

★ ఆంధ్రాలో స్వరాజ్యపార్టీ శాఖకు వి.వి. రామదాసు అధ్యక్షుడిగా, ఉన్నవ లక్ష్మీ నారాయణ కార్యదర్శిగా నియమితులయ్యారు.

★ చిత్తరంజన్‌దాస్ ఆంధ్రాలో పర్యటించి, ఎన్నికల ప్రచారం చేశారు.

★ 1924 గంజాం జిల్లా సభలో బులుసు సాంబమూర్తి, డాక్టర్ సుబ్రహ్మణ్యం స్వరాజ్య తీర్మానాన్ని ప్రవేశపెట్టారు.

★ 1926 ఎన్నికల్లో టంగుటూరి ప్రకాశం నాయకత్వంలో కాంగ్రెస్ విజయం సాధించినప్పటికీ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయలేదు. దీంతో జస్టిస్ పార్టీ డాక్టర్ సుబ్బరాయన్ ముఖ్యమంత్రిగా స్వతంత్ర ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు.

## సైమన్ కమిషన్

★ ఆంగ్ల ప్రభుత్వం 1927లో సైమన్ కమిషన్‌ను నియమించింది.

★ మాంటేగ్ – చెమ్స్‌ఫర్డ్ సంస్కరణల్లోని లోపాలను అధ్యయనం చేయడం, భారతీయ సమస్యలను తెలుసుకోవడమనే లక్ష్యాలతో ఏర్పడిన ఈ కమిషన్‌లో భారతీయులకు స్థానం కల్పించకపోవడంతో దీనికి వ్యతిరేకంగా సైమన్ కమిషన్ వ్యతిరేక ఉద్యమం జరిగింది.

- ★ 1928, ఫిబ్రవరి 3న సైమన్ కమిషన్ బొంబాయిలో దిగిన రోజున మద్రాసులో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు అధ్యక్షతన నిరసన సభ జరిగింది.
- ★ 1928, ఫిబ్రవరి 26న మద్రాసులో సైమన్ కమిషన్ వ్యతిరేక ఉద్యమం టంగుటూరి ప్రకాశం పంతులు అధ్యక్షతన జరిగింది.
- ★ పోలీసు కాల్పుల్లో పార్థసారథి అనే వ్యక్తి మరణించాడు. అతడిని తీసుకురావడానికి వెళుతున్న ఉద్యమకారులపై పోలీసులు తుపాకులు ఎక్కుపెట్టారు. టంగుటూరి తుపాకులకు తన గుండెను ఎదురొడ్డినందుకు ఆయన్ని 'ఆంధ్రకేసరి' అని ప్రజలు నినదించారు.
- ★ సైమన్ కమిషన్ విజయవాడ రైల్వేస్టేషన్‌లో దిగినప్పుడు నాటి విజయవాడ మున్సిపల్ ఛైర్మన్ అయ్యదేవర కాళేశ్వరరావు సైమన్ గోబ్యాక్ అనే నినాదం ఉన్న చీటీని పంపాడు.
- ★ సైమన్ కమిషన్ బహిష్కరణ ఉద్యమాన్ని నిర్వహించిన బులుసు సాంబమూర్తిని ఆంగ్ల ప్రభుత్వం నిర్బంధించింది.

**రచయిత: బి. నాగరాజు**

# భారతదేశ చరిత్ర

1. రెండో మైసూరు యుద్ధం ఏ సంధితో ముగిసింది?
   1) ఎక్స్–లా–చాపెల్ సంధి
   2) శ్రీరంగపట్నం సంధి
   3) మంగళూరు సంధి
   4) అమృత్‌సర్ సంధి

2. మద్రాస్‌లోని సెయింట్ జార్జి కోట ఎవరిది?
   1) ఫ్రెంచివారిది 2) ఇంగ్లిష్‌వారిది 3) డచ్చివారిది 4) పోర్చుగీసువారిది

3. టిప్పు సుల్తాన్ స్వేచ్ఛా వృక్షాన్ని ఎక్కడ నాటించాడు?
   1) కడలూరు 2) మంగళూరు 3) శ్రీరంగపట్నం 4) దిండిగల్

4. బెంగాల్ గవర్నర్ జనరల్ హోదాను 'గవర్నర్ జనరల్ ఆఫ్ ఇండియా'గా ఏ చట్టం ద్వారా మార్చారు?
   1) 1833 చార్టర్ చట్టం
   2) 1835 చట్టం
   3) 1813 చార్టర్ చట్టం
   4) 1878 చట్టం

5. హైదరాబాద్ నిజాం, నిజాం–ఉల్–ముల్క్ ఏ సంవత్సరంలో మరణించాడు?
   1) 1746 2) 1744 3) 1748 4) 1758

6. మూడో పానిపట్టు యుద్ధం ఏ సంవత్సరంలో జరిగింది?
   1) 1521 2) 1556 3) 1764 4) 1761

7. సాంస్కృతిక పునరుజ్జీవ పితామహుడు అని ఎవరినంటారు?
   1) దేవేంద్రనాథ్ ఠాగూర్
   2) రాజా రామమోహన్‌రాయ్
   3) కేశవ చంద్రసేన్
   4) దయానంద సరస్వతి

8. బ్రహ్మ సమాజ స్థాపకుడు ఎవరు?
   1) కేశవ చంద్రసేన్
   2) రాజా రామమోహన్‌రాయ్
   3) హరిహరానంద్
   4) దేవేంద్రనాథ్ ఠాగూర్

9. తత్వబోధిని సభను నెలకొల్పింది ఎవరు?
   1) దేవేంద్రనాథ్ ఠాగూర్
   2) సుబ్రహ్మణ్యశాస్త్రి
   3) కేశవ చంద్రసేన్
   4) రాజా రామమోహన్‌రాయ్

10. భారతదేశానికి సముద్ర మార్గాన్ని కనుకున్నదెవరు?
   1) హెన్రీ 2) కొలంబస్ 3) వాస్కోడిగామా 4) మాజిలాన్

11. కాన్‌స్టాంట్‌నోపుల్‌ను తురుష్కులు ఏ సంవత్సరంలో ఆక్రమించారు?
   1) 1453 2) 1653 3) 1353 4) 1553

12. గులాంగిరి గ్రంథ రచయిత ఎవరు?
   1) తులసీరామ్ 2) బెహరాంజి 3) రాధాకాంత్‌దేవ్ 4) జ్యోతిబా పూలే

13. సైన్య సహకార ఒప్పందాన్ని అంగీకరించిన తొలి స్వదేశీ రాజు ఎవరు?
   1) వాజిద్ అలీషా 2) బహదూర్ ఖాన్ 3) నిజాం అలీ 4) కున్వర్ సింగ్

**14.** ప్లాసీ యుద్ధం ఏ సంవత్సరంలో జరిగింది?

1) 1764 2) 1857 3) 1756 4) 1757

**15.** శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతిని ప్రవేశపెట్టిన గవర్నర్ జనరల్ ఎవరు?

1) వారన్ హేస్టింగ్స్ 2) వెల్లస్లీ 3) కారన్ వాలీస్ 4) డల్హౌసీ

**16.** బక్సార్ యుద్ధం ఏ సంవత్సరంలో జరిగింది?

1) 1757 2) 1761 3) 1756 4) 1764

**17.** 1857 సిపాయిల తిరుగుబాటుకు తక్షణ కారణం?

1) సైన్యసహకార ఒప్పందాలు 2) ఎన్‌ఫీల్డ్ తుపాకీ మందు

3) శాశ్వత శిస్తు విధానం 4) దివానీ హక్కు

**18.** భారతదేశ మొదటి వైస్రాయ్‌గా నియమితులైంది?

1) డల్హౌసీ 2) బెంటింక్ 3) కానింగ్ 4) రిప్పన్

**19.** మూడో పానిపట్టు యుద్ధం ఏ సంవత్సరంలో జరిగింది?

1) 1761 2) 1764 3) 1757 4) 1759

**20.** డివైన్ కామెడీ గ్రంథ రచయిత ఎవరు?

1) పెట్రార్క్ 2) డాంటే 3) విరాస్మస్ 4) బేకన్

**21.** అచ్చు యంత్రాన్ని కనుక్కున్నది?

1) థామస్ మోర్ 2) జాన్ విక్లిఫ్ 3) జాన్ గూటెన్‌బర్గ్ 4) ఫ్రాన్సిస్ డ్రేక్

**22.** చివరి మొగల్ చక్రవర్తి ఎవరు?

1) షా ఆలం 2) రెండో బహదూర్‌షా

3) ఖాన్ బహదూర్ ఖాన్ 4) మీర్ ఖాసిం

**23.** రాజా రామమోహన్‌రాయ్ ఎక్కడ మరణించారు?

1) లాంక్‌షైర్ 2) లండన్ 3) బ్రిస్టల్ 4) పారిస్

**24.** బ్రహ్మధర్మం గ్రంథ రచయిత ఎవరు?

1) దేవేంద్రనాథ్ ఠాగూర్ 2) అక్షయ కుమార్

3) రామచంద్ర 4) రాధాకాంత్‌దేవ్

**25.** సంవాద కౌముది, మిరాత్-ఉల్-అక్బర్ పత్రికలను ప్రారంభించింది?

1) కేశవ చంద్రసేన్ 2) రాధాకాంత్‌దేవ్

3) తారాచంద్ 4) రాజా రామమోహన్‌రాయ్

**26.** వివేకవర్ధిని పత్రికను ప్రారంభించింది?

1) కందుకూరి వీరేశలింగం 2) దయానంద సరస్వతి

3) చిలకమర్తి లక్ష్మీనరసింహం 4) కేశవ చంద్రసేన్

**27.** కందుకూరి వీరేశలింగం భార్య పేరు ఏమిటి?

1) అన్నపూర్ణాదేవి 2) రాజ్యలక్ష్మి 3) సుబ్బమ్మ 4) లక్ష్మీబాయమ్మ

**28.** ప్రార్థనా సమాజ స్థాపకుడు ఎవరు?

1) ఆనందమోహన్ బోస్
2) లాలా హంసరాజ్
3) ఆత్మారాం పాండురంగ
4) దయానంద సరస్వతి

**29.** 1875, ఏప్రిల్ 10న ఆర్యసమాజాన్ని స్థాపించింది ఎవరు?

1) విరజానందుడు
2) దయానంద సరస్వతి
3) కేశవ చంద్రసేన్
4) దేవేంద్రనాథ్ ఠాగూర్

**30.** దయానంద సరస్వతి ఎవరి వద్ద శిష్యరికం చేశారు?

1) తోతాపురి
2) అక్షయ కుమార్
3) రాధాకాంత్‌దేవ్
4) విరజానంద

**31.** వేదభాష్య భూమిక, సత్యార్థ ప్రకాశ్, వేద భాష్య గ్రంథ రచయిత ఎవరు?

1) అనిబిసెంట్
2) దయానంద సరస్వతి
3) కేశవ చంద్రసేన్
4) ఆత్మారాం పాండురంగ

**32.** ఆర్య సమాజ సిద్ధాంత ప్రచారానికి దయానంద సరస్వతి ఉపయోగించిన భాష ఏది?

1) ఇంగ్లిష్
2) హిందీ
3) పంజాబీ
4) గుజరాతీ

**33.** రామకృష్ణ పరమహంస అసలు పేరు?

1) గదాధరుడు
2) నరేంద్రనాథ్
3) వివేకానంద
4) విరజానంద

**34.** శుద్ధి ఉద్యమాన్ని ప్రారంభించింది ఎవరు?

1) రాజా రామమోహన్‌రాయ్
2) దయానంద సరస్వతి
3) వివేకానంద
4) కేశవ చంద్రసేన్

**35.** వేదయుగాలకు తరలిపొండి అనే నినాదం ఎవరిది?

1) వివేకానంద
2) రామకృష్ణ పరమహంస
3) ఆత్మరాం పాండురంగ
4) దయానంద సరస్వతి

**36.** దక్షిణేశ్వర యోగిగా ప్రసిద్ధి చెందింది?

1) ఈశ్వరచంద్ర విద్యాసాగర్
2) రామకృష్ణ పరమహంస
3) చిలకమర్తి లక్ష్మీనరసింహం
4) వివేకానంద

**37.** నదులన్నీ సముద్రంలోకి సంగమించినట్టు మతాలన్నీ భగవంతుడిలో లీనమవుతాయని ప్రవచించింది ఎవరు?

1) వివేకానంద
2) రామకృష్ణ పరమహంస
3) దయానంద సరస్వతి
4) వీరెవరూ కాదు

**38.** మానవ సేవే మాధవ సేవ అనే లక్ష్యంతో పని చేసింది ఎవరు?

1) రామకృష్ణ మఠం
2) దివ్యజ్ఞాన సమాజం
3) ఆర్య సమాజం
4) బ్రహ్మ సమాజం

**39.** వివేకానంద అసలు పేరు?

1) మూల్‌శంకర్
2) నరేంద్రనాథ్ దత్తా
3) గదాధరుడు
4) వీరేంద్రనాథ్ దత్తా

**40.** ప్రబుద్ధ భారతి, ఉద్బోధన పత్రికలు స్థాపించింది ఎవరు?

1) వివేకానంద 2) డి.కె. కార్వే
3) మహాదేవ గోవింద రనడే 4) గోపాలకృష్ణ గోఖలే

**41.** 1897లో రామకృష్ణ మిషన్‌ను వివేకానంద ఎక్కడ స్థాపించారు?

1) ఏలూరు 2) బేలూరు 3) మదనపల్లి 4) మైసూరు

**42.** భారతదేశ గ్రామాల్లోని పేదరికాన్ని హిందీ రచనల్లో తెలియజేసింది?

1) కె.వి. పుట్టప్ప 2) మహ్మద్ ఇక్బాల్ 3) హరినారాయణ 4) ప్రేమ్‌చంద్

**43.** మన దేశంలో మొట్టమొదటి వైద్య విద్యార్థి ఎవరు?

1) సి.వి. రామన్ 2) జగదీష్ చంద్రబోస్
3) మహేంద్రలాల్ సర్కార్ 4) హరగోవింద్ ఖొరానా

**44.** కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలాన్ని ఆంగ్లంలోకి తర్జుమా చేసింది ఎవరు?

1) కర్జన్ 2) విలియం జోన్స్ 3) మాక్స్ ముల్లర్ 4) మార్షల్

**45.** మన దేశంలో మొదటి నూలు మిల్లును 1853లో ఎక్కడ ప్రారంభించారు?

1) కలకత్తా 2) బొంబాయి 3) మద్రాస్ 4) బెంగళూరు

**46.** ఆలీఘర్ ఉద్యమ ప్రారంభకుడు ఎవరు?

1) సర్ సయ్యద్ అహ్మద్‌ఖాన్ 2) ఆగాఖాన్
3) అబ్దుల్ లతీఫ్ 4) నాసిరుద్దౌలా

**47.** 1873లో సత్యశోధన్ సమాజాన్ని స్థాపించింది ఎవరు?

1) రఘునాథరావు 2) జ్యోతిబా పూలే 3) రాధాకాంత్‌దేవ్ 4) దీన్‌దయాళ్

**48.** జ్యోతిబా పూలే భార్య పేరు ఏమిటి?

1) సావిత్రిబాయి 2) కమలాబాయి 3) రుక్మిణీబాయి 4) పూర్ణాబాయి

**49.** 'తండ్రిని సమీపించే బిడ్డకు మధ్యవర్తి అవసరం లేనట్లే భగవంతుని చేరడానికి పురోహితుడు అవసరం లేదు' అని పేర్కొన్నది ఎవరు?

1) జ్యోతిబా పూలే 2) వివేకానంద 3) బి.ఆర్. అంబేద్కర్ 4) దయానంద సరస్వతి

**50.** గాంధీ – ఇర్విన్ ఒప్పందంలో భాగంగా శాసనోల్లంఘన ఉద్యమాన్ని నిలిపివేయడాన్ని తీవ్రంగా వ్యతిరేకించిన వ్యక్తి?

1) సుభాష్‌చంద్ర బోస్ 2) సి. రాజగోపాలాచారి
3) మోతీలాల్ నెహ్రూ 4) సర్దార్ వల్లభాయ్ పటేల్

**జవాబులు**

1-3; 2-2; 3-3; 4-1; 5-3; 6-4; 7-2; 8-2; 9-1; 10-3; 11-1; 12-4; 13-3; 14-4; 15-3; 16-4; 17-2; 18-3; 19-1; 20-2; 21-3; 22-2; 23-3; 24-1; 25-4; 26-1; 27-2; 28-3; 29-2; 30-4; 31-2; 32-2; 33-1; 34-2; 35-4; 36-2; 37-2; 38-1; 39-2; 40-1; 41-2; 42-4; 43-3; 44-2; 45-2; 46-1; 47-2; 48-1; 49-1; 50-1.

**రచయిత: అమరనేని కృష్ణ**

# భారతదేశ చరిత్ర

## సాంఘిక, మత సంస్కరణలు ఉద్యమాలు

**1.** 1828లో బ్రహ్మసమాజాన్ని స్థాపించింది ఎవరు?

1) దయానంద సరస్వతి
2) కేశవ చంద్రసేన్
3) దేవేంద్రనాథ్ ఠాగూర్
4) రాజా రామ్ మోహన్‌రాయ్

**2.** బ్రహ్మ సమాజానికి కార్యదర్శిగా పని చేసిన వ్యక్తి ఎవరు?

1) కేశవ చంద్రసేన్
2) రామచంద్ర విద్యావాగీష్
3) దేవేంద్రనాథ్ ఠాగూర్
4) తారాచంద్

**3.** రాజా రామ్ మోహన్‌రాయ్ కృషి ఫలితంగా 1829లో సతి విధానాన్ని రద్దు చేసింది ఎవరు?

1) విలియం జోన్స్
2) విలియం స్లీమెన్
3) విలియం బెంటింక్
4) లార్డ్ డల్హౌసీ

**4.** రాయ్ జీవిత కథను రాసింది ఎవరు?

1) సోఫియా డాబ్సన్ కోలెట్
2) విలియం డిగ్బీ
3) హెన్రీ డెరోజియో
4) తారాచంద్

**5.** బ్రహ్మధర్మం అనే గ్రంథాన్ని రచించింది ఎవరు?

1) దేవేంద్రనాథ్ ఠాగూర్
2) ద్వారకానాథ్ ఠాగూర్
3) రవీంద్రనాథ్ ఠాగూర్
4) ఎవరూ కాదు

**6.** 1872లో స్వదేశస్తుల వివాహ చట్టం రావడానికి కృషి చేసిన భారతీయుడు ఎవరు?

1) రాజా రామ్ మోహన్‌రాయ్
2) కేశవ చంద్రసేన్
3) ఈశ్వరచంద్ర విద్యాసాగర్
4) రామచంద్ర విద్యావాగీష్

**7.** భారతదేశంలో తొలి కార్మిక పత్రిక 'శ్రమజీవి'ని ఎవరు స్థాపించారు?

1) బాబూ శశిపాద బెనర్జీ
2) కేశవ చంద్రసేన్
3) ఆత్మారాం పాండురంగ
4) ఈశ్వరచంద్ర విద్యాసాగర్

**8.** ఈశ్వరచంద్ర విద్యాసాగర్ కృషి ఫలితంగా చేసిన చట్టం?

1) సతి రద్దు చట్టం
2) బాల్య వివాహాల నిషేధ చట్టం
3) నరబలి రద్దు చట్టం
4) వితంతు పునర్వివాహ చట్టం

**9.** భారతదేశంలో తొలి వితంతు పునర్వివాహం 1856లో ఏ నగరంలో జరిగింది?

1) రాజమండ్రి
2) కాకినాడ
3) కలకత్తా
4) బొంబాయి

**10.** దక్కన్ ఎడ్యుకేషనల్ సొసైటీని స్థాపించింది ఎవరు?

1) ఆత్మారాం పాండురంగ
2) ఎం.జి. రనడే
3) ఆర్.జి. భండార్కర్
4) పండిత రమాబాయి

**11.** 1873లో సాధారణ ధర్మసభను స్థాపించింది ఎవరు?

1) ఆనందమోహన్ బోస్ 2) కేశవ చంద్రసేన్

3) బాబూ శశిపాద బెనర్జీ 4) శివనాథ శాస్త్రి

**12.** సులభ్ సమాచార్ పత్రికను నడిపింది ఎవరు?

1) బాబూ శశిపాద బెనర్జీ 2) కేశవ చంద్రసేన్

3) దేవేంద్రనాథ్ ఠాగూర్ 4) ఎవరూ కాదు

**13.** వితంతు వివేకం, బెంగాల్ చరిత్ర లాంటి గ్రంథాలను రచించింది ఎవరు?

1) ఈశ్వరచంద్ర విద్యాసాగర్ 2) రాజా రామ్ మోహన్‌రాయ్

3) కేశవ చంద్రసేన్ 4) శశిపాద బెనర్జీ

**14.** దేవదాసీ వ్యవస్థ నిర్మూలనకు కృషి చేసింది ఎవరు?

1) కేశవ చంద్రసేన్ 2) రఘుపతి వెంకటరత్నం నాయుడు

3) కందుకూరి వీరేశలింగం 4) సత్యమూర్తి

**15.** బొంబాయిలో 'శారదాసదన్'ను స్థాపించింది ఎవరు?

1) సావిత్రిబాయి పూలే 2) పండిత రమాబాయి సరస్వతి

3) తారాబాయి షిండే 4) ఉన్నవ లక్ష్మీబాయమ్మ

**16.** 'లోకహితవాది'గా పేరొందిన వ్యక్తి ఎవరు?

1) రఘుపతి వెంకటరత్నం 2) రఘుపతి వెంకయ్య

3) కందుకూరి వీరేశలింగం 4) గోపాల్ హరిదేశ్‌ముఖ్

**17.** కిందివారిలో విభిన్నమైన వారిని గుర్తించండి.

1) డి.కె. కార్వే 2) ఆత్మారాం పాండురంగ

3) ఎం.జి. రనడే 4) ఆర్.జి. భండార్కర్

**18.** 'వేదాలకు మరలండి' అనే నినాదాన్ని ఇచ్చినవారు?

1) స్వామి వివేకానంద 2) స్వామి విరజానంద

3) స్వామి దయానంద 4) రాజా రామ్ మోహన్‌రాయ్

**19.** దయానంద సరస్వతికి సంబంధించి సరికానిది ఏది?

1) సత్యార్థ ప్రకాశిక గ్రంథాన్ని రచించారు

2) సాంఘిక శుద్ధి ఉద్యమాన్ని నడిపారు

3) బోధనలు హిందీలో, రచనలు సంస్కృతంలో సాగాయి

4) అన్నీ సరైనవే

**20.** ఆర్య సమాజ గురుకులశాఖ ప్రధాన కేంద్రం ఏది?

1) కేధారినాథ్ 2) హరిద్వార్ 3) లాహోర్ 4) గంగోత్రి

**21.** దయానందుడి అనంతరం ఆర్య సమాజాన్ని నడిపింది, నాయకత్వం వహించింది ఎవరు?

1) లాలా లజపతిరాయ్ 2) లాలా హంసరాజ్

3) స్వామి విరజానంద 4) స్వామి శ్రద్ధానంద

**22.** 'పురోహితులు మహా అపవిత్రులు, పండితులు పురోహితుల కన్నా భ్రష్టులు, అజ్ఞానులు' అన్నదెవరు?

1) స్వామి శ్రద్ధానంద 2) లాలా లజపతిరాయ్

3) గోపాల్ హరిదేశ్‌ముఖ్ 4) ఎం.జి. రనడే

**23.** దయానంద్ ఆంగ్లో వైదిక కళాశాలను ఎక్కడ స్థాపించారు?

1) హరిద్వార్ 2) లాహోర్ 3) పెషావర్ 4) అడయార్

**24.** 'నదులన్నీ సముద్రంలో కలిసినట్లే, మతాలన్నీ భగవంతుడిలో విలీనమవుతాయి' అన్నదెవరు?

1) స్వామి దయానంద 2) స్వామి వివేకానంద

3) రామకృష్ణ పరమహంస 4) అనిబిసెంట్

**25.** 'ప్రబుద్ధ భారత్' అనే ఆంగ్ల పత్రికను నిర్వహించింది ఎవరు?

1) స్వామి వివేకానంద 2) రామకృష్ణ పరమహంస

3) శిశిర్‌కుమార్ ఘోష్ 4) కేశవ చంద్రసేన్

**26.** 1878లో సాధారణ బ్రహ్మ సమాజాన్ని స్థాపించింది ఎవరు?

1) శివనాథశాస్త్రి 2) ఆనంద్‌మోహన్ బోస్

3) శివనాథశాస్త్రి, ఆనంద్‌మోహన్ బోస్ 4) ఎవరూ కాదు

**27.** 1875లో అమెరికాలోని ఏ నగరంలో దివ్యజ్ఞాన సమాజాన్ని స్థాపించారు?

1) శాన్‌ఫ్రాన్సిస్కో 2) వాషింగ్టన్ 3) న్యూయార్క్ 4) మిసిసిపి

**28.** అలీఘర్ ఉద్యమాన్ని నిర్వహించింది ఎవరు?

1) సర్ సయ్యద్ అహ్మద్‌ఖాన్ 2) నవాబ్ అబ్దుల్ లతీఫ్

3) ధర్మ్‌నిజామి 4) షరియతుల్లా

**29.** 'సుందర భారత వధువుకు హిందువులు, ముస్లింలు రెండు కన్నుల లాంటి వారు' అన్నదెవరు?

1) జిన్నా 2) సయ్యద్ అహ్మద్‌ఖాన్

3) మహ్మద్ ఇక్బాల్ 4) మౌలానా అబ్దుల్ కలాం

**30.** నామ్‌ధారీ ఉద్యమానికి నాయకుడు ఎవరు?

1) భాయి దయాల్‌సింగ్ 2) భాయి దర్బార్‌సింగ్

3) భాయి రాంసింగ్ 4) భాయి సుందర్‌సింగ్

**31.** ఆత్మగౌరవ ఉద్యమాన్ని ప్రారంభించిందెవరు?

1) పి. త్యాగరాయ చెట్టి 2) జ్యోతిరావు పూలే

3) రామస్వామి నాయకర్ 4) అంబేడ్కర్

**32.** 'ఒకే మతం, ఒకే కులం, ఒకే దైవం' అనే విధానాన్ని ప్రచారం చేసింది ఎవరు?

1) రాజా రామ్ మోహన్‌రాయ్ 2) స్వామి దయానంద సరస్వతి

3) స్వామి వివేకానంద 4) ఎవరూ కాదు

**33.** 1924లో వైకోం సత్యాగ్రహాన్ని నిర్వహించింది?

1) అంబేడ్కర్ 2) జ్యోతిరావు పూలే

3) నారాయణగురు 4) పెరియార్ రామస్వామి నాయకర్

**34.** 'గులాంగిరి' గ్రంథాన్ని రచించింది ఎవరు?

1) జ్యోతిరావు పూలే
2) బి.ఆర్. అంబేడ్కర్
3) భాగ్యరెడ్డి వర్మ
4) ఓంప్రకాశ్ వాల్మీకి

**35.** 1848లో తొలి బాలికా పాఠశాలను ఎక్కడ ప్రారంభించారు?

1) రాజమండ్రి
2) ధవళేశ్వరం
3) బొంబాయి
4) పుణె

**36.** 'తహరీఖ్ ఉల్ అఖ్లాక్' అనే పత్రికను ఎవరు నిర్వహించారు?

1) నవాబ్ అబ్దుల్ లతీఫ్
2) థియోడర్ బెక్
3) దాదాభాయ్ నౌరోజీ
4) సయ్యద్ అహ్మద్‌ఖాన్

**37.** 'నేను సోషలిస్ట్'ని అని ప్రకటించుకున్న తొలి భారతీయుడు ఎవరు?

1) ఎం.ఎన్. రాయ్
2) జయప్రకాశ్ నారాయణ్
3) స్వామి వివేకానంద
4) సుభాష్ చంద్రబోస్

**38.** రహస్య సిద్ధాంతం అనే గ్రంథాన్ని రచించింది?

1) అనిబిసెంట్
2) జిడ్డు కృష్ణమూర్తి
3) జి.ఎస్. అరుండేల్
4) మేడం బ్లావెట్‌స్కీ

**39.** వేద సమాజాన్ని దక్షిణ భారత బ్రహ్మ సమాజంగా రూపొందించింది ఎవరు?

1) మన్నవ బుచ్చయ్య పంతులు
2) కందుకూరి వీరేశలింగం
3) శ్రీధర నాయుడు
4) దేశిరాజు పెదబాపయ్య

**40.** అకాలీదళ్‌ను ఎప్పుడు స్థాపించారు?

1) 1910
2) 1920
3) 1924
4) 1930

**41.** సమాధులు, స్మశానాలను ధ్వంసం చేస్తూ, కసాయి వారిని హత్య చేసిన సిక్కు ఉద్యమం ఏది?

1) నామ్‌ధారీ
2) నిరంకారీ
3) కూకా
4) అకాలీదళ్

**42.** 1888లో బొంబాయిలో 'మహాత్మ' బిరుదుతో సత్కారం అందుకున్న వ్యక్తి ఎవరు?

1) గాంధీజీ
2) జ్యోతిరావు పూలే
3) గోపాల్ హరిదేశ్‌ముఖ్
4) ఎవరూ కాదు

**43.** 'కుడి అరశు' అనే వారపత్రికను నడిపింది ఎవరు?

1) జ్యోతిరావు పూలే
2) రామస్వామి నాయకర్
3) నారాయణ గురు
4) అంబేడ్కర్

**44.** 1901లో కోరేగావ్ రైల్వేస్టేషన్‌లో కులవివక్ష ఎదుర్కొన్న వ్యక్తి ఎవరు?

1) అంబేడ్కర్
2) ఓంప్రకాశ్ వాల్మీకి
3) జ్యోతిరావు పూలే
4) భాగ్యరెడ్డి వర్మ

**45.** 'జుతాన్' అనే పేరుతో ఆత్మకథను రాసుకున్నది ఎవరు?

1) అంబేడ్కర్
2) ఓంప్రకాశ్ వాల్మీకి
3) జ్యోతిరావు పూలే
4) రామస్వామి నాయకర్

**46.** 1944లో ద్రవిడ కజగం (DK) పార్టీని స్థాపించింది?

1) రామస్వామి నాయకర్ 2) అన్నాదురై

3) కరుణానిధి 4) పి. త్యాగరాయ చెట్టి

**47.** కులప్రసక్తి లేని దేవాలయాలను నిర్మించింది ఎవరు?

1) రామస్వామి నాయకర్ 2) రామానుజాచార్యులు

3) రామానందుడు 4) నారాయణ గురు

**48.** 'శ్రామిక కులాలైన శూద్రులు, అంటరాని కులాలైన అతిశూద్రులు కలిసి పోరాడితేనే కుల వివక్ష పోతుంది' అన్నదెవరు?

1) జ్యోతిరావు పూలే 2) అంబేడ్కర్

3) ఓంప్రకాశ్ వాల్మీకి 4) బాతుల వెంకట్రావ్

**49.** 1873లో సత్యశోధక సమాజాన్ని స్థాపించింది ఎవరు?

1) జ్యోతిరావు పూలే 2) అంబేడ్కర్

3) ఓంప్రకాశ్ వాల్మీకి 4) నారాయణ గురు

**50.** 1903లో 'నారాయణ ధర్మ పరిపాలనా యోగం' సంస్థను స్థాపించింది ఎవరు?

1) జ్యోతిరావు పూలే 2) నారాయణ గురు

3) రామస్వామి నాయకర్ 4) స్వామి దయానంద సరస్వతి

**51.** ఎగువ కులంలో సంస్కరణోద్యమాన్ని ప్రారంభించింది ఎవరు?

1) జ్యోతిరావు పూలే 2) నారాయణ గురు

3) రామస్వామి నాయకర్ 4) అంబేడ్కర్

**52.** ఇండిపెండెంట్ లేబర్ పార్టీని స్థాపించింది ఎవరు?

1) అంబేడ్కర్ 2) సుభాష్ చంద్రబోస్

3) జవహర్‌లాల్ నెహ్రూ 4) లార్డ్ అట్లీ

**53.** రాజా రామ్ మోహన్‌రాయ్ మరణానంతరం ఎవరి ఆర్థిక సహకారంతో బ్రహ్మ సమాజాన్ని నిర్వహించారు?

1) దేవేంద్రనాథ్ ఠాగూర్ 2) సత్యేంద్రనాథ్ ఠాగూర్

3) రామచంద్ర విద్యావాగీష్ 4) ద్వారకనాథ్ ఠాగూర్

**54.** 1929 నాటి శారదా చట్టం ప్రకారం బాలికలు, బాలుర వివాహ వయసెంత?

1) 12, 14 2) 14, 16 3) 18, 21 4) 10, 12

**55.** పాట్నా, కలకత్తాల్లో ముస్లిం పాఠశాలలు (మదర్సాలు) స్థాపించింది ఎవరు?

1) సావిత్రిబాయి పూలే 2) రమాబాయి సరస్వతి

3) తారాబాయి షిండే 4) రోకియా సఖావత్

**56.** యంగ్ బెంగాల్ ఉద్యమాన్ని నిర్వహించింది ఎవరు?

1) హెన్రీ డెరీజియో 2) రాజా రామ్ మోహన్‌రాయ్

3) డేవిడ్ హేర్ 4) అలెగ్జాండర్ డఫ్

**57.** కింది అంశాలను జతపరచండి.

i) సంవాద కౌముది — a) కేశవ చంద్రసేన్

ii) సులభ్ సమాచార్ — b) రాజా రామ్ మోహన్‌రాయ్

iii) తత్వబోధిని — c) రఘుపతి వెంకటరత్నం

iv) బ్రహ్మ ప్రకాశిక — d) దేవేంద్రనాథ్ ఠాగూర్

1) i-a, ii-b, iii-c, iv-d 2) i-b, ii-a, iii-d, iv-c

3) i-d, ii-c, iii-b, iv-a 4) i-c, ii-d, iii-a, iv-b

**58.** సంగత్‌సభ (సంగీత సభ)ను ప్రారంభించింది ఎవరు?

1) రాజా రామ్ మోహన్‌రాయ్ 2) దేవేంద్రనాథ ఠాగూర్

3) కేశవ చంద్రసేన్ 4) ఈశ్వరచంద్ర విద్యాసాగర్

**జవాబులు**

1-4; 2-4; 3-3; 4-1; 5-1; 6-2; 7-1; 8-4; 9-3; 10-2; 11-3; 12-2; 13-1; 14-2; 15-2; 16-4; 17-1; 18-3; 19-2; 20-2; 21-4; 22-3; 23-2; 24-3; 25-1; 26-3; 27-3; 28-1; 29-2; 30-3; 31-3; 32-4; 33-4; 34-1; 35-4; 36-4; 37-3; 38-4; 39-3; 40-2; 41-3; 42-2; 43-2; 44-1; 45-2; 46-2; 47-4; 48-1; 49-1; 50-2; 51-2; 52-1; 53-4; 54-2; 55-4; 56-1; 57-2; 58-3.

**రచయిత: బి. నాగరాజు**

# భారతదేశ చరిత్ర

## భారత జాతీయోద్యమం

**1.** భారతదేశంలో ఏర్పడిన తొలి రాజకీయ సంస్థ ఏది?

1) అకడెమిక్ అసోసియేషన్

2) బెంగాల్ భూస్వాముల సంఘం

3) బెంగాల్ బ్రిటిష్ ఇండియా సంఘం

4) బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్ ఆఫ్ బెంగాల్

**2.** అకడెమిక్ అసోసియేషన్‌ను స్థాపించింది ఎవరు?

1) హెన్రీ డిరోజియో 2) చార్లెస్ డికెన్స్

3) థియోడర్ డికెన్స్ 4) సురేంద్రనాథ్ బెనర్జీ

**3.** కింది సంస్థలను, వాటి స్థాపక సంవత్సరాలతో జత చేయండి.

I) బెంగాల్ బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్ A) 1870

II) బొంబాయి అసోసియేషన్ B) 1853

III) మద్రాస్ నేటివ్ అసోసియేషన్ C) 1852

IV) పూనా సార్వజనిక సభ D) 1851

1) I-A, II-B, III-C, IV-D 2) I-B, II-A, III-D, IV-C

3) I-C, II-B, III-D, IV-A 4) I-D, II-C, III-B, IV-A

**4.** లండన్ ఇండియన్ అసోసియేషన్‌ను స్థాపించింది ఎవరు?

1) సురేంద్రనాథ్ బెనర్జీ 2) దాదాభాయ్ నౌరోజీ

3) ఎం.జి. రనడే 4) విలియం వెడ్డర్‌బర్న్

**5.** 1876లో సురేంద్రనాథ్ బెనర్జీ ఎవరితో కలిసి ఇండియన్ అసోసియేషన్‌ను స్థాపించారు?

1) జి.వి. జోషి 2) ఆనందమోహన్ బోస్

3) శిశిర్‌కుమార్ ఘోష్ 4) కె.టి. తెలాంగ్

**6.** 1884లో మద్రాస్ మహాజన సభను స్థాపించింది ఎవరు?

1) సుబ్రహ్మణ్య అయ్యర్ 2) సుబ్రహ్మణ్య భారతి

3) వాంఛి అయ్యర్ 4) గాజుల లక్ష్మీనరసు

**7.** ఆధునిక జాతీయతాభావ పితామహుడిగా ప్రసిద్ధిగాంచిన వ్యక్తి ఎవరు?

1) గాంధీజీ 2) స్వామి దయానంద

3) స్వామి వివేకానంద 4) దాదాభాయ్ నౌరోజీ

**8.** 'ఇల్బర్ట్ బిల్లు భారతీయులకు నేర్పిన గుణపాఠాన్ని విద్యావంతులైన భారతీయులెవరూ మర్చిపోరు' అని వ్యాఖ్యానించింది ఎవరు?

1) క్రిస్టోదాస్ పాల్ 2) సురేంద్రనాథ్ బెనర్జీ

3) దాదాభాయ్ నౌరోజీ 4) థాంప్సన్ గారట్

**9.** 1883లో కలకత్తాలో ఇండియన్ నేషనల్ కాన్ఫరెన్స్ నిర్వహించింది ఎవరు?

1) ఎ.ఒ. హ్యూమ్ 2) గోపాలకృష్ణ గోఖలే

3) సురేంద్రనాథ్ బెనర్జీ 4) పండిత అయోధ్యనాథ్

**10.** భారత జాతీయ కాంగ్రెస్‌కు సంబంధించి సరికానిది?

1) రక్షక కవాట సిద్ధాంతాన్ని అమలు చేయడానికి హ్యూమ్ కాంగ్రెస్‌ను స్థాపించారు.

2) కాంగ్రెస్‌ను అల్ప సంఖ్యాక వర్గాల సంస్థగా విలియం వెడ్డర్‌బర్న్ వ్యాఖ్యానించారు.

3) కాంగ్రెస్ అంతాన్ని చూడటమే తన ధ్యేయం అని లార్డ్ కర్జన్ వ్యాఖ్యానించారు.

4) భారత జాతీయ కాంగ్రెస్ తొలి కార్యదర్శిగా ఎ.ఒ. హ్యూమ్ వ్యవహరించారు.

**11.** తొలి జాతీయ కాంగ్రెస్ సమావేశానికి హజరైన సభ్యుల సంఖ్య?

1) 76 2) 78 3) 72 4) 79

**12.** భారత జాతీయ కాంగ్రెస్ చరిత్ర పుస్తక రచయిత?

1) ఎ.ఒ. హ్యూమ్ 2) డబ్ల్యూ.సి. బెనర్జీ

3) భోగరాజు పట్టాభి సీతారామయ్య 4) విలియం వెడ్డర్‌బర్న్

**13.** కింది అంశాలను జతపరచండి.

I) జార్జి యూలె A) మద్రాస్

II) బద్రుద్దీన్ త్యాబ్జీ B) అలహాబాద్

III) సరోజినీ నాయుడు C) నాగ్‌పూర్

IV) పి. ఆనందాచార్యులు D) కాన్పూర్

1) I-A, II-B, III-C, IV-D 2) I-B, II-A, III-D, IV-C

3) I-B, II-A, III-C, IV-D 4) I-D, II-B, III-A, IV-C

**14.** 'ఇండియా' అనే పత్రికను ప్రారంభించింది ఎవరు?

1) విలియం వెడ్డర్‌బర్న్ 2) జార్జి యూలె

3) దాదాభాయ్ నౌరోజీ 4) చార్లెస్ బ్రాడ్‌లా

**15.** 1924లో గాంధీజీ అధ్యక్షత వహించిన కాంగ్రెస్ సమావేశం ఏది?

1) వార్ధా 2) గయ 3) కలకత్తా 4) బెల్గాం

**16.** భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పుడు కాంగ్రెస్ అధ్యక్షుడిగా ఉన్నదెవరు?

1) గాంధీజీ 2) నెహ్రూ

3) జె.బి. కృపలానీ 4) భోగరాజు పట్టాభి సీతారామయ్య

**17.** మితవాద యుగానికి సంబంధించి కిందివాటిలో సరైన అంశం?

1) గోపాలకృష్ణ గోఖలే మితవాద నాయకుడు.

2) ప్రార్థన, విజ్ఞప్తి, నిరసన విధానాలు అనుసరించారు.

3) వెల్బీ కమిషన్‌ను నియమించారు.

4) రొట్టె కోసం పోరాడిన మితవాదులు రాళ్లు కూడా సంపాదించ లేకపోయారని తిలక్ విమర్శించారు.

18. బ్రిటిష్ పాలనను భారతదేశం మీద నిరంతరం సాగుతున్న విదేశీ దండయాత్రగా వ్యాఖ్యానించింది ఎవరు?
1) దాదాభాయ్ నౌరోజీ 2) బాలగంగాధర తిలక్
3) లాలాలజపతిరాయ్ 4) బిపిన్ చంద్రపాల్

19. వాయిస్ ఆఫ్ ఇండియా పత్రికను, భారత తంతి సమాచార సంఘాన్ని స్థాపించింది ఎవరు?
1) దాదాభాయ్ నౌరోజీ 2) ఎ.ఒ. హ్యూమ్
3) గోపాలకృష్ణ గోఖలే 4) ఆర్.సి. దత్

20. భారత జాతీయ కాంగ్రెస్‌కు ఆ పేరు సూచించింది ఎవరు?
1) ఎ.ఒ. హ్యూమ్ 2) డబ్ల్యూ.సి. బెనర్జీ
3) దాదాభాయ్ నౌరోజీ 4) గోపాలకృష్ణ గోఖలే

21. బ్రిటన్ పార్లమెంటుకు ఎన్నికైన తొలి భారతీయుడిగా పేరొందిన దాదాభాయ్ నౌరోజీ ఏ నియోజకవర్గం నుంచి గెలిచారు?
1) సెంట్రల్ ప్రావిన్సిస్ 2) సెంట్రల్ ఫ్రిన్స్‌బరి
3) సెంట్రల్ బ్రిస్టల్ 4) ఏదీకాదు

22. 'స్వదేశీ' అనే పదాన్ని తొలిసారిగా తీర్మానించింది, ప్రతిపాదించింది ఎవరు?
1) అరవిందో ఘోష్ 2) స్వామి వివేకానంద
3) దాదాభాయ్ నౌరోజీ 4) స్వామి దయానంద సరస్వతి

23. 1892 భారత కౌన్సిళ్ల చట్టాన్ని 'బిక్షగాడి జీవితం లాంటిది' అని వ్యాఖ్యానించింది ఎవరు?
1) దాదాభాయ్ నౌరోజీ 2) సురేంద్రనాథ్ బెనర్జీ
3) గోపాలకృష్ణ గోఖలే 4) ఫిరోజ్ షా మెహతా

24. 'ఎ నేషన్ ఇన్ మేకింగ్' అనే గ్రంథ రచయిత ఎవరు?
1) సురేంద్రనాథ్ బెనర్జీ 2) బిపిన్ చంద్రపాల్
3) లాలాలజపతిరాయ్ 4) దాదాభాయ్ నౌరోజీ

25. మహారాష్ట్ర సోక్రటీస్‌గా బిరుదు పొందిన వ్యక్తి ఎవరు?
1) నానా ఫడ్నవీస్ 2) తిలక్
3) ఫిరోజ్ షా మెహతా 4) గోపాలకృష్ణ గోఖలే

26. రాజద్రోహ నేరంపై అరెస్ట్ అయిన తొలి భారతీయుడు ఎవరు?
1) తిలక్ 2) లాలాలజపతిరాయ్
3) భగత్‌సింగ్ 4) చంద్రశేఖర్ ఆజాద్

27. 1905 లో 'సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ' అనే సంస్థను స్థాపించింది ఎవరు?
1) గోపాలకృష్ణ గోఖలే 2) తిలక్
3) భగత్‌సింగ్ 4) సురేంద్రనాథ్ బెనర్జీ

28. గోపాలకృష్ణ గోఖలేను 'భారతదేశపు వజ్రం'గా పేర్కొన్నది ఎవరు?
1) గాంధీజీ 2) తిలక్
3) దాదాభాయ్ నౌరోజీ 4) కె.ఎం. ఫణిక్కర్

**29.** 1905లో అతివాదం తలెత్తడానికి కారణం కాని అంతర్జాతీయ సంఘటన ఏది?

1) ఇటలీ అబిసీనియా చేతిలో ఓడిపోవడం

2) రష్యా జపాన్ చేతిలో ఓడిపోవడం

3) రష్యాలో శూన్యవాదం తలెత్తడం

4) 1905లో కర్జన్ బెంగాల్ విభజన చేయడం

**30.** 1858 విక్టోరియా మహారాణి ప్రకటనను భారతదేశంలో మానవ హక్కుల మాగ్నా కార్టాగా పేర్కొన్నది ఎవరు?

1) ఫిరోజ్ షా మెహతా
2) సురేంద్రనాథ్ బెనర్జీ
3) గోపాలకృష్ణ గోఖలే
4) దాదాభాయ్ నౌరోజీ

**31.** 'దేశ భక్తుల్లో రాజు'గా పేరొందిన జాతీయ నాయకుడు ఎవరు?

1) తిలక్
2) లాలాలజపతిరాయ్
3) బిపిన్ చంద్రపాల్
4) భగత్‌సింగ్

**32.** అమెరికా నుంచి హోంరూల్ ఉద్యమాన్ని నడిపిన నాయకుడు ఎవరు?

1) లాలాలజపతిరాయ్
2) బాలగంగాధర తిలక్
3) బిపిన్ చంద్రపాల్
4) దర్శి చెంచయ్య

**33.** 1906 లో కలకత్తాలో శివాజీ ఉత్సవాలను రాజకీయ పండుగగా నిర్వహించిన వ్యక్తి ఎవరు?

1) బిపిన్ చంద్రపాల్
2) అరవిందో ఘోష్
3) బాలగంగాధర తిలక్
4) ఎవరూ కాదు

**34.** వందేమాతరం (ఉర్దూ), పీపుల్ (ఆంగ్లం) పత్రికలను నిర్వహించింది ఎవరు?

1) బాలగంగాధర తిలక్
2) బిపిన్ చంద్రపాల్
3) లాలాలజపతిరాయ్
4) శిశిర్‌కుమార్ ఘోష్

**35.** భారతదేశ పారిశ్రామికాభివృద్ధికి 'పైసా ఫండ్' ఏర్పాటు చేసింది ఎవరు?

1) బాలగంగాధర తిలక్
2) గోఖలే
3) లాలాలజపతిరాయ్
4) సుభాష్ చంద్రబోస్

**36.** మాజినీ (ఇటలీ)ని తన రాజకీయ గురువుగా పేర్కొన్న అతివాద నాయకుడు ఎవరు?

1) లాలాలజపతిరాయ్
2) బిపిన్ చంద్రపాల్
3) తిలక్
4) లాలా హరదయాళ్

**37.** 'మనపై పడే ప్రతీ దెబ్బ ఆంగ్లేయులు స్వయంగా నిర్మించుకుంటున్న శవపేటికలోకి దిగుతున్న ఒక్కొక్క మేకు' అని వ్యాఖ్యానించింది ఎవరు?

1) ఆంధ్ర కేసరి
2) పంజాబ్ కేసరి
3) మైసూర్ పులి
4) లోకమాన్య

**38.** సర్వెంట్స్ ఆఫ్ పీపుల్ సొసైటీని 1921లో స్థాపించిన నాయకుడు ఎవరు?

1) మదన్ మోహన్ మాలవీయ
2) లాలాలజపతిరాయ్
3) అరవిందో ఘోష్
4) గోపాలకృష్ణ గోఖలే

**39.** న్యూ ఇండియా అనే ఆంగ్ల వార పత్రికను స్థాపించింది ఎవరు?

1) అనిబిసెంట్ 2) బిపిన్ చంద్రపాల్

3) అరవిందో ఘోష్ 4) అంబేద్కర్

**40.** పాండిచ్చేరి యోగిగా పేరొందిన అతివాది ఎవరు?

1) లాలాలజపతిరాయ్ 2) రవీంద్రనాథ్ ఠాగూర్

3) అరవిందో ఘోష్ 4) బాలగంగాధర తిలక్

**41.** వందేమాతర ఉద్యమ కాలంలో 'అమర్‌సోనార్ బంగ్లా' గీతాన్ని రచించింది ఎవరు?

1) బంకించంద్ర ఛటర్జీ 2) రవీంద్రనాథ్ ఠాగూర్

3) అరవిందో ఘోష్ 4) లాలాలజపతిరాయ్

**42.** ఇండియన్ నేషనలిజం అనే గ్రంథ రచయిత ఎవరు?

1) తిలక్ 2) అరవిందుడు

3) రవీంద్రనాథ్ ఠాగూర్ 4) బిపిన్ చంద్రపాల్

**43.** వందేమాతర ఉద్యమ కాలంలో నెలకొల్పిన బెంగాల్ జాతీయ కళాశాల తొలి ప్రిన్సిపాల్ ఎవరు?

1) సుభాష్ చంద్రబోస్ 2) రవీంద్రనాథ్ ఠాగూర్

3) అరవిందో ఘోష్ 4) రాస్‌బిహారీ బోస్

**44.** ఏ రోజును జాతీయ సంతాప దినంగా పాటిస్తారు?

1) 1905, అక్టోబరు 6 2) 1905, అక్టోబరు 16

3) 1919, ఏప్రిల్ 6 4) 1909, ఏప్రిల్ 16

**45.** భారతదేశంలో పబ్లిక్ సర్వీస్ కమిషన్‌ను ఎప్పుడు ఏర్పాటు చేశారు?

1) 1853 2) 1883 3) 1886 4) 1892

**46.** భారత జాతీయ కాంగ్రెస్ తొలి నామం?

1) ఇండియన్ యూనియన్ 2) ఇండియన్ అసోసియేషన్

3) ఇండియన్ నేషనల్ యూనియన్ 4) ఇండియన్ నేషనల్ లీగ్

**47.** 1909 నాటి ఆలీపూర్ బాంబు కేసులో అరెస్టయిన అరవిందో ఘోష్‌ను నిర్దోషిగా నిరూపించింది ఎవరు?

1) చిత్తరంజన్ దాస్ 2) మోతీలాల్ నెహ్రూ

3) జవహర్‌లాల్ నెహ్రూ 4) తేజ్‌బహదూర్ సప్రూ

**48.** ది లైఫ్ డివైన్, సావిత్రి గ్రంథాలను రచించింది ఎవరు?

1) అరవిందుడు 2) రవీంద్రుడు

3) తిలక్ 4) సుబ్రహ్మణ్య భారతి

**49.** ఢిల్లీలో స్వదేశీ/ వందేమాతర ఉద్యమానికి నాయకత్వం వహించిన వ్యక్తి ఎవరు?

1) తిలక్ 2) జోగేష్ చంద్ర ఛటర్జీ

3) సయ్యద్ హైదర్‌రజా 4) మోతీలాల్ నెహ్రూ

**50.** 1905, జులై 19న బెంగాల్ విభజన జరిగింది. ఇది ఎప్పటి నుంచి అమల్లోకి వచ్చింది

1) 1905, అక్టోబరు 16
2) 1906, అక్టోబరు 16
3) 1905, ఏప్రిల్ 6
4) 1906, ఏప్రిల్ 6

**51.** 1905లో బెనారస్‌లో జరిగిన మొదటి భారత పరిశ్రమల సమావేశానికి అధ్యక్షత వహించింది ఎవరు?

1) లాలాలజపతిరాయ్
2) ఎన్.ఎం. లోఖాండే
3) రమేష్‌చంద్ర దత్
4) దాదాభాయ్ నౌరోజీ

**52.** వందేమాతర ఉద్యమానికి సంబంధించి కిందివాటిలో సరైన అంశం ఏది?

ఎ) ఆంధ్రాలో కాకినాడ బాంబు కేసు సంఘటన జరిగింది.

బి) తమిళనాడులో చిదంబరం పిళ్లై స్వదేశీ స్టీమ్ నావిగేషన్ కంపెనీని స్థాపించారు.

సి) ఆంధ్రాలో బిపిన్ చంద్రపాల్ ఉద్యమాన్ని ప్రచారం చేశారు.

డి) పి.సి. రే బెంగాల్ స్వదేశీ కెమికల్ స్టోర్స్ స్థాపించారు.

1) ఎ, బి సరైనవి
2) బి, సి సరైనవి
3) బి, సి, డి సరైనవి
4) అన్నీ సరైనవి

**జవాబులు**

1-2; 2-1; 3-4; 4-2; 5-2; 6-1; 7-3; 8-4; 9-3; 10-2; 11-3; 12-3; 13-2; 14-3; 15-4; 16-3; 17-4; 18-1; 19-2; 20-3; 21-2; 22-3; 23-4; 24-1; 25-4; 26-1; 27-1; 28-2; 29-4; 30-2; 31-1; 32-1; 33-3; 34-3; 35-1; 36-1; 37-2; 38-2; 39-2; 40-3; 41-2; 42-4; 43-3; 44-2; 45-3; 46-3; 47-1; 48-1; 49-3; 50-1; 51-3; 52-3.

**రచయిత: బి. నాగరాజు**

# చరిత్ర

## అసఫ్‌జాహీ యుగం – నిజాం పాలన

క్రీ.శ. 1724లో నిజాం ఉల్‌ముల్క్ మొగలుల అధికారాన్ని ధిక్కరించి స్వతంత్ర హైదరాబాద్ రాజ్యాన్ని స్థాపించాడు. అతడి వంశీయులు క్రీ.శ. 1948 వరకు హైదరాబాద్ రాజ్యాన్ని పరిపాలించారు. ఈ కాలాన్నే అసఫ్‌జాహీయుగం లేదా నిజాంల పాలనగా పేర్కొంటారు.

### నిజాం ఉల్‌ముల్క్

ఇతడు నిజాంల మొదటి పాలకుడిగా పేరు పొందారు. అసలు పేరు మీర్ కమ్రుద్దీన్. మొగలుల కొలువులో పని చేస్తున్న సమయంలో ఔరంగజేబ్ 'చిన్ – ఖిలిజ్ – ఖాన్' అనే బిరుదిచ్చాడు. చిన్ – ఖిలిజ్ – ఖాన్ అంటే కుర్రకత్తి వీరుడు అని అర్థం. అనంతరం మొగల్ చక్రవర్తి ఫరూక్‌షియర్ నిజాం ఉల్‌ముల్క్, ఫతేజంగ్ బిరుదులను ప్రదానం చేశాడు. మరో మొగల్ చక్రవర్తి మహ్మద్‌షా ఇతడికి అసఫ్ జా అనే బిరుదు ఇచ్చాడు. నిజాం ఉల్‌ముల్క్ ముబారిజ్‌ఖాన్ సైన్యాలను 1724 నాటి షక్కర్‌ఖేడ యుద్ధంలో ఓడించి, ఔరంగాబాద్ రాజధానిగా అసఫ్‌జాహీ పాలనను ప్రారంభించాడు. తన రాజ్యాన్ని ఆరు సుబాలు (బీరర్, బీదర్, బీజాపూర్, ఖాందేష్, హైదరాబాద్, ఔరంగాబాద్)గా విభజించాడు. షాకిర్ (సంతృప్తుడు) అనే కలం పేరుతో కవితలు రాసేవాడు. 1748, మే 22న బర్హాన్‌పూర్ వద్ద మరణించాడు.

### నాజర్‌జంగ్

నిజాం ఉల్‌ముల్క్ మరణానంతరం అతడి కుమారుడు నాజర్‌జంగ్ పాలనాధికారాలు చేపట్టాడు. కానీ నిజాం ఉల్‌ముల్క్ కుమార్తె పుత్రుడు (మనవడు) ముజఫర్‌జంగ్ వారసత్వ పోరులో కర్నూలు నవాబు హిమ్మత్‌ఖాన్‌తో నాజర్‌జంగ్‌ను హత్య చేయించాడు. ఈ పోరులో ఫ్రెంచి వారు ముజఫర్‌జంగ్‌కు సహాయపడగా, ఆంగ్లేయులు నాజర్‌జంగ్ పక్షం వహించారు.

### ముజఫర్‌జంగ్

ఫ్రెంచివారి సాయంతో పాలకుడైన ముజఫర్‌జంగ్ వారికి మచిలీపట్నం, పుదుచ్చేరి, కరైకాల్ ప్రాంతాల్లో అధికారం కల్పించాడు. తన ఆస్థానంలో ఉండే ఫ్రెంచి అధికారికి హైదర్‌జంగ్ అనే బిరుదు ఇచ్చాడు. డూప్లేను తన ఏడు వేల అశ్వికదళానికి మున్సబ్‌దారుగా నియమించాడు. కానీ కడప, కర్నూలు నవాబు హిమ్మత్‌ఖాన్ చేతిలో కడప జిల్లాలోని లక్కిరెడ్డిపల్లె వద్ద హత్యకు గురయ్యాడు.

### సలాబత్‌జంగ్

ముజఫర్‌జంగ్ హత్యకు గురవడంతో ఫ్రెంచివారు సలాబత్‌జంగ్‌ను హైదరాబాద్ నిజాంగా నియమించారు. అందుకే సలాబత్ ఫ్రెంచివారికి ఉత్తర సర్కారులను బహుమతిగా ఇచ్చాడు. బుస్సీ నాయకత్వంలోని ఫ్రెంచి సైన్యం సలాబత్‌జంగ్‌కు రక్షణ కల్పించింది. ఇందుకు కొండవీడు, నిజాంపట్నం, నరసాపురం ప్రాంతాలను ఫ్రెంచివారికిచ్చి రూ. 24 లక్షలు సైనిక ఖర్చుగా చెల్లించాడు. ఖజానాను గోల్కొండ నుంచి ఔరంగాబాద్‌కు మార్చాడు. మూడో కర్ణాటక యుద్ధ సమయంలో ఫ్రెంచివారు ఆంగ్లేయుల చేతిలో ఓడిపోవడంతో ఇతడు ఆంగ్లేయుల వైపు చేరి వారికి ఉత్తర సర్కారులను అప్పగించాడు. తన సోదరుడైన నిజాం అలీఖాన్‌ను ఖైదు నుంచి విడుదల చేసి, బీదర్ సుబేదారుగా నియమించాడు. కానీ 1761లో నిజాం అలీఖాన్ సలాబత్‌జంగ్‌ను తొలగించి, అధికారాన్ని హస్తగతం చేసుకున్నాడు. దీంతో రెండో నిజాం పాలకుడిగా గుర్తింపు పొందిన నిజాం అలీఖాన్ పాలన ప్రారంభమైంది. (వారసత్వ యుద్ధాల్లో మునిగి తేలిన నాజర్, ముజఫర్, సలాబత్‌జంగ్‌లను మొగల్ చక్రవర్తులు నిజాం పాలకులుగా గుర్తించలేదు.)

### నిజాం అలీఖాన్

నిజాం అలీఖాన్ (రెండో అసఫ్‌జా/ రెండో నిజాం) ఉత్తర సర్కారులపై ఆంగ్లేయుల అధికారాన్ని అంగీకరించలేదు. అయితే ఆంగ్లేయులు దుబాసీ కాండ్రేగుల జోగిపంతులును రాయబారిగా పంపి, 1766 నాటికి ఉత్తర సర్కారులను స్వాధీనం చేసుకున్నారు. మూడో మైసూర్ యుద్ధంలో ఆంగ్లేయులకు సహకరించి కడప, బళ్లారి, గుత్తి ప్రాంతాలను పొందాడు. కానీ మహారాష్ట్రుల చేతిలో ఓడిపోయి (1767 ఖర్దా యుద్ధంలో) దౌలతాబాద్ దుర్గాన్ని కోల్పోయాడు. వెల్లస్లీ ప్రవేశపెట్టిన సైన్య సహకార పద్ధతిలో చేరిన మొదటి భారతీయ పాలకుడు నిజాం అలీఖాన్ (1798). 1800లో కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురం ప్రాంతాలను ఆంగ్లేయులకు దత్తత ఇచ్చాడు. అందుకే వాటిని దత్త మండలాలుగా పేర్కొంటారు. నిజాం తన రాజధానిని ఔరంగాబాద్ నుంచి హైదరాబాద్‌కు మార్చాడు. 1788లో గుంటూరు సర్కారును ఆంగ్లేయులకుఇచ్చాడు. కిర్క్‌పాట్రిక్‌ను తన రాజధానిలో బ్రిటిష్ రెసిడెంట్‌గా నియమించాడు.

★ రేమండ్ అనే ఫ్రెంచి నిపుణుడి సహాయంతో హైదరాబాద్‌లోని గన్‌ఫౌండ్రీ వద్ద ఆయుధాగారాన్ని నెలకొల్పాడు. నేటి మూసారాంబాగ్‌లో రేమండ్ సమాధి ఉంది. కిర్క్‌పాట్రిక్, ఖైరున్నీసాబేగంల ప్రేమకు చిహ్నంగా నిర్మించిన కట్టడంలోనే ప్రస్తుతం కోఠిలోని మహిళా కళాశాలను నిర్వహిస్తున్నారు.

## సికిందర్ ఝా

మూడో నిజాం/అసఫ్ జాగా పేరొందిన పాలకుడు. ఇతడి పాలనా కాలంలోనే రెండో ఆంగ్ల – మరాఠా యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో నిజాం సైన్యాన్ని బీరర్ గవర్నర్ రాజా మహీపతిరామ్ నడిపాడు. ఆంగ్లేయులు మహీపతి రామ్ స్థానంలో దివాన్ చందూలాల్‌ను పేష్కార్‌గా నియమించారు. సికిందర్ ఝా ప్రధాని మీర్ ఆలం కూడా ఆంగ్ల వ్యతిరేకి. 1811లో రెసిడెంట్‌గా వచ్చిన హెన్రీ రస్సెల్ నాయకత్వంలో దళాన్ని ఏర్పాటు చేశాడు. దీన్నే రస్సెల్ బ్రిగేడ్ లేదా హైదరాబాద్ కంటింజెంట్‌గా పేర్కొన్నారు. విలియం పామర్ అనే వ్యక్తి పామర్ అండ్ కో కంపెనీని స్థాపించాడు. నిజాం ప్రభుత్వం పామర్ కంపెనీ నుంచి 25 శాతానికి అప్పు తీసుకుంది. సికిందర్ ఝా పేరు మీదే నేటి సికింద్రాబాద్‌ను నిర్మించారు. ఇతడి కాలంలోనే మెట్‌కాఫ్ సంస్కరణలను ప్రవేశపెట్టారు.

## నాసిర్ – ఉద్ – దౌలా

ఇతడు నాలుగో నిజాం/ అసఫ్‌జా గా పేరొందాడు. ఇతడి కాలంలోనే ఆంగ్లేయులు అధిక సంఖ్యలో ఉద్యోగాలు పొందారు. 1829లో నాటి గవర్నర్ జనరల్ విలియం బెంటిక్‌కు వారి సంఖ్యను తగ్గించాల్సిందిగా విజ్ఞప్తి చేశాడు. తన రాజ్యాన్ని 16 జిల్లాలుగా విభజించాడు. హైదరాబాద్ రాజ్యంలో సతీసహగమనాన్ని రద్దు చేశాడు. ఇతడి కాలంలోనే వహాబీ ఉద్యమం జరిగింది. సయ్యద్ అహ్మద్ బ్రైల్వీ సిక్కులకు వ్యతిరేకంగా ప్రారంభించిన ఈ ఉద్యమం నిజాం కాలంలో ఆంగ్ల వ్యతిరేక ఉద్యమంగా మారింది. నిజాం సోదరుడు ముబారిజ్ – ఉద్ – దౌలా నాయకత్వంలో హైదరాబాద్ రాజ్యంలో ఉద్యమం జరిగింది. కర్నూలు నవాబు గులాం రసూల్‌ఖాన్ కూడా ఈ ఉద్యమంలో పాల్గొన్నాడు. 1843లో దివాన్ చందూలాల్ రాజీనామా చేయడంతో సిరాజ్ ఉల్‌ముల్క్‌ను ప్రధానిగా నియమించాడు. 1853లో మొదటి సాలార్‌జంగ్‌ను ప్రధానిగా నియమించాడు. నాసిరుద్దౌలా కాలంలోనే 1857 సిపాయిల తిరుగుబాటు ప్రారంభమైంది (కానీ తిరుగుబాటును ఎదుర్కొన్నది మాత్రం అఫ్జల్ – ఉద్ – దౌలా). హైదరాబాద్ కంటింజెంట్ ఖర్చుల నిమిత్తం రూ.64 లక్షలు అప్పు చేయడంతో, నిజాం తన రాజ్యంలోని రాయచూర్, ఉస్మాన్‌బాద్, బీరర్ ప్రాంతాలను ఆంగ్లేయులకు స్వాధీనం చేయాల్సి వచ్చింది.

## అఫ్జల్ – ఉద్ – దౌలా

1857, మే 18న అయిదో నిజాంగా పాలన చేపట్టాడు. ఇతడి కాలంలోనే 1857, జులై 17న హైదరాబాద్‌లో సిపాయిల తిరుగుబాటు ప్రారంభమైంది. (భారతదేశంలో తిరుగుబాటు ప్రారంభం మే 10, నాటి నిజాం నాసిరుద్దౌలా). మొగల్ చక్రవర్తి పేరు మీద కాకుండా నిజాం పేరు మీద కుత్బా చదవడం ప్రారంభమైంది. హైదరాబాద్‌లోని ఆంగ్ల రెసిడెన్సీపై తుర్రేబాజ్‌ఖాన్ దాడి చేశాడు. తిరుగుబాటును అణచడంలో ఆంగ్లేయులకు తోడ్పడినందుకు నాటి బ్రిటిష్ రెసిడెంట్ కల్నల్ డేవిడ్‌సన్, సైన్యాధికారి మేజర్ బ్రిగ్స్ నిజాంకు 'స్టార్ ఆఫ్ ఇండియా' బిరుదుతో పాటు రాయచూర్, ఉస్మానాబాద్ ప్రాంతాలను తిరిగిచ్చారు. అతడు చెల్లించాల్సిన రూ.50 లక్షల రుణాన్ని రద్దు చేశారు. నిజాం రాజ్య ప్రధానమంత్రి నవాబ్ తురాబ్ అలీఖాన్‌కు 'సాలార్‌జంగ్' అనే బిరుదు ఇచ్చారు. ప్రధాని సాలార్‌జంగ్ అనేక సంస్కరణలు ప్రవేశపెట్టాడు. 1865లో జిలాబందీ రెవెన్యూ విధానాన్ని ప్రవేశపెట్టాడు. హాలిసిక్కా అనే నూతన వెండి నాణేన్ని ప్రవేశపెట్టాడు. హైదరాబాద్ – వాడి రైలు మార్గాన్ని నిర్మించాడు.

## మీర్ మహబూబ్ అలీఖాన్

అఫ్జల్ – ఉద్ – దౌలా మరణించే నాటికి ఇతడు రెండున్నర సంవత్సరాల బాలుడు. మీర్జా గాలిబ్ మనవడైన మీర్జా ఆషాబేగ్‌ను ఇతడికి సంరక్షకుడిగా నియమించారు. 1884 నాటికి పూర్తి అధికారాలను స్వీకరించాడు. ఖానున్‌చా – ఇ – ముబారక్ పేరుతో క్యాబినెట్ కౌన్సిల్ ఏర్పాటు చేశాడు. చట్టాల నిర్మాణం కోసం 1893లో ఒక లెజిస్లేటివ్ కౌన్సిల్ ఏర్పాటు చేశాడు. బీరర్‌పై నిజాం సార్వభౌమాధికారాన్ని గుర్తించాడు. హైదరాబాద్ కంటింజెంట్‌ను రద్దు చేసి, బ్రిటిష్ సైన్యంలో విలీనం చేశాడు. 1905లో రాజ్యాన్ని నాలుగు సుబాలుగా విభజించాడు. అవి: వరంగల్, మెదక్, గుల్బర్గా, ఔరంగాబాద్. ఇతడి కాలంలోనే కిషన్‌రావు అనే న్యాయవాది ముల్కీ నిబంధనలను రూపొందించాడు. చాందా రైల్వే పథకం ఆందోళన ఇతడి కాలంలోనే జరిగింది. నిజాం కళాశాల తొలి ప్రిన్సిపల్‌గా అఘోరనాథ చటోపాధ్యాయను నియమించాడు. మీర్ మహబూబ్ అలీఖాన్‌ను ఆంగ్లేయులు నియమించిన తొలి నిజాం నవాబుగా పేర్కొంటారు. మొదటి సాలార్‌జంగ్ మరణంతో మీర్ లాయక్ అలీని (రెండో సాలార్‌జంగ్) ప్రధానిగా నియమించాడు. ఇతడు 1887లో నిజాం కళాశాలను స్థాపించాడు. మూడో సాలార్‌జంగ్‌గా పేరొందిన మీర్ యూసఫ్ అలీఖాన్ సాలార్‌జంగ్ మ్యూజియానికి విదేశాల నుంచి అనేక వస్తువులు తెప్పించాడు.

★ 1884లో లార్డ్ రిప్పన్ హైదరాబాద్ వచ్చి నిజాంకు సర్వాధికారాలు అప్పగించాడు. అదే సంవత్సరం నిజాం ఉర్దూను రాజభాషగా ప్రవేశపెట్టాడు. మంత్రివర్గం, ద్విసభా విధానం ఏర్పాటు చేశాడు.

★ మీర్ మహబూబ్ అలీఖాన్‌కు ఆంగ్లేయులు 'గ్రాండ్ కమాండర్' బిరుదును ప్రదానం చేశారు. ఇతడు 1909లో మోక్షగుండం విశ్వేశ్వరయ్యతో మూసీ నదిపై వంతెన నిర్మించాడు. ఇతడి కాలంలోనే యంగ్‌మెన్ ఇంప్రూవ్‌మెంట్ అసోసియేషన్‌ను స్థాపించారు. 1882లో థియోసాఫికల్ సొసైటీశాఖ, 1892లో ఆర్యసమాజ శాఖ హైదరాబాద్‌లో ఏర్పాటయ్యాయి.

## మీర్ ఉస్మాన్ అలీఖాన్

చివరి, ఏడో నిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్. ఇతడి కాలంలో హైదరాబాద్ సర్వతోముఖాభివృద్ధిని సాధించింది. ఉస్మాన్‌సాగర్, నిజాంసాగర్ చెరువులను తవ్వించాడు. న్యాయశాఖను ఇతర శాఖల నుంచి వేరు చేశాడు. 1919లో సర్ అలీ ఇమామ్‌ను ప్రధానిగా నియమించాడు. 1919లో ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని స్థాపించాడు.

★ సిర్పూర్ పేపరు మిల్లు, అజంజాహీ దుస్తుల మిల్లు, బోధన్ చక్కెర కర్మాగారం, చార్మినార్ సిగరెట్ కంపెనీ, వజీర్ సుల్తాన్ టొబాకో కంపెనీలను స్థాపించాడు. 1932లో అరవముదు అయ్యంగార్ నాయకత్వంలో రాజకీయ సంస్కరణల కమిటీని ఏర్పాటు చేశాడు. రజాకార్ల వ్యవస్థను ప్రోత్సహించాడు. తొలిసారి ఆదాయ, వ్యయ పద్దులను పునర్విభజించాడు. 1938లో 85 మంది సభ్యులతో ఒక శాఖను ఏర్పాటు చేసి, అందులో హరిజనులకు కూడా స్థానం కల్పించాడు.

★ భద్రాచలం, తిరుపతి దేవాలయాలకు విరాళాలు అందించేవాడు. నాందేడ్‌లో గురుద్వారాను నిర్మించాడు.

★ ఆంగ్లేయులకు విశ్వసనీయుడైన మిత్రుడిగా (ఫెయిత్‌ఫుల్ అలై) గుర్తింపు పొందాడు. 1918లో కింగ్‌జార్జ్ నిజాంను 'హిజ్ ఎగ్జాల్టెడ్ హైనస్'గా కీర్తించాడు.

★ స్టాన్లీ బాలికల ఉన్నత పాఠశాల, జనానా పాఠశాల, శాలిబండ మిడిల్ స్కూల్, హన్మకొండ ప్రభుత్వ మిడిల్ స్కూలు లాంటి విద్యాలయాలను ప్రారంభించాడు. రైల్వేలు, రోడ్డు రవాణా సంస్థలను ఏర్పాటు చేశాడు.

★ భారత ప్రభుత్వం 1948లో సెప్టెంబరు 13 – 17 మధ్య 'ఆపరేషన్ పోలో' పేరుతో సైనిక చర్య జరిపి, హైదరాబాద్ రాజ్యాన్ని భారత యూనియన్‌లో విలీనం చేసింది. 1950, జనవరి 2న హైదరాబాద్ భారత యూనియన్‌లో చేరినట్లు ప్రకటించి, నిజాంను రాజ్‌ప్రముఖ్‌గా నియమించారు.

## యుగ విశేషాలు

✪ మొదటి సాలార్‌జంగ్ ప్రధానిగా హైదరాబాద్ రాజ్య అభివృద్ధికి అనేక సంస్కరణలు చేపట్టాడు.

✪ 1853 నుంచి 1883 వరకు ముగ్గురు నిజాంల వద్ద ప్రధానిగా మొదటి సాలార్‌జంగ్ పని చేశాడు.

✪ ఇతడు రాజ్యాన్ని 5 సుబాలు, 17 జిల్లాలుగా విభజించారు.

✪ సుబా అధిపతిని సుబేదార్, తాలుకా అధిపతిని తహసీల్దార్, జిల్లా అధిపతిని తాలూక్‌దార్ అనేవారు.

✪ 1864లో రెవెన్యూ బోర్డును ఏర్పాటు చేశారు.

✪ సదర్ – ఉల్ – మహమ్ పేరుతో పోలీసు, రెవెన్యూ, న్యాయ, విద్య, ఆరోగ్య శాఖలు ఏర్పాటు చేశారు.

✪ భూమి శిస్తును జమ అని, కౌలును ఇజారా అని పిలిచేవారు.

✪ అవల్ తాలూక్‌దార్ నేటి జిల్లా కలెక్టర్‌తో సమాన అధికారి. దోయం తాలూక్‌దార్‌ను సబ్‌కలెక్టర్ హోదాతో, సోయం తాలూక్‌దార్‌ను తహసీల్దార్ హోదాతో సమానంగా భావించేవారు.

✪ పోలీసు సూపరింటెండెంట్‌ను ముహతామీన్ అని, పోలీసు ఇన్‌స్పెక్టర్‌ను అమీన్ అని పిలిచేవారు.

✪ వసూలు చేసిన శిస్తులో జమీందార్ల వాటాను రుసుం అనేవారు.

✪ శిస్తు వసూలు అధికారులను బిల్ మక్తదారులు అనేవారు.

✪ చివరి నిజాం పాలనా కాలంలో కింది పట్టణాల పేర్లను మార్చారు.

ఎలగండల – కరీంనగర్, మహబూబ్‌నగర్ – పాలమూరు, ఇందూరు – నిజామాబాద్, మానుకోట – మహబూబాబాద్, భోన్‌గిరి – భువనగిరి

- హైదరాబాద్ పాఠశాలల్లో డబ్ల్యూ.హెచ్. విల్కిన్‌సన్ అనే విద్యాశాఖ కార్యదర్శి నూతన బోధనా పద్ధతులను ప్రవేశపెట్టాడు.
- 1871లో హైదరాబాద్‌లో తపాలా శాఖను ఏర్పాటు చేశారు.
- 1856లో డాక్టర్ స్మిత్ హైదరాబాద్‌లో వస్తు ప్రదర్శన (పారిశ్రామిక) ఏర్పాటు చేశాడు.
- బ్రిటిష్ రెసిడెంట్‌గా జేమ్స్ పాట్రిక్ ఖైరున్నీసా బేగం అనే ముస్లిం యువతిని వివాహం చేసుకున్నాడు.
- భద్రాచలం రాముడికి తలంబ్రాలు పంపే ఆచారాన్ని నాసిరుద్దౌలా ప్రవేశ పెట్టాడు.
- రాజ్య కేంద్ర ద్రవ్య ముద్రణాలయం హైదరాబాద్‌లో, జిల్లా ద్రవ్య ముద్రణాలయాలు గద్వాల్, నారాయణపేట్‌ల్లో ఏర్పాటు చేశారు.
- కె.ఎం. మున్షీ హైదరాబాద్‌లోని దక్కన్ హౌస్‌లో ఉంటూ 'ది ఎండ్ ఆఫ్ యాన్ ఎరా' అనే గ్రంథాన్ని రచించారు.
- 1918లో ఏర్పడిన ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 1919, ఆగస్టు 28 నుంచి తరగతులు ప్రారంభమయ్యాయి.

**రచయిత: బొత్స నాగరాజు**

# చరిత్ర

## సింధు నాగరికత

★ తొలి భారతీయ, మూలభారతీయ నాగరికత, సింధు నాగరికత

★ సింధు నాగరికతను నిర్మించింది – ద్రావిడులు

★ సింధు నాగరికత కాలం క్రీ.పూ. 2500 – క్రీ.పూ. 1750

★ 1921 – 22లో తొలిసారిగా సింధు నాగరికత అవశేషాలు వెలుగుచూశాయి.

★ 1922లో హరప్పా వద్ద దయారాం సహాని, మొహెంజొదారో వద్ద ఆర్.డి.బెనర్జీ తవ్వకాలు జరిపారు.

★ సింధు నాగరికత వెలికితీతకు కారకుడు – సర్ జాన్ మార్షల్.

★ హరప్పా, మొహెంజొదారో ప్రస్తుతం పాకిస్థాన్‌లో ఉన్నాయి.

★ హరప్పా రావి నదీతీరంలో పంజాబ్ రాష్ట్రంలోని మౌంట్ గోమరి జిల్లాలో ఉంది.

★ మొహెంజొదారో సింధు నది ఒడ్డున సింధు రాష్ట్రంలోని లార్ఖాన జిల్లాలో ఉంది.

★ కాళీభంగన్ రాజస్థాన్‌లో ఉంది. ఎ.ఘోష్ ఇక్కడ తవ్వకాలు జరిపారు.

★ కాళీభంగన్ అంటే కాలిన నల్లని గాజులు అని అర్థం.

★ మొహెంజొదారో అంటే మృతుల దిబ్బ అని అర్థం.

★ లోథాల్ గుజరాత్‌లో ఉంది. ఇక్కడ తవ్వకాలు జరిపించింది – ఎస్.ఆర్.రావు.

★ సింధు తవ్వకాల్లో బయటపడిన తొలి పట్టణం – హరప్పా

★ హరప్పాలో 6 చిన్న ధాన్యాగారాలు, రాయితో చేసిన గడ్డం ఉన్న పురుషుడి బొమ్మ, కార్మికుల నివాసగృహాలు, ఎక్కాగా పిలిచే ఎడ్లబండి లభించాయి.

★ మొహెంజొదారోలో మహాస్నానవాటిక, కంచుతో చేసిన నాట్యగత్తె విగ్రహం, అతిపెద్ద ధాన్యాగారం లభించాయి.

★ సింధు నాగరికత కట్టడాలన్నింటిలోకి పెద్దదైన అనేక స్తంభాలున్న సమావేశపు హాలు బయటపడిన ప్రాంతం – మొహెంజొదారో

★ నాగలిచాళ్ల ఆనవాళ్లు, కాలిన మసిగుడ్డ అవశేషాలు లభించిన ప్రాంతం – కాళీభంగన్

★ రాతివాడకం కనిపించిన ఏకైక సింధు పట్టణం – ధోలవీర

★ గుర్రపు ఎముకల అవశేషాలు లభించిన ప్రాంతం – సుర్కటోడా

★ కోటలేని ఏకైక సింధు పట్టణం – చన్హుదారో

★ సిరా సీసా (Ink – well) కనిపించిన పట్టణం – చన్హుదారో

★ పూసల పరిశ్రమ ఆనవాళ్లు లభించిన ప్రాంతాలు – లోథాల్, చన్హుదారో

★ వరిపంట ఆనవాళ్లు లభించిన పట్టణాలు – రంగపూర్, లోథాల్

★ సింధు ప్రజల ప్రధాన ఓడరేవు – లోథాల్

★ రక్షణ కుడ్యంగా రాతిగోడ ఉన్న ఏకైక నగరం – సుర్కటోడ

★ మధ్య పట్టణం ఉన్న ఏకైక నగరం – ధోలవీర

★ సింధు నాగరికత ప్రధానంగా పట్టణ నాగరికత

★ సింధు ప్రజల కుటుంబ అధిపతి – తల్లి (మాతృస్వామిక వ్యవస్థ)

★ సింధు ప్రజల ప్రధాన వృత్తి – వ్యవసాయం

★ ప్రధాన పంటలు – గోధుమ, బార్లీ

★ ప్రధాన దైవం – అమ్మతల్లి, ప్రధాన పురుషదైవం – పశుపతి

★ ప్రపంచంలో తొలిసారిగా పత్తిని పండించింది – సింధు ప్రజలు
★ తొలిసారిగా కాల్చిన ఇటుకలను వాడింది – సింధు ప్రజలు
★ ప్రధాన వీధులు ఉత్తర, దక్షిణ దిక్కుల్లో ఉండేవి.
★ తూర్పు ఎత్తయిన ప్రాంతాల్లో ఉండే భవనాలు – ప్రభుత్వ భవనాలు
★ పశ్చిమ ఎత్తయిన ప్రాంతాల్లో ఉండేవి – కోటలు, దుర్గాలు
★ సామాన్యుల ఇళ్లు తూర్పు పల్లపు ప్రాంతాల్లో ఉండేవి.
★ సింధు పట్టణాల్లో రోడ్ల వెడల్పు (వీధుల వెడల్పు) 3 – 10 మీటర్లు
★ పెద్దవీధులు 34 అడుగుల వెడల్పుతో ఉంటే, చిన్నవీధులు 9 అడుగుల వెడల్పుతో ఉండేవి
★ సింధు ప్రజల లిపి – బొమ్మల లిపి
★ సింధు లిపి రాసే విధానం – సర్పలేఖనం
★ సింధు లిపిలో మొదటివరుస ఎడమ నుంచి కుడికి, రెండో వరుస కుడి నుంచి ఎడమకు ఉండేది (సర్పలేఖనం).
★ సింధు ప్రజలు పూజించిన జంతువు – మూపురం ఉన్న ఎద్దు
★ పూజించిన చెట్టు – రావిచెట్టు
★ పూజించిన పక్షి – పావురం
★ ఎక్కువగా ఉపయోగించిన లోహాలు – రాగి, వెండి
★ సింధు ప్రజలకు తెలియని లోహం – ఇనుము
★ భారతదేశంలో తొలిసారిగా ఇనుమును ఆర్యులు 1500 BCలో ఉపయోగించారు.
★ సింధు ప్రజలకు తెలియని జంతువు – గుర్రం
★ గుర్రం ఎముకలుగా భావిస్తున్న ఆనవాళ్లు సుర్కటోడాలో లభించాయి.
★ వీరికాలంనాటి ముద్రికలను బంకమన్ను, దంతం, స్టిటైట్ రాయితో తయారుచేశారు.
★ సింధు ప్రజలు ఎక్కువగా మెసపటోమియా (ఇరాక్)తో విదేశీ వ్యాపారం నిర్వహించారు.
★ బంగారాన్ని కోలార్, అనంతపురం నుంచి దిగుమతి చేసుకునేవారు.
★ రాగిని రాజస్థాన్, బెలుచిస్థాన్‌ల నుంచి దిగుమతి చేసుకునేవారు.
★ వెండిని అఫ్గనిస్థాన్ నుంచి దిగుమతి చేసుకునేవారు.
★ తగరాన్ని బిహార్ నుంచి దిగుమతి చేసుకునేవారు.
★ పర్షియా (ఇరాన్) నుంచి పచ్చలు దిగుమతి చేసుకునేవారు.
★ సింధు, మెసపటోమియా రాజ్యాల మధ్య ప్రధాన వాణిజ్య కేంద్రం – మెలూహ
★ సింధు నాగరికత కాలం నాటి ఎద్దుబొమ్మ ముద్రిక గురించి 1875 లోనే వ్యాసం రాసిన చరిత్రకారుడు – అలెగ్జాండర్ కన్నింగ్‌హాం
★ సింధు లిపి నుంచే తమిళ భాష పుట్టింది అన్నది – ఫాదర్ హీరాస్
★ సింధు లిపి నుంచే బ్రాహ్మీ లిపి పుట్టింది అన్నది – కన్నింగ్ హాం
★ ఆర్యుల దండయాత్ర వల్ల సింధు నాగరికత పతనమైందనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించినవారు – వీలర్, గోర్డన్ చైల్డ్

**సింధు నాగరికతపై రోమిలా థాపర్ వ్యక్తం చేసిన అభిప్రాయాలు:**

1) సింధు నాగరికత మూడు దశలు/అంచెలు ఉన్నాయి.
2) సింధు ప్రజలకు గుర్రం తెలియదు.
3) సింధు ప్రజలు వరిని పండించేవారు.

**రచయిత: బొత్స నాగరాజు**

# భారతదేశ చరిత్ర

## క్రీ.పూ. 6వ శతాబ్దం నాటి పరిస్థితులు

**క్రీస్తు పూర్వం ఆరో శతాబ్దం నాటికి మలివేద కాలం పూర్తయి మహాజనపథ రాజ్యాలు అవతరించాయి. మతపరంగా ప్రపంచాన్ని ప్రభావితం చేసిన జైన, బౌద్ధ మతాలు ఆవిర్భవించాయి. ఇదే కాలంలో భారతదేశంపై పారశీకులు, గ్రీకులు దండెత్తి వచ్చారు.**

★ క్రీస్తు పూర్వం 6వ శతాబ్దంలో మూడు ముఖ్య పరిణామాలు చోటు చేసుకున్నాయి.

1. షోడశ మహా జనపథాలు ఆవిర్భవించడం.
2. జైన, బౌద్ధాలు జనించడం.
3. పారశీక, గ్రీకు దండయాత్రలు జరగడం.

★ భారతదేశంలో సింధు నాగరికత కాలాన్ని తొలి పట్టణీకరణగా పేర్కొంటే క్రీ.పూ. 6వ శతాబ్దాన్ని లేదా షోడశ మహాజనపథాల కాలాన్ని రెండో పట్టణీకరణ అంటారు.

★ ఈ కాలంలో 16 మహాజనపథాలు ఆవిర్భవించాయి. వాటినే షోడశ మహాజనపథాలు అంటారు.

★ ఉత్తర భారతదేశంలో హిమాలయ పర్వత సానువుల వెంట 15 మహాజనపథాలు ఏర్పడ్డాయి.

★ దక్షిణ భారతదేశంలో ఏకైక జనపథంగా అస్మక ఏర్పడింది.

★ భారతదేశంలో ఏర్పడిన తొలి సామ్రాజ్యంగా మగధ సామ్రాజ్యాన్ని పేర్కొంటారు.

★ మగధ రాజధానులుగా రాజగృహం, వైశాలి, పాటలీపుత్రం ఉండేవి. మగధ తొలి రాజధాని రాజగృహం. దాన్నే గిరివ్రజం అని పిలిచేవారు.

★ పురాణకాలంలో మగధను రిపుంజయుడు (బార్హద్రద వంశం) పాలించేవాడు.

★ రిపుంజయుడిని ఓడించిన బింబిసారుడు హర్యంక వంశాన్ని స్థాపించాడు.

★ బింబిసారుడి బిరుదు సేనీయ.

★ బింబిసారుడు తన ఆస్థానంలో జీవకుడు అనే వైద్యుడిని నియమించాడు.

★ బింబిసారుడిని వధించి అతడి కుమారుడు అజాతశత్రువు రాజ్యానికి వచ్చాడు.

★ అజాతశత్రువు గంగా – శోణ్ నదుల మధ్య పాటలీపుత్రాన్ని నిర్మించాడు.

★ మొదటి బౌద్ధ సంగీతిని అజాతశత్రువు రాజగృహంలో నిర్వహించాడు.

★ అజాతశత్రువు కోసల రాజ్యాన్ని ఆక్రమించి తన రాజ్యంలో కలపడంతో మగధ బలీయమైన రాజ్యమైంది.

★ అజాతశత్రువు లిచ్ఛవులను ఓడించడానికి తన మంత్రి వసకారను వినియోగించాడు.

★ హర్యంక వంశస్థులను పితృ హంతకులు అంటారు.

★ బుద్ధుడికి సమకాలీనుడైన మగధ రాజు బింబిసారుడు.

★ బుద్ధుడి శిష్యుడైన మగధ రాజు అజాతశత్రువు.

★ హర్యంక వంశం అనంతరం మగధను శైశునాగ వంశం పరిపాలించింది.

★ శైశునాగవంశ పాలనను శిశునాగుడు ప్రారంభించాడు.

★ శైశునాగ వంశానికి చెందిన కాలాశోకుడి కాలంలో రెండో బౌద్ధ సంగీతిని వైశాలిలో నిర్వహించారు (కాలాశోకుడిని కకవరిన్ అని కూడా పేర్కొన్నారు).

★ కాలాశోకుడు మగధ రాజధానిని రాజగృహం నుంచి పాటలీపుత్రానికి మార్చాడు.

★ మహాపద్మనందుడు శైశునాగ వంశాన్ని నిర్మూలించి నందవంశ పాలన ప్రారంభించాడు.

★ మహాపద్మనందుడు ఏకరాట్, ఉగ్రసేన లాంటి బిరుదులతో పరిపాలించాడు.

★ నందవంశ చివరి రాజు ధననందుడు.

★ క్రీ.పూ. 321లో చంద్రగుప్తమౌర్యుడు ధననందుడిని ఓడించి మగధను ఆక్రమించాడు.

★ వజ్జి, మల్లి రాజ్యాలు గణతంత్రాలు, అంటే ఎన్నుకున్న పాలకులు ఉన్న రాజ్యాలు.

★ సంస్కృతంలో జన అంటే తెగలు లేదా ప్రజలు, పథం అంటే స్థిరపడిన ప్రాంతం. తెగలు లేదా ప్రజలు స్థిరపడిన ప్రాంతమే జనపథం.

★ షోడశ మహా జనపథాల కాలంలో ఢిల్లీ, అత్రంజిఖేర, కౌశాంబి, పాట్నా, అయోధ్య రాజ్‌గిర్ లాంటి పట్టణాలు అభివృద్ధి చెందాయి.

★ ఉపనిషత్తులు, ధర్మసూత్రాలు, దిగనికాయ, మజ్జనికాయ లాంటి గ్రంథాలను మహాజనపథాల కాలంలో రాశారు.

★ వ్యవసాయం చేసే భూయజమానులను గృహపతి/ గాహపతి అనేవారు.

★ యుద్ధాల్లో బందీలై బానిసలుగా అమ్ముడయ్యే వారిని దాసులు (దస్యులు) అనేవారు.

★ కూలీలను భర్తుకా అని పిలిచేవారు.

★ గృహపతులు (వ్యవసాయదారులు) రాజుకు చెల్లించే పంటలో 1/6వ వంతు పన్నును భాగ అనేవారు.

★ వృత్తి పనివారు రాజుగారి పొలంలో ఒకరోజు ఉచితంగా పనిచేయడం ద్వారా పన్ను చెల్లించేవారు.

★ మహిళలు, బానిసలు, సేవకులకు గణరాజ్య సమావేశాల్లో పాల్గొనే హక్కులేదు.

★ మగధ రాజ్యం దక్షిణ ప్రాంతంలో ఇనుప గనులు అధికంగా ఉండేవి.

★ వజ్జి గణరాజ్యం మగధ రాజ్యానికి ఉత్తర దిక్కులో ఉండేది.

★ నాణేలను ముద్రించడం, ఉపయోగించడం అనేది షోడశ మహాజనపథాల కాలంలోనే ప్రారంభమైంది. వేదకాలంలో నిష్క, శతమాన, కర్షాపణ లాంటి నాణేలను పేర్కొన్నారు.

| **షోడశ మహాజనపథాలు** | **రాజధానులు** |
|---|---|
| అంగ | చంపా నగరం |
| ఛేది | శుక్తిమతి |
| కురు | ఇంద్రప్రస్థం |
| మత్స్య | విరాట్‌నగరం |
| అస్మక | పూతన్ (బోధన్) |
| కాంభోజ | రాజపురం (అట్టక్) |
| అవంతి | ఉజ్జయిని |
| మల్ల | కుశినగరం, పావ |
| కాశి | వారణాసి |
| వత్స | కౌశాంబి |
| పాంచాల | కపిలవస్తు (అహిచ్ఛత్ర) |
| శూరసేన | మధురా నగరం |
| గాంధార | తక్షశిల |
| వజ్జి | మిథిలా నగరం/ మిథిల |
| మగధ | పాటలీపుత్రం/ రాజగృహం |
| కోసల | శ్రావస్తి, సాకేత |

**రచయిత: బొత్స నాగరాజు**

# చరిత్ర

## సింధు నాగరికత

★ 'సింధు ప్రజల కాలంలో వరిసాగు లేదు' అన్నది – ఎ.ఎల్. భాషం.

★ 'సింధు ప్రజలు యోని – లింగ పూజ చేసేవారు' అన్నది – సర్‌జాన్ మార్షల్.

★ 'సర్ జాన్ మార్షల్ యోని – పూజ సిద్ధాంతాన్ని తిరస్కరించింది' – ఎఫ్.డేల్స్.

★ భారతదేశంలో అధిక సింధు నాగరికత పట్టణాలు బయటపడిన రాష్ట్రం – గుజరాత్.

★ సింధు ముద్రికలపై (270) అధికంగా ముద్రించిన జంతువు – వృషభం.

★ కాల్చిన మట్టి బొమ్మలను టెర్రాకోట బొమ్మలుగా పేర్కొంటారు.

★ సతీసహగమన ఆచారాన్ని సూచించే ఆనవాళ్లు లభించిన ప్రాంతం లోథాల్.

★ టెర్రాకోట బొమ్మలపై కనిపించని జంతువు ఆవు.

★ సింధు కాలంనాటి కుండలు ఎక్కువగా ఎరుపు రంగులో ఉండేవి.

★ చదరంగం ఆటకు సంబంధించిన ఆనవాళ్లు లభించిన ప్రాంతం – లోథాల్.

★ నాటి ప్రధాన రవాణా సాధనం ఎడ్లబండి.

★ నేసిన నూలు వస్త్రం ముక్క (మసిబట్ట) లభించిన ప్రాంతం కాళీభంగన్.

★ ఇంగ్లిష్ బాండ్‌గా పిలిచే తాపీ పనిని ప్రవేశపెట్టింది సింధు ప్రజలు.

★ స్త్రీలు పెదాలకు రంగులు (లిప్‌స్టిక్) వాడేవారని పేర్కొన్న చరిత్రకారుడు ఆర్.సి.మజుందార్.

★ సింధు ప్రజలు లాపిజ్‌లాజులి అనే ప్రత్యేక రాతిని ఉత్తర అఫ్ఘనిస్థాన్ నుంచి దిగుమతి చేసుకునేవారు.

★ నటరాజ విగ్రహాన్ని పోలిన రాతి విగ్రహం లభించిన ప్రాంతం హరప్పా

★ స్త్రీల మర్మాంగాలను పోలిన రాళ్లు హరప్పా పట్టణంలో లభించాయి.

★ ఏనుగును మచ్చిక చేసుకున్నట్లు గుజరాత్ ప్రాంతంలో ఆధారాలు లభించాయి.

★ జంతు బలి అవశేషాలు లభించిన ప్రాంతం కాళీభంగన్.

★ పులిబొమ్మను పోలిన జంతువు ఉన్న టెర్రాకోట ముద్రిక లభించిన ప్రాంతం బన్వాలి

★ సింధు నాగరికతను నిర్మూలించిన వారు ఆర్యులు.

### ఆర్య నాగరికత

### మలి వేదకాలం క్రీ.పూ. 1000 – 600

★ మలి వేదకాలంలో ఆర్యులు గంగా – యమునా అంతర్వేదిలో నివసించేవారు.

★ మలివేద ఆర్యుల వలసను బ్రాహ్మణాలు వివరిస్తాయి.

★ మలివేద కాలంలో రాజును సామ్రాట్ అని పిలిచేవారు.

★ రాజ్యాన్ని మహా జనపథం అనేవారు.

★ రాజుకు పాలనలో సహాయపడే ఉద్యోగులను రత్నిన్‌లు అనేవారు.

★ పన్ను వసూలు అధికారిని భాగదుఘ అనేవారు.

★ కోశాధికారిని సంగ్రహితగా పేర్కొనేవారు.

★ గణకుడు / గణాంకాధ్యక్షుడిని అక్షవాస అనేవారు (జూద గృహంపై అధిపతి)

★ పోలీసు విధులు నిర్వహించే వ్యక్తిని అధికృతగా పేర్కొనేవారు.

★ రాజులు రాజసూయ, అశ్వమేధ, వాజపేయం లాంటి యజ్ఞ యాగాలను మలి వేదకాలంలోనే ప్రారంభించారు.

★ మలి వేదకాలంలో ప్రజల ప్రధాన వృత్తి వ్యవసాయంగా మారింది.

★ వరి, గోధుమ, బార్లీ, పత్తి లాంటి పంటలను పండించేవారు.

★ వడ్రంగం, లోహపు పని, చర్మాలను శుద్ధి చేయడం, నేత, కుండలు చేయడం లాంటి పరిశ్రమలు ప్రారంభమయ్యాయి.

★ మలి వేదకాలంలో దంతపు పని (ట్యానింగ్ పరిశ్రమ) లేదు.

★ శతమాన, కర్షాపణ (కృష్ణాలు) లాంటి నాణేలు వాడేవారు.

★ వర్ణ వ్యవస్థ క్లిష్టమైంది. వృత్తుల ఆధారంగా అనేక కులాలు ఆవిర్భవించాయి.

★ వర్ణాశ్రమ ధర్మాలు నాలుగు మలి వేదకాలంలో అభివృద్ధి చెందాయి.

★ వర్ణాశ్రమ ధర్మాల గురించి తొలిసారిగా ప్రస్తావించింది ఐతరేయ బ్రాహ్మణం.

★ బ్రహ్మచర్యం, గృహస్థం, వానప్రస్థం ధర్మాలను ఛాందోగ్యోపనిషత్తు వివరించగా, సన్యాసంతో సహా నాలుగు ఆశ్రమ ధర్మాలను 'జాబాలోపనిషత్తు' వివరించింది.

★ గోత్ర వ్యవస్థ మలి వేదకాలంలోనే (అధర్వణ వేదం) ఆవిర్భవించింది.

★ స్త్రీ స్థానం దిగజారింది. వంటింటికే పరిమితమైంది. బాల్య వివాహాలు లాంటి సాంఘిక దురాచారాలు అధికమయ్యాయి.

★ మలి వేదకాలంలో త్రిమూర్తుల ఆరాధన ప్రధానంగా ఉండేది.

★ రుగ్వేదంలోనే 33 మంది దేవుళ్ల ప్రస్తావన కనిపిస్తుంది.

★ అగ్ని దేవుడిని రెండో అతి ముఖ్యమైన దేవుడిగా పేర్కొన్నారు. 'అగ్ని'ని దేవతలకు, ప్రజలకు మధ్యవర్తిగా ప్రస్తావించారు.

★ సోమ, సుర అనే మత్తు పానీయాలను ఆర్యులు సేవించేవారు.

★ సోమను యజ్ఞ యాగాల సమయంలో, సురను అన్నివేళలా సేవించేవారు.

★ వస, అధివస అనే దుస్తులను ఆర్యులు ధరించేవారు.

★ వేదకాలంలో అతిథిని గోఘన అని పిలిచేవారు.

★ ధాన్యాన్ని వ్రిహి అని, ఇనుమును అయస్ అని పిలిచేవారు.

★ ఆర్య నాగరికతను దక్షిణా పథంలో విస్తరింపజేసింది అగస్త్యుడు.

★ 'యుద్ధం ఎల్లప్పుడూ మానవ హృదయాల్లో ప్రారంభమవుతుంది' అని అధర్వణ వేదం పేర్కొంది.

★ మలివేద కాలం నాటికి రాజు అధికారాలు బలపడినట్లు శతపథ బ్రాహ్మణం వివరిస్తుంది.

★ రుగ్వేద కాలంలో వర్ణం అంటే వర్గం అని అర్థం. కానీ మలి వేదకాలంలో వర్ణం అంటే కులం అని అర్థం.

★ మలివేద కాలం నాటి శూద్రుల ప్రత్యేక దైవంగా పుషాన్‌ను పేర్కొంటారు.

★ సీతను నాగలి దేవతగా పేర్కొంటారు.

★ 'ఉపనయన' క్రతువు గురించి శతపథ బ్రాహ్మణం వివరించింది.

★ హిందూ మతంలో 44 సంస్కారాలు ఉండేవి.

★ మలి వేదకాలంలో రాజ్యాలు, భూముల ఆక్రమణల కోసం యుద్ధాలు జరిగేవి.

★ ఉపనయన సంస్కారం పొందే అర్హత కలిగిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్గాలను 'ద్విజులు' అని పిలిచేవారు.

★ వడ్డీ వ్యాపారం గురించి శతపథ బ్రాహ్మణంలో పేర్కొన్నారు.

★ విధాత అనేది పురాతనమైన గిరిజన/ ఆటవిక జాతుల సభ. మలివేద కాలంలో ఈ సభ అదృశ్యమైంది.

**రచయిత: బొత్సనాగరాజు**

# చరిత్ర

## క్రీ.పూ. 6వ శతాబ్దం నాటి పరిస్థితులు

### పారశీక, గ్రీకు దండయాత్రలు

**క్రీ.పూ. 6 నుంచి క్రీ.పూ. 3వ శతాబ్ది మధ్య భారతదేశంపై పారశీకులు, గ్రీకులు దండెత్తి వచ్చారు. క్రీ.పూ. 540 (553 – 540) ప్రాంతంలో సైరస్ ది గ్రేట్ అనే పారశీక చక్రవర్తి భారతదేశంపై దండెత్తి వచ్చి గాంధార ప్రాంతాన్ని జయించాడు. భారతదేశం పైకి దండెత్తి వచ్చిన తొలి విదేశీయులు ఆర్యులు కాగా, తొలి విదేశీయుడు సైరస్ ది గ్రేట్. క్రీ.పూ. 516 ప్రాంతంలో భారతదేశంపై దండెత్తిన పారశీకరాజు మొదటి డేరియస్.**

★ అలెగ్జాండర్ దండయాత్ర కాలం క్రీ.పూ. 327 – 324.

★ అలెగ్జాండర్ గ్రీకు దేశంలోని మాసిడోనియా రాజ్యానికి చెందినవాడు.

★ అలెగ్జాండర్ తండ్రి ఫిలిప్. రాజకీయ గురువు అరిస్టాటిల్.

★ తక్షశిల రాజైన అంబి, అలెగ్జాండర్‌ను భారతదేశ దండయాత్రకు ఆహ్వానించి భారతదేశ చరిత్రలో మొదటి దేశద్రోహిగా పేరొందాడు.

★ అలెగ్జాండర్‌ను జీలం నది యుద్ధం (హైడాస్పస్ యుద్ధం)లో ఎదిరించిన భారతీయ పాలకుడు పురుషోత్తముడు/ ఫోరస్ (క్రీ.పూ. 326).

★ పురుషోత్తముడి రాజ్యం జీలం – చీనాబ్ నదుల మధ్య ఉంది.

★ అలెగ్జాండర్ క్రీ.పూ. 323లో బాబిలోనియాలో మరణించాడు.

★ అలెగ్జాండర్ దండయాత్ర భారతదేశ చరిత్రలో కాల నిర్ణయానికి ఎంతో తోడ్పడింది.

★ అలెగ్జాండర్ మూడో డేరియస్‌ల మధ్య అర్బేలా యుద్ధం జరిగింది.

★ పారశీకుల వల్ల ఖరోష్ఠి లిపి భారతదేశంలో ప్రవేశించింది.

★ ఖరోష్ఠి లిపిని కుడి నుంచి ఎడమకు రాస్తారు.

★ అశోకుడి శాసనాలు కొన్ని ఖరోష్ఠి లిపిలో ఉన్నాయి.

★ అలెగ్జాండర్ దండయాత్ర వల్ల భారతీయులకు గ్రీకు నాణేల ముద్రణ పద్ధతులు, ఖగోళశాస్త్ర పరిచయం అయ్యాయి.

### జైన, బౌద్ధ మతాలు

★ క్రీ.పూ. 6వ శతాబ్దంలో భారతదేశంలో జైన, బౌద్ధ మతాలు ఆవిర్భవించాయి.

★ చారిత్రకంగా జైన మత స్థాపకుడు – పార్శ్వనాథుడు. (జైన మత స్థాపకుడు, జైన మతానికి పేరు రావడానికి కారకుడు – వర్ధమాన మహావీరుడు.)

★ జైన మత గురువులను తీర్థంకరులు అంటారు. జైన మతంలో మొత్తం 24 మంది తీర్థంకరులు ఉన్నారు.

★ మొదటి తీర్థంకరుడు – వృషభనాథుడు (ఎద్దు) (రుగ్వేదంలో ప్రస్తావించారు).

★ 23వ తీర్థంకరుడు పార్శ్వనాథుడు (పాము).

★ 24వ తీర్థంకరుడు వర్ధమాన మహావీరుడు (సింహం).

★ జైన మత సిద్ధాంతాలను పంచవ్రతాలు అంటారు.

**మొదటి నాలుగు సూత్రాలు చెప్పింది:**

1) అహింస – హింస చేయకూడదు

2) అసత్య – అబద్ధం ఆడకూడదు

3) అస్తేయ – ఆస్తి ఉండకూడదు

4) అపరిగ్రాహ – దొంగతనం చేయకూడదు

5) బ్రహ్మచర్య – బ్రహ్మచర్యం పాటించాలి

★ అయిదో సూత్రమైన బ్రహ్మచర్యాన్ని వర్ధమాన మహావీరుడు బోధించాడు.

★ జైన మత గ్రంథాలను అంగాలు/ ద్వాదశాంగాలు అంటారు.

★ త్రిరత్నాలు జైన మతానికి చెందినవి.

1) సరైన విశ్వాసం

2) సరైన జ్ఞానం

3) సరైన నడవడిక/ క్రియ

★ వర్ధమాన మహావీరుడు జ్ఞాత్రిక క్షత్రియ వంశానికి చెందినవాడు (వైశాలి రాజ్యం)

★ తండ్రి సిద్ధార్థుడు తల్లి త్రిశాలి/ త్రిశాల.

★ వర్ధమానుడు క్రీ.పూ. 540 సంవత్సరంలో నేటి బిహార్‌లోని కుంద గ్రామంలో జన్మించాడు.

★ వర్ధమాన మహావీరుడి భార్య పేరు యశోద. కుమార్తె పేరు ప్రియదర్శిని/ అనోజ్ఞ.

★ వర్ధమానుడు తన 30వ ఏట ఇల్లు విడిచి పరివ్రాజకుడు అయ్యాడు.

★ 'పుట్టుక, చావు అనే చక్రబంధం నుంచి విముక్తి పొందడం ఎలా?' అని అన్వేషిస్తూ వర్ధమానుడు పరివ్రాజకుడయ్యాడు.

★ రిజుపాలిక నదీతీరంలోని జృంభిక అనే గ్రామంలో వర్ధమానుడు తపస్సు చేశాడు.

★ 12 సంవత్సరాల తపస్సు అనంతరం వర్ధమానుడు తన 42వ ఏట జ్ఞానోదయం పొందాడు (జినుడయ్యాడు).

★ జినుడు అంటే జ్ఞానం పొందినవాడు లేదా కోర్కెలను జయించినవాడు అని అర్థం.

★ వర్ధమాన మహావీరుడి పేరు (జినుడు) మీదుగానే జైనమతం అనే పేరు వచ్చింది.

★ వర్ధమానుడు 'మహావీరుడు', (నిర్బంధుడు), 'కేవలి' లాంటి బిరుదులు పొందాడు.

**వర్ధమానుడి బోధనలు:**

☆ వేదాలు ప్రామాణికం కాదు.

☆ యజ్ఞయాగాల వల్ల మోక్షం రాదు.

☆ కులమత భేదాలు చూపకూడదు.

☆ సల్లేఖన వ్రతం పాటించాలి.

★ క్రీ.పూ. 468లో వర్ధమానుడు పావాపురి గ్రామంలో నిర్యాణం చెందాడు (బిహార్).

★ వర్ధమాన మహావీరుడి తొలి శిష్యుడిగా జామాలిని పేర్కొంటారు.

★ తీవ్ర అహింసా సిద్ధాంతాన్ని (సల్లేఖన వ్రతం) వర్ధమాన మహావీరుడు ప్రబోధించాడు.

★ జైనులు తమ సిద్ధాంతాలను ప్రాకృత భాషలో ప్రచారం చేశారు.

★ కన్నడ భాషలో జైన సాహిత్యం అధికంగా వెలువడింది (ప్రాంతీయ భాష)

★ మహావీరుడికి గణధారులు (పీఠాధిపతులు) అనే 11 మంది శిష్యులు ఉండేవారు (ధర్మదూతలు/ శిష్యులు)

★ మహావీరుడి అనంతరం ఆర్య సుధర్ముడు జైన సంఘానికి ప్రధాన గురువుగా వ్యవహరించాడు.

★ జైనమతంలో ప్రధాన గురువును థేరా అంటారు.

★ సుధర్ముడి అనంతరం 'జంబు' ప్రధాన గురువుగా వ్యవహరించాడు.

★ ధననందుడి కాలంలో శంభూత విజయుడు ప్రధాన గురువుగా ఉన్నాడు.

★ చంద్రగుప్త మౌర్యుడి కాలంలో భద్రబాహుడు జైన సంఘానికి థేరాగా ఉన్నాడు. ఇతడు మహావీరుడి అనంతరం 6వ గురువుగా (థేరా) పేరొందాడు.

★ భద్రబాహుడు 'కల్ప సూత్రాలు' అనే గ్రంథాన్ని రాశాడు.

★ కల్పసూత్ర గ్రంథంలో 3 ప్రధాన భాగాలు ఉన్నాయి. మొదటి భాగంలో తీర్థంకరుల జీవిత చరిత్రలు, రెండో భాగంలో గణధారులు/ పీఠాధిపతుల జాబితా వివరాలు, మూడో భాగంలో జైన సన్యాసులు/ సమాచారులకు సంబంధించిన నియమాలు ఉన్నాయి.

★ మహావీరుడు తన శిష్యులకు బోధించిన 14 పూర్వాలను భద్రబాహుడే సంస్కరించాడు.

★ వ్యక్తి కేవలం జ్ఞానాన్ని పొందడానికే 14 ఆధ్యాత్మిక దశలు (పూర్వాలు) దాటాలి.

★ జైన మతం శ్వేతాంబరులు, దిగంబరులు అనే రెండు ప్రధాన వర్గాలుగా చీలిపోయింది.

★ శ్వేతాంబరులు స్థూలభద్రుడు/ స్థూలబాహుడి నాయకత్వంలో మగధలో స్థిరపడ్డారు.

★ దిగంబరులు భద్రబాహుడి నాయకత్వంలో దక్కన్ ప్రాంతానికి వలస వెళ్లి, పన్నెండు సంవత్సరాల అనంతరం తిరిగి ఉత్తర భారతదేశానికి వెళ్లిపోయారు.

★ థేరపంతీలు, సమైయాస్ అనే శాఖలు కూడా జైన మతానికి చెందినవే.

★ మొదటి జైన పరిషత్‌ను క్రీ.పూ. 3వ శతాబ్దంలో స్థూలబాహుడు పాటలీపుత్రంలో నిర్వహించాడు.

★ మొదటి జైన పరిషత్‌లోనే 14 పూర్వాల స్థానంలో 12 అంగాలను సంకలనం చేశారు.

★ ద్వాదశాంగాలను శ్వేతాంబరులు మాత్రమే అంగీకరించారు.

★ క్రీ.శ. 5వ శతాబ్దంలో రెండో జైన పరిషత్‌ను వల్లభలో దేవర్ధి క్షమశ్రమణుడు నిర్వహించాడు. 12 అంగాలు, 12 ఉపాంగాల తుది సంకలనం పూర్తి చేశాడు.

★ జైన మతంలో శాద్వాదాన్ని కుందుకుందాచార్యుడు ప్రచారం చేశాడు.

★ శాద్వాదం, న్యాయవాదాలను కలిపి జైన మతంలో 'అనేకాంతవాదం' గా పేర్కొంటారు.

★ జైనులు జీవులకు ఉన్న జ్ఞానాల సంఖ్యను బట్టి వాటిని అయిదు వర్గాలుగా విభజించారు.

★ బుద్ధి, దృష్టి, వాసన, రుచి, స్పర్శ జ్ఞానాలను వర్గీకరణకు ఆధారం చేసుకున్నారు.

★ మానవులు, దేవతలు, ఉన్నత స్థాయి జంతువుల్లో ఈ అయిదు జ్ఞానాలు ఉంటాయి. కాబట్టి వాటిని అత్యున్నత/ ప్రథమ వర్గంగా పేర్కొన్నారు.

★ జైన తత్వం ప్రకారం దేవుడు/ స్రష్ట అనేవాడు లేడు.

★ 'పరిత్యాగ జీవనమే మోక్ష ప్రాప్తికి సూక్ష్మ మార్గం' అని జైన మతం ప్రబోధిస్తుంది.

★ చంద్రగుప్త మౌర్యుడు భద్రబాహుడి సలహాపై దిగంబర జైనాన్ని స్వీకరించాడు.

★ కర్ణాటకలోని శ్రావణబెలగొళలో చంద్రగుప్త మౌర్యుడు సల్లేఖన వ్రతం ఆచరించి, మరణించాడు.

★ శ్రావణబెలగొళలో గోమఠేశ్వర విగ్రహాన్ని చాముండరాయుడు అనే చాళుక్య మంత్రి నిర్మించాడు.

★ కళింగ పాలకుడు ఖారవేలుడు జైనమతాన్ని ఆచరించాడు.

★ కదంబులు, గాంగులు, చాళుక్యులు, రాష్ట్రకూటులు జైన మతాన్ని ఆదరించారు.

★ అమోఘవర్షుడి పాలనాకాలంలో జినసేనుడు, గుణభద్రుడు అనే కవులు 'ఆది పురాణం' అనే జైన మత గ్రంథాన్ని రాశారు.

★ అమోఘవర్షుడు కన్నడ భాషలో కవిరాజమార్గం/ కవిరత్నమాలిక అనే గొప్ప జైన గ్రంథాన్ని రాశాడు.

★ రాష్ట్రకూట రాజు నాలుగో ఇంద్రుడు సల్లేఖన వ్రతాన్ని ఆచరించి నిర్యాణం చెందాడు.

★ జయసింహుడిగా ప్రసిద్ధిచెందిన చాళుక్య రాజు సిద్ధరాజు, అతడి కుమారుడు కుమారపాలుడు జైన మతాన్ని పోషించారు.

★ కుమారపాలుడి ఆస్థానంలో ఉన్న జైనకవి హేమచంద్రుడు 'త్రిషష్ఠి సకల పురుష చరిత్ర' అనే గ్రంథాన్ని రాశాడు.
(ఇది 63 మంది ప్రముఖుల విశేషాలను వివరిస్తుంది)

★ ఒడిషాలోని ఉదయగిరి గుహలు జైన మతానికి చెందినవి.

★ రాజస్థాన్‌లోని దిల్వారాలో జైన దేవాలయాలు ఉన్నాయి.

★ ఆంధ్రప్రదేశ్‌లోని కొనగండ్ల (అనంతపురం జిల్లా), తెలంగాణలోని కొలనుపాక (నల్గొండ జిల్లా) ప్రసిద్ధిచెందిన జైన క్షేత్రాలు.

★ జైనమత ప్రేరణతో మధుర శిల్పకళ అభివృద్ధి చెందింది.

## బౌద్ధ మతం

✪ బౌద్ధ మత స్థాపకుడు గౌతమబుద్ధుడు.

✪ బుద్ధుడి అసలు పేరు సిద్ధార్థుడు. (శాక్యముని, తథాగతుడు, అంగీరసుడు – ఇంకా ఇతర పేర్లూ ఉన్నాయి)

✪ గౌతమబుద్ధుడి తండ్రి శుద్ధోధనుడు తల్లి మాయాదేవి.

✪ బుద్ధుడు కపిలవస్తు రాజ్యానికి చెందినవాడు. శాక్య వంశస్థుడు.

✪ క్రీ.పూ. 563 సంవత్సరంలో సిద్ధార్థుడు లుంబినీ వనంలో జన్మించాడు.

✪ లుంబిని ప్రస్తుతం నేపాల్ దేశంలో ఉంది.

✪ క్రీ.పూ. 483లో నేటి ఉత్తర్ ప్రదేశ్‌లోని కుశి నగరంలో నిర్యాణం చెందాడు.

✪ బుద్ధుడి జీవితంలో జరిగిన అయిదు ప్రధాన సంఘటనలను పంచకల్యాణాలు అంటారు.

**పంచకల్యాణాలు:**

- ✷ బుద్ధుడి జననానికి ప్రతీక/ గుర్తు – తామరపువ్వు/ పద్మం
- ✷ బుద్ధుడు ఇంటి నుంచి వెళ్లిపోవడం (మహాభినిష్క్రమణం) గుర్తు – గుర్రం
- ✷ బుద్ధుడికి జ్ఞానోదయం కలగడం (సంబోధి) – బోధివృక్షం
- ✷ బుద్ధుడు తొలి ఉపదేశం ఇవ్వడం (ధర్మచక్ర పరివర్తన), ధర్మచక్రం
- ✷ బుద్ధుడి మరణం లేదా పరినిర్యాణం – స్తూపం.

✪ బుద్ధుడిని పెంచిన తల్లి ప్రజాపతి గౌతమి.

✪ బుద్ధుడికి 19వ ఏట యశోధరతో వివాహం జరిగింది. వారికి రాహులుడు అనే కుమారుడు జన్మించాడు.

✪ బుద్ధుడు కపిలవస్తు నగరంలో వృద్ధుడిని, వ్యాధిగ్రస్తుడిని, శవాన్ని, సన్యాసిని చూసి పరివర్తన చెందాడు.

✪ బుద్ధుడు తన 29వ ఏట ఇల్లు విడిచి వెళ్లాడు. దీన్నే 'మహాభినిష్క్రమణం' అంటారు.

✪ బుద్ధుడి ప్రధాన గురువులు అలరక, ఉద్దారక.

✪ బుద్ధుడు అలారకలామ అనే గురువు వద్ద సాంఖ్య దర్శనాన్ని నేర్చుకున్నాడు.

- రుద్రవీరామపుత్ర అనే గురువు వద్ద యోగాభ్యాసం అధ్యయనం చేశాడు.
- బుద్ధగయలో సుజాత అనే కర్షక బాలిక బుద్ధుడికి క్షీరాన్నం (గంజి) ఇచ్చింది.
- సిద్ధార్థుడు తన 35వ ఏట 40 రోజుల ధ్యానం అనంతరం జ్ఞానోదయం పొందాడు. దీన్నే 'సంబోధి'అంటారు.
- సిద్ధార్థుడు నేటి బిహార్‌లోని గయలో రావిచెట్టు కింద 40 రోజులు తపస్సు చేశాడు.
- బుద్ధుడి తపస్సును భగ్నం చేయడానికి మార అనే దుష్టశక్తి ప్రయత్నించగా భూదేవి వచ్చి మారను శిక్షించింది. ఈ విషయాన్నే బౌద్ధ సాహిత్యంలో భూస్పర్శముద్రగా పేర్కొంటారు.
- బుద్ధుడి రథసారధి పేరు చెన్నుడు. బుద్ధుడి గుర్రం పేరు కంఠక.
- బుద్ధుడు తన తొలి ఉపదేశాన్ని సారనాథ్ (ఉత్తర్‌ప్రదేశ్ లోని జింకలతోట/ మృగదావనం)లో తన పూర్వ సహచరులైన అయిదుగురు స్నేహితులకు బోధించాడు. దీన్నే 'ధర్మచక్ర ప్రవర్తన' లేదా 'ధర్మచక్ర పరివర్తన' అంటారు
- బుద్ధుడి బోధనలను ఆర్య సత్యాలు (Nobel Truths) అంటారు. ఆర్య సత్యాలు నాలుగు. అవి:

  1. ప్రపంచం దుఃఖమయం
  2. దుఃఖానికి కారణం కోరికలు
  3. దుఃఖం పోవాలంటే కోరికలు అంతమవ్వాలి
  4. కోరికలు అంతం కావడానికి అష్టాంగ మార్గం అనుసరించాలి.

- దుఃఖ నివారణకు, మోక్షసాధనకు బుద్ధుడు చూపిన మార్గం లేదా చెప్పిన సూత్రాలే 'అష్టాంగ మార్గం.'

**అష్టాంగ మార్గంలోని ఎనిమిది సూత్రాలు**

1. సరైన జీవనం
2. సరైన వాక్కు
3. సరైన క్రియ
4. సరైన ధ్యానం
5. సరైన నిశ్చయం
6. సరైన దృష్టి
7. సరైన ఆలోచన
8. సరైన శ్రమ.

- బౌద్ధమత గ్రంథాలను త్రిపీఠకాలు అంటారు.

  1. వినయ
  2. సుత్త
  3. అభిదమ్మ.

- బుద్ధుడు, ధర్మం, సంఘాలను బౌద్ధ త్రిరత్నాలుగా పేర్కొంటారు.(బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి).

**రచయిత: బొత్స నాగరాజు**

# చరిత్ర

## ఆర్య నాగరికత

ఆర్య నాగరికత ప్రాచీన భారతీయ నాగరికతలో రెండోది. తొలి ఇనుప యుగ నాగరికతగా పేరొందింది. ఇది క్రీ.పూ. 1500 నుంచి క్రీ.పూ. 600 వరకు కొనసాగింది. ఆర్యుల చరిత్రకు ఆధారం వేదాలు కాబట్టి వారి నాగరికతను వేద నాగరికత అని కూడా పేర్కొంటారు. ఆర్య నాగరికతను తొలి వేద నాగరికత, మలి వేద నాగరికతగా విభజించారు. భారతదేశంపైకి దండెత్తి వచ్చిన తొలి విదేశీయులుగా ఆర్యులను ప్రస్తావిస్తారు. ఆర్యుల జన్మస్థలంపై అనేక సిద్ధాంతాలున్నాయి. 'ఆర్య ద్రావిడ దంపతులకు జన్మించిన బిడ్డే హైందవ నాగరికత లేదా హిందూ మతం' అని రవీంద్రనాథ్ ఠాగూర్ పేర్కొన్నారు.

### వేద సాహిత్యం

ఆర్యుల చరిత్రకు ప్రధాన ఆధారం వేద సాహిత్యం. ఇందులో నాలుగు వేదాలు, నాలుగు ఉప వేదాలు, ఆరు వేదాంగాలు, 180 ఉపనిషత్తులు, అరణ్యకాలు, బ్రాహ్మణాలు ఉన్నాయి.

★ వేదాలు నాలుగు. 1) రుగ్వేదం 2) యజుర్వేదం 3) సామవేదం 4) అధర్వణ వేదం.

**రుగ్వేదం:** దీన్ని స్తోత్ర వేదంగా పేర్కొంటారు. రుగ్వేదాన్ని పది మండలాలుగా విభజించారు. ఇందులో 1028 శ్లోకాలున్నాయి. దేవతలను స్తుతిస్తూ ఉండే శ్లోకాలు/ పాటలనే రుక్కులు అంటారు. ఇంద్రుడిపై 250 శ్లోకాలు, అగ్ని దేవుడిపై 200 శ్లోకాలు ఉన్నాయి. పదో మండలంలో ఉన్న పురుష సూక్తంలో వర్ణ వ్యవస్థ గురించిన ప్రస్తావన కనిపిస్తుంది. ఇది ప్రాచీన వేదం. క్రీ.పూ. 1500 నుంచి 1000 వరకు ఉన్న ఈ వేదకాలాన్నే రుగ్వేద సంస్కృతి లేదా తొలి వేద నాగరికత అని పేర్కొంటారు. రుగ్వేదంలో గాయత్రి మంత్రం, పెండ్లి శ్లోకం ఉన్నాయి.

**యజుర్వేదం:** యజ్ఞ యాగాల గురించి వివరించే వేదం. దీన్ని క్రతు సూత్రాల వేదం అని కూడా అంటారు. దీనిలో అధర్వు పౌరోహిత్య విధానాన్ని పేర్కొన్నారు. ప్రకృతిని వశపరచుకునే మంత్రాలు ఉన్నాయి. అతి ప్రాచీనమైన గద్య రచన ఈ వేదంలో కనిపిస్తుంది.

**సామవేదం**: శ్రావ్య వేదంగా పేర్కొనే సామవేదంలో సంగీత మూలాలు ఉన్నాయి. స్తోత్రాల గ్రంథంగా అభివర్ణిస్తారు. ఉద్గాత్రి పౌరోహిత్య విధానం ఇందులో ఉంది.

**అధర్వణవేదం:** భూత ప్రేతాలను, రోగాలను పారద్రోలే మంత్రాలు ఉన్న వేదం. వ్యవసాయం, వైద్య సంబంధిత మూలాలు ఈ వేదంలో ఉన్నాయి. దీన్ని ఆర్యేతరుల వేదంగా చరిత్రకారులు విశ్వసిస్తారు. గిరిజన జాతుల మూఢ నమ్మకాలను కూడా ఈ వేదం వివరిస్తుంది.

★ ఉపవేదాలు నాలుగు. 1) ఆయుర్వేదం 2) శిల్పవేదం 3) గాంధర్వవేదం 4) ధనుర్వేదం

★ వేదాంగాలు ఆరు. 1) శిక్ష (ధ్వనిశాస్త్రం) 2) ఛందస్సు 3) వ్యాకరణ 4) నిరుక్త 5) జ్యోతిష్య 6) కల్ప

**బ్రాహ్మణాలు:** యజ్ఞ యాగాది క్రతు విజ్ఞానాన్ని అందిస్తాయి. కర్మ మార్గాన్ని ప్రచారం చేస్తాయి. గణిత, ఖగోళశాస్త్రాల్లాంటి భారతీయ శాస్త్ర విజ్ఞానాలకు సంబంధించిన మూలాలు బ్రాహ్మణాల్లోనే ఉన్నాయి. బలి విధానాలను వివరిస్తాయి. ఐతరేయ బ్రాహ్మణం రుగ్వేదానికి అనుబంధమై ఉంది. రాజు ధర్మపాలన చేయాలని పేర్కొనేది శతపథ బ్రాహ్మణం.

**అరణ్యకాలు:** వీటికి శబ్దపరంగా అటవీ పుస్తకాలు అనే అర్థం వస్తుంది. ఇవి మార్మిక, యాగ ప్రతీక వాదాలతోపాటు పౌరోహిత్య తత్వాన్ని వివరిస్తాయి. బలి, కర్మల కంటే ధ్యాన పద్ధతులపై ఎక్కువగా దృష్టిని కేంద్రీకరిస్తాయి. బ్రాహ్మణాల కర్మ మార్గానికి, ఉపనిషత్తుల జ్ఞాన మార్గానికి మధ్యస్థంగా ఉన్నవే అరణ్యకాలు.

**ఉపనిషత్తులు:** ఇవి తాత్వికమైన గ్రంథాలు. జ్ఞాన మార్గానికి అధిక ప్రాధాన్యమిస్తాయి. ఉపనిషత్తులనే వేదాంతాలు అంటారు. భారతదేశంలోని అన్ని మతాల తాత్విక చింతనలు ఉపనిషత్తుల నుంచే ఆవిర్భవించాయి. భారతీయ ఆధ్యాత్మిక చింతన వీటిలోనే పరాకాష్ఠను పొందింది. స్వామి వివేకానంద ఉపనిషత్తుల బోధినలకు అధిక ప్రాధాన్యమిచ్చారు.

# తొలి వేదకాలం/ రుగ్వేద సంస్కృతి

## క్రీ.పూ. 1500 – 1000

★ ఆర్యుల జన్మస్థలం ఆర్కిటిక్ ప్రాంతమని బాలగంగాధర్ తిలక్ పేర్కొన్నారు.

★ మధ్య ఆసియా నుంచి వచ్చారని మాక్స్ ముల్లర్, ధృవ ప్రాంతవాసులని ఎ.సి. డార్న్ పేర్కొన్నారు.

★ తొలి వేద ఆర్యులు సప్త సింధు ప్రాంతంలో జీవించారు.

★ సింధు ప్రజలను వీరు దాస్యులుగా సంబోధించారు.

★ ఆర్యుల వలసలను తెలియజేసే విదేశీ ఆధారం భోగజ్‌కోయి శాసనం. ఇది ఇరాక్ ప్రాంతంలో (మధ్య ఆసియా – కవడోషియా) బయల్పడింది.

★ ఆర్య నాగరికత భారతదేశంలో తొలి ఇనుప యుగ నాగరికత. క్రీ.పూ. 1500లో భారతదేశంలో తొలిసారిగా ఆర్యులే ఇనుమును ఉపయోగించారు.

★ కుటుంబ అధిపతిని గృహపతి అనేవారు. పితృస్వామిక కుటుంబ జీవన విధానం ఉండేది.

★ గ్రామాధిపతిని గ్రామణి అనేవారు.

★ రాజును రాజన్ అని, రాజ్యాన్ని జనపథం అని పిలిచేవారు. రాజుకు పరిపాలనలో సేనాని, పురోహిత అనే ఉద్యోగులు తోడ్పడేవారు. సభ, సమితి అనేవి రాజుకు పరిపాలనలో సహాయపడేవి.

★ తొలి వేదకాలంలో రాజు బలి, భాగ అనే పన్నులు వసూలు చేసేవాడు. బలి అంటే యజ్ఞ యాగాల సమయంలో వసూలు చేసే పన్ను.

★ భాగ అనేది తెగ సభ్యులు (ప్రజలు) చెల్లించే పన్ను.

★ రాజ్యాన్ని జనపదాలు – విస్‌లు – గ్రామాలుగా విభజించారు. సభ, సమితితో పాటు విడత, గణం అనే సభలు కూడా తొలి వేదకాలంలో ఉండేవి.

★ రుగ్వేద కాలంలో వ్రజపతి (పచ్చికబయళ్ల సంరక్షకుడు) అనే అధికారి ప్రస్తావన ఉంది.

★ దశరాజ్ఞ యుద్ధం గురించి రుగ్వేదం వివరిస్తుంది. రావి (పరుష్ని) నది ఒడ్డున ఈ యుద్ధం జరిగింది. భరత తెగకు చెందిన సుదాసుడు అనార్య తెగలను ఓడించాడు.

★ భరత, పురు తెగలు కలిసి కురు తెగగా మారారు.

★ తొలి వేదకాలంలో పశుపోషణ, వ్యవసాయం ప్రధాన వృత్తిగా ఉండేవి.

★ సంపదకు సూచిక గోవులు. పశు సంపద కోసమే యుద్ధాలు జరిగేవి.

★ తొలి వేదకాలంలో నిష్క అనే బంగారు నాణెం వాడుకలో ఉండేది. నాటి ఆర్యుల ప్రధాన దైవం ఇంద్రుడు.

★ తొలి వేదకాలంలో వర్ణ వ్యవస్థ లేదు. కానీ వర్ణ వ్యవస్థ గురించి వివరించే ఆధారం రుగ్వేదంలోని పురుష సూక్తంలో ఉంది.

★ చాతుర్వర్ణ వ్యవస్థ ఉండేది. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అనే నాలుగు వర్ణాలు ఉండేవి.

★ వృత్తుల ప్రాతిపదికన సైనికులు, పురోహితులు, సామాన్య ప్రజలు అనే మూడు వర్గాలను చరిత్రకారులు పేర్కొన్నారు.

★ రుగ్వేద కాలంలో స్త్రీ స్థానం ఎంతో ఉన్నతంగా ఉండేది. సాంఘిక దురాచారాలు అమల్లోలేవు. గార్గి, మైత్రేయి, లోపాముద్ర లాంటి స్త్రీ రచయితలు ప్రసిద్ధిగాంచారు. అపాల విశ్వవర, ఘోష లాంటి స్త్రీలు రుగ్వేదంలోని కొన్ని రుక్కులను సంతరించారు.

**రచయిత: బొత్స నాగరాజు**

# భారతదేశ చరిత్ర

## మౌర్యుల చరిత్రకు ఆధారాలు

### మౌర్య సామ్రాజ్యం (క్రీపూ. 321 - క్రీపూ. 184)

మగధను పరిపాలిస్తున్న చివరి నంద రాజైన ధననందుడిని ఓడించిన చంద్రగుప్త మౌర్యుడు క్రీ.పూ. 321లో మౌర్య సామ్రాజ్యాన్ని స్థాపించాడు. మౌర్యుల్లో గొప్పవాడు అశోకుడు. చివరి మౌర్య చక్రవర్తి బృహద్రధుడిని చంపి క్రీ.పూ. 184లో పుష్యమిత్ర శుంగుడు శుంగ వంశాన్ని స్థాపించాడు.

★ కౌటిల్యుడు రచించిన అర్థశాస్త్రం మౌర్యుల రాజకీయ చరిత్రకు ప్రధాన ఆధారం. దీన్ని సంస్కృత భాషలో రాశారు. ఇందులో 15 అధికరణాలు (అధ్యాయాలు) ఉన్నాయి.

★ ఇది రాజనీతి, గూఢచారి వ్యవస్థ, ఉద్యోగుల అవినీతి లాంటి విషయాలను వివరిస్తుంది.

★ ఆర్. శ్యామశాస్త్రి ఈ గ్రంథాన్ని 1904లో కనుక్కొని, 1924 నాటికి ఆంగ్లంలోకి అనువదించారు.

★ మరొక ప్రధాన ఆధార గ్రంథం – మెగస్తనీస్ రచించిన 'ఇండికా'. ఈ గ్రంథం మౌర్యుల కాలంనాటి సాంఘిక, ఆర్థిక పరిస్థితులను వివరిస్తుంది.

★ సైనిక పాలన, నగర పాలన (పాటలీపుత్ర నగరం), వర్ణ వ్యవస్థ, బానిస విధానం మొదలైన విషయాలను మెగస్తనీస్ ఇండికాలో వివరించాడు. ఆ రోజుల్లో 7 ప్రధాన కులాలున్నాయని రాశాడు.

★ క్రీ.శ. అయిదో శతాబ్దంలో (గుప్తుల కాలం) విశాఖదత్తుడు రాసిన ముద్రారాక్షసం మౌర్య రాజ్య స్థాపనను, విష్ణుపురాణం మౌర్య వంశానుక్రమాన్ని వివరిస్తాయి.

★ బౌద్ధ జాతక కథలు, దిఘనికాయ, వంశథపకాశిని లాంటి బౌద్ధ సాహిత్యం నాటి సామాజిక ఆర్థిక పరిస్థితులను, బౌద్ధమత ప్రభావాన్ని, మౌర్యుల క్షత్రియ మూలాలకు సంబంధించిన సమాచారాన్ని అందిస్తాయి.

★ శ్రీలంక/ సింహళ బౌద్ధ గ్రంథాలైన దీపవంశం, మహావంశం అశోకుడు బౌద్ధమత వ్యాప్తికి చేసిన కృషిని వివరిస్తాయి.

★ హేమచంద్రుడు రచించిన పరిశిష్ఠ పర్వం చంద్రగుప్త మౌర్యుడు జైన మతాన్ని స్వీకరించడం, జైన మతాన్ని దక్షిణ భారతదేశానికి విస్తరించడాన్ని వివరిస్తుంది.

★ అశోకుడు వేయించిన 14 ప్రధాన శిలా శాసనాలు, 7 చిన్న రాతిస్తంభ శాసనాలు, 84 వేల స్తూపాలు మౌర్యుల చరిత్రకు ప్రధాన పురావస్తు ఆధారాలు.

★ అశోకుడి శాసనాల్లోని బ్రాహ్మీ లిపిని 1837లో జేమ్స్ ప్రిన్సెప్ అనే కంపెనీ ఉద్యోగి చదివి వివరించాడు (పరిష్కరించాడు).

★ అశోకుడి శాసనాలు అధికంగా ప్రాకృత భాషలో, బ్రాహ్మీలిపిలో ఉన్నాయి.

★ భారతదేశంలో తొలి శాసన సాహిత్యం అశోకుడి శాసనాలే.

★ అశోకుడి శాసనాలకు వినియోగించిన రాళ్లను చూనార్ నుంచి తెప్పించారు.

★ రాజ్య సరిహద్దుల్లో ప్రధాన శిలాశాసనాలు, రాజ్య అంతర్భాగంలో చిన్న రాతి స్తంభ శాసనాలు వేశారు.

★ సరిహద్దుల్లో వేసిన శాసనాలు ఖరోష్ఠి లిపిలో ఉన్నాయి. ఖరోష్ఠి లిపిని కుడి నుంచి ఎడమకు రాస్తారు.

★ దశరథుడు వేయించిన నాగార్జునకొండ గుహ శాసనం అజీవకులకు గుహలను దానం చేసిన విషయాన్ని తెలియజేస్తుంది.

★ జునాఘడ్ శాసనం (రుద్రదమనుడు) పుష్యగుప్తుడు సుదర్శన తటాకం తవ్వించడం గురించి వివరిస్తుంది.

★ సోహ్‌గౌర, మహాస్థాన్ శాసనాలు చంద్రగుప్త మౌర్యుడి కాలంనాటి కరవు సహాయక చర్యల గురించి వివరిస్తున్నాయి.

★ మౌర్యుల కాలంనాటి ప్రధాన వెండి నాణెం పణ. నాటి నాణేలు విద్ధాంక నాణేలు (Punch Marked Coins) గా ప్రసిద్ధి చెందాయి (కర్షపణ నాటి రాగి నాణెం).

- ★ నాటి కుండలు నలుపురంగులో ఉండేవి. వీటిని నార్తరన్ బ్లాక్ పాలిష్డ్ పాత్రలు అంటారు. నాటి శాసన స్తంభాలు, స్తూపాలపై చిత్రించిన, చెక్కిన జంతువుల బొమ్మలు నాటి కళా నైపుణ్యాన్ని చాటుతున్నాయి.

**రాజకీయ చరిత్ర**

**చంద్రగుప్త మౌర్యుడు (క్రీపూ. 321 - 297)**

- ★ ఇతడు క్రీ.పూ 321లో చివరి నంద వంశ రాజు ధననందుడిని ఓడించి పాటలీపుత్రాన్ని ఆక్రమించి మౌర్య సామ్రాజ్యాన్ని, మౌర్య వంశాన్ని స్థాపించాడు. మౌర్య వంశ, రాజ్య స్థాపకుడు చంద్రగుప్త మౌర్యుడే.
- ★ రాజ్యస్థాపనలో చంద్రగుప్త మౌర్యుడికి చాణక్యుడు/ కౌటిల్యుడు/ విష్ణుగోపుడు అనే వ్యక్తి సహకరించాడు.
- ★ క్రీ.పూ. 305 లో వాయవ్య భారతదేశాన్ని పరిపాలిస్తున్న సెల్యూకస్ నికేటర్‌ను ఓడించి, అతని కుమార్తె హెలీనాను పెళ్లి చేసుకున్నాడు.
- ★ సెల్యూకస్ నికేటర్‌కు (అలెగ్జాండర్ ప్రతినిధి) చంద్రగుప్త మౌర్యుడు 500 ఏనుగులను బహుమతిగా పంపాడు.
- ★ సెల్యూకస్ నికేటర్ మెగస్తనీస్ అనే గ్రీకు రాయబారిని చంద్రగుప్త మౌర్యుడి ఆస్థానానికి పంపాడు.
- ★ మెగస్తనీస్ గ్రీకు భాషలో ఇండికా గ్రంథాన్ని రచించాడు. ఇండికా గ్రంథం అసలు ప్రతి లభించడం లేదు. నాటి గ్రీకు రచయితల రచనల్లోని ఇండికా ఆధారంగా నాటి భారతదేశ సాంఘిక, ఆర్థిక పరిస్థితులు తెలుసుకున్నారు.
- ★ చంద్రగుప్త మౌర్యుడి కాలంలోనే పుష్యగుప్తుడు గుజరాత్/ సౌరాష్ట్రలో సుదర్శన తటాకాన్ని తవ్వించాడు.
- ★ చంద్రగుప్త మౌర్యుడిని పురాణాలు, ముద్రారాక్షసం గ్రంథాలు శూద్రుడిగా, గ్రీకు, జైన మత గ్రంథాలు హీనకులజుడిగా, బౌద్ధ మత గ్రంథాలు క్షత్రియుడిగా పేర్కొంటున్నాయి (మహా వంశం).
- ★ పిప్పిలి వనంలో మౌర్యులు అనే క్షత్రియ తెగ ఉండేదని దిఘనికాయలో పేర్కొన్నారు.
- ★ చంద్రగుప్త మౌర్యుడు భద్రబాహుని సలహాపై దిగంబర జైన మతాన్ని స్వీకరించి, కర్ణాటకలోని శ్రావణ బెళగొళలో సల్లేఖన వ్రతాన్ని ఆచరించాడు. అక్కడి కొండను చంద్రగుప్త బసదిగా పిలుస్తారు (పరిశిష్ఠ పర్వం గ్రంథంలో హేమచంద్రుడు పేర్కొన్నాడు)
- ★ శ్రావణ బెళగొళలో గోమఠేశ్వర విగ్రహాన్ని పశ్చిమ చాళుక్యుల మంత్రి చాముండ రాయుడు ఏర్పాటు చేశాడు. అక్కడ 12 సంవత్సరాలకు ఒకసారి మహామస్తకాభిషేకం నిర్వహిస్తారు.

**బిందుసారుడు క్రీపూ 297 - 273**

- ★ చంద్రగుప్త మౌర్యుడి అనంతరం అతడి కుమారుడు బిందుసారుడు రాజయ్యాడు. ఇతడి భార్య పేరు సుభద్రాంగి.
- ★ బిందుసారుడి బిరుదు 'అమిత్రఘాత/ అమిత్రో ఖేటస్ (శత్రు సంహారకుడు).
- ★ బిందుసారుడి కాలంలో సిరియా రాజు మొదటి ఆంటియోకస్ పంపిన రాయబారి డయమోకస్ / డైమాకస్ భారతదేశానికి వచ్చాడు.
- ★ పింగళి వత్సలుడు అనే అజీవక మతానికి చెందిన జ్యోతిష్కుడు బిందుసారుడి ఆస్థానంలో ఉండేవాడు.
- ★ బిందుసారుడి కాలంలో పెద్ద కుమారుడు సుమన తక్షశిలకు, అశోకుడు ఉజ్జయినికి గవర్నర్‌లుగా (కుమారామాత్యులు) పనిచేశారు.
- ★ తక్షశిలలో వచ్చిన ప్రజా తిరుగుబాటును అణిచివేసిన అశోకుడు అక్కడ కుమారామాత్యుడిగా పనిచేశాడు
- ★ ఆర్యమంజుశ్రీ రాసిన మూలకల్ప గ్రంథం బిందుసారుడి గురించి వివరిస్తుంది.
- ★ చాణక్యుడు బిందుసారుడి వద్ద కూడా కొంతకాలం ప్రధానమంత్రిగా పని చేసినట్లు తారానాథుడు అనే టిబెట్ చరిత్రకారుడు పేర్కొన్నాడు.

**అశోకుడు (క్రీపూ. 273 - 232)**

- ★ అశోకుడు బిందుసారుడు, సుభద్రాంగిల కుమారుడు.
- ★ అశోకుడి బిరుదులు: దేవానాంప్రియ, ప్రియదర్శి

★ అశోకుడు అనే పేరున్న మస్కి శాసనం 1915లో కర్ణాటకలో లభించింది (రాణ్యు అశోక్ అనే పేరున్న కనగనహళ్లి శాసనం కర్ణాటకలో లభించింది).

★ అశోకుడు మొదట ఉజ్జయినికి, తర్వాత తక్షశిలకు యువరాజు/ అమాత్యుడు/ కుమారామాత్యుడు/ గవర్నర్‌గా పని చేశాడు.

★ అశోకుడి పట్టపు రాణిగా అసంధిమిత్రను పేర్కొంటారు.

★ అశోకుడి కుమారులు: మహేంద్రుడు, తివార, కుణాలుడు, జలౌకుడు

★ కుమార్తెలు: సంఘమిత్ర, చారుమతి

★ చారుమతి దేవపాలుడు అనే నేపాల్ రాజవంశీయుడిని వివాహం చేసుకుంది.

★ మహేంద్ర, సంఘమిత్ర సింహళంలో బౌద్ధ మతాన్ని ప్రచారం చేశారు.

★ శాసనాల్లో పేర్కొన్న అశోకుడి ఏకైక కుమారుడు తివార.

★ అశోకుడి పట్టాభిషేకం క్రీ.పూ. 269లో జరిగింది.

★ అశోకుడు క్రీ.పూ. 261లో కళింగ యుద్ధం చేశాడు. నాటి కళింగ పాలకుడు అనంత పద్మనాభుడు. కళింగ యుద్ధం గురించి అశోకుడి 13వ శిలాశాసనం వివరిస్తోంది.

★ 13వ శిలాశాసనాన్నే దౌళి/ జౌగాడ శాసనం అంటారు. ఈ శాసనంలో అశోకుడు తను పాలనకు వచ్చిన తొమ్మిదో పాలనా సంవత్సరంలో కళింగ యుద్ధం చేసినట్లు పేర్కొన్నాడు.

★ 'అశోకుడి జీవితంలో కళింగ యుద్ధం ఒక మలుపు' అని రాయ్‌చౌదరి అనే చరిత్రకారుడు వ్యాఖ్యానించాడు.

★ 'యుద్ధంలో విజయం సాధించి యుద్ధాన్ని త్యజించిన ఏకైక పాలకుడు అశోకుడు' అని హెచ్.జి. వెల్స్ అనే చరిత్రకారుడు పేర్కొన్నాడు.

★ 'సీజరు వచ్చి తెలుసుకుని జయించాడు. అశోకుడు జయించి తెలుసుకున్నాడు' అని లారెన్స్ బనియన్ పేర్కొన్నాడు.

★ దక్షిణా పథానికి వెళ్లే భూ, జల మార్గాలు కళింగ ఆధీనంలో ఉండటంతో అశోకుడు కళింగ యుద్ధం చేశాడు.

★ అశోకుడి బౌద్ధ మత గురువు ఉపగుప్తుడు.

★ అశోకుడి ప్రధానమంత్రిగా పని చేసిన వ్యక్తి రాధాగుప్తుడు.

★ అశోకుడు సోన, ఉత్తర అనే ఉద్యోగులను బర్మా దేశానికి పంపించి, బౌద్ధాన్ని వ్యాప్తి చేయించాడు.

★ క్రీ.పూ. 250లో అశోకుడు పాటలీపుత్రంలో మొగలిపుత్త తిస్స అధ్యక్షతన మూడో బౌద్ధ సంగీతిని నిర్వహించాడు.

★ మూడో బౌద్ధ సంగీతిలోనే అభిదమ్మ పీటకాన్ని రాశారు.

★ అశోకుడు ప్రచారం చేసిన నైతిక నియమాలను 'ధమ్మ' అంటారు.

★ ధమ్మ ప్రాకృత పదం, ధర్మ అనేది సంస్కృత పదం.

★ అశోకుడు ధర్మ సిద్ధాంతాన్ని ప్రచారం చేయడానికి ధర్మ మహామాత్రులు అనే ఉద్యోగులను నియమించినట్లు అయిదో శిలాశాసనం వివరిస్తోంది.

**అశోకుడికి సమకాలీనులైన ప్రపంచ పాలకులు**

సిరియా రాజు - రెండో ఆంటియోకస్

ఈజిప్ట్ రాజు - మూడో టాలమీ

మాసిడోనియా రాజు - గోనాటస్

ఎపిరస్ రాజు - అలెగ్జాండర్

★ చివరి మౌర్య వంశ చక్రవర్తి బృహద్రధుడిని క్రీ.పూ.184లో ఓడించిన పుష్యమిత్ర శుంగుడు మగధలో శుంగ వంశాన్ని స్థాపించాడు.

★ చివరి శుంగ వంశ రాజు దేవభూతిని చంపి వసుదేవ కణ్వుడు కణ్వ వంశాన్ని స్థాపించాడు.

★ చివరి కణ్వ వంశ రాజు సుశర్మను చంపింది శాతవాహన రాజు మొదటి పులోమావి.

## మౌర్యుల సంస్కృతి - పాలనకు సంబంధించిన అంశాలు

మౌర్యులు తమ సామ్రాజ్యాన్ని ఆహారాలు (రాష్ట్రాలు), విషయాలు (జిల్లాలు), గ్రామాలుగా విభజించారు. రాజుకు పరిపాలనలో సాయం చేసేందుకు మంత్రి పరిషత్ ఉండేది.

✧ 'మంత్రి పరిషత్ రాజు శకటంలో ఒక చక్రం లాంటిది' అని కౌటిల్యుడు పేర్కొన్నాడు.

✧ రాజ్యాన్ని ఉత్తరాపథం (తక్షశిల), దక్షిణాపథం (సువర్ణగిరి), అవంతీపథం (ఉజ్జయిని), తూర్పుపథం/ కళింగపథం (తోసాలి/ దౌళి)గా విభజించారు.

✧ రాష్ట్రాలకు పాలకులుగా రాజకుమారులను నియమిస్తే వారిని కుమారామాత్యులు అనేవారు.

✧ రాష్ట్ర పాలకులుగా రాజ కుటుంబీకులు నియమితులైతే, వారిని ఆర్య పుత్రులు అనేవారు.

✧ కోశాధికారిని సన్నిధాత అని, పన్ను వసూలు అధికారిని సమాహర్త అని, శాంతి భద్రతల పరిరక్షక అధికారిని దండపాలుడు అని, అకౌంటెంట్ జనరల్‌ను అక్షపటలిక అని పిలిచేవారు.

✧ ప్రాదేశిక, యుక్త, రజ్జుక అనే రెవెన్యూ ఉద్యోగులు పాలనలో సహాయపడేవారు.

✧ నాటి గూఢచారి వ్యవస్థ గురించి కౌటిల్యుడు అర్థశాస్త్రంలో వివరించాడు.

✧ మగ గూఢచారులను 'గూఢ పురుషులు' అని, స్త్రీ గూఢచారులను 'సత్రిన్'లు అని పిలిచేవారు.

✧ సరిహద్దు ప్రాంతాల గవర్నర్‌లను అంతమహామాత్రులు అనేవారు.

✧ నాటి ప్రధాన రెవెన్యూ ఉద్యోగి రజ్జుక. రజ్జుకకు యుక్త అనే అధికారి సహాయపడేవారు.

✧ గ్రామ అధిపతిని గ్రామికుడు అనేవారు.

✧ 100 గ్రామాలపై అధిపతిని 'స్థానికుడు' అని, 10 గ్రామాలపై అధిపతిని 'గోప' అని పేర్కొన్నారు.

✧ జిల్లా అధికారినే 'రజ్జుక' అని పిలిచేవారు.

✧ పాటలీపుత్ర నగర పాలన గురించి మెగస్తనీస్ ఇండికాలో వివరించాడు. 30 మంది సభ్యులు ఉన్న కమిటీ ఆరు ఉప కమిటీలుగా విడిపోయి, నగర పాలన చేసేదని పేర్కొన్నాడు.

✧ నాగరికుడికి గోప, స్థానిక అనే అధికారులు పాలనలో తోడ్పడేవారు.

✧ అశోకుడు తన శాసనాల్లో గూఢచారులను పతివేదకులు, పులిసానులు అని ప్రస్తావించాడు.

✧ సివిల్ న్యాయ స్థానాలను ధర్మస్థీయ అని, క్రిమినల్ న్యాయస్థానాలను కంఠక శోధన అని పిలిచారు.

✧ మౌర్యుల సైన్యంలో 6 లక్షల పదాతి దళం, 30 వేల అశ్విక దళం, తొమ్మిదివేల గజ దళం, వెయ్యి రథాలు ఉన్నట్లు ప్లినీ పేర్కొన్నాడు.

✤ అశోకుడు దేశవ్యాప్తంగా 84 వేల స్తూపాలను నిర్మించాడు.

✤ అశోకుడి స్తూపాల్లో సాంచి, సారనాథ్, బార్హూత్ స్తూపాలు ప్రసిద్ధి చెందాయి.

✤ అశోకుడు బౌద్ధ మతం స్వీకరించినట్లు భబ్రు శాసనం వివరిస్తోంది.

✤ భారత జాతీయ చిహ్నమైన సింహతలాటంను సారనాథ్ స్తూపం నుంచి గ్రహించారు.

✤ సాంచి స్తూపం మధ్యప్రదేశ్‌లోని భోపాల్ వద్ద (విదిశ ప్రాంతంలో) ఉంది.

✤ సారనాథ్ స్తూపం ఉత్తర్ ప్రదేశ్‌లో ఉంది.

**రచయిత: బొత్స నాగరాజు**

# భారతదేశ చరిత్ర

## బౌద్ధ మతం

★ బుద్ధుడి తొలి జీవితం గురించి బౌద్ధ జాతక కథలు వివరిస్తాయి.

★ బౌద్ధ మత పవిత్ర గ్రంథాలైన త్రిపీటకాలు పాళీ భాషలో ఉన్నాయి.

★ భారతదేశంలో పుట్టిన బౌద్ధ మతం ప్రపంచ మతంగా అభివృద్ధి చెందింది.

★ వినయ పీటకం బౌద్ధ సంఘ నియమ నిబంధనలను, సుత్త పీటకం బుద్ధుడి బోధనలను, అభిదమ్మ పీటకం బౌద్ధ దమ్మ వేదాంతాన్ని వివరిస్తాయి.

★ బౌద్ధ మతానికి చెందిన ముఖ్య నిర్మాణాలు

1. స్తూపం

2. చైత్యం

3. విహారం

★ బుద్ధుడి ధాతువులపై నిర్మించిన పొడవైన స్తంభాన్ని స్తూపం అంటారు. ఇది బుద్ధుడి మహా నిర్యాణానికి ప్రతీక.

★ బౌద్ధ మతస్తుల పూజా గృహాన్ని చైత్యం అంటారు. ఇది మహాయానులకు చెందింది.

★ బౌద్ధ భిక్షువుల విశ్రాంతి గృహాలను విహారాలు అంటారు.

★ స్తూప, చైత్య, విహారాలు ఒకే చోట ఉంటే దాన్ని బౌద్ధ ఆరామంగా పేర్కొన్నారు.

★ బౌద్ధ ఆరామాలు నాడు ప్రసిద్ధ విద్యా కేంద్రాలుగా అభివృద్ధి చెందాయి.

★ భారతదేశంలో తొలి బౌద్ధ  విశ్వవిద్యాలయంగా నాగార్జున కొండ విశ్వవిద్యాలయం పేరొందింది.

★ భారతదేశంలో తొలి విశ్వవిద్యాలయం తక్షశిల, ప్రసిద్ధి చెందిన విశ్వవిద్యాలయం నలంద.

★ విహార దేశంగా పేరొందిన రాష్ట్రం బిహార్

★ గాంధార, అమరావతి శిల్ప కళలు బౌద్ధ మత ప్రేరణతో అభివృద్ధి చెందాయి.

★ సాంచీ స్తూపం మధ్యప్రదేశ్‌లోని భోపాల్ దగ్గర ఉంది.

★ సారనాథ్ స్తూపం ఉత్తర్ ప్రదేశ్ రాష్ట్రంలో ఉంది.

★ పిప్రావహని భారతదేశంలో అతి ప్రాచీన స్తూపం అని పేర్కొంటారు.

★ ఆంధ్రదేశం / దక్షిణ భారతదేశంలో అతి ప్రాచీన స్తూపంగా భట్టిప్రోలు పేరుగాంచింది.

★ బుద్ధుడు బోధించిన అష్టాంగ మార్గం వల్ల బౌద్ధ మతాన్ని మధ్యేమార్గంగా పేర్కొంటారు.

★ బుద్ధుడు చెప్పిన సిద్ధాంతాన్ని ప్రతీయ - సముత్పాద సిద్ధాంతం అంటారు.

★ బుద్ధుడి జననం, జ్ఞానోదయం కలగడం, మహాపరినిర్యాణం పౌర్ణమి రోజునే జరిగాయి.

★ బుద్ధుడి మరణం తర్వాత బౌద్ధ మత అభివృద్ధి కోసం నిర్వహించిన సభలను బౌద్ధ సంగీతులు అంటారు.

(మొత్తం నాలుగు బౌద్ధ సంగీతులు జరిగాయి)

★ మొదటి బౌద్ధ సంగీతి - రాజగృహం - అజాతశత్రువు కాలం - మహాకాశ్యపుడు అధ్యక్షుడు.

★ రెండో బౌద్ధ సంగీతి కాలాశోకుడి కాలంలో వైశాలిలో జరిగింది. సబకామి దానికి అధ్యక్షుడు.

★ మూడో బౌద్ధ సంగీతి అశోకుడి కాలంలో పాటలీపుత్రంలో జరిగింది. మొగ్గలిపుతతిస్స అధ్యక్షుడు.

★ నాలుగో బౌద్ధ సంగీతి కనిష్కుడి కాలంలో కశ్మీర్/ కుందనవనంలో జరిగింది. వసుమిత్రుడు అధ్యక్షుడు.

★ మాధ్యమిక సంప్రదాయ వాదాన్ని ఆచార్య నాగార్జునుడు ప్రబోధించారు.

★ మైత్రేయనాథుడు యోగాచారవాదాన్ని ప్రారంభించాడు.

★ మాధ్యమిక వాదాన్నే శూన్యవాదంగా కూడా పేర్కొంటారు.

★ యోగాచార వాదాన్ని విజ్ఞానవాదంగా కూడా పేర్కొంటారు.

★ యోగాచార వాదం హీనయానానికి చెందిన వాస్తవిక వాదాన్ని పూర్తిగా తిరస్కరించి, పరమ ఆదర్శవాదాన్ని అంగీకరిస్తుంది.

★ ఆచార్య నాగార్జునుడు రచించిన ప్రజ్ఞాపారమితిక శాస్త్ర మహాయానుల పవిత్ర గ్రంథంగా పేరుగాంచింది.

★ అసంగుడు, వసుబంధు లాంటి రచయితలు కూడా మహాయాన సంప్రదాయాన్ని అనుసరించారు.

★ సూత్రాలంకార గ్రంథాన్ని రాసింది అసంగుడు.

★ మహాయానులు సంస్కృత భాషలో ఉన్న సొంత త్రిపీటకాలను అభివృద్ధి చేసుకున్నారు.

★ మహాయానులు వైపుల్య సూత్రాలను బుద్ధుడి ప్రకటనలుగా భావించి వాటికి అధిక ప్రాధాన్యం ఇచ్చారు.

★ సధర్మపుండరీకం, లలిత విస్తార, వజ్రచేధిక, సుఖవతి లాంటి గ్రంథాలను పవిత్రంగా భావించి, అనుసరించారు.

★ బౌద్ధ మతంలో వజ్రయానం అనే మరొక శాఖ తర్వాత కాలంలో ఏర్పడింది.

★ ఇంద్రజాలిక శక్తులు పొందడం ద్వారా మోక్షం సాధించడం ఈ వాదం వారి ఆశయం.

★ వజ్రయాన శాఖవారు బౌద్ధులు, బోధిసత్వుల భార్యలైన తారలను ప్రధాన దైవాలుగా భావించి పూజించారు.

★ వీరు తాంత్రిక పూజా విధానానికి ప్రాధాన్యం ఇచ్చారు (తంత్ర నిర్వహణ ద్వారా మంత్రం వల్లెవేయడం)

★ పాల వంశీయులు, సేన వంశీయుల కాలంలో తూర్పు భారతదేశంలో వజ్రయాన శాఖ బాగా విస్తరించింది.

★ సరాహుడు రచించిన దోహకోశ వజ్రయానానికి చెందిన ప్రసిద్ధ గ్రంథం.

★ కనిష్కుడు మహాయాన బౌద్ధాన్ని ఆచరించాడు.

★ గాంధార శిల్పకళ కనిష్కుడి కాలంలో మహాయాన బౌద్ధ మతం ప్రేరణతో అభివృద్ధి చెందింది.

★ భాగవతుడు అంటే ఆరాధనీయమైన వారిని ఆరాధించేవ్యక్తి అని అర్థం. చాందోగ్యోపనిషత్తు కృష్ణ వాసుదేవుడిని దేవకీ పుత్రుడిగా పేర్కొంది.

★ పాణిని రచన అష్టాధ్యాయిలోను, మెగస్తనీస్ ఇండికా (హెరాక్లెస్) లోను, బెస్‌నగర్ స్తంభ శాసనంలో భాగవత మత ఆరాధన గురించిన ప్రస్తావన ఉంది.

★ బెస్ నగర స్తంభ శాసనాన్ని కాశీపురానికి చెందిన శుంగరాజు భాగభద్రుడు వేయించాడు.

★ బెస్ నగర స్తంభ శాసనం గ్రీకు రాయబారి హీలియో డోరస్‌ను భాగవతుడిగా పేర్కొంది.

★ గుప్తుల కాలంలో భాగవత మతం అభివృద్ధి చెందింది.

★ నాగులు, యక్షులు, గ్రామదేవతల ఆరాధన నుంచి బ్రాహ్మణవాదం అభివృద్ధి చెందింది.

★ పంచాయతన పూజా విధానంలో గణేశుడికి అగ్రస్థానం ఇచ్చారు.

★ గుప్తయుగానంతరం భాగవత మతాన్ని వైష్ణవ మతంగా పేర్కొన్నారు. అవతార సిద్ధాంతానికి అధిక ప్రాధాన్యం లభించింది.

★ భాగవత మతం భగవద్గీత మీద ఆధారపడింది. వైష్ణవానికి క్రమంగా భాగవత పురాణం, విష్ణు పురాణాలు ప్రధాన గ్రంథాలుగా మారాయి.

★ క్రీ.శ. 100వ సంవత్సరంలో 'శాండిల్యుడు' పంచరాత్రాలను ప్రబోధించారు. ఇందులో వాసుదేవ కృష్ణుడి కుటుంబం మొత్తాన్ని తాదాత్మ్యీకరించారు.

- ★ కృష్ణుడి సోదరుడు సంకర్షణ, కృష్ణుడి కుమారుడు ప్రద్యుమ్నుడు, కృష్ణుడి మనువడు అనిరుద్ధుడు.
- ★ విఖానసుడు ప్రబోధించిన వైఖానస సంప్రదాయాన్ని అత్రి, మరీచి, భృగు, కశ్యపుడు అనే మహార్షులు ప్రచారం చేశారు.
- ★ వైఖానస సంస్కార సిద్ధాంతం విష్ణువుకు చెందిన అయిదు రూపాల భావనపై ఆధారపడి ఉంది.
- ★ బ్రహ్మ, పురుషుడు, సత్యం, అచ్యుతం, అనిరుద్ధుడు అనేవి విష్ణువు అయిదు రూపాల భావనలు.
- ★ తిరుపతి వేంకటేశ్వరస్వామి దేవాలయం, కంచి దేవాలయాలలో సంస్కృత భాషలో పూజలు నిర్వహిస్తున్న పూజారులు వైఖానసశాఖకు చెందినవారే.
- ★ దక్షిణ భారతదేశంలో వైష్ణవ భక్తులను ఆళ్వారులు అంటారు. వీరు మొత్తం పన్నెండుమంది.
- ★ నమ్మాళ్వార్, పెరియాళ్వార్, ఆండాళ్, తిరుమంగై ఆళ్వార్ వారిలో ముఖ్యమైనవారు.
- ★ ఆళ్వార్‌లలో ఉన్న ఏకైక మహిళ ఆండాళ్.
- ★ ఆండాళ్ అనే తమిళ కవయిత్రి గురించి శ్రీకృష్ణ దేవరాయలు తన 'ఆముక్తమాల్యద' గ్రంథంలో ప్రస్తావించారు.
- ★ ఆళ్వార్లు రాసిన పద్యాలు, పాటలను పాశురాలు లేదా 'ప్రబంధాలు' అంటారు.
- ★ 'తండ్రివి నీవే ఓ పరమాత్మా! అగ్ని, నీరు, ఆకాశం నీ సృష్టేనయ్యా!' అనే పాటను నమ్మాళ్వార్ రాసి పాడారు.
- ★ 'నాకేల ఇవ్వవు నీ దర్శన భాగ్యము? దాగుడు మూతలు ఏల' అని నమ్మాళ్వార్ భగవంతుడిని ప్రశ్నిస్తూ పద్యాలు రాశారు.
- ★ శంకరాచార్యులు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు త్రిమతాచార్యులు/ వైష్ణవాచార్యులుగా పేరొందారు.
- ★ శంకరాచార్యులు 'అద్వైత' మత సిద్ధాంతాన్ని ప్రబోధించారు. (కేరళలో జన్మించారు, 8వ శతాబ్దం.)
- ★ 'జీవాత్మ, పరమాత్మ ఒకటే. మోక్షసాధనకు జ్ఞానమార్గం అనుసరించడం ఒక్కటే మార్గం' అని శంకరాచార్యులు ప్రబోధించారు.
- ★ రామానుజాచార్యులు క్రీ.శ. 11వ శతాబ్దంలో విశిష్టాద్వైతాన్ని ప్రబోధించారు.
- ★ 'విష్ణువు మీద గాఢమైన భక్తి కలిగి ఉండటమే ముక్తికి ఉన్న ఏకైక మార్గం' అని రామానుజాచార్యులు పేర్కొన్నారు.
- ★ రామానుజాచార్యులపై ఆళ్వార్లు అధిక ప్రభావాన్ని చూపారు.
- ★ భారతదేశంలో భక్తి ఉద్యమ ప్రారంభికుడిగా, నిమ్నకులాల వారికి దేవాలయ ప్రవేశం కల్పించిన తొలి వ్యక్తిగా మానుజాచార్యులు పేరొందారు.
- ★ రామానుజులు ప్రచారం చేసిన విశిష్టాద్వైతాన్ని 'శ్రీవైష్ణవం' అని పేర్కొంటారు. మధ్వాచార్యులు ద్వైత మతాన్ని, వల్లభాచార్యుడు శుద్ధా ద్వైతాన్ని, నింబార్కుడు ద్వైతాద్వైతాన్ని ప్రచారం చేశారు.
- ★ బౌద్ధమతంలో చేరిన తొలి మహిళ ప్రజాపతి గౌతమి.
- ★ బౌద్ధమతంలో చేరిన వేశ్యగా ఆమ్రపాలిని పేర్కొంటారు.
- ★ బుద్ధుడు అంగుళీమాలుడు అనే బందిపోటు దొంగను బౌద్ధమతంలో చేర్చుకున్నాడు.
- ★ బుద్ధుడు కపిలవస్తు నగరంలో ఆనందుడు, దేవదత్తుడు, ఉపాలి (మంగలి) అనే వారిని బౌద్ధ సంఘంలో చేర్చుకున్నాడు.
- ★ బుద్ధుడి తొలి శిష్యుడిగా ఆనందుడిని పేర్కొంటారు.
- ★ బుద్ధుడి ప్రధాన శిష్యులు ఆనందుడు, ఉపాలి.

**రచయిత: బొత్స నాగరాజు**

# చరిత్ర

## మౌర్యుల కాలం నాటి ఆర్థిక పరిస్థితులు

- ప్రజల ప్రధాన వృత్తి వ్యవసాయం. రాజ్యానికి ప్రధాన ఆదాయం భూమి శిస్తు.
- మౌర్యుల కాలంలో భూమి శిస్తు 1/6 నుంచి 1/4 వ వంతు వరకు ఉండేది.
- వెండి నాణేలను ఫణ అని, రాగి నాణేలను కర్షపణ అని పిలిచేవారు.
- సంచార వర్తక శ్రేణులను పుగ అని, వాటి అధిపతిని సార్థవాహులు అని పిలిచేవారు.
- జాతక కథల ప్రకారం మౌర్య యుగంలో 18 రకాల చేతి వృత్తులు, పరిశ్రమలు ఉన్నాయి.
- గనుల తవ్వకం, ఆయుధాల తయారీ, మద్యం తయారీ నౌకా నిర్మాణం లాంటి రంగాల్లో ప్రభుత్వ గుత్తాధిపత్యం ఉండేది.
- గ్రీకు, శ్రీలంక (సిలోన్), బర్మా దేశంతో విదేశీ వ్యాపారం విరివిగా సాగేది.
- సుగంధ ద్రవ్యాలు, ముత్యాలు, వజ్రాలు, నూలు వస్త్రాలు, దంతపు వస్తువులు ముఖ్య ఎగుమతులుగా ఉండేవి.
- బంగారం, వెండి, గుర్రాలు లాంటివి ప్రధాన దిగుమతులు.
- అగ్రనోమోయిన్ అనే ప్రత్యేక అధికారులు రహదారుల నిర్మాణం, నిర్వహణను చూసేవారు.
- సుగంధ ద్రవ్యాలను యవనప్రియ అని పిలిచేవారు.

## సామాజిక అంశాలు

- మెగస్తనీస్ ప్రకారం సమాజంలో ఏడు కులాలు ఉన్నాయి. అవి
  1) తత్త్వవేత్తలు
  2) వ్యవసాయదారులు
  3) సైనికులు
  4) పశుపోషకులు
  5) చేతిపనివారు
  6) మెజిస్ట్రేట్‌లు
  7) కౌన్సిలర్‌లు
- మెగస్తనీస్ ఇండికా నాటి సామాజిక పరిస్థితులకు ప్రధాన ఆధారం.
- భారతదేశంలో బానిస వ్యవస్థ లేదని మెగస్తనీస్ రాశాడు.
- సాంఘిక దురాచారాలు అధికంగా ఉండేవి. భారతదేశంలో బహుభార్యత్వం పెరిగిపోతూ ఉందని మెగస్తనీస్ రాశాడు.
- వర్ణ సంకర విధానం మౌర్యుల కాలంలోనే ప్రారంభమైంది.
- స్త్రీ కళాకారులను 'గనికులు' అని పిలిచేవారు.
- జంతు బలులు, జాతరలను నిషేధిస్తున్నట్లు 1వ ప్రధాన శిలాశాసనం పేర్కొంది.
- శిక్షలు కఠినంగా, నేరాలు తక్కువగా ఉండేవని గ్రీకు రచయిత ఎరియన్ పేర్కొన్నాడు.

## మత సంబంధ విషయాలు

- అశోకుడు బౌద్ధ మతాన్ని ఆచరించినప్పటికీ అజీవక మతస్థుల కోసం బరాబర్ గుహల్లో సుధామ గుహలను తవ్వించి, దానం చేశాడు.

- అశోకుడు ధర్మమహామాత్రులను నియమించి నైతిక సూత్రాలను ప్రచారం చేశాడు.
- తొమ్మిదో ప్రధాన శిలాశాసనం ధమ్మానికి విస్తృతమైన అర్థాన్ని, వివరణను చెప్పింది.
- పరమత సహన విధానాన్ని 7, 12వ ప్రధాన శిలాశాసనాలు వివరిస్తున్నాయి.
- ధర్మమహామాత్రుల నియామకాన్ని అయిదో ప్రధాన శిలాశాసనం అంగీకరించింది.
- అశోకుడు తన 14వ పాలనా సంవత్సరంలో ధర్మమహామాత్రులను నియమించాడు.
- 'అశోకుడి దమ్మ విధానం లౌకిక బౌద్ధ మతం' అని ఆర్.జి. భండార్కర్ వ్యాఖ్యానించారు.
- 'అశోకుని అన్వేషణా ఫలితమే ధమ్మ' అని పేర్కొన్నది రొమిల్లా థాపర్.
- మొదటి శిలా శాసనంలో జంతుబలులను, జాతరల్లో గుమిగూడటాన్ని నిషేధించాడు.
- రెండో శిలా శాసనంలో వైద్యశాలలు, విశ్రాంతి గృహాల నిర్మాణం గురించి వివరించాడు.
- అశోకుడు తన 12వ పాలనా సంవత్సరంలో బరాబర్ కొండల్లో సుధామ గుహను అజీవకులకు దానం చేశాడు.

**సాంస్కృతిక అంశాలు**

- భారతదేశంలో లలిత కళల చరిత్ర మౌర్యులతోనే ప్రారంభమైంది.
- మౌర్యులు మొదటి దశలో చెక్కతో నిర్మించిన రాజప్రాసాదం పాట్నా వద్ద తవ్వకాల్లో లభించింది.
- కట్టడాల్లో గోధుమవర్ణపు రాయిని ఎక్కువగా వాడారు. గృహ వేదికల నిర్మాణానికి గ్రానైట్ రాళ్లు వాడారు.
- అశోకుడి కాలంలో స్మారక చిహ్నాలు/ కీర్తిస్తంభాలు పెద్దసంఖ్యలో వేశారు.
- డాక్టర్ కుమారస్వామి అనే చరిత్రకారుడు మౌర్యుల కాలం నాటి కళలను 'ఆస్థాన కళ', 'జనప్రియ కళ'గా వర్గీకరించాడు.
- అశోక స్తంభాల నిర్మాణానికి ఎర్ర చుక్కలున్న తెల్లటిరాయి (మధుర), నలుపు చుక్కలున్న ఇసుక రాయి (చూనార్)లను ఉపయోగించారు.
- అశోక స్తంభాలను తయారు చేసే నిపుణులు ఎక్కువగా తక్షశిల నుంచి వచ్చేవారు.
- అశోక స్తంభాల్లో మూడు భాగాలున్నాయి. 1. శిలావేదిక 2. ధర్మచక్ర చిహ్నం 3. తలకిందులుగా ఉన్న పద్మం.
- అశోక స్తంభాల్లోని శిలా వేదికలపై ఎక్కువగా నెమళ్ల బొమ్మలను చెక్కేవారు.
- భారత జాతీయ చిహ్నం 'సింహ తలాటం'ను సారనాథ్ స్తంభం నుంచి స్వీకరించారు.
- లెస్‌నగర్ (మధ్యప్రదేశ్) లోని యక్షిణి శిల్పం, పర్ఖామ్ (మధుర, ఉత్తర్ ప్రదేశ్)లోని యక్షుడి శిల్పం, దిదార్‌గంజ్ (బిహార్)లోని శిల్పాలు జనప్రియ కళకు మంచి ఉదాహరణలు.
- సాంచీ స్తూపం మధ్యప్రదేశ్‌లోని భోపాల్ వద్ద ఉంది. దీని వ్యాసం 121.5 అడుగులు కాగా స్తూపం ఎత్తు 77.5 అడుగులు (విదిశ దగ్గర ఉంది).
- అశోకుడు, అతడి మనవడు దశరథుడు బుద్ధ గయ వద్ద ఉన్న బరాబర్ కొండల్లో గుహలను నిర్మించి, అజీవకులకు దానం చేశారు.
- సుధామ, లోమాస్‌రుషి గుహలు బరాబర్ కొండల్లో ఉన్నాయి.
- సుధామ గుహను అశోకుడు, గోపికా గుహను దశరథుడు నిర్మించారు. భారతదేశ మొదటి రాతి గుహాలయాల నిర్మాణం మౌర్యులతోనే ప్రారంభమైంది.
- భారతదేశంలో అతి ప్రాచీన స్తూపం పిప్రావహ.
- అశోకుడి రాంపూర్వా స్తంభంపై వృషభ శిఖరం ఉంది.
- రుమ్మిందై స్తంభంపై గుర్రం శిఖరం ఉంది.
- సారనాథ్ స్తంభంపై (ఉత్తర్ ప్రదేశ్) నాలుగు సింహాలున్నాయి. స్తంభ ఫలకంపై ఏనుగు, ఎద్దు, అశ్వం, సింహం శిల్పాలున్నాయి.

- ఏనుగు శిల్పం తూర్పు దిక్కున, ఎద్దు పశ్చిమ దిక్కున, సింహం ఉత్తర దిక్కున, అశ్వం దక్షిణ దిక్కున ఉన్నాయి. వీటి మధ్య ధర్మచక్రం చెక్కారు.
- అహిచ్ఛత్ర ప్రాంతంలో మౌర్యుల కాలం నాటి మట్టిపాత్రలు, మట్టితో చేసిన మాతృదేవతల ప్రతిమలు బయటపడ్డాయి.
- తక్షశిల ప్రాంతంలో టెర్రాకోట వస్తువులతో (ఆట వస్తువులు, పాచికలు, పూసలు, ఆభరణాలు) పాటు నాలుగు బంగారు గాజులు లభించాయి.
- ఆట వస్తువుల్లో ఎక్కువగా చక్రాలున్న జంతువుల బొమ్మలు లభించాయి. వాటిలో ఏనుగు బొమ్మ వారికి ఎంతో ప్రీతిపాత్రమైందిగా కనిపిస్తుంది.

**రచయిత: బొత్స నాగరాజు**

# భారతదేశ చరిత్ర

## మహ్మదీయ పాలనా కాలపు ముఖ్య సాహిత్యం

ప్రాచీన భారతదేశ చరిత్రలో మౌర్యుల కాలంలో ప్రాకృతం/ పాలి రాజభాష. తర్వాత గుప్తుల కాలం నుంచి సంస్కృతం ఆస్థాన, పండితుల భాషగా ఉండేది. ఢిల్లీ సుల్తానుల పాలన మొదలవడంతో సంస్కృతం స్థానాన్ని పర్షియన్ భాష ఆక్రమించింది. ఇది మొగల్ పాలన ముగిసేవరకు కొనసాగింది.

క్రీ.శ. పదమూడో శతాబ్దం ఆరంభం నాటికి భారతదేశంలో మహ్మదీయుల పాలన స్థిరపడింది. వీరి పాలన ప్రముఖంగా ఢిల్లీ కేంద్రంగా సాగింది. కాబట్టి వీరిని ఢిల్లీ సుల్తానులు అంటారు. వీరిలో మామెలుక్‌లు, ఖిల్జీలు, తుగ్లక్, సయ్యద్ వంశాల వాళ్లు తురుష్కులు. అయిదో వంశం అయిన లోడీలు అఫ్గన్లు (లేదా పఠాన్లు).

- క్రీ.శ. 1526లో మొదటి పానిపట్ యుద్ధంలో బాబర్ విజయం సాధించడంతో ఢిల్లీ సుల్తానత్ అంతరించింది. ఇక్కడి నుంచి మొగలుల పాలన ప్రారంభమైంది. మధ్యలో క్రీ.శ. 1540 – 55 మధ్య కాలంలో ఢిల్లీ కేంద్రంగా పాలన సాగించిన షేర్షాసుర్ వంశం పాలనను మినహాయిస్తే, క్రీ.శ. 1707 వరకు మొగలుల పాలన భారతదేశం అంతటా విస్తరించింది. ఆ తర్వాత బ్రిటిష్ వారి ప్రాబల్యం పెరగడంతో మొగలుల వైభవం క్షీణించడం మొదలైంది.
- క్రీ.శ. 1858 నాటికి చివరి మొగల్ చక్రవర్తి బహదూర్ షా–2 జాఫర్‌ను బర్మాకు తరలించడంతో భారతదేశ చరిత్రలో ఒక వైభవోజ్జ్వల శకం అంతరించిపోయింది.
- ఢిల్లీ సుల్తానుల కాలం నుంచి ఆస్థాన చరిత్రల శకం మొదలైంది. కుతుబుద్దీన్ ఐబక్ మొదలు ఔరంగజేబ్ మరణం వరకు వివిధ సుల్తానులు, మొగల్ చక్రవర్తులు ఆస్థాన చరిత్రకారులను నియమించి చరిత్రను సంకలనం చేయించారు. అయితే ఢిల్లీ సుల్తానులు తురుష్కులు (లోడీలు, సుర్‌లు అఫ్గన్లు/ పఠాన్లు), మొగలులు ఛగతాయ్ టర్కులు (మంగోలులు) అయినప్పటికీ ఆస్థాన చరిత్ర పుస్తకాలను మాత్రం పర్షియన్‌లోనే రాయించడం విశేషం.

### ముఖ్యమైన పుస్తకాలు, రచయితలు, వాటి విశేషాలు

**కితాబ్–ఉల్–హింద్:** దీన్ని అల్ బెరూనీ రచించాడు. అసలు పేరు అబూ రేహాన్. ఈయన క్రీ.శ. 973లో మధ్య ఆసియాలోని ఖివాలో జన్మించాడు. ఆ కాలంలో ఉన్న వివిధ శాస్త్రాలను అధ్యయనం చేశాడు. మహ్మద్ గజనీ దాడుల సమయంలో, అతడి వెంట భారతదేశానికి వచ్చాడు. అందుకే గజనీ దాడులు, ఆ కాలపు ఉత్తర భారతదేశ సామాజిక, సాంస్కృతిక పరిస్థితులను తెలుసుకోవడానికి ఈ 'కితాబ్–ఉల్–హింద్' ప్రధాన ఆధారంగా నిలుస్తోంది. అల్ బెరూనీ దీన్ని అరబ్బీ భాషలో రచించాడు. దీనికే తెహకీక్–ఎ–హింద్ అని కూడా పేరు.

**తబకత్–ఎ–నాసిరి:** దీన్ని నసీరుద్దీన్ మహ్మద్ ఆస్థాన విద్వాంసుడైన మిన్హాజుస్ సిరాజ్ రచించాడు. ఇది 1260లో పూర్తయ్యింది. దీన్ని నసీరుద్దీన్ మహ్మద్‌కు అంకితం ఇచ్చాడు. ఇందులో తొలి మానవుడి పుట్టుక నుంచి మొదలుపెట్టి, నసీరుద్దీన్ 14వ పాలనా సంవత్సరం వరకు గ్రంథస్థం చేశాడు. జియావుద్దీన్ బరౌనీ 'తారిఖ్–ఎ–ఫిరోజ్ షాహి' తబకత్–ఎ–నాసిరి ముగిసిన దగ్గరి నుంచే ప్రారంభమవుతుంది.

**తాజ్–ఉల్–మాసిర్:** దీన్ని కుతుబుద్దీన్ ఐబక్ ఆస్థానంలో ఉన్న హసన్ నిజామీ రచించాడు. ఇందులో కుతుబుద్దీన్ ఐబక్, ఇల్‌టుట్‌మిష్ పాలనా కాలపు వివరాలు నమోదు చేశాడు. ఇది కొంత అరబిక్, కొంత పర్షియాలో సాగింది.

**తారిఖ్–ఎ–ఫిరోజ్ షాహి:** ఈ గ్రంథ రచయిత జియావుద్దీన్ బరౌనీ. ముస్లిం కులీన వర్గానికి చెందిన బరౌనీ మహ్మద్ బిన్ తుగ్లక్ దగ్గర 'నదీమ్' ఎప్పుడూ వెంట ఉండే హోదాలో పని చేశాడు. ఫిరోజ్ సుల్తాన్ కాగానే బరౌనీని ఈ పదవి నుంచి తొలగించాడు. సుమారు 100 సంవత్సరాల ఢిల్లీ సుల్తానత్ చరిత్రను (1259 – 1352) గ్రంథస్థం చేశాడు. ఇందులో బాల్బన్ నుంచి ఫిరోజ్ షా వరకు తొమ్మిదిమంది సుల్తానుల వివరాలు నమోదు చేశాడు. బరౌనీ మరో రచన అప్పటి పాలనా నియమాలకు సంబంధించిన 'ఫత్వా–ఎ–జహందారీ'.

- ఫిరోజ్ షా తుగ్లక్ జీవితం గురించి వివరించే మరో రచన షంస్–ఎ–సిరాజ్ అఫీఫ్ రాసిన 'తారిఖ్–ఎ–ఫిరోజ్ షాహి'. ఇది ఫిరోజ్ మరణానంతరం రచించిన పుస్తకం. ఫిరోజ్ షా తుగ్లక్ తన గురించి తాను రాసిన పుస్తకం 'ఫుతూహత్–ఎ–ఫిరోజ్ షాహి'.

**ఫుతూహ్-ఉస్-సలాతిన్:** దీన్ని 1349 – 50లో ఖాజా అబ్దుల్లా మాలిక్ ఇసామీ రచించాడు. భాష పర్షియన్. ఇతను బహమనీ రాజ్య స్థాపకుడు అల్లావుద్దీన్ హసన్ సమకాలికుడు. గజనీ నుంచి మహమ్మద్ బిన్ తుగ్లక్ వరకు చారిత్రక ఘట్టాలను ఇసామీ ఇందులో వివరించాడు. మహమ్మద్ బిన్ తుగ్లక్‌ను 'తెలివైన మూర్ఖుడు' అన్నాడు.

**తారిఖ్–ఎ–ముబారక్ షాహి:** రచయిత యాహ్యా బిన్ అహ్మద్ సర్హింది. పదిహేనో శతాబ్దానికి చెందిన సర్హింది ఢిల్లీ సుల్తాన్ ముబారక్ షా సయ్యద్ ఆస్థాన కవి. ఘోరీల నుంచి ముబారక్ షా సయ్యద్ వరకు ఢిల్లీ సుల్తానుల చరిత్రను ఇందులో గ్రంథస్థం చేశాడు.

**తారిక్–ఎ–ఫెరిష్తా:** ఇది బహమనీలు, వారి అనంతరం దక్కన్‌ను పాలించిన అయిదు సుల్తానత్‌ల చరిత్రను వివరిస్తుంది. రచయిత ఫెరిష్తా. అసలు పేరు మహమ్మద్ ఖాసిం అస్త్రాబాది. పర్షియాకు చెందిన ఫెరిష్తా జీవిత కాలం క్రీ.శ.1560 – 1620. మొదట మహారాష్ట్రలోని అహ్మద్‌నగర్ నిజాంషాహీల ఆస్థానానికి వచ్చిన ఫెరిష్తా తర్వాత బీజాపూర్ చేరుకున్నాడు. బీజాపూర్ సుల్తాన్ ఇబ్రహీం ఆదిల్ షా–2 దక్కన్ సుల్తానుల చరిత్రను రాయమని ఫెరిష్తాను ఆదేశించాడు. దాంతో మొత్తం పదమూడు అధ్యాయాల్లో గజనీ మహమ్మద్ మొదలు, భారతదేశాన్ని పాలించిన మహమ్మదీయ పాలకుల చరిత్రను తారిఖ్–ఎ–ఫెరిష్తా పేరుతో గ్రంథస్థం చేశాడు. దక్కన్ సుల్తానుల చరిత్ర తెలుసుకునేందుకు ప్రధాన ఆధారం ఈ తారిఖ్–ఎ–ఫెరిష్తా. దీనికే గుల్షన్–ఎ–ఇబ్రహీమి అని కూడా పేరు.

## మొగలులు సాహితీ సేవ

మొగలుల మాతృభాష ఛగతాయ్ టర్కీ అయినప్పటికీ, రాజభాష పర్షియన్ కావడం గమనార్హం. సుమారు 200 సంవత్సరాలు సాగిన తొలి మొగలుల పాలనలో బాబర్ నుంచి ఔరంగజేబ్ వరకు ఎన్నో ఆస్థాన, ఇతర చరిత్ర గ్రంథాలు వెలువడ్డాయి. ఇవన్నీ ఆస్థాన రచనలు. ఔరంగజేబ్ చరిత్ర రచన మీద నిషేధం విధించినప్పటికీ, అతడి కాలపు విశేషాలను వివరిస్తూ పుస్తకాలు విరివిగా వచ్చాయి. అక్బర్ కాలంలో భారతీయ గ్రంథాల అనువాదానికి ప్రత్యేక విభాగం ఏర్పాటుకావడం విశేషం.

**తుజుక్–ఎ–బాబరీ:** ఇది మొగల్ సామ్రాజ్య స్థాపకుడు బాబర్ ఆత్మకథ. దీన్ని తన మాతృభాష 'ఛగతాయ్ టర్కీ'లో రాశాడు. దీన్నే 'వాఖియాత్–ఎ–బాబరీ' లేదా "బాబర్ నామా" అని కూడా పిలుస్తారు. ఇది బాబర్ 12వ ఏటనుంచి మొదలవుతుంది. ఇందులో బాబర్ కాలంనాటి భారతదేశ సమకాలీన రాజకీయ, ఆర్థిక, భౌగోళిక పరిస్థితులను వివరించాడు. అతడి దృష్టిలో తన మాతృదేశం కంటే భారత దేశం "ఎంతో భిన్నం". దీన్ని పర్షియాలోకి అక్బర్ కాలంలో అబ్దుల్ రహీం ఖాన్–ఎ–ఖానన్ అనువదించారు. బాబర్ 48 ఏళ్ల జీవిత కాలంలో కేవలం 18 ఏళ్ల చరిత్రే ఇందులో ఉంది.

**తారిఖ్–ఎ–షేర్ షాహి:** దీన్ని అక్బర్ కోరిక మేరకు అబ్బాస్‌ఖాన్ షేర్వానీ రచించాడు. షేర్వానీ మొదట షేర్షా ఆస్థానంలో ఉన్నాడు. అయితే దీన్ని 'తారిఖ్–ఎ–అక్బర్ షాహి' పేరుతో రాసి, అక్బర్‌కు అంకితం చేశాడు. ఇందులో మొదటి భాగంలో షేర్షా; రెండో భాగంలో ఇస్లాం షా; మూడో భాగంలో హుమాయూన్ మళ్లీ రాజ్యాన్ని గెలుచుకోవడం గురించి వివరించాడు షేర్వానీ.

**తారిఖ్–ఎ–రషీదీ:** రచయిత మీర్జా హైదర్ డగ్లత్. ఈయన బాబర్ రక్త సంబంధీకుడు (Cousin). కొంతకాలం కశ్మీర్‌ను పరిపాలించాడు. ఇది బాబర్, హుమాయూన్‌ల గురించి తెలుపుతుంది.

**హుమాయూన్ నామా:** బాబర్ కుమార్తె, హుమాయూన్ సవతి సోదరి గుల్‌బదన్ బేగం రచన. ఇది పర్షియా భాషలో ఉంది. అక్బర్ కోరిక మేరకు రాసిన ఈ గ్రంథంలో రెండు భాగాలు ఉన్నాయి. ఒకటి బాబర్‌కు, రెండోది హుమాయూన్‌కు సంబంధించిన భాగాలు. ఇతర రచయితలకు భిన్నంగా ఇందులో రాజకీయ సంఘటనలతో పాటు, మొగల్ అంతపుర జీవిత చిత్రణ కూడా కనిపించడం విశేషం. హుమాయూన్ జీవిత విశేషాలు తెలిపే మరో రచన ఖ్వాందమీర్ రాసిన ఖానూన్–ఎ–హుమాయునీ.

**అక్బర్ నామా:** దీన్ని అక్బర్‌కు అత్యంత సన్నిహితుడైన షేక్ అబుల్ ఫజల్ అల్లామీ రచించాడు. అబుల్ ఫజల్ తండ్రి షేక్ ముబారక్ గొప్ప పండితుడు. అబుల్ ఫజల్, అతడి సోదరుడు ఫైజీ అక్బర్ ఆస్థానంలో ఉన్నారు. అక్బర్ కోరిక మేరకు అబుల్ ఫజల్ 1590లో అక్బర్ నామా రాయడం మొదలుపెట్టాడు. 1598 లో పూర్తయ్యింది. అక్బర్ చరిత్రకు సంబంధించి ఇదే అత్యంత ప్రధాన వనరు. 1602 ఆగస్టులో సలీం రాకుమారుడి ఆదేశం మేరకు బీరేంద్ర బుందేలా అబుల్ ఫజల్‌ను హత్య చేశాడు.

- అక్బర్ నామాలో మూడు భాగాలు ఉన్నాయి. మొదటి భాగంలో తైమూర్ వంశ చరిత్ర, బాబర్, హుమాయూన్, సుర్ వంశ చరిత్రను నమోదు చేశాడు. రెండో భాగంలో అక్బర్ పాలనా కాలపు విశేషాలను వివరించాడు. అక్బర్‌ను పొగుడుతూ, బలహీనతలను పక్కనపెడుతూ సాగడం 'అక్బర్ నామా'లో లోపం. ఈ రెండు భాగాలను హెచ్.ఎస్. బెవరిడ్జి ఇంగ్లిష్‌లోకి అనువదించాడు. అక్బర్ నామాలో మూడో భాగాన్ని 'అయిన్–ఎ–అక్బరి' అంటారు. ఇది మొత్తం పుస్తకంలో ఒక భాగం అయినా, విడి పుస్తకంగా ఉండే లక్షణాలను కలిగి ఉంది. ఇందులో అక్బర్ పాలన, మత, సైనిక సంస్కరణలు, సాహిత్య పోషణ లాంటి వివిధ అంశాలను 5 భాగాల్లో వివరించాడు. 'అర్థశాస్త్రం' తర్వాత రాజ్య వ్యవహారాలను తెలుసుకునేందుకు, మళ్లీ అంతటి ప్రాధాన్యం కలిగిన రచన 'అయిన్–ఎ–అక్బరి'. దీన్ని బ్లాచ్‌మాన్, జారెట్ ఇంగ్లిష్‌లోకి అనువదించారు.

**ముంతఖాబ్-ఉత్-తవారిఖ్:** రచయిత అబ్దుల్ ఖాదర్ బదాయూనీ. మహాభారతం పర్షియా అనువాదం "రజ్మ్ నామా" బదాయూనీ ఆధ్వర్యంలోనే పూర్తయ్యింది. ఇంకా రామాయణాన్ని పర్షియాలోకి అనువదించాడు. మతపరంగా బదాయూనీ ఇస్లాంలోని సున్నీ శాఖకు చెందినవాడు. కాబట్టి అక్బర్ ఉదారవాద విధానాలను విమర్శించాడు. ముంతఖాబ్-ఉత్-తవారిఖ్‌లో గజనీ మహమ్మద్ నుంచి, అక్బర్ 40 ఏళ్ల పాలనా కాలం వరకు ఉన్న విశేషాలను మూడు భాగాల్లో వివరించాడు.

**తబకత్-ఎ-అక్బరి:** ఖాజా నిజాముద్దీన్ అహ్మద్ రచించాడు. ఇది మధ్యయుగాల రాజకీయ చరిత్రను సాధికారికంగా వివరిస్తుంది. ఇది భారతదేశం మీదికి గజనీల దాడులు మొదలు, అక్బర్ కాలం వరకు అంటే, 1594 వరకు జరిగిన సంఘటనలను వివరిస్తుంది. మూడు భాగాల ఈ రచనలో మొదటిది గజనీల నుంచి ఢిల్లీ సుల్తానుల కాలం వరకు, రెండోది బాబర్ నుంచి అక్బర్ వరకు, మూడోది సమకాలీన భారతదేశ ప్రాంతీయ రాజ్యాల గురించి వివరిస్తాయి.

**తారిఖ్-ఎ-అల్ఫి:** దీన్ని ముల్లా దావూద్ రచించాడు. మహమ్మద్ ప్రవక్త కాలం నుంచి అక్బర్ చక్రవర్తి వరకు ఉన్న వెయ్యేళ్ల ఇస్లామిక్ చరిత్ర ఇందులో ఉంది. అక్బర్ కాలపు మరో రచన 'తారిఖ్-ఎ-అక్బర్ షాహి'. దీన్ని రచించింది మహమ్మద్ ఆరిఫ్ కాందహారి.

**తుజుక్-ఎ-జహంగీరి:** ఇది జహంగీర్ ఆత్మకథ. ఇందులో తన మొదటి 12 ఏళ్ల పాలనా విశేషాలను అందించాడు. తర్వాతి కాలపు వివరాలు ముతామిద్ ఖాన్ రాసిన 'ఇక్బాల్‌నామా-ఎ-జహంగీరి'లో ఉన్నాయి.

**ఇక్బాల్ నామా-ఎ-జహంగీరి:** దీన్ని పర్షియాలో ముతామిద్ ఖాన్ రచించాడు. ఇతడు జహంగీర్ కాలంలో కొన్నేళ్లపాటు మీర్ బక్షీగా పనిచేశాడు. తుజుక్-ఎ-జహంగీరి వదిలిపెట్టిన జహంగీర్ పాలనాకాలం విశేషాలను తెలుసుకునేందుకు ప్రధాన ఆధారం ఇదే. ఇది షాజహాన్ కాలంలో పూర్తయ్యింది. ఇక్బాల్ నామా-ఎ-జహంగీరిలో మూడు భాగాలున్నాయి. మొదటి భాగం హుమాయూన్ వరకున్న తైమూర్ చరిత్రను, రెండో భాగం అక్బర్ కాలాన్ని, మూడో భాగం జహంగీర్ చరిత్రను వివరిస్తాయి.

**పాదుషానామా:** ఇది షాజహాన్ జీవిత చరిత్ర. దీన్ని అబ్దుల్ హమీద్ లాహోరీ రాశాడు. ఇందులో షాజహాన్ మొదటి 20 ఏళ్ల పాలనా (1648 వరకు) విశేషాల వివరణ ఉంది. మరో పాదుషానామాను షాజహాన్ ఆదేశం మేరకు మహమ్మద్ అమీన్ కాజ్విని రచించాడు. ఇందులో షాజహాన్ మొదటి పదేళ్ల చరిత్ర ఉంది. షాజహాన్ చరిత్రను 'షాజహాన్ నామా' పేరుతో ఇనాయత్ ఖాన్ గ్రంథస్థం చేశాడు. షాజహాన్ కాలపు వివరాలను అందించే మరో గ్రంథం చంద్రభాన్ బ్రాహ్మణ్ రచించిన చహార్ చమన్.

**ఆలంగీర్ నామా:** దీన్ని మీర్జా మహమ్మద్ కాజిమ్ సిరాజీ రచించాడు. ఔరంగజేబ్ ఆజ్ఞ మేరకు రాసిన ఏకైక చరిత్ర పుస్తకం ఇదే. ఇందులో ఔరంగజేబ్ మొదటి పదేళ్ల చరిత్ర ఉంది. షాజహాన్ జబ్బు పడినప్పటినుంచి మొదలయ్యే 'ఆలంగీర్ నామా' చివరి వరకూ ఔరంగజేబ్‌ను పొగుడుతూ సాగుతుంది. కాబట్టి ఇందులో ఉన్న సమాచారం అర్ధసత్యమే. ఇది ఖాఫీ ఖాన్ 'ముంతఖాబ్-ఉల్-లుబాబ్' రచనకు ప్రాథమిక వనరుగా ఉపయోగపడింది.

**ముంతఖాబ్-ఉల్-లుబాబ్:** దీన్ని ఖాఫీ ఖాన్ రచించాడు. ఇతని అసలు పేరు మహమ్మద్ హాషీం. ఇది ఔరంగజేబ్ జీవిత చరిత్ర. ఇది మహమ్మద్ షా "రంగీలా" కాలంలో పూర్తయ్యింది. ఔరంగజేబ్ తన జీవితచరిత్రను రాయడాన్ని నిషేధించాడు. దీంతో రహస్యంగా దీన్ని రాశాడంటారు. పర్షియాలో 'ఖ్వాఫ్' అంటే రహస్యంగా అని అర్థం. అందుకే అతణ్ని "ఖాఫీ ఖాన్" అని పిలిచారంటారు. మహమ్మద్ హషీం పూర్వీకులు ఖురాసాన్‌లోని ఖాఫ్ నగరం నుంచి వచ్చినందుకు ఖాఫీ ఖాన్ అయ్యాడనేది కొంతమంది చరిత్రకారుల వాదన.

బాబర్ భారతదేశ దండయాత్ర నుంచి మొదలయ్యే ఈ పుస్తకం, మహమ్మద్ షా 15వ పాలనా కాలంతో ముగుస్తుంది. ఇందులో సమకాలీన రైతాంగం స్థితిగతులు, మొగల్ సామ్రాజ్య పతనానికి దారితీసిన ఇరానీ-తురానీ వివాదాలు, శివాజీ వ్యక్తిత్వం తదితర అంశాలను గ్రంథస్థం చేశాడు. అయితే 50 ఏళ్ల ఔరంగజేబ్ సుదీర్ఘ పాలనా కాలాన్ని సంక్షిప్తంగా చెప్పడం ఇందులో లోపం.

**రచయిత: చింతలపల్లి హర్షవర్ధన్**

# భారతదేశ చరిత్ర

## మొగలుల సాహితీసేవ (2)

మొగలుల కాలంలో ఆస్థాన చరిత్రలతోపాటు అనువాదానికి కూడా ప్రాధాన్యం లభించింది. అక్బర్ మక్తబ్ ఖానా పేరుతో అనువాద విభాగాన్ని ఏర్పాటు చేశాడు. ఈ కాలంలో హిందీ సాహిత్యం కూడా వికసించింది. తులసీదాస్ రచించిన రామ్ చరిత్ మానస్ ఉత్తర భారతదేశంలో ఆరాధనీయ గ్రంథమైంది. షాజహాన్ పెద్ద కుమారుడు దారాషికో హిందూ మహ్మదీయ మతాల సారాన్ని మజ్ మా–ఉల్–బహ్రెయిన్ పేరుతో గ్రంథస్థం చేయడం విశేషం.

**ఫుతూహత్–ఎ–ఆలంగీరి:** దీన్ని రాసింది ఈసర్ దాస్ నాగర్. ఇతడు ఔరంగజేబ్ ప్రతినిధిగా జోధ్‌పూర్‌లో పనిచేశాడు. ఔరంగజేబ్ మొదటి 34 ఏళ్ల పాలనా కాలపు విశేషాలు ఉన్న ఈ పుస్తకం ఆ కాలపు మొగల్, రాజపుత్రుల సంబంధాల గురించి ప్రధానంగా సాగింది.

**నుష్కా–ఎ–దిల్‌కుషా:** ఇది కూడా ఔరంగజేబ్ చరిత్రను తెలిపే రచనే. భీమ్‌సేన్ దీని రచయిత. ఇతడు మొగల్ మన్సబ్‌దారు దల్‌పత్ రావ్ బుందేలా దగ్గర పేష్కారుగా పనిచేశాడు. క్రీ.శ.1700 నుంచి ఔరంగజేబ్ సేనలు మహారాష్ట్రలో చేసిన పోరాటాల కథనం ఇందులో ప్రధానం. సమకాలీన అధికారుల అవినీతి, మొగల్ సేనల దాడుల వల్ల మరాఠా రైతులు ఎదుర్కొన్న ఇబ్బందులను 'నుష్కా–ఎ–దిల్ కుషా'లో వెల్లడించాడు. అయితే ఇది కూడా సత్యాన్ని పాక్షికంగానే తెలుపుతుంది.

**మాసీర్–ఎ–ఆలంగీరి:** ఔరంగజేబ్ 40 ఏళ్ల పాలనను సంక్షిప్తంగా అందించే ఈ పుస్తకాన్ని రాసింది మహమ్మద్ సాకి ముస్తాయిద్ ఖాన్. ఔరంగజేబ్ దండయాత్రలు, అధికారుల నియామకం, బదిలీల గురించిన వివరాలు ఇందులో ఉన్నాయి. దీన్ని సర్ జదునాథ్ సర్కార్ "మొగలుల రాజపత్రం"గా (Gazetteer of Mughal Empire) పేర్కొన్నారు. ఔరంగజేబ్ గురించి వివరించే మరో గ్రంథం సుజన్ రావ్ ఖత్రీ రాసిన 'ఖులాసత్–ఉత్–తవారిఖ్'.

### అనువాదాలు

**రజ్మ్ నామా:** అంటే యుద్ధాల పుస్తకం అని అర్థం. ఇది మహాభారతానికి పర్షియా అనువాదం (తర్జుమా–ఎ–మహాభారత్). అనువాద బృందానికి అబ్దుల్ ఖాదర్ బదాయూనీ పర్యవేక్షణ బాధ్యతలు చేపట్టాడు. అనువాదం పూర్తయ్యాక అక్బర్ దీనికి చిత్రాలు కూడా గీయించాడు.

✣ రామాయణాన్ని అబ్దుల్ ఖాదర్ బదాయూని, అథర్వణ వేదాన్ని హాజీ ఇబ్రహీం సర్హిందీ, లీలావతిని (గణితశాస్త్ర పుస్తకం) ఫైజీ, తుజుక్–ఎ–బాబరీని అబ్దుల్ రహీం ఖాన్–ఎ–ఖానన్ పర్షియా భాషలోకి అనువదించారు. ఇవే కాకుండా రాజాస్థానంలో గజళ్లు, ఖసీదాలు తదితర కవితా ప్రక్రియలు వికసించాయి.

✣ అక్బర్ కాలంలో హిందీ సాహిత్యం కూడా ఆదరణ పొందింది. అబ్దుల్ రహీం ఖాన్–ఎ–ఖానన్ దోహాలనే ద్విపదలను రచించాడు. నరహరి అనే పండితుడికి అక్బర్ 'మహాపాత్ర్' అనే బిరుదునిచ్చాడు. ప్రసిద్ధ హిందీ కవులకు 'కవిరాయ్' అనే బిరుదును ఇచ్చి గౌరవించేవారు.

★ బీర్బల్‌కు (అసలు పేరు మహేశ్ దాస్) అక్బర్ కవి ప్రియ అనే బిరుదు ఇచ్చాడు. రస్‌ఖాన్ 'ప్రేమ్ వార్తికా' అనే హిందీ కావ్యం రచించాడు. ఇది కృష్ణభక్తికి సంబంధించింది. తులసీదాస్ విరచిత 'రామ్ చరిత్ మానస్' ఉత్తర భారతదేశం అంతటా ప్రసిద్ధి చెందింది. దీన్ని "వంద మిలియన్ల హిందూస్థాన్ ప్రజల పాలిటి బైబిల్" అని జార్జి గ్రియర్సన్ ప్రశంసించాడు.

### అమీర్ ఖుస్రూ

కవి, చరిత్రకారుడు, సంగీత విద్వాంసుడైన అమీర్ ఖుస్రూ ఉత్తర్ ప్రదేశ్‌లోని పటియాలిలో క్రీ.శ.1252లో జన్మించాడు. బాల్బన్ మొదలు ఘియాజుద్దీన్ తుగ్లక్ వరకు వివిధ ఢిల్లీ సుల్తానుల ఆస్థానంలో ఉన్నాడు. పర్షియన్, హిందీ, ఉర్దూ భాషల్లో ఖుస్రూ రచనలు సాగాయి. ఈయన ఢిల్లీలోని ప్రసిద్ధ చిష్తీ సాధువు నిజాముద్దీన్ ఔలియా శిష్యుడు. అమీర్ ఖుస్రూ బిరుదు "తూతీ–ఎ–హింద్" (భారతదేశపు చిలుక). అమీర్ ఖుస్రూ రచనా శైలిని 'సబాక్ ఎ హింద్' అంటారు.

✣ అమీర్‌ఖుస్రూ మొదటి చరిత్ర రచన కిరాన్–ఉస్–సాదిన్. ఇది మామెలుక్ సుల్తాన్ కైకుబాద్ కాలపు రచన. ఇక ఖజైన్–ఉల్–ఫుతూహ్‌లో అల్లావుద్దీన్ ఖిల్జీ గుజరాత్, చిత్తోడ్‌గఢ్, మాల్వా, దక్కన్, వరంగల్ దండయాత్రలు, భారతదేశం మీదికి జరిగిన మంగోల్ దాడుల గురించి వివరించాడు. అల్లావుద్దీన్ ఖిల్జీ రణథంబోర్‌ను ముట్టడించినప్పుడు, అక్కడి రాజపుత్ర స్త్రీల "జౌహర్"(మూకుమ్మడిగా చితి పేర్చుకుని మరణించడం) గురించి తెలిపాడు. ఘియాజుద్దీన్ తుగ్లక్ చరిత్రను వివరిస్తూ "తుగ్లక్ నామా" రచించాడు. అమీర్ ఖుస్రూ ఇతర రచనలు నూహ్ సిపార్, మిఫ్తా ఉల్ ఫుతూహ్, దేవలరాణి ఖిజిర్‌ఖానీ.

✣ సంగీతం విషయానికి వస్తే, అమీర్ ఖుస్రూ ఖవ్వాలీ ప్రక్రియను అభివృద్ధి చేశాడు. సితార్, తబలాను ఈయనే మొదటగా తయారు చేశాడని అంటారు. క్రీ.శ. 1325లో మరణించిన అమీర్ ఖుస్రూను నిజాముద్దీన్ ఔలియా దర్గా ప్రాంగణంలోనే ఖననం చేశారు.

**పద్మావత్:** మాలిక్ మహమ్మద్ జాయసీ ప్రసిద్ధ రచన. జాయసీ ఉత్తర్ ప్రదేశ్‌లోని రాయ్‌బరేలీలోని జాయస్‌లో జన్మించాడు. మాలిక్ మహమ్మద్ జాయసీ షేర్షా కాలపు కవి. అవధీ మాండలికంలో (హిందీ) ఉన్న ఈ రచన ప్రధానంగా సూఫీ ప్రేమతత్వానికి చెందింది. ఇందులో సుప్రసిద్ధ పద్మావతి (పద్మిని) కథ ఉంది. పద్మావతి చిత్తోడ్ రాణా రతన్ సింగ్ భార్య. ఈమె అందం గురించి తెలుసుకున్న అప్పటి ఢిల్లీ సుల్తాన్ అల్లావుద్దీన్ ఖిల్జీ చిత్తోడ్‌ను ముట్టడించాడని చెబుతారు. అయితే చరిత్రకారులు దీన్ని వ్యతిరేకించారు. చిత్తోడ్ గుజరాత్ వెళ్లే మార్గం మీద ఉండటంతో ఖిల్జీ దండయాత్ర చేశాడనేది చరిత్రకారుల వాదన.

**దారాషికో:** మొగల్ చక్రవర్తి షాజహాన్ పెద్ద కొడుకు. సూఫీ మార్మికవాది. ఇతడు హిందూ, ఇస్లాం మతాలను క్షుణ్నంగా అధ్యయనం చేశాడు. రెండు మతాల సారాన్ని క్రోడీకరిస్తూ "మజ్ మా–ఉల్–బహ్రెయిన్" (రెండు సముద్రాల సంగమం) పేరుతో పుస్తకాన్ని రాశాడు. ఇంకా కొన్ని ఉపనిషత్తులను పర్షియా భాషలోకి అనువదించి, వాటిని "సిర్–ఎ–అక్బర్" పేరుతో సంకలనం చేశాడు. మొగల్ సింహాసనం కోసం జరిగిన వారసత్వ పోరులో క్రీ.శ. 1659లో ఔరంగజేబ్ చేతిలో దారాషికో మరణించాడు.

## అభ్యాస ప్రశ్నలు

**1.** భారతదేశ చరిత్రకు సంబంధించి అబ్దుల్ హమీద్ లాహోరీ ఎవరు?

ఎ) అక్బర్ కాలంలో ఒక ప్రధాన సైన్యాధికారి

బి) షాజహాన్ పాలనాకాలపు అధికారిక చరిత్రకారుడు.

సి) ఔరంగజేబ్ కాలపు కులీనుడు, అతడి సన్నిహితుడు

డి) మహమ్మద్ షా పాలనా కాలపు రచయిత, కవి

**2.** కింది పుస్తకాలు, రచయితలను సరిగా జతపరచండి.

1) తుజుక్–ఎ–బాబరీ పర్షియా అనువాదం — a. చంద్రభాన్ బ్రాహ్మణ్

2) హుమయూన్ నామా — b. అబ్దుర్ రహీం ఖాన్–ఎ–ఖానన్

3) ఇక్బాల్ నామా–ఎ–జహంగీరి — c. గుల్‌బదన్ బేగం

4) చహార్ చమన్ — d. ముతామిద్ ఖాన్

ఎ) 1-b, 2-c, 3-d, 4-a  బి) 1-d, 2-c, 3-a, 4-b

సి) 1-c, 2-a, 3-b, 4-d  డి) 1-b, 2-a, 3-c, 4-d

**3.** దక్కన్ సుల్తానుల చరిత్ర తెలుసుకునేందుకు ప్రధాన ఆధారం ఏది?

ఎ) తబకత్–ఎ–నాసిరి  బి) ఫుతూహ్–ఉస్–సలాతిన్

సి) తారిఖ్–ఎ–ఫెరిష్తా  డి) కితాబ్–ఉల్–రెహ్లా

**4.** అక్బర్ కాలంలో రామాయణాన్ని పర్షియన్ భాషలోకి అనువదించింది ఎవరు?

ఎ) అబుల్ ఫజల్  బి) అబ్దుల్ ఖాదర్ బదాయూనీ

సి) బీర్బల్  డి) ఫైజీ సర్హింది

**5.** హిందూ ఇస్లాం మతాల సారంగా పేర్కొనే 'మజ్మా–ఉల్–బహ్రెయిన్' రచయిత ఎవరు?

ఎ) దారాషికో  బి) సులేమాన్ షికో

సి) అబుల్ ఫజల్  డి) అమీర్ ఖుస్రూ

**6.** 'తారిఖ్–ఎ–ముబారక్ షాహీ' ఎవరి కాలపు రచన?

ఎ) ఖిల్జీలు  బి) తుగ్లక్‌లు  సి) లోడీలు  డి) సయ్యద్‌లు

**7.** 'తబకత్–ఎ–నాసిరి' రచయిత ఎవరు?

ఎ) మిన్హాజుస్ సిరాజ్

బి) నాసిరుద్దీన్ మహమ్మద్

సి) జియావుద్దీన్ బరౌనీ

డి) అబ్బాస్ ఖాన్ షేర్వానీ

**8.** కిందివాటిలో మహమ్మద్ హాషీం ఖాఫీఖాన్ రచన?

ఎ) ముంతఖాబ్–ఉత్–తవారిఖ్

బి) ముంతఖాబ్–ఉల్–లుబాబ్

సి) ఖులాసత్–ఉత్–తవారిఖ్

డి) షాజహాన్ నామా

**సమాధానాలు**

1–బి; 2–ఎ; 3–సి; 4–బి; 5–ఎ; 6–డి; 7–ఎ; 8–బి.

**రచయిత: చింతలపల్లి హర్షవర్ధన్**

# భారతదేశ చరిత్ర

## గుప్త యుగం

గుప్త వంశ మూల పురుషుడు శ్రీగుప్తుడు. గుప్త రాజ్య స్థాపకుడు మొదటి చంద్రగుప్తుడు. సముద్రగుప్తుడు, రెండో చంద్రగుప్తుడు, కుమారగుప్తుడు లాంటి చక్రవర్తులు గుప్త రాజుల్లో ముఖ్యులు. చివరి గుప్త చక్రవర్తి విష్ణుగుప్తుడి కాలంలో హూణుల దండయాత్ర వల్ల గుప్త సామ్రాజ్యం పతనమైంది. గుప్తులకాలం భారతదేశ చరిత్రలో తొలి స్వర్ణయుగంగా పేరొందింది.

గుప్త యుగానికి ఆధారాలను రెండు రకాలుగా పేర్కొంటారు. అవి:

1. పురావస్తు ఆధారాలైన శాసనాలు, నాణేలు, కట్టడాలు, మృణ్మయ పాత్రలు.

2. సాహిత్య ఆధారాలు.

### శాసనాలు

మంకువార్ బౌద్ధ శాసనం మొదటి కుమారగుప్తుడిని 'మహారాజ' బిరుదుతో పేర్కొంది. స్కంధగుప్తుడి భిలారి శాసనం హూణులు, పుష్యమిత్ర వంశస్థులు గుప్త సామ్రాజ్యంపై జరిపిన దాడులను వివరిస్తుంది. సముద్రగుప్తుడి విజయాలను వివరించే అలహాబాద్ శాసనాన్ని అతడి సేనాని (సంధి విగ్రాహి) హరిసేనుడు వేయించాడు.

★ ఎరాన్ శాసనం గుప్తుల కాలంనాటి సాంఘిక పరిస్థితులను వివరిస్తుంది. సతీ సహగమనం గురించి ఎరాన్ శాసనం తెలుపుతుంది. ఉదయగిరి శాసనం, మెహరౌలీ (ఢిల్లీ) ఉక్కు స్తంభ శాసనాలు రెండో చంద్రగుప్తుడి గురించి పేర్కొంటున్నాయి.

★ గుప్త యుగానికి సంబంధించి సుమారు 42 శాసనాలు లభిస్తున్నాయి. అందులో 27 శిలాశాసనాలే. మొత్తం 42 శాసనాల్లో 23 శాసనాలు ప్రత్యేక వ్యక్తుల రికార్డులైతే, మిగిలిన 19 శాసనాలు ప్రభుత్వ అధికార సంబంధ శాసనాలు.

### సాహిత్యం

మొదటి చంద్రగుప్తుడి కాలంనాటి రాజనీతి గ్రంథమైన నీతిసారాన్ని కామందకుడు రాశాడు. గుప్తుల కాలంనాటి రాజనీతి, పరిపాలనా విషయాలను ఈ గ్రంథం తెలుపుతుంది. క్రీ.శ. నాలుగో శతాబ్దంలో రాసిన 'నారదస్మృతి', 'బృహస్పతి స్మృతి' లాంటి రచనలు గుప్తుల చరిత్రను పేర్కొంటున్నాయి. విశాఖదత్తుడు రచించిన 'దేవీ చంద్రగుప్తం' నాటకం రామగుప్తుడు శక రాజైన బసన చేతిలో పొందిన ఓటమిని తెలుపుతుంది. మొదటి చంద్రగుప్తుడి విజయాలను వజ్జికుడు రచించిన 'కౌముదీ మహోత్సవం' గ్రంథం వివరిస్తుంది. గుప్తయుగం నాటి పట్టణ ప్రజల జీవిత విధానాలను, చారుదత్త, వసంతసేనల మధ్య ఉన్న ప్రేమాయణం గురించి పేర్కొంటుంది. వాయు పురాణంలో గుప్తుల చరిత్రను ఎక్కువగా వివరించారు. ఆర్య మంజుశ్రీ రాసిన 'మూలకల్ప' గ్రంథంలో గుప్తరాజుల ప్రస్తావనను అనేక శ్లోకాల్లో పేర్కొన్నారు. క్రీ.శ.672లో భారతదేశానికి వచ్చిన ఇత్సింగ్ అనే చైనా యాత్రికుడు చీ-లి-కిటో (శ్రీగుప్తుడు) అనే రాజు నలందా బౌద్ధ విహారంలో కొన్ని గ్రామాలను చైనా వారికి దానం చేసినట్లు తన రచనల్లో పేర్కొన్నాడు. యతి వృషభుడు అనే బౌద్ధ సన్యాసి రాసిన 'తిలస్య పన్నాటి' అనే గ్రంథం గుప్తుల కాలం నాటి బౌద్ధ మత ప్రాచుర్యాన్ని తెలుపుతుంది. రెండో చంద్రగుప్తుడి కాలంలో వచ్చిన చైనా యాత్రికుడు ఫాహియాన్ నాటి పరిస్థితులను తన ఫో-కువో-కి గ్రంథంలో వివరించాడు.

### రెండో చంద్రగుప్తుడు (క్రీ.శ. 375 – 415)

ఇతడి కాలాన్ని స్వర్ణయుగంగా పేర్కొంటారు. 'శకారి', 'సాహసాంక', 'విక్రమాదిత్య' లాంటి బిరుదులు పొందాడు. అన్న రామగుప్తుడిని చంపి, వదిన ధ్రువాదేవిని వివాహం చేసుకుని రాజ్యానికి వచ్చినట్లు 'దేవీచంద్రగుప్తం' నాటకం పేర్కొంటుంది. ఇతడి కాలంలో ఫాహియాన్ అనే చైనా యాత్రికుడు భారతదేశాన్ని సందర్శించాడు. ఫాహియాన్ పాటలీపుత్రంలో మూడు సంవత్సరాలు, తామ్రలిప్తిలో రెండు సంవత్సరాలు నివసించాడు. రెండో చంద్రగుప్తుడి ఆస్థానంలో 'నవ రత్నాలు' అనే కవులు ఉండేవారు. వారిలో కాళిదాసు సుప్రసిద్ధుడు. రెండో చంద్రగుప్తుడు సింహం బొమ్మతో నాణేలను ముద్రించాడు. ఉజ్జయిని బొమ్మతో నాణేలను ముద్రించి, ఉజ్జయినిని రెండో రాజధానిగా చేసుకుని పాలించాడు. వాకాటక రాజైన రెండో ధ్రువసేనుడికి తన కుమార్తె ప్రభావతీ గుప్తను ఇచ్చి వివాహం జరిపించాడు. రెండో ధ్రువసేనుడి సహాయంతో చివరి శకరాజు రుద్రసింహుడిని చంపి, 'శకారి' అనే బిరుదు పొందాడు. రెండో చంద్రగుప్తుడి సేనానియైన అమరకర దేవుడు బౌద్ధ మతాభిమాని. మంత్రి శబర వీరసేనుడు శైవ మతాభిమాని. ఢిల్లీలోని మెహరౌలీ ఉక్కు స్తంభాన్ని చేయించింది రెండో చంద్రగుప్తుడే. వెండి నాణేలను ముద్రించిన తొలి గుప్తరాజు ఇతడే.

## చివరి గుప్త చక్రవర్తులు

మొదటి కుమారగుప్తుడు నలందా విశ్వవిద్యాలయాన్ని నిర్మించాడు. ఇతడి కాలంలోనే యువరాజైన స్కంధగుప్తుడు హూణుల దండయాత్రను తిప్పికొట్టాడు. కానీ స్కంధగుప్తుడు రాజైన తర్వాత హూణులు గుప్త రాజ్యంపై నిరంతరం దాడులు చేయడం వల్ల కోశాగారం ఖాళీ అయ్యింది. ఇతడు హూణుల చేతిలో పరాజయం పాలయ్యాడు. అనంతరం పురుగుప్తుడు, రెండో కుమారగుప్తుడు, బుధగుప్తుడు లాంటి రాజులు పాలించారు. చివరికి విష్ణుగుప్తుడితో గుప్త వంశం అంతమైంది.

## పాలనా విశేషాలు

గుప్తులు తమ సామ్రాజ్యాన్ని భుక్తులు, విషయాలు, గ్రామాలుగా విభజించారు. విషయపతి జిల్లాలకు (విషయాలకు) అధిపతిగా, భుక్తులకు ఉపరిక అధిపతిగా ఉండేవాడు. గ్రామాధిపతిని గ్రామైక అనేవారు. అయిదుమంది సభ్యులున్న నగరసభ విషయపతికి పరిపాలనలో తోడ్పడేది. గ్రామంలో ఉండే సభను పంచ మండలం సభ అనేవారు. చక్రవర్తి మంత్రి పరిషత్తు లేదా మంత్రి మండలి సహాయంతో పరిపాలించడం వల్ల మంత్రి మండలి నాయకుడిని మంత్రి ముఖ్యుడు అనేవారు. నైతిక, ధార్మిక విషయాల్లో పురోహితుడు కీలకపాత్ర పోషించేవాడు. రాష్ట్రాలకు (భుక్తులకు) యువ రాజులను అధిపతులుగా నియమించేవారు. వారిని 'కుమారామాత్య' అనేవారు. వీరు కేంద్ర ప్రభుత్వానికి, ప్రాంతీయ ప్రభుత్వానికి మధ్య వారధిగా ఉండేవారు. మొత్తంగా గుప్తుల కాలంలో పాలన వికేంద్రీకృత పాలనగా ఉండేది.

## రెవెన్యూ పాలన

గుప్తుల కాలంలో 1/6వ వంతు భూమి శిస్తును వసూలు చేసేవారు. పన్నులను నగదు రూపంలో చెల్లించేవారు. ఫాహియాన్ తన రచనల్లో ఎక్కువగా రాచరిక భూముల గురించి ప్రస్తావించాడు. బుద్ధగుప్తుడి పహాడ్‌పూర్ శాసనం భూమిపై ప్రభుత్వానికున్న ప్రత్యేక యాజమాన్యపు హక్కును వివరిస్తుంది. వ్యవసాయ యోగ్యమైన భూమిని 'క్షేత్రం' అనేవారు. నివాసయోగ్యమైన భూమిని 'వస్తి' అని, అటవీ భూమిని 'అప్రహత' అని, పచ్చిక బయళ్లను 'గపధసార' అని, బంజరు భూములను 'ఖిలం' అని పేర్కొనేవారు.

భూమి అమ్మకం రిజిస్ట్రేషన్ చేసే జిల్లా ప్రధాన కార్యాలయ అధిపతిని 'పుస్తపాల' అనేవారు. నాటి ప్రధాన న్యాయమూర్తి 'మహా దండనాయక'. నాటి శిక్షల గురించి ఫాహియాన్ తన రచనల్లో ప్రస్తావించాడు. మహా సేనాపతి, రణభండారిక లాంటి సైనికాధికారులు యుద్ధ సమయాల్లో ప్రధానపాత్ర పోషించేవారు. నాటి యుద్ధ ఆయుధాల గురించి అలహాబాద్ శాసనంలో ప్రస్తావన ఉంది. ప్రత్యేక యుద్ధమండలి కూడా ఉండేది. నాటి పురోహితుడికి న్యాయ సమీక్ష అధికారం ఉండటం గొప్ప విషయం. మంత్రి మండలికి, చక్రవర్తికి మధ్య సంధాన కర్తగా 'కంచుకి' అనే ఉద్యోగి ప్రధాన పాత్ర పోషించేవాడు.

## ఆర్థిక విషయాలు

గుప్తుల కాలంలో వ్యవసాయం, వాణిజ్యం, పరిశ్రమలు సమానంగా అభివృద్ధి చెందాయి. నాటి వ్యవసాయ భూముల సర్వే విధానం గురించి ప్రభావతి గుప్త వేయించిన పూనా శాసన ఫలకాలు వివరిస్తున్నాయి. భూముల కొలతలు, సరిహద్దు రాళ్లు వేయడం గురించి 'పహాడ్‌పూర్' శాసనం పేర్కొంటుంది. పుస్తపాల అనే అధికారి జిల్లాలో జరిగే భూ లావాదేవీలను రికార్డు చేసేవాడు. భూదానాలు అధికంగా చేయడంతో గుప్తుల కాలంలో భూస్వామ్య వ్యవస్థకు పునాది పడింది. ఏ విధమైన పన్నులు లేకుండా బ్రాహ్మణులకు భూములను, గ్రామాలను (అగ్రహారాలు) దానం చేసేవారు. సముద్రగుప్తుడు వేయించిన నలందా, గయ శాసనాల్లో అగ్రహారాల ప్రస్తావన ఉంది. నాటి ప్రధాన భూస్వామ్య ప్రభువులను 'ఉక్కకల్ప' మహారాజులుగా పిలిచేవారు. దేవాలయాలు, కవులు, వ్యాపారులకు దానం చేసే గ్రామాలను 'దేవాగ్రహారాలు' అనేవారు. ఉక్కకల్ప మహారాజులు పుళిందభట్టు అనే గిరిజన తెగ నాయకుడికి కూడా రెండు గ్రామాలను దానం చేసినట్లు శాసన ఆధారాలు లభించాయి.

రోమ్ దేశంతో ఎక్కువ విదేశీ వాణిజ్యం జరిపేవారు. తూర్పున తామ్రలిప్తి, పశ్చిమాన బరుకచ్ఛ ప్రధాన ఓడరేవులుగా ఉండేవి. సార్థవాహులు అనే సంచార వ్యాపారులు నగరాల్లో వ్యాపారం చేసేవారు. అరేబియా, పర్షియా, అఫ్గనిస్థాన్ దేశాల నుంచి గుర్రాలను దిగుమతి చేసుకునేవారు. ఉప్పును ప్రభుత్వం మాత్రమే ఉత్పత్తి చేసేది.

## సాంఘిక, మత పరిస్థితులు

వర్ణ వ్యవస్థ పెరగడంతో సామాజిక అంతరాలు అధికంగా ఉండేవి. ఛండాలురు అనే పంచమ వర్ణం ఏర్పడింది. వర్ణాశ్రమ ధర్మాలను కాపాడటానికి ప్రత్యేకంగా అభయదత్తుడు అనే ఉద్యోగి ఉండేవాడు. అనులోమ, ప్రతిలోమ వివాహాలు ఉండేవి. ఎక్కువ వర్ణం పురుషుడు తక్కువ వర్ణం స్త్రీని వివాహం చేసుకుంటే దాన్ని అనులోమ వివాహం అంటారు. దీనిపై నిషేధం లేదు. కానీ తక్కువ వర్ణానికి

చెందిన పురుషుడు ఎక్కువ కులానికి చెందిన స్త్రీని వివాహం చేసుకునే ప్రతిలోమ వివాహాలను ధర్మశాస్త్రాలు నిషేధించాయి. నాటి ఎరాన్ శాసనం ప్రకారం సతీ సహగమనం ఉన్నట్లు తెలుస్తోంది. దేవదాసీ ఆచారం ప్రారంభమైంది. గుప్తుల కాలంలో వైదిక మతం/ హిందూమతాన్ని పునరుద్ధరించారు. రెండో చంద్రగుప్తుడు 'పరమ భాగవత' అనే బిరుదు ధరించాడు. సముద్రగుప్తుడు రాజ చిహ్నంగా గరుడ వాహనాన్ని ఉపయోగించాడు. దశావతార సిద్ధాంతం గుప్తుల కాలంలో బాగా ప్రాచుర్యం పొందింది. భాగవత మతం అభివృద్ధి చెందింది. స్కంధగుప్తుడి జునాగఢ్ శాసనంలో బలి చక్రవర్తి, వామనుల కథనాన్ని వివరించారు. మౌఖరీ వంశస్థుడైన అనంతవర్మబారాబర్ గుహల్లో కృష్ణుడి విగ్రహాన్ని పూజించాడు. విష్ణుదేవుడి నరసింహ అవతారం గురించి అలీనదాన శాసనం వివరిస్తుంది. ఎరాన్‌లో వరాహ విగ్రహం కనిపిస్తుంది. గుప్తుల కాలంలో శైవ, వైష్ణవ, బౌద్ధ మతాలను సమానంగా ఆదరించారు. గుప్త చక్రవర్తులు పరమత సహన విధానాన్ని పాటించారు.

## రాజకీయ చరిత్ర

గుప్త వంశ మూల పురుషుడు శ్రీగుప్తుడు. చైనా యాత్రికుడు ఇత్సింగ్ తన రచనల్లో శ్రీ గుప్తుడిని చిలికిత (చీ-లీ-కిటో) మహా రాజుగా ప్రస్తావించాడు. శ్రీగుప్తుడి అనంతరం అతడి కుమారుడు ఘటోత్గజ గుప్తుడు 'మహారాజు' బిరుదుతో రాజ్యపాలన చేశాడు. కానీ వాస్తవంగా గుప్త రాజ్య స్థాపకుడిగా పేరొందింది మొదటి చంద్రగుప్తుడు. ఇతడు లిచ్ఛవీ గణానికి చెందిన కుమారదేవిని వివాహం చేసుకున్నాడు. 'రాజాధిరాజ' బిరుదుతో పాలన చేశాడు. అనంతరం అతడి కుమారుడైన సముద్రగుప్తుడు క్రీ.శ. 335 – 375 సంవత్సరాల మధ్య పాటలీపుత్రం రాజధానిగా పరిపాలన చేశాడు. కచ అనే యువరాజుతో వారసత్వ యుద్ధంలో విజయం సాధించి, సముద్రగుప్తుడు రాజ్యానికి వచ్చినట్లు తెలుస్తుంది.

హరిసేనుడు వేయించిన అలహాబాద్ శాసనం సముద్రగుప్తుడి విజయాలను వివరిస్తుంది. దాని ప్రకారం సముద్రగుప్తుడు మొదటి ఆర్యావర్తన దండయాత్ర, దక్షిణ భారతదేశ దండయాత్ర, రెండో ఆర్యావర్తన దండయాత్ర చేసి అనేక విజయాలను సాధించాడు. ముఖ్యంగా దక్షిణదేశ దండయాత్రలో 12 మంది రాజులను ఓడించి, వారిని సామంతులుగా చేసుకున్నాడు. వారిలో కోసలరాజు మహేంద్రుడు, వేంగి రాజు హస్తివర్మ (శాలంకాయన రాజు), కంచి పాలకుడు విష్ణుగోపుడు (పల్లవ రాజు) ముఖ్యమైనవారు.

ఆంగ్ల చరిత్రకారుడైన వి.ఎ.స్మిత్ సముద్రగుప్తుడిని 'ఇండియన్ నెపోలియన్' అని కీర్తించాడు. 'కవిరాజు', 'అశ్వమేధ యోగి' లాంటి బిరుదులను పొందాడు. మొదటి ఆర్యావర్తన దండయాత్రలో నాగసేనుడిని, రెండో ఆర్యావర్తన దండయాత్రలో గణపతినాగ, అచ్యుతనాగ, లాంటి నవనాగ చక్రవర్తులను ఓడించాడు. కౌశాంబి యుద్ధంలో మొదటి రుద్రసేనుడిని ఓడించి, అశ్వమేధ యాగం చేసి 'అశ్వమేధ యోగి' బిరుదు పొందాడు. ఇంకా అయిదు సరిహద్దు రాజ్యాలను, తొమ్మిది ఆటవిక రాజ్యాలను ఓడించాడు. సింహళరాజు మేఘవర్ణుడు సముద్రగుప్తుడి అనుమతితో బుద్ధగయలో బౌద్ధ విహారాన్ని నిర్మించాడు. సముద్రగుప్తుడి అనంతరం అతడి పెద్ద కుమారుడైన రామగుప్తుడు రాజ్యానికి వచ్చినట్లు, శక రాజు బసన చేతిలో ఓడిపోయి తన భార్య ధ్రువాదేవిని ఇచ్చి సంధి చేసుకున్నట్లు, రెండో చంద్రగుప్తుడు బసనను, రామగుప్తుడిని చంపి రాజ్యానికి వచ్చినట్లు 'దేవీచంద్రగుప్తం' నాటకం పేర్కొంటుంది.

## నాణేలు

గుప్తుల కాలంలో అధికంగా బంగారు నాణేలను ముద్రించారు. వీరు కుషాణుల నాణేలను పోలిన నాణేలను విడుదల చేశారు. సముద్ర గుప్తుడు వీణ బొమ్మతో బంగారు నాణేలను ముద్రించాడు. అశ్వమేధ యాగం చేసి, 'అశ్వమేధ యోగి' బిరుదుతో కూడా సముద్రగుప్తుడు బంగారు నాణేలను ముద్రించాడు. మొదటి చంద్రగుప్తుడు శ్రీ చంద్రగుప్త కుమారదేవి పేరుతో నాణేలను ముద్రించాడు. గుప్తుల కాలం నాటి బంగారు నాణేలను 'దీనార్', 'కారా', 'సువర్ణ' అని పిలిచేవారు. సముద్రగుప్తుడి నాణేల్లో ఎక్కువగా వెనుక భాగంలో లక్ష్మీదేవి బొమ్మను ముద్రించేవారు. రెండో చంద్రగుప్తుడి నాణేలపై 'మహా రాజాధిరాజ శ్రీచంద్రగుప్త' అనే బిరుదును ముద్రించారు. గుప్తుల్లో రాగి నాణేలను ముద్రించిన తొలి చక్రవర్తిగా రెండో చంద్రగుప్తుడిని పేర్కొంటారు. ఉజ్జయిని ముద్రతో నాణేలను ముద్రించింది రెండో చంద్రగుప్తుడే. రెండో చంద్రగుప్తుడు వెండి నాణేలపై ఒకవైపు పరమభాగవత, మహారాజాధిరాజు బిరుదులను, మరో వైపు గరుడి (గద్ద) బొమ్మను ముద్రింపజేసేవాడు. ఏనుగు, నెమలి, అశ్వికుడు లాంటి బొమ్మలతో కుమారగుప్తుడు నాణేలను ముద్రించాడు.

**రచయిత: బొత్స నాగరాజు**

# చరిత్ర

## గుప్త యుగం - సాంస్కృతిక వికాసం

- గుప్తుల కాలంలో అధికార భాష సంస్కృతం.
- వసుబంధు అనే బాస మహాకవి 'స్వప్న వాసవదత్త' అనే గ్రంథాన్ని రాశాడు.
- వాత్స్యాయనుడు కామసూత్రాలను రచించాడు.
- శూద్రకుడు మృచ్ఛకటికం అనే గ్రంథాన్ని రాశాడు. ఈ గ్రంథంలో నాటి పట్టణ జీవితాన్ని వర్ణించాడు.
- విశాఖదత్తుడు దేవీచంద్రగుప్తం, ముద్రా రాక్షసం అనే గ్రంథాలను రచించాడు.
- అమరసింహుడు తొలి సంస్కృత భాషా నిఘంటువుగా పేరొందిన 'అమరకోశం' అనే గ్రంథాన్ని రాశాడు.
- పాలకవ్యుడు హస్త్యాయుర్వేదం అనే పశు వైద్యశాస్త్ర గ్రంథాన్ని రచించాడు.
- కామందకుడు రచించిన నీతిశాస్త్రం గుప్తుల అర్థశాస్త్రంగా పేరొందింది.
- బెంగాల్‌కు చెందిన చంద్రగోమియా 'చంద్ర వ్యాకరణం' గ్రంథాన్ని రాశాడు.
- రామచంద్రుడు అనే కవి 'నాట్య దర్పణం' గ్రంథాన్ని రచించాడు.
- రామాయణాన్ని జైనమతానికి అనుగుణంగా రచించింది విమలుడు.
- దివాకరుడు అనే కవి న్యాయవర్త, సమ్మతి తర్కసూత్ర అనే గ్రంథాలు రాశాడు.
- పాణిని అష్టాధ్యాయి గ్రంథాన్ని, పతంజలి మహాభాష్యం అనే వ్యాఖ్యానాన్ని రాశారు.
- గుప్తుల కాలంలో ప్రాకృత భాషను శూరసేన (మగధ ప్రాంతం), అర్థమగధి (బుందేల్‌ఖండ్ ప్రాంతం), మగధి (బిహార్ ప్రాంతం) లాంటి పేర్లతో పిలిచేవారు.
- వాగ్భటుడు అష్టాంగ సంగ్రహం అనే గ్రంథాన్ని రచించాడు (వైద్యశాస్త్ర గ్రంథం).
- నవరత్నాలు – కాళిదాసు, శంఖువు, బేతాళభట్టు, ఘటకర్పరుడు, అమర సింహుడు, వరాహమిహిరుడు, వరరుచి, ధన్వంతరి, క్షహరాటుడు.

### శాస్త్ర విజ్ఞానం

- గుప్తుల కాలంలో గణిత, ఖగోళ, వైద్య శాస్త్రాలు ఎంతో అభివృద్ధి చెందాయి.
- గుప్తుల కాలంనాటి గొప్ప గణిత, ఖగోళ శాస్త్రవేత్త ఆర్యభట్టు.
- ఆర్యభట్టు రచనలు ఆర్యభట్టీయం, సూర్య సిద్ధాంతం, లఘు జాతకం. సూర్య సిద్ధాంతం గ్రంథంలో సూర్య, చంద్ర గ్రహణాలు ఏర్పడటానికి కారణాలు వివరించారు. భూమి గుండ్రంగా ఉందని చెప్పింది ఆర్యభట్టు.
- వృత్త పరిధికి, వృత్త వ్యాసానికి సరైన $\pi$ నిష్పత్తిని 22/7 గా చెప్పింది ఆర్యభట్టు.
- వరాహమిహిరుడు 'బృహత్ సంహిత' అనే గ్రంథాన్ని రచించాడు. దీన్ని గుప్తుల కాలంనాటి విజ్ఞాన సర్వస్వంగా పేర్కొంటారు.
- భూమికి ఆకర్షణ శక్తి ఉందని గుప్తుల కాలంలోనే చెప్పిన బ్రహ్మగుప్తుడు 'ఇండియన్ న్యూటన్'గా పేరొందాడు.

  (ఖండఖాద్యక, బ్రహ్మస్ఫుటక సిద్ధాంతం అనేవి ఈయన రచనలు)
- వరాహమిహిరుడు పంచ సిద్ధాంతిక, బృహత్ జాతక లాంటి ఇతర రచనలు కూడా చేశాడు.
- వివిధ మందులు, ఔషధాల తయారీ విధానం గురించి వివరిస్తున్న గ్రంథం 'నవనీతకం'
- గుప్తుల కాలంలో గొప్ప ఆయుర్వేద వైద్యుడిగా పేరొందింది ధన్వంతరి.



R-19-5-18

- "శుశృత సంహిత" అనే శస్త్ర చికిత్స గ్రంథాన్ని శుశృతుడు రచించాడు.
- వజ్జిక అనే రచయిత 'కౌముది మహోత్సవం' అనే గ్రంథాన్ని రాశాడు.
- గుప్తుల కాలంలో శబరుడు అనే వ్యక్తి సాంఖ్య, యోగ లాంటి దర్శనాలపై వ్యాఖ్యలు రాశాడు

**గుప్తుల కాలంనాటి ప్రసిద్ధ హిందూ దేవాలయాలు**

నాచన్ కుటారా – పార్వతీదేవి దేవాలయం

భూమ్రా – శివాలయం, మధ్యప్రదేశ్

దేవఘడ్ – దశావతార దేవాలయం, మధ్యప్రదేశ్

టిగావా – విష్ణు దేవాలయం, మధ్యప్రదేశ్

బిట్టర్‌గావ్ – ఇటుకల దేవాలయం, ఉత్తర్ ప్రదేశ్

- దశావతార దేవాలయ గోడలపై రామాయణ, మహాభారత గాథలను శిల్పాలుగా చెక్కారు.
- ఉదయగిరి గుహాలయం (ఒడిశా) వద్ద వరాహ విగ్రహాన్ని చెక్కారు.
- గ్వాలియర్ సమీపంలోని పవాయి వద్ద నాట్యగత్తె, సంగీతకారిణుల విగ్రహాలు లభించాయి.
- సుల్తాన్‌గంజ్‌లో బుద్ధ విగ్రహం (కంచుతో తయారు చేసింది) ఏడున్నర అడుగుల పొడవుతో లభించింది.
- నలందాలో 18 అడుగుల ఎత్తున్న బుద్ధుడి రాగి విగ్రహం లభించింది.
- వారణాసిలో కార్తికేయ శిల్పాలు లభించాయి.
- గుప్తుల కాలంనాటి ముద్రలు ఎక్కువగా వైశాలిలో లభించాయి.
- గుప్తుల కాలంనాటి బుద్ధుడి శిల్పాలు 'తౌమ బుద్ధులు'గా పేరొందాయి.
- నాటి శిల్పాలను ఎక్కువగా చూనార్ నుంచి తెచ్చిన ఇసుకరాతితో చెక్కారు.
- సారనాథ్ మ్యూజియంలో బుద్ధ విగ్రహం (సారనాథ్ బుద్ధుడు) యోగిముద్రలో ఉంటుంది.
- అజంతా, బాగ్ గుహల్లో గుప్తుల కాలంనాటి చిత్రలేఖనాలు లభించాయి.
- అజంతా 16వ గుహలోని 'మరణశయ్యపై రాకుమార్తె' చిత్రం గుప్తుల కాలానిదే.
- గుప్తుల శిల్పకళ మహోన్నతి పొందిన హైందవ శిల్పకళ అని విన్సెంట్ స్మిత్ పేర్కొన్నారు.
- 23 అడుగుల 8 అంగుళాల పొడవున్న మెహరౌలీ ఉక్కు స్తంభం (ఢిల్లీ) ఇప్పటికీ తుప్పుపట్టలేదు.
- "బిట్టర్‌గావ్ దేవాలయ శిల్ప నిర్మాణం సుదీర్ఘ సంప్రదాయానికి ప్రతీకగా ఉంది" అని పెర్సీబ్రౌన్ అనే చరిత్రకారుడు పేర్కొన్నాడు.

## హర్షవర్ధనుడు

- గుప్తుల అనంతరం ఉత్తర భారతదేశాన్ని పరిపాలించిన చివరి హిందూ చక్రవర్తి హర్షవర్ధనుడు.
- హర్షవర్ధనుడు పుష్యభూతి వంశానికి చెందినవాడు. ఇతడి రాజధాని స్థానేశ్వరం.
- హర్షుడి తండ్రి ప్రభాకరవర్ధనుడు. తల్లి యశోమతి దేవి. సోదరుడు రాజ్యవర్ధనుడు. సోదరి రాజ్యశ్రీ.
- పుష్యభూతి వంశీకుల పాలన గురించి వివరిస్తున్న శాసనాలు మధుబన్, బాన్స్‌ఖేరా.
- మధుబన్ శాసనం ప్రకారం ప్రభాకరవర్ధనుడు పరమభట్టారక, మహారాజాధిరాజు అనే బిరుదులతో పాలించాడని తెలుస్తోంది.
- బాణుడి హర్షచరిత్రలో ప్రభాకరవర్ధనుడు హూణుల హరిణాలకు (జింకలకు) సింహం లాంటి వాడని పేర్కొన్నారు.
- యశోమతీదేవి భర్తతో సతీసహగమనం చేసింది.
- రాజ్యశ్రీని కనోజ్ పాలకుడైన గ్రహవర్మకు ఇచ్చి వివాహం జరిపించారు.

- గ్రహవర్మ, అతడి మిత్రుడు గౌడ శశాంకుడు కుట్రచేసి రాజ్యవర్ధనుడిని చంపారు.
- హర్షుడు అస్సాం/ కామరూప పాలకుడు భాస్కరవర్మ సహాయంతో గ్రహవర్మ, గౌడ శశాంకుడిని ఓడించాడు.
- మాళ్వారాజు దేవగుప్తుడు గ్రహవర్మను చంపి, కనోజ్‌ను ఆక్రమించాడు.
- హర్షుడు సోదరిని రక్షించి, కనోజ్ పాలకురాలిగా నియమించాడు.
- కనోజ్ ప్రజల కోరిక మేరకు హర్షవర్ధనుడు క్రీ.శ.606లో శీలాదిత్య బిరుదుతో స్థానేశ్వరం, కనోజ్‌లను కలిపి పట్టాభిషేకం చేసుకున్నాడు.
- హర్షుడి పాలనాకాలం క్రీ.శ.606 – 647
- హర్షుడి కాలంలో హుయాన్‌త్సాంగ్ అనే చైనా యాత్రికుడు అతడి రాజ్యాన్ని సందర్శించాడు.
- హుయాన్‌త్సాంగ్ రచన 'సియుకి'
- హుయాన్‌త్సాంగ్ యాత్రికుల్లో రాజు (కింగ్ ఆఫ్ పిలిగ్రిమ్స్)గా పేరొందాడు.
- హర్షుడి బిరుదులు శీలాదిత్య, రాజపుత్ర
- హర్షుడిని నర్మదా నది యుద్ధంలో ఓడించిన పశ్చిమ చాళుక్య రాజు రెండో పులకేశి.
- రెండో పులకేశి ఐహోలు శాసనంలో హర్షుడిని సకలోత్తర పథేశ్వరుడు అనే బిరుదుతో ప్రస్తావించడం కనిపిస్తుంది.
- హర్షుడు మహామోక్ష పరిషత్, కనోజ్ పరిషత్తులను నిర్వహించాడు.
- ప్రతి 5 సంవత్సరాలకు ఒకసారి తన సంపదనంతా పేదలకు పంచే కార్యక్రమమే 'మహామోక్ష పరిషత్'. దీన్నే 'ప్రయాగ పరిషత్' అంటారు.
- హర్షుడు మొత్తం ఆరు మహామోక్ష పరిషత్‌లు నిర్వహించాడు. 6వ పరిషత్‌కు హుయాన్‌త్సాంగ్ హాజరయ్యాడు.
- హర్షుడు కనోజ్‌లో హుయాన్‌త్సాంగ్ అధ్యక్షతన సర్వమత సమావేశాన్ని నిర్వహించాడు. దీన్నే 'కనోజ్ పరిషత్' అంటారు.
- హర్షుడు తన రాజ్యాన్ని భుక్తులు – విషయాలు – పథక గ్రామాలుగా విభజించాడు.
- వల్లభి రాజ్య రాజు రెండో ధ్రువసేనుడిని హర్షుడు ఓడించినట్లు నౌశాసితామ్ర ఫలకం (శాసనం) తెలియజేస్తోంది.
- యుద్ధభూమిలో చక్రవర్తే సైన్యాధ్యక్షుడిగా వ్యవహరించేవాడు. చక్రవర్తికి పాలనలో సహాయపడటానికి సచివులు/అమాత్యులు అనే మంత్రులను నియమించేవారు.
- హర్షుడి ప్రధానమంత్రి పేరు 'భండి'.
- యుద్ధమంత్రి – మహాసంధి విగ్రహాధికృత, సైన్యాధికారి – మహాబలాధికృత
- గజబలాధ్యక్షుడు – కాటుక, విదేశీ కార్యదర్శి – రాజస్థానీయ
- హర్షుడి కాలంలో రాష్ట్రాలను భుక్తులు అని, జిల్లాలను విషయాలు అని పిలిచారు.
- భుక్తి అధిపతిని ఉపరిక/గోప్త్రీ అని పిలిచేవారు.
- నాడు రహదారులు క్షేమంగా లేవని హుయాన్‌త్సాంగ్ పేర్కొన్నాడు.
- హుయాన్‌త్సాంగ్ క్రీ.శ.630లో భారతదేశానికి వచ్చి 15 సంవత్సరాలు ఇక్కడే ఉన్నాడు. (సి-యు-కి అంటే పశ్చిమ ప్రపంచ ప్రతులు)
- హర్షుడు యుద్ధం, శాంతి కళల్లో సమాన ప్రతిభ కలిగి ఉన్నాడని ఆర్.సి. మజుందర్ పేర్కొన్నారు.
- నాటి కాలంలో మగధ వరి పంటకు ప్రసిద్ధి చెందింది.
- నాడు భూమి శిస్తు పంటలో 1/6వ వంతు ఉండేది. భూమి శిస్తును 'ఉద్రంగ' అనేవారు. భూమి శిస్తు కాకుండా మరో 18 రకాల పన్నులు వసూలు చేసేవారు.
- హర్షుడు వివిధ స్థాయిల్లో పన్ను వసూలు కోసం ఆయుక్త, భోజక, ధ్రువాధికరణ, గౌల్మిక లాంటి అధికారులను నియమించాడు.

- గ్రామంలో పన్ను వసూలు కోసం అక్షపటలిక, కరణిక్ అనే ఉద్యోగులను నియమించాడు.
- వస్తువు బరువు ఆధారంగా 'తుల్యమేయ' పేరుతో అమ్మకం పన్నును వసూలు చేసేవారు.
- భారతదేశంలో వ్యవసాయ రంగంలో తొలిసారిగా నీటివేగంతో నడిచే తులాయంత్రాలను ప్రవేశపెట్టింది హర్షుడే.
- హర్షుడి కాలంలో మౌఖరీ వంశీయులు వల్లభి విశ్వవిద్యాలయాన్ని అభివృద్ధి చేశారు.
- హర్షుడు నలందా విశ్వవిద్యాలయానికి 100 గ్రామాలను దానం చేసినట్లు హుయాన్‌త్సాంగ్ పేర్కొన్నాడు.
- హర్షుడి ఆస్థానకవి బాణుడు హర్షచరిత్ర అనే గ్రంథాన్ని రాశాడు.
- హర్షుడు సంస్కృత భాషలో నాగానందం, రత్నావళి, ప్రియదర్శి లాంటి గ్రంథాలు రాశాడు.
- సుభాషిత శతకం – భర్తృహరి, సూర్యశతకం – మయూరుడు. వీరు హర్షుడి ఆస్థానంలో ఉండేవారు.
- హుయాన్‌త్సాంగ్ క్రీ.శ. 645లో ఉదిత అనే సహాయకుడితో చైనా చేరాడు.
- గౌడ శశాంకుడు వంగ, మగధ, ఒరిస్సాలను 'మహారాజాధిరాజ' బిరుదుతో పాలించినట్లు గంజాం శాసనం తెలుపుతోంది.
- నలందా విశ్వవిద్యాలయంలోని గ్రంథాలయాన్ని 'ధర్మఘంజ్' అనేవారు.
- ధర్మపాల, ఆర్యదేవ, శీలభద్ర లాంటి ఆచార్యులు నలందా విశ్వవిద్యాలయంలో పనిచేశారు.
- స్థిరమతి, గుణమతి లాంటి ఆచార్యులు వల్లభి విశ్వవిద్యాలయంలో పనిచేశారు.
- భారతదేశ చరిత్రలో గుప్తుల కాలాన్ని స్వర్ణయుగంగా పేర్కొంటారు. హిందూమత పునరుద్ధరణ, భాషా, సాహిత్యాల వికాసం, వాస్తు, కళారంగాలు, విజ్ఞాన శాస్త్రం అభివృద్ధి లాంటి కారణాల వల్ల గుప్త యుగాన్ని స్వర్ణయుగం అంటారు.
- కాళిదాసు సంస్కృత భాషలో గొప్ప రచనలు చేసి, 'ఇండియన్ షేక్‌స్పియర్'గా పేరొందాడు. ఇతడు అభిజ్ఞాన శాకుంతలం, మాళవికాగ్నిమిత్రం, రఘువంశం, విక్రమోర్వశీయం, మేఘసందేశం, కుమార సంభవం లాంటి రచనలు చేశాడు.

**వాస్తు, కళారంగాలు**

- గుప్తుల కాలంనాటికి నగర, ద్రవిడ శైలులు రూపాంతరం సంతరించుకున్నాయి.
- గుప్తుల వాస్తు నిర్మాణంలో ప్రధానమైనవి గుహాలయాలు, దేవాలయాలు, స్తూపాలు.
- మహారాష్ట్రలోని అజంతా గుహలు, మధ్యప్రదేశ్‌లోని బాగ్ గుహలు గుప్తుల కాలంలోనే అభివృద్ధి చెందాయి.
- గుప్తుల కాలంలో సారనాథ్ (ఉత్తర్ ప్రదేశ్), రత్నగిరి (ఒడిశా) మీర్‌పూర్‌ఖాన్ (సింధు) ప్రాంతాల్లో స్తూపాలను నిర్మించారు.
- మధ్యప్రదేశ్‌లోని భూమ్రాలో శివాలయాన్ని నిర్మించారు.

**రచయిత: బొత్స నాగరాజు**

# భారతదేశ చరిత్ర

## మధ్యయుగ భారతదేశ చరిత్ర - రాజపుత్రయుగం

భారతదేశ చరిత్రలో క్రీ.శ.8 – 18 శతాబ్దాల మధ్య కాలాన్ని మధ్యయుగంగా పేర్కొంటారు. ఈ యుగ ప్రధాన లక్షణం భూస్వామ్య వ్యవస్థ / ఫ్యూడలిజం. క్రీ.శ.712లో అరబ్బుల సింధు దండయాత్రను మధ్యయుగ ప్రారంభంగా భావిస్తారు. హర్షుడి మరణం తర్వాత ఉత్తర భారతదేశాన్ని పరిపాలించిన వారిని రాజపుత్రులు అంటారు.

✶ ప్రతీహారులు, పరమారులు, కదంబులు, ఛందేలులు, పాల, సేన వంశీయులు, చౌహానులు / చహమానులు, గహద్వాలులు, సోలంకీలు, కర్కోట, ఉత్పల, లోహార వంశాలు రాజపుత్ర రాజ్యాల్లో ప్రధానమైనవి.

✶ రాజపుత్రులు శాసనాల్లో తమను తాము సూర్యవంశ, చంద్రవంశ క్షత్రియులుగా పేర్కొన్నారు.

✶ పృథ్వీరాజ్ రాసో గ్రంథంలో చాంద్‌బర్దై రాజపుత్రులను అగ్నికుల క్షత్రియులుగా పేర్కొన్నాడు.

✶ కల్నల్ టాడ్ తన "రాజస్థాన్ కథావళి" గ్రంథంలో రాజపుత్రులను విదేశీ జాతుల సంతతిగా ప్రస్తావించాడు.

✶ రాజపుత్ర రాజులు దేశ భక్తికి, హిందూ మతం పట్ల అభిమానానికి, ధైర్యసాహసాలకు పేరొందారు. కానీ వారిలో అనైక్యత ముస్లింలు భారతదేశంపై అధికారం పొందడానికి కారణమైంది.

✶ రాజపుత్ర వంశాల్లో తొలి, ప్రధాన వంశం ప్రతీహారులు. వీరు నేటి ఉత్తర్ ప్రదేశ్, కనోజ్ ప్రాంతాలను పాలించారు.

✶ ప్రతీహారులు అంటే ద్వార పాలకులు అని అర్థం.

✶ రాజౌర్ / రాజోర్ శాసనం ప్రకారం ప్రతీహార వంశ మూలపురుషుడు హరిశ్చంద్రుడు. ఇతడు బ్రాహ్మణుడు.

✶ ప్రతీహారుల్లో మొదటి గొప్ప రాజు మొదటి నాగభట్టు. ఇతడి విజయాలను గ్వాలియర్ శాసనం వివరిస్తోంది.

✶ మొదటి నాగభట్టు నాటి కనోజ్ పాలకుడు చక్రాయుధుడ్ని ఓడించాడు.

✶ వంగ (బెంగాల్), అనార్త (గుజరాత్) ప్రాంతాలను ఆక్రమించాడు.

✶ కనోజ్‌పై ఆధిపత్యం కోసం పాల, ప్రతీహార, రాష్ట్రకూట రాజులు త్రైపాక్షిక పోరాటం చేశారు.

✶ ఉద్యోధనుడు రచించిన కువలయమాల గ్రంథంలో ప్రతీహార మొదటి వత్సరాజును రణహస్తిన్ వత్సరాజుగా పేర్కొన్నాడు.

✶ మొదటి వత్సరాజు రాష్ట్రకూట ధృవుడి చేతిలో ఓడిపోయి, మాళ్వాను కోల్పోయాడు.

✶ ప్రతీహారుల్లో గొప్పరాజు మొదటి భోజుడు/ మిహిరభోజుడు.

✶ మిహిరభోజుడి కాలంలో అరబ్ యాత్రికుడు సులేమాన్ ప్రతీహార రాజ్యాన్ని సందర్శించాడు.

✶ మిహిరభోజుడు చౌహాన్ వంశ రాకుమార్తె కళావతిని వివాహం చేసుకున్నాడు.

✶ మహేంద్రపాలుడనే ప్రతిహార రాజు ఆస్థానంలో రాజశేఖరుడనే కవి ఉండేవాడు.

✶ రాజశేఖరుడు కర్పూర మంజరి, కావ్యమీమాంస లాంటి గ్రంథాలు రచించాడు.

✶ మహీపాలుడనే ప్రతీహార రాజు కాలంలో అల్ మసూది అనే అరబ్బు యాత్రికుడు వచ్చాడు.

✶ చివరి ప్రతీహార వంశ పాలకుడు యశపాలుడు.

✶ ప్రతీహారుల రాజలాంఛనం గంగా యమున తోరణం.

✶ గహద్వాలులు ప్రతీహారులకు సామంతులుగా ఉండేవారు.

### గహద్వాలులు

✶ గహద్వాల రాజ్య స్థాపకుడు చంద్రదేవుడు.

✶ గోవింద చంద్రుడనే గహద్వాల రాజు ఆస్థానంలో లక్ష్మీధరుడనే కవి ఉండేవాడు. ఇతడు కృత్యకల్పతరు అనే న్యాయశాస్త్ర గ్రంథాన్ని రచించాడు.

✶ గోవింద చంద్రుడి బిరుదు "వివిధ విద్య వికాస వాచస్పతి".

✶ గోవింద చంద్రుడి ఆస్థానంలోని మరొక కవి దామోదర శర్మ. ఈయన "యుక్తివ్యక్తి ప్రకరణం" అనే గ్రంథాన్ని (సంస్కృత వ్యాకరణ గ్రంథం) రాశాడు.

✶ గోవింద చంద్రుడి భార్య కుమారదేవి సారనాథ్‌లో బౌద్ధ విహారాన్ని నిర్మించింది.

✶ బంగారు నాణేలను ముద్రించిన ఏకైక గహద్వాల పాలకుడు గోవింద చంద్రుడు.

✶ జయచంద్రుడు అనే గహద్వాల రాజు ఘోరీ మహ్మద్‌ను భారతదేశ దండయాత్రలకు ఆహ్వానించాడని చరిత్రకారులు పేర్కొన్నారు.

✶ జయచంద్రుడి కుమార్తె రాణి సంయుక్తను చౌహాన్ రాజైన మూడో పృథ్వీరాజ్ తీసుకెళ్లి, ప్రేమ వివాహం చేసుకున్నాడు.

✶ జయచంద్రుడు 1194 నాటి చంద్‌వార్ యుద్ధంలో ఘోరీ చేతిలో ఓడి, రాజ్యాన్ని కోల్పోయాడు.

✶ జయచంద్రుడి ఆస్థానంలోని శ్రీహర్షుడు నైషధచరిత్ర, ఖండనఖండఖాద్య అనే గ్రంథాలను రచించాడు.

✶ చివరి గహద్వాల పాలకుడు హరిశ్చంద్రుడు.

✶ నాటి ఢిల్లీ, అజ్మీర్ ప్రాంతాలను పాలించిన రాజపుత్ర వంశం చౌహాన్/ చహమాను వంశం.

✶ చౌహానులు కూడా ప్రతీహారులకు సామంతులుగా ఉండేవారు.

**చౌహానులు**

✶ చౌహాన్ వంశ స్థాపకుడు వాసుదేవుడు/ సింహరాజు

✶ వాక్పతిరాజు అనే చౌహాన్ పాలకుడు పుష్కర్ వద్ద ఒక శివాలయాన్ని నిర్మించాడు.

✶ విశాలదేవుడు అనే చౌహాన్ రాజు "హరకేళి" అనే నాటకాన్ని రచించాడు.

✶ హరకేళి నాటకంలోని కొన్ని అంశాలను అర్హిదిన్‌కా జోంప్రా మసీదుపై చిత్రించారు.

✶ విశాలదేవుడి ఆస్థానంలోని సోమదేవుడు అనే కవి లలిత విగ్రహరాజు నాటకాన్ని రచించాడు.

✶ 4వ విగ్రహరాజు/ విశాలదేవుడు అజ్మీర్‌లో సంస్కృత విద్యాసంస్థను నెలకొల్పాడు.

✶ చౌహాన్ వంశంలో గొప్పవాడు మూడో పృథ్వీరాజ్. ముస్లిం రచయితలు ఇతడిని రాయపితారా అనే పేరుతో ప్రస్తావించారు.

✶ మూడో పృథ్వీరాజ్ చౌహాన్ ఆస్థానకవి చాంద్‌బార్డై హిందీ భాషలో పృథ్వీరాజ్ రాసో అనే గ్రంథాన్ని రాశాడు.

✶ పృథ్వీరాజ్ చౌహాన్, ఘోరీ మహ్మద్‌ల మధ్య 1191, 1192ల్లో రెండు తరైన్ యుద్ధాలు జరిగాయి. మొదటి తరైన్ యుద్ధం (1191)లో ఓడిపోయిన ఘోరీ రెండో తరైన్ యుద్ధం (1192)లో పృథ్వీరాజ్‌ను వధించి ఢిల్లీ, అజ్మీర్‌లను ఆక్రమించాడు.

**పాలవంశీయులు**

✶ మధ్యయుగంలో తూర్పు బెంగాల్ ప్రాంతాన్ని వంగ దేశమని, పశ్చిమ బెంగాల్ ప్రాంతాన్ని గౌడ దేశమని పిలిచేవారు.

✶ బెంగాల్‌ను పాలించిన పాలవంశ స్థాపకుడు గోపాలుడు. ఇతడు ప్రజల చేత ఎన్నుకోబడిన పాలకుడిగా పేరొందాడు.

✶ ఉద్దండపురం బౌద్ధ ఆరామాన్ని గోపాలుడు నిర్మించాడని తారానాథుడు పేర్కొన్నాడు.

✶ పాలవంశీయుల్లో గొప్పవాడు ధర్మపాలుడు. ఇతడే విక్రమశిల విశ్వవిద్యాలయాన్ని నిర్మించాడు (బిహార్)

✶ దేవపాలుడనే పాలరాజు గురించి బాదల్ స్తంభ శాసనం, నలంద రాగి రేకుల శాసనం వివరిస్తున్నాయి.

✶ నారాయణ పాలుడు అనే పాలరాజు 1000 శివాలయాలు నిర్మించాడని భాగల్పూర్ శాసనం పేర్కొంటోంది.

✶ మహీపాల్ అనే పాలరాజు మొదటి రాజేంద్ర చోళుని చేతిలో ఓడిపోయాడు.

✶ పాలవంశీయులు ముద్గరి (మాంఘీర్)ని రాజధానిగా చేసుకుని పాలించారు.

✶ మహీపాలుడి ఆస్థానంలో ధీమన్, విటపాల అనే చిత్రకారులున్నట్లు వి.ఎ. స్మిత్ పేర్కొన్నాడు. పాలవంశీయుల రాజలాంఛనం "శ్వేతచ్ఛత్రములు"

* అతిశ అనే బౌద్ధ సన్యాసి నాయకత్వంలో ఒక బృందాన్ని టిబెట్‌కు పంపాడు.
* పాలవంశం అనంతరం బెంగాల్‌ను సేన వంశీయులు పరిపాలించారు.
* సేన వంశం స్థాపకుడు సామంత సేనుడు.
* విజయసేనుడి ఆస్థానంలో ఉన్న ధోయి అనే కవి పవనదూతం గ్రంథాన్ని రచించాడు.
* బల్లాల సేనుడు అనే సేనవంశపు రాజు ధనసాగర, అద్భుత సాగర అనే గ్రంథాలను రాశాడు.
* లక్ష్మణసేనుడి ఆస్థానంలో పంచరత్నాలు అనే కవులు ఆదరణ పొందారు.
* పంచరత్నాల్లో ఒకరైన జయదేవుడు "గీతాగోవిందం" అనే గ్రంథాన్ని రచించాడు.
* మధ్యప్రదేశ్‌లోని బుందేల్‌ఖండ్ ప్రాంతాన్ని పాలించినవారు చందేలులు.
* చందేల వంశ మూలపురుషుడు జయశక్తి / బెజ్జక
* స్వతంత్ర చందేల రాజ్యస్థాపకుడు యశోవర్మ.
* చందేల రాజు ధంగ కందరీయ మహదేవ దేవాలయాన్ని, ఖజురహో (మధ్యప్రదేశ్) దేవాలయాలను నిర్మించాడు.
* ఖజురహో దేవాలయాలపై వాత్సాయన కామసూత్రాల్లోని భంగిమలను శిల్పాలుగా చెక్కారు.
* విద్యాధరుడు అనే చందేల రాజు గజనీని ఓడించి, సంధికి ఒప్పించాడు.

**పరమారులు**

* మధ్యప్రదేశ్‌లోని మాళ్వా ప్రాంతాన్ని పాలించినవారు పరమారులు.
* పరమార రాజ్యస్థాపకుడు వాక్పతి ముంజ (ముంజరాజు)
* ముంజసాగరం అనే చెరువును తవ్వించింది – వాక్పతి ముంజరాజు
* వాక్పతి ముంజరాజు ఆస్థానంలో ఉన్న కవి ధనుంజయుడు దశరూప గ్రంథాన్ని రచించాడు.
* ధనిక హలాయుధ, పద్మగుప్త అనే కవులు కూడా ముంజరాజు ఆస్థానంలో ఉండేవారు.
* పరమార రాజుల్లో గొప్పవాడు భోజుడు (కవిరాజు)
* పరమార భోజుడు (వైద్యశాస్త్రం) ఆయుర్వేద సర్వస్వం, సమరాంగణ సూత్రధార (వాస్తు శాస్త్రం) అనే గ్రంథాలు రచించాడు.
* భోజపురి నగరాన్ని, భోజశాల అనే సంస్కృత్ కళాశాలను స్థాపించాడు.
* పరమార భోజుడి ఆస్థానంలో ఉన్న కవులు – ధనపాల – శోభన, శాంతిసేవ.
* శ్రీకృష్ణదేవరాయలను 'ఆంధ్ర భోజుడు' అని పరమార భోజుడితో పోల్చి కీర్తించారు.
* ఒరిస్సాలోని భువనేశ్వర్ ప్రాంతాన్ని కేసరి వంశం, 'కళింగ' ప్రాంతాన్ని తూర్పు గాంగులు పరిపాలించారు.
* భువనేశ్వర్‌లోని లింగరాజు దేవాలయాన్ని కేసరి వంశం వారు నిర్మించారు.
* పూరీ జగన్నాథ స్వామి ఆలయాన్ని అనంతవర్మ చోడగాంగ రాజు నిర్మించాడు.
* కోణార్క్ సూర్య దేవాలయాన్ని నిర్మించింది – గాంగ రాజు మొదటి నరసింహుడు
* బృహత్ కథాకోశం, నృపావళి గ్రంథాలు రచించింది – క్షేమేంద్రుడు.
* సిద్ధాంత శిరోమణి గ్రంథాన్ని రాసింది – భాస్కరాచార్యుడు.
* ఉత్తర రామచరితం, మాలతీమాధవం, మహవీర చరిత్రం గ్రంథాల రచయిత – భవభూతి
* చికిత్సాసార సంగ్రహం గ్రంథ రచయిత – చక్రపాణి దత్తుడు

## సోలంకీలు

* ✶ సోలంకీలు అనే రాజపుత్ర రాజులు గుజరాత్‌ను పాలించారు. వీరినే లాటచాళుక్యులు అని కూడా అంటారు.
* ✶ సోలంకీ వంశ స్థాపకుడు, మొదటి రాజు – మూలరాజు.
* ✶ మొదటి సోలంకీ భీముడి కాలంలో గజనీ మహ్మద్ కథియవాడ్‌లోని సోమనాథ దేవాలయాన్ని ధ్వంసం చేశాడు.
* ✶ మౌంట్ ఆబూ పర్వత శిఖరంపై దిల్వారా జైన దేవాలయాలను నిర్మించిన మొదటి సోలంకీ రాజు భీముడు.
* ✶ కర్ణుడు అనే సోలంకీ రాజు అహ్మదాబాద్ నగరాన్ని నిర్మించాడు.
* ✶ జయసింహసిద్ధ రాజు (జయసింహుడు) తన ఆస్థానంలో జైన పండితుడైన హేమచంద్రుడికి ఆశ్రయం కల్పించాడు.
* ✶ హేమచంద్రుడి ప్రభావంతో జైనమతాన్ని స్వీకరించిన సోలంకీ రాజు కుమారపాలుడు.
* ✶ కుమారపాలుని కుమారుడైన అజయపాలుడు జైన దేవాలయాలను కూల్చడం, జైన పండితులను నిర్బంధించడం లాంటి పనులు చేశాడు.
* ✶ ఘోరీ దండయాత్రల సమయంలో రెండో మూలరాజు తల్లి నాయకీదేవి మౌంట్ ఆబూ వద్ద తురుష్కులను ఓడించింది.
* ✶ రెండో సోలంకీ భీముడు సోమనాథ దేవాలయానికి మరమ్మతులు చేయించాడు.
* ✶ సోలంకీల అనంతరం గుజరాత్ ప్రాంతాన్ని వాఘేలులు పాలించారు. వీరు బరోడా వద్ద సూర్యదేవాలయాన్ని నిర్మించారు.
* ✶ సిద్ధపూర్‌లో మహాకాళి ఆలయాన్ని నిర్మించింది జయసింహసిద్ధ రాజు.
* ✶ మధ్యప్రదేశ్‌లోని త్రిపురిని రాజధానిగా చేసుకుని పాలించిన వంశం కాలచూరులు.
* ✶ కాలచూరి రాజ్య స్థాపకుడు కొక్కళుడు.
* ✶ కాలచూరుల్లో గొప్పవాడు – గాంగయ దేవుడు. ఇతడికి త్రిలింగాధిపతి, విక్రమాదిత్య అనే బిరుదులున్నాయి.
* ✶ శతాధిక యుద్ధ వీరుడుగా పేరొందిన కాలచూరి రాజు – కర్ణదేవుడు.
* ✶ కశ్మీర్‌ను పాలించిన కర్కోట వంశ మూలపురుషుడు దుర్లభవర్ధనుడు.
* ✶ కర్కోట వంశంలో గొప్పవాడు లలితాదిత్య ముక్తాపీడుడు (మార్తాండ దేవాలయ నిర్మాత)
* ✶ కశ్మీర్‌ను పాలించిన ఉత్పలవంశ మూలపురుషుడు అవంతివర్మ/ అనంతవర్మన్
* ✶ అనంతవర్మన్ ఆస్థానంలో రత్నాకరుడు, ఆనందవర్ధనుడు అనే కవులుండేవారు.
* ✶ చివరి ఉత్పలవంశ రాజు – చక్రవర్మన్
* ✶ క్షేమగుప్తుడి భార్య దిద్ద 50 సంవత్సరాల పాటు కశ్మీర్‌ను పాలించింది.
* ✶ కశ్మీర్‌ను పాలించిన లోహార వంశ మూలపురుషుడు సంగ్రామ రాజు.
* ✶ లోహార వంశ పాలకుడైన శ్రీహర్షుడి ఆస్థానంలో కల్హణుడు ఉండేవాడు.
* ✶ క్రీ.శ. 12వ శతాబ్దంలో కల్హణుడు సంస్కృత భాషలో రాజతరంగిణి గ్రంథాన్ని రచించాడు. భారతదేశంలో తొలి చారిత్రక గ్రంథం రాజతరంగిణి.
* ✶ రాజపుత్రుల కాలంలో అధికార భాష సంస్కృతం.
* ✶ ఆడపిల్ల పుట్టగానే చంపే ఆచారం రాజపుత్రులతోనే ప్రారంభమైంది.
* ✶ అంతఃపుర స్త్రీలు శత్రువుల చేతికి చిక్కకుండా, అగ్నిలోకి దూకి ఆత్మహ్యా చేసుకునే జౌహార్ ఆచారం రాజపుత్ర యుగంలో ప్రారంభమైంది.

**రచయిత: బొత్స నాగరాజు**

# భారతదేశ చరిత్ర

## మధ్యయుగ భారతదేశ చరిత్ర

### దక్షిణ భారతదేశ రాజ్యాలు - చాళుక్యులు

- మధ్యయుగంలో దక్షిణ భారతదేశంలో చాళుక్యులు, చోళులు, రాష్ట్రకూటులు, యాదవ, కాకతీయ, హోయసాల, పాండ్య రాజ్యాలు విలసిల్లాయి.
- ఢిల్లీ సుల్తానత్ కాలంలో ఈ రాజ్యాలన్నింటినీ మహ్మద్ బిన్ తుగ్లక్ ఆక్రమించాడు. కానీ అతడి కాలంలోనే మళ్లీ దక్షిణ భారత దేశంలో విజయనగర, బహమనీ సామ్రాజ్యాలు అవతరించాయి.

### చాళుక్య రాజ్యాలు

- మధ్యయుగంలో దక్షిణ భారతదేశంలో మూడు ప్రధాన చాళుక్య రాజ్యాలు పాలించాయి.
- చాళుక్యుల్లో పశ్చిమ చాళుక్యులు, తూర్పు చాళుక్యులు, వేంగి చాళుక్యులు ప్రధానమైనవారు.
- చాళుక్యులు క్షత్రియులు. చాళుక్య పాలకుడైన చలికి రెమ్మణక ప్రస్తావన తొలిసారిగా ఇక్ష్వాకుల కాలంనాటి నాగార్జునకొండ శాసనంలో కనిపించింది.
- చాళుక్యులు మధ్య ఆసియా ప్రాంతానికి చెందిన వారని లూయిరైస్ అనే చరిత్రకారుడు పేర్కొన్నాడు.
- చాళుక్యులు బ్రహ్మ చుళకము నుంచి జన్మించారని బిల్హణుడు తన విక్రమాంక దేవచరిత్ర గ్రంథంలో పేర్కొన్నాడు.
- చాళుక్యులు హారితీపుత్ర అనే మాతృ సంజ్ఞను వినియోగించారు. ముఖ్యంగా తూర్పు చాళుక్యులు హారితీపుత్రులుగా పేరు పొందారు.

**పశ్చిమ చాళుక్యులు/ బాదామి చాళుక్యులు/ వాతాపి చాళుక్యులు**

- పశ్చిమ చాళుక్య వంశ మూలపురుషుడు జయసింహ వల్లభుడు.
- పశ్చిమ చాళుక్య రాజ్య స్థాపకుడు మొదటి పులకేశి. ఇతడు అశ్వమేధయాగం చేసిన పశ్చిమ చాళుక్యరాజుగా పేరొందాడు.
- పశ్చిమ చాళుక్యులు నేటి కర్ణాటక రాష్ట్రం, బీజాపూర్ జిల్లాలోని బాదామి లేదా వాతాపిని రాజధానిగా చేసుకుని పాలించారు. కాబట్టి వారిని బాదామి చాళుక్యులు లేదా వాతాపి చాళుక్యులు అంటారు.
- మొదటి పులకేశి కుమారుడు మొదటి కీర్తివర్మ మహారాజ బిరుదుతో పాలించాడు.
- మొదటి కీర్తివర్మ అనంతరం అతడి కుమారుడు రెండో పులకేశి చిన్నవాడు కావడంతో కీర్తివర్మ సోదరుడు మంగళేశుడు రాజ్యపాలన చేశాడు.
- మంగళేశుడు గుజరాత్ పాలకులను ఓడించి వారి నుంచి రేవతి ద్వీపాన్ని (గోవా) ఆక్రమించాడు.
- మంగళేశుడి అనంతరం క్రీ.శ.609 – 642 మధ్య రెండో పులకేశి పాలించాడు.
- పశ్చిమ చాళుక్యుల్లో గొప్పవాడు రెండో పులకేశి. అతడి విజయాలను ఐహోల్ శాసనం వివరిస్తుంది.
- ఐహోల్ శాసనాన్ని రెండో పులకేశి సేనాని (సింధి విగ్రాహి) రవికీర్తి వేయించాడు.
- రెండో పులకేశి పల్లవ రాజు మొదటి మహేంద్ర వర్మను క్రీ.శ.630 నాటి పుల్లలూరు యుద్ధంలో వధించాడు.
- తూర్పు ప్రాంతాలను జయించిన రెండో పులకేశి తన సోదరుడు కుబ్జ విష్ణువర్ధనుడిని ఆ ప్రాంతాలకు ప్రతినిధిగా నియమించాడు. తూర్పు చాళుక్య రాజ్యస్థాపకుడు కుబ్జ విష్ణువర్ధనుడు.
- ఉత్తర భారతదేశాన్ని పాలిస్తున్న హర్షుడిని రెండో పులకేశి నర్మదానది యుద్ధంలో ఓడించినట్లు ఐహోల్ శాసనం పేర్కొంటోంది.
- సకలోత్తరాపథేశ్వరుడైన హర్షుడిని ఓడించిన రెండో పులకేశి 'పరమేశ్వర' అనే బిరుదు పొందాడు.

- రెండో పులకేశి ఆస్థానానికి పర్షియా పాలకుడు రెండో ఖుస్రూ రాయబారం పంపినట్లు అజంతా మొదటిగుహలోని ఒక చిత్రంలో కనిపిస్తుంది.
- రెండో పులకేశి రాజ్యాన్ని హుయాన్‌త్సాంగ్ అనే చైనా యాత్రికుడు సందర్శించాడు.
- క్రీ.శ. 642లో పల్లవ రాజు మొదటి నరసింహవర్మ మణిమంగళ యుద్ధంలో రెండో పులకేశిని వధించి "వాతాపికొండ" అనే బిరుదు పొందాడు.
- మొదటి విక్రమాదిత్యుడు పల్లవులను ఓడించి, రాజ్యాధికారాన్ని పొందాడు. అతడి తర్వాత వినయాదిత్యుడు, విజయాదిత్యుడు, రెండో విక్రమాదిత్యుడు, రెండో కీర్తివర్మ పాలనకు వచ్చారు.
- రెండో విక్రమాదిత్యుడు పల్లవ రాజైన రెండో నందివర్మను ఓడించాడు.
- రెండో విక్రమాదిత్యుడి కాలంలోనే అరబ్బులు దక్షిణ దేశంపై దండెత్తి వచ్చారు.
- చివరి పశ్చిమ చాళుక్య రాజు రెండో కీర్తివర్మ. ఇతడిని ఓడించి, దంతిదుర్గుడు రాష్ట్రకూట రాజ్యాన్ని స్థాపించాడు.
- పశ్చిమ చాళుక్యులు తమ రాజ్యాన్ని, రాష్ట్రాలు – విషయాలు – గ్రామాలుగా విభజించారు.
- వీరి కాలంలో బాదామి వేద విద్యలకు నిలయంగా మారింది.
- వీరి కాలంలో రేవతి ద్వీపం (గోవా), పూరీ గొప్ప నౌకా కేంద్రాలుగా అభివృద్ధి చెందాయి.
- దేవాలయాల నిర్మాణంలో దక్కన్ శైలిని అభివృద్ధి చేశారు.
- బాదామి, ఐహోల్, పట్టడల్ ప్రాంత దేవాలయాలను పశ్చిమ చాళుక్యులే నిర్మించారు.
- పట్టడకల్‌లో పాపనాథ, విరూపాక్ష ఆలయాలు వీరి కాలంలోనే నిర్మించారు.
- పశ్చిమ చాళుక్యుల కాలంలోనే ఆలంపూర్ నవ బ్రహ్మ దేవాలయాలు నిర్మితమయ్యాయి.
- ఐహోల్‌లో లడ్కాన్, దుర్గ, హుచిమల్లి, మెగూటి దేవాలయాలను నిర్మించారు.
- బాదామిలో మేలగిట్టి శివాలయం ఎంతో ప్రసిద్ధి చెందింది.
- పట్టడకల్‌తో ఆరు ఉత్తరాది శైలి, నాలుగు దక్షిణాది శైలి దేవాలయాలు నిర్మించారు.
- పశ్చిమ చాళుక్యుల కాలంలో గ్రామాధిపతిని గ్రాముండ అనేవారు.
- బాదామిలో శిలలను తొలిచి, మూడు హిందూ మందిరాలను, ఒక జైన మందిరాన్ని నిర్మించారు.

**తూర్పు చాళుక్యులు**

- తూర్పు చాళుక్య రాజ్య స్థాపకుడు కుబ్జ విష్ణువర్ధనుడు.
- తూర్పు చాళుక్యుల రాజధాని వేంగి. అందుకే వీరిని వేంగి చాళుక్యులు అంటారు.
- తూర్పు చాళుక్యుల్లో గొప్పవాడు మూడో విజయాదిత్యుడు లేదా గుణగ విజయాదిత్యుడు.
- చివరి తూర్పు చాళుక్యుల రాజు ఏడో విజయాదిత్యుడు.
- కుబ్జ విష్ణువర్ధనుడు విషమసిద్ధి, మకరధ్వజుడు, మహారాజ, కాయదేవ లాంటి బిరుదులతో పాలించాడు.
- మొదటి జయసింహ వల్లభుడి కాలంలో విప్పర్ల శాసనం వేశారు.
- మూడో విష్ణువర్ధనుడు త్రిభువనాంకుశ, కవిపండిత కామధేనువు లాంటి బిరుదులతో పరిపాలించాడు.
- రెండో విజయాదిత్యుడు 108 యుద్ధాలు చేసి, 108 శివాలయాలు నిర్మించి, నరేంద్ర మృగరాజు అనే బిరుదు పొందాడు.
- గుణగ/మూడో విజయాదిత్యుడి సేనాని పాండురంగడు అద్దంకి శాసనాన్ని వేయించాడు. ఈ శాసనంలోనే తరువోజ వృత్తం తొలిసారిగా కనిపిస్తుంది.
- మొదటి చాళుక్య భీముడి కాలంలో పంచారామాలు అభివృద్ధి చెందాయి. ఇతడు ద్రాక్షారామ భీమేశ్వర ఆలయాన్ని నిర్మించాడు.

- కావ్యాలంకార సూత్ర గ్రంథాన్ని రచించిన భట్టవామనుడు మొదటి చాళుక్య భీముడి ఆస్థానంలో ఉండేవాడు.
- మొదటి అమ్మరాజు రాజమహేంద్ర అనే తన బిరుదు పేరుతో రాజమహేంద్రవరం అనే నూతన రాజధానిని నిర్మించాడు.
- రెండో యుద్ధమల్లు వేయించిన బెజవాడ శాసనంలో మధ్యాక్కరలు అనే తెలుగు ఛందస్సు కనిపిస్తుంది.
- రెండో అమ్మరాజు/ ఆరో విజయాదిత్యుడు కవిగాయక కల్పతరువుగా పేరొందాడు.
- రెండో అమ్మరాజు అనంతరం దానార్ణవుడు, జటాఛోడ భీముడు, మొదటి శక్తివర్మ, విమలాదిత్యుడు, రాజరాజ నరేంద్రుడు, ఏడో విజయాదిత్యుడు పాలించారు.
- దానార్ణవుడు మాగల్లు శాసనం వేయించాడు.
- మొదటి శక్తివర్మ చాళుక్యచంద్ర అనే బిరుదుతో పరిపాలించాడు.
- విమలాదిత్యుడు తన గురువు సిద్ధాంత దేవుడు/ త్రికాల యోగి కోసం విజయనగరం జిల్లాలోని రామతీర్థంలో రామకొండ గుహాలయాన్ని నిర్మించాడు.
- కావ్యగీతి ప్రియుడిగా పేరొందిన రాజరాజ నరేంద్రుడు నన్నయ్య, పావులూరి మల్లన లాంటి కవులను పోషించాడు.
- నన్నయ్య నారాయణభట్టు సాయంతో మహాభారతాన్ని ఆంధ్రీకరించి, ఆదికవిగా పేరొందాడు.
- పావులూరి మల్లన గణితసారసంగ్రహం అనే గ్రంథాన్ని రచించాడు.
- రాజరాజ నరేంద్రుడు నారాయణ భట్టుకు నందపూడిని, పావులూరి మల్లనకు నవఖండవాడను దానం చేశాడు.
- రాజరాజ నరేంద్రుడు చోళ రాజేంద్రుడి కుమార్తె అమ్మాంగ దేవిని వివాహం చేసుకున్నాడు.
- చివరి వేంగి చాళుక్య పాలకుడు ఏడో విజయాదిత్యుడి మరణం తర్వాత తూర్పు చాళుక్య రాజ్యాన్ని కులోత్తుంగ చోళుడు చోళ సామ్రాజ్యంలో కలిపి పరిపాలించాడు.

### యుగ విశేషాలు

- తూర్పు చాళుక్యులు రాజ్యాన్ని విషయాలు – నాడులు – కొట్టాలు – గ్రామాలుగా విభజించి, పాలించారు.
- నాటి ఉద్యోగ బృందాన్ని నియోగాధిపతులు అనేవారు.
- నాటి వర్తక సంఘాలను నకరములు అని, కులసంఘాలను సమయములని పిలిచేవారు.
- తూర్పు చాళుక్యుల అధికార మతం శైవం. పంచారామాలను వీరే అభివృద్ధి చేశారు.
- శ్రీశైలం, ద్రాక్షారామం, కాళేశ్వరం శైవక్షేత్రాల కారణంగా ఆంధ్రదేశాన్ని త్రిలింగ దేశంగా పిలిచేవారు.
- కంసాలి, కమ్మరి, కంచరి, కాసె, వడ్రంగి అనే అయిదు ప్రధాన తరగతులుగా కంసాలివారు రూపొందారు. వీరినే పంచాణం వారు అని పిలిచేవారు.
- తూర్పు చాళుక్యుల కాలంనాటి అధికార భాష సంస్కృతం. తెలుగు భాషాభివృద్ధికి తూర్పు చాళుక్యులు ఎంతో కృషిచేశారు.
- నాటి గంగాధర శాసనంలో కందపద్యాలు, అద్దంకి శాసనంలో తరువోజ, సాతలూరు శాసనంలో చంపకమాల, కందుకూరు, ధర్మవరం శాసనాల్లో సీసపద్యాలు కనిపిస్తాయి.
- తూర్పు చాళుక్యయుగం నాటి ప్రాచీన తెలుగు శాసనం విప్పర్ల శాసనం. దీన్ని మొదటి జయసింహ వల్లభుడు వేయించాడు.
- తూర్పు చాళుక్యయుగం నాటి ప్రధాన వినోదం కోలాటం.

### కళ్యాణి చాళుక్యులు

- నేటి కర్ణాటక రాష్ట్రంలోని బీదర్ జిల్లాలో ఉన్న కళ్యాణిని రాజధానిగా చేసుకుని పరిపాలించిన వారే కళ్యాణి చాళుక్యులు.
- కళ్యాణి చాళుక్య రాజ్యస్థాపకుడు రెండో తైలపుడు.
- చివరి రాష్ట్రకూట రాజు రెండో కర్ణుడిని ఓడించి, రెండో తైలపుడు కళ్యాణి చాళుక్య రాజ్యాన్ని స్థాపించాడు (క్రీ.శ. 973).

- తొలి కళ్యాణి చాళుక్యులు మాన్యఖేటాన్ని రాజధానిగా చేసుకుని పాలించారు.
- మొదటి సోమేశ్వరుడి కాలంలో రాజధానిని కళ్యాణికి మార్చారు.
- మొదటి సోమేశ్వరుడు కాకతీయ సామంత ప్రభువుల సహాయంతో రాజరాజనరేంద్రుడిని ఓడించి, నారాయణభట్టును అతడి ఆస్థానానికి పంపాడు.
- మొదటి సోమేశ్వరుడు హన్మకొండ ప్రాంతాన్ని కాకతీయులకు ఇచ్చాడు.
- ఆరో విక్రమాదిత్యుడు అనే చాళుక్య రాజు ఆస్థానంలో బిల్హణుడు, విజ్ఞానేశ్వరుడు లాంటి కవులు ఉండేవారు.
- బిల్హణుడు రచించిన గ్రంథం విక్రమాంక దేవచరిత్ర.
- విజ్ఞానేశ్వరుడు రచించిన గ్రంథం మితాక్షర.
- మూడో సోమేశ్వరుడు అనే కళ్యాణి చాళుక్య రాజు అభిలాషితార్థ చింతామణి (మానసోల్లాసం) అనే గ్రంథాన్ని రచించాడు.
- మూడో తైలపుడి కాలంలో కాలచూరి రాజు బిజ్జలుడు చాళుక్య రాజ్యాన్ని ఆక్రమించాడు.
- చివరి కళ్యాణి చాళుక్య రాజు నాలుగో సోమేశ్వరుడు ఇతడిని ఓడించి, 1181లో అయిదో భిల్లముడు యాదవ రాజ్యాన్ని స్థాపించాడు.
- గదాయుద్ధం/ సాహసభీమ విజయం గ్రంథాన్ని రాసిన 'రన్న' కూడా కళ్యాణి చాళుక్య రాజ్యంలో ఆదరణ పొందాడు.
- ప్రాచీన కాలం నుంచి దక్షిణాపథం భారతదేశ చరిత్రలో కీలకమైన పాత్ర పోషిస్తోంది.
- మౌర్యుల కాలంలో దక్షిణాపథంలో శాతవాహనులకు, సంగంయుగ రాజ్యాలైన ప్రాచీన చోళ, చేర, పాండ్య రాజ్యాలకు ప్రధాన పాత్ర ఉంది.
- ఉత్తర భారతదేశాన్ని గుప్తులు, హర్షుడు పరిపాలిస్తున్న సమయంలో దక్షిణ భారతదేశంలో విష్ణుకుండినులు, పల్లవులు పరిపాలించారు.

**నమూనా ప్రశ్నలు**

**1.** ఐహోల్ శాసనం వేయించింది ఎవరు?

1) రవికీర్తి  2) మంగళేశుడు  3) రెండో పులకేశి  4) మహేంద్రవర్మ

**2.** పశ్చిమ చాళుక్య వంశ మూలపురుషుడు ఎవరు?

1) మొదటి పులకేశి  2) జయసింహ వల్లభుడు  3) రెండో పులకేశి  4) కీర్తివర్మ

**3.** 'పరమేశ్వర' అనే బిరుదు పొందిన రాజు ఎవరు?

1) మొదటి పులకేశి  2) మహేంద్రవర్మ  3) చాళుక్య భీముడు  4) రెండో పులకేశి

**4.** తూర్పు చాళుక్య రాజ్య స్థాపకుడు?

1) కుబ్జ విష్ణువర్ధనుడు  2) మూడో విజయాదిత్యుడు

3) మూడో విష్ణువర్ధనుడు  4) మొదటి జయసింహ

**5.** తూర్పు చాళుక్యుల రాజధాని

1) బాదామి  2) కళ్యాణి  3) వేంగి  4) మాన్యఖేటం

**6.** 108 యుద్ధాలు చేసి, 108 శివాలయాలు నిర్మించిన రాజు ఎవరు?

1) రెండో విజయాదిత్యుడు  2) కుబ్జ విష్ణువర్ధనుడు

3) మొదటి చాళుక్య భీముడు  4) మొదటి అమ్మరాజు

**7.** ఎవరి కాలంలో పంచారామాలు అభివృద్ధి చెందాయి?

1) తూర్పు చాళుక్యులు 2) పశ్చిమ చాళుక్యులు 3) కళ్యాణి చాళుక్యులు 4) ఎవరూ కాదు

**8.** కావ్యాలంకార సూత్ర గ్రంథాన్ని రచించింది ఎవరు?

1) నారాయణభట్టు 2) భట్టవామనుడు 3) పావులూరి మల్లన 4) బిల్హణుడు

**9.** మాగల్లు శాసనం వేయించిన తూర్పు చాళుక్య రాజు ఎవరు?

1) జటాచోడ భీముడు 2) మొదటి శక్తివర్మ 3) దానార్ణవుడు 4) రెండో అమ్మరాజు

**10.** మితాక్షర గ్రంథ రచయిత ఎవరు?

1) బిల్హణుడు 2) విజ్ఞానేశ్వరుడు 3) రన్న 4) పావులూరి మల్లన

**11.** తూర్పు చాళుక్యయుగం నాటి ప్రధాన వినోదం?

1) గదాయుద్ధం 2) కోలాటం 3) పాచికలు 4) వేట

**జవాబులు**

1-1; 2-2; 3-4; 4-1; 5-3; 6-1; 7-1; 8-2; 9-3; 10-2; 11-2.

**రచయిత: బొత్స నాగరాజు**

# భారతదేశ చరిత్ర

## ఆధునిక భారతదేశ చరిత్ర - ఐరోపా వారి రాక

క్రీ.శ. 18వ శతాబ్దం ద్వితీయార్ధంలో ఆంగ్ల సామ్రాజ్య స్థాపనతో భారతదేశంలో ఆధునిక యుగం ప్రారంభమైనట్లు చరిత్రకారులు పేర్కొన్నారు. క్రీ.శ. 1453లో తురుష్కులు కాన్‌స్టాంట్‌నోపుల్‌ను ఆక్రమించుకున్నారు. ఫలితంగా తూర్పు, పశ్చిమ దేశాల మధ్య ఉన్న ఏకైక భూమార్గం మూసుకుపోయింది. నూతన మార్గాలను అన్వేషించడానికి ప్రయత్నించిన తొలి ఐరోపా దేశం పోర్చుగల్.

- ✦ పోర్చుగల్ రాజు హెన్రీ స్వయంగా సముద్రంపై ప్రయాణించి, సముద్ర మార్గాన్ని భౌగోళిక పటంగా (పోర్టోలనీ) రూపొందించాడు. స్వయంగా నావికా శిక్షణ కేంద్రాన్ని స్థాపించాడు. కాబట్టి హెన్రీని 'ది నావిగేటర్' బిరుదుతో పిలుస్తారు.
- ✦ హెన్రీ ఆర్థిక సహాయంతో బార్తోలోమ్యూ డియాస్ (Bartolomeu Dias) తుపానుల అగ్రం/ కేప్ ఆఫ్ స్టార్మ్స్‌ను కనుక్కున్నాడు.
- ✦ తర్వాత హెన్రీ కుమారుడు రెండో జాన్ కేప్ ఆఫ్ స్టార్మ్స్ వరకూ వెళ్లి, దానికి కేప్ ఆఫ్ గుడ్‌హోప్ అనే పేరు పెట్టాడు.

### పోర్చుగీసువారు

- ✦ 1498, మే 17న వాస్కోడిగామా భారతదేశానికి వచ్చి, కాలికట్ పాలకుడు జామొరిన్‌ను కలిసి వ్యాపార ఒప్పందం చేసుకున్నాడు.
- ✦ వాస్కోడిగామాకు అబ్దుల్ వాజిద్ (అబ్దుల్ అజీజ్) అనే గుజరాత్ నావికుడు సహాయపడ్డాడు.
- ✦ ఆధునిక యుగంలో భారతదేశానికి వచ్చిన తొలి ఐరోపా దేశంగా పోర్చుగల్‌ను పేర్కొంటారు.
- ✦ కాలికట్‌లో పోర్చుగీసువారు తమ తొలి వర్తక స్థావరాన్ని స్థాపించారు.
- ✦ వాస్కోడిగామా రెండోసారి 1502లో భారతదేశానికి వచ్చాడు.
- ✦ పోర్చుగల్ దేశ ప్రతినిధిగా/అధికారిగా వచ్చిన కాబ్రల్ కొచ్చిన్, క్రాంగనూర్ ప్రాంతాల్లో వర్తక స్థావరాలను స్థాపించాడు.
- ✦ 1505 – 09 మధ్య గవర్నర్‌గా పనిచేసిన డీ ఆల్మడా నౌకా వ్యాపార అభివృద్ధి కోసం నీలి నీటి విధానాన్ని (Blue water policy) ప్రవేశ పెట్టాడు. కన్ననూర్ వద్ద ఒక కోటను నిర్మించాడు.
- ✦ ఆల్బుకర్క్ అనే పోర్చుగీసు గవర్నర్ సొకొట్రా, ఆర్ముజ్, డయ్యూ, మలక్కా, గోవా, మాకోలు రేవులను ఆక్రమించి "భారతదేశంలో పోర్చుగీసు వలస సామ్రాజ్య నిర్మాత"గా పేరుగాంచాడు.
- ✦ 1510లో ఆల్బుకర్క్ శ్రీకృష్ణదేవరాయలతో సంధి చేసుకుని బీజపూర్ పాలకుడిని ఓడించి, గోవాను ఆక్రమించాడు.
- ✦ భారతదేశంలో పోర్చుగీసువారి ప్రధాన వర్తక స్థావరం గోవా.

**పోర్చుగీసువారు ఆక్రమించిన వివిధ ప్రాంతాలు**

| సంవత్సరం | ప్రాంతం పేరు |
|---|---|
| 1511 | మలక్కా |
| 1515 | ఆర్ముజ్ |
| 1518 | కొలంబో |
| 1534 | డయ్యూ |
| 1538 | డామన్, నాగపట్నం |

- ✦ చిట్టగాంగ్, హుగ్లీ, శాంథోమ్ లాంటి ప్రాంతాల్లో కూడా వర్తక స్థావరాలను స్థాపించారు.
- ✦ గోవాకు వెళ్లిన మొదటి క్రైస్తవ మతాచార్యుడు సర్ ఫ్రాన్సిస్ జేవియర్ పోర్చుగీసు వాడే.
- ✦ భారతదేశంలో 1556లో తొలి అచ్చు యంత్రాన్ని ప్రవేశ పెట్టింది కూడా పోర్చుగీసువారే.
- ✦ పొగాకు, మిరప, మొక్కజొన్న లాంటి పంటలను భారతీయులకు పరిచయం చేసింది పోర్చుగీసువారే.

- ✦ 1534లో గుజరాత్ పాలకుడు బహదూర్‌షా నుంచి బొంబాయిని పొందిన పోర్చుగీసువారు 1661లో దాన్ని ఆంగ్లేయులకు అద్దెకు ఇచ్చారు. (ఏడాదికి 10 పౌండ్లు).
- ✦ పోర్చుగీసు వారి సహాయంతోనే విజయనగర రాజులు అశ్విక దళాన్ని, గుజరాత్ పాలకులు ఫిరంగి దళాన్ని సమకూర్చుకున్నారు.
- ✦ 16వ శతాబ్దంలో హిందూ మహాసముద్రంపై వాణిజ్య ఆధిపత్యాన్ని పొందిన పోర్చుగీసువారు ఆంగ్లేయుల చేతిలో ఓడిపోయి, క్రమంగా తమ ఆధిపత్యాన్ని కోల్పోయారు.
- ✦ షాజహాన్ 'హుగ్లీ' స్థావరాన్ని, ఔరంగజేబ్ 'చిట్టగాంగ్' స్థావరాన్ని పోర్చుగీసు వారి నుంచి స్వాధీనం చేసుకున్నారు.
- ✦ 1961లో భారత ప్రభుత్వం 'ఆపరేషన్ విజయ్' పేరుతో సైనిక చర్య జరిపి, పోర్చుగీసు వారి నుంచి గోవాను ఆక్రమించుకుంది.
- ✦ భారతదేశానికి వచ్చిన తొలి ఐరోపా దేశీయులుగా, భారతదేశం నుంచి వెళ్లిన చివరి ఐరోపా దేశీయులుగా పోర్చుగీసువారు గుర్తింపు పొందారు.

## డచ్‌వారు (నెదర్లాండ్స్/ హాలండ్)

- ✤ డచ్‌వారు 1602లో 'యునైటెడ్ ఈస్ట్ ఇండియా కంపెనీ ఆఫ్ నెదర్లాండ్స్'ను స్థాపించారు.
- ✤ 1605లో డచ్‌వారు మచిలీపట్నం వచ్చి, నాటి గోల్కొండ పాలకుడు మహ్మద్ కులీకుతుబ్‌షా సహాయంతో భారతదేశంలో తొలి వర్తక స్థావరాన్ని ఏర్పాటు చేసుకున్నారు.
- ✤ వీరు పులికాట్ (1610), సూరత్ (1616), భీమునిపట్నం (1641), చిన్సురా (1653); కాశింబజార్, నాగపట్నం, కొచ్చిన్ చోట్ల వర్తక స్థావరాలను స్థాపించారు.
- ✤ భారతదేశంలో డచ్‌వారి తొలి ప్రధాన వర్తక కేంద్రం పులికాట్. కానీ 1690లో వారు తమ ప్రధాన వర్తక కేంద్రాన్ని నాగపట్నానికి మార్చుకున్నారు. (నోట్: భారతదేశంలో డచ్‌వారి ప్రధాన వర్తక కేంద్రం నాగపట్నం అని గుర్తించాలి.)
- ✤ 1658లో డచ్‌వారు పోర్చుగీసు వారిని ఓడించి, సింహళాన్ని (శ్రీలంక) ఆక్రమించారు.
- ✤ 1623 నాటి అంబోయినా వధ ఆంగ్లేయులకు, డచ్చివారికి మధ్య వైరాన్ని పెంచింది.
- ✤ అంబోయినా వధ కాలంలో డచ్ గవర్నర్ హెర్మన్ వాన్‌స్పెల్ట్ (Herman van Speult).
- ✤ డచ్‌వారు వాన్‌లిచ్‌టన్ అనే అన్వేషకుడి రాతలు/రచనల వల్ల ప్రభావితమై, భారతదేశానికి వచ్చారు.
- ✤ చివరికి డచ్‌వారు ఇండోనేషియాను తమ వలస రాజ్యంగా మార్చుకున్నారు.
- ✤ సుగంధ ద్రవ్యాల వ్యాపారం నుంచి వస్త్ర వ్యాపారం దిశగా దృష్టి మరల్చిన తొలి ఐరోపా దేశం డచ్ నెదర్లాండ్స్.

## డేన్‌లు (డెన్మార్క్)

- ✲ డెన్మార్క్‌వారు 1616లో తమ తొలి వర్తక స్థావరాన్ని తమిళనాడులోని ట్రాంక్వీబార్‌లో ఏర్పాటు చేసుకున్నారు.
- ✲ భారతదేశంలో డేన్‌ల ప్రధాన వర్తక స్థావరం బెంగాల్‌లోని సేరాంపూర్.
- ✲ క్రైస్తవ మిషనరీల ద్వారా విద్యా వ్యాప్తికి కృషి చేసిన ప్రధాన ఐరోపా దేశం డెన్మార్క్ (డేన్స్).
- ✲ డేన్‌లు 1845లో భారతదేశంలోని తమ వర్తక స్థావరాలన్నింటినీ ఆంగ్లేయులకు అమ్మేసి, తమ దేశం వెళ్లిపోయారు.

## ఆంగ్లేయులు (ఇంగ్లండ్)

- ☆ ఫాదర్ స్టీఫెన్స్ అనే క్రైస్తవ మతాచార్యుడు ఎలిజబెత్ రాణి కాలంలో తొలిసారిగా భారతదేశానికి వచ్చాడు (1579).
- ☆ ఆంగ్లేయులు 1600లో 'ఈస్ట్ ఇండియా కంపెనీ ఆఫ్ ఇంగ్లండ్'ను స్థాపించుకున్నారు.
- ☆ ఎలిజబెత్ రాణి రాయల్ చార్టర్ చట్టం ద్వారా ఈస్ట్ ఇండియా కంపెనీకి అనుమతిని మంజూరు చేసింది.
- ☆ అక్బర్ కాలంలో జాన్‌న్యూబెరి, విలియం లీడ్స్ అనే నగల వ్యాపారులు; జేమ్స్‌స్టోరీ అనే చిత్రకారుడు, రాల్ఫ్‌ఫిచ్ అనే రాయబారి భారతదేశాన్ని సందర్శించారు.

☆ 1599 – 1605 మధ్య జాన్‌మిండెన్ హాల్ అనే ఆంగ్లేయుడు భారతదేశంలో ఉన్నాడు.

☆ 1608లో విలియం హాకిన్స్ అనే ఆంగ్లేయుడు జహంగీర్ ఆస్థానాన్ని సందర్శించాడు.

☆ 1611లో 'గ్లోబ్' నౌకలో కెప్టెన్ హిప్పన్ నాయకత్వంలో ఆంగ్లేయులు మచిలీపట్నం వచ్చి, మహ్మద్ కులీకుతుబ్‌షా అనుమతి పొందారు (స్థావరం ఏర్పాటు చేయలేదు).

☆ 1615 – 16 మధ్య సర్ థామస్ రో అనే ఆంగ్లేయుడు జహంగీర్ ఆస్థానానికి వచ్చి, వ్యాపార అనుమతి పొందాడు. ఫలితంగా ఆంగ్లేయులు 1616లో తమ తొలి వర్తక స్థావరాన్ని సూరత్‌లో ప్రారంభించారు.

☆ ఆంగ్లేయులు 1626లో గోవాలో తమ వర్తక స్థావరాన్ని ఏర్పాటు చేశారు.

☆ 1639లో ఫ్రాన్సిస్ డే అనే ఆంగ్ల ప్రతినిధి 2 గ్రామాలను దామెర్ల సోదరుల నుంచి కొనుగోలు చేసి, సెయింట్ జార్జ్ కోటను నిర్మించాడు. ఆ ప్రాంతమే చెన్నపట్నంగా ప్రసిద్ధి చెందింది.

☆ 1633లో ఆంగ్లేయులు రాల్ఫ్‌కార్ట్‌రైట్ కృషి వల్ల ఒరిస్సాలోని హరిహరపురంలో వర్తక స్థావరాన్ని ఏర్పాటుచేశారు.

☆ బ్రాడ్‌మన్ అనే ఆంగ్లేయుడి కృషి ఫలితంగా 1651లో హుగ్లీలో ఆంగ్లేయుల వర్తక స్థావరం ఏర్పాటైంది.

☆ గాబ్రియల్ బౌటన్ అనే ఆంగ్ల వైద్యుడు షాజహాన్ నుంచి పొందిన ప్రాంతంలో జాబ్ చార్నక్ 'పోర్టు విలియం కోట'ను నిర్మించాడు (1699).

☆ ఆంగ్లేయులు మొగలుల నుంచి సుతనుతి, కాళీఘట్టం, గోవింద్‌పూర్ గ్రామాలను పొంది, వాటిని కలకత్తా నగరంగా అభివృద్ధి చేశారు.

☆ కడలూరు (తమిళనాడు)లో సెయింట్ డేవిడ్ కోటను నిర్మించారు.

☆ ఆంగ్లేయులు 1682లో విశాఖపట్నంలో తమ వర్తక స్థావరాన్ని స్థాపించారు.

☆ 1717లో విలియం హామిల్టన్ అనే ఆంగ్ల వైద్యుడు మొగల్ చక్రవర్తి అయిన ఫరూక్ షియర్ వ్యాధిని నయంచేసి, గోల్డెన్ ఫర్మానా ద్వారా అనేక రాయితీలు పొందాడు.

☆ జెరాల్డ్ ఆంగియర్ అనే ఆంగ్లేయుడు బొంబాయిని గొప్ప వాణిజ్య కేంద్రంగా మార్చాడు.

☆ భారతదేశంలో ఆంగ్లేయులు మద్రాస్‌లోని సెయింట్ జార్జికోటను తమ ప్రధాన వర్తక కేంద్రంగా చేసుకున్నారు.

## ఫ్రెంచివారు (ఫ్రాన్స్)

✶ 1656లో బెర్నియార్ అనే ఫ్రెంచి యాత్రికుడు ఔరంగజేబ్ రాజ్యాన్ని, ట్రావెర్నియర్ అనే ఫ్రెంచి యాత్రికుడు గోల్కొండ రాజ్యాన్ని సందర్శించారు.

✶ ఫ్రాన్స్ ఆర్థిక మంత్రి కోల్బర్ట్ 1664లో 14వ లూయీ అనుమతితో ఫ్రెంచి ఈస్ట్ ఇండియా కంపెనీని స్థాపించాడు.

✶ 1668లో ఫ్రాంకోయిస్ కరోన్ అనే వ్యక్తి ఔరంగజేబ్ అనుమతితో సూరత్‌లో తొలి వర్తక స్థావరాన్ని స్థాపించాడు.

✶ 1669లో ఫ్రెంచివారు మచిలీపట్నంలో తమ వర్తక స్థావరాన్ని స్థాపించారు.

✶ ఫ్రాంకోయిస్ మార్టిన్ అనే అధికారి వాలి కొండాపురం ప్రాంతాన్ని పొంది అక్కడ పుదుచ్చేరి/పాండిచ్చేరి నగరాన్ని నిర్మించాడు.

✶ భారతదేశంలో ఫ్రెంచివారి ప్రధాన వర్తక స్థావరం పుదుచ్చేరి/పాండిచ్చేరి.

✶ ఫ్రెంచివారు షయిస్తాఖాన్ నుంచి పొందిన బాలాసోర్, కాశింబజార్, చంద్రనగర్ ప్రాంతాల్లో ఫ్యాక్టరీలను నిర్మించారు.

✶ భారతదేశంలో ఫ్రెంచి ప్రతినిధులుగా లె నోయిర్, డ్యూమాస్, డూప్లే లాంటి వ్యక్తులు పనిచేశారు.

✶ లె నోయిర్ మాహె, యానాం (1729) ప్రాంతాల్లో వర్తక స్థావరాలు స్థాపించాడు.

✶ డ్యూమాస్ మొగల్ చక్రవర్తి నుంచి 'నవాబ్' అనే బిరుదును పొందాడు.

✶ డూప్లే భారతదేశంలో ఫ్రెంచి వలస రాజ్య నిర్మాతగా పేరుపొందాడు.

✶ కానీ ఆంగ్లేయులు కర్ణాటక యుద్ధాల్లో ఫ్రెంచివారిని ఓడించి భారతదేశాన్ని ఆక్రమించారు.

✶ ఫ్రెంచివారి అధీనంలో ఉన్న యానాం, పాండిచ్చేరి ప్రాంతాలను భారత ప్రభుత్వం 1956లో ఆక్రమించుకుంది.

## మాదిరి ప్రశ్నలు

**1.** భారతదేశానికి సముద్ర మార్గాన్ని కనుక్కున్న వాస్కోడిగామా ఏ దేశానికి చెందినవాడు?

1) ఇంగ్లండ్ 2) స్పెయిన్ 3) పోర్చుగల్ 4) డచ్ నెదర్లాండ్స్

**2.** భారతదేశంలో డచ్‌వారి తొలి వర్తక స్థావరం?

1) మచిలీపట్నం 2) నాగపట్నం 3) పులికాట్ 4) యానాం

**3.** అంబోయినా వధ ఏ దేశాల మధ్య జరిగిన సంఘర్షణ?

1) ఇంగ్లండ్, ఫ్రాన్స్ 2) పోర్చుగల్, ఇంగ్లండ్

3) డచ్, పోర్చుగల్ 4) డచ్, ఇంగ్లండ్

**4.** ఆంగ్లేయులు 'సెయింట్ డేవిడ్ కోట'ను ఎక్కడ నిర్మించారు?

1) మద్రాస్ 2) కలకత్తా 3) కడలూరు 4) పాండిచ్చేరి

**5.** ఫ్రెంచివారికి వ్యాపార అనుమతి ఇచ్చిన మొగల్ చక్రవర్తి ఎవరు?

1) అక్బర్ 2) జహంగీర్ 3) షాజహాన్ 4) ఔరంగజేబ్

**6.** పాండిచ్చేరి నగరాన్ని నిర్మించింది?

1) ఫ్రాన్సిస్ డే 2) ఫ్రాంకోయిస్ మార్టిన్ 3) లికర్బూజియర్ 4) జాబ్‌చార్నక్

**7.** కింది అంశాలను జతపరచండి.

i) వాన్‌స్పెల్ట్ a) ఇంగ్లండ్

ii) విలియమ్ హాకిన్స్ b) ఫ్రాన్స్

iii) డి-ఆల్మడా c) నెదర్లాండ్స్

iv) ఫ్రాంకోయిస్ మార్టిన్ d) పోర్చుగల్

1) i-a, ii-b, iii-c, iv-d 2) i-b, ii-a, iii-d, iv-c

3) i-c, ii-a, iii-d, iv-b 4) i-d, ii-c, iii-b, iv-a

**8.** భారతదేశం నుంచి వెళ్లిన చివరి ఐరోపావాసులు?

1) ఇంగ్లండ్ 2) ఫ్రాన్స్ 3) పోర్చుగల్ 4) డచ్ నెదర్లాండ్స్

**9.** నీలి నీటి విధానాన్ని అమలు చేసింది ఎవరు?

1) లె నోయిర్ 2) డి-ఆల్మడా 3) ఆల్బూకర్క్ 4) డూప్లే

**10.** భారతదేశంలో మిరప, పొగాకు పంటలను ప్రవేశపెట్టింది?

1) పోర్చుగీసువారు 2) ఆంగ్లేయులు 3) ఫ్రెంచివారు 4) డచ్‌వారు

## సమాధానాలు

1-3; 2-1; 3-4; 4-3; 5-4; 6-2; 7-3; 8-3; 9-2; 10-1.

**రచయిత: బొత్స నాగరాజు**

# చరిత్ర

## మధ్యయుగం – దక్షిణ భారత రాజ్యాలు

## నవీన చోళులు

సంగం యుగంలో తమిళ ప్రాంతంలో ప్రాచీన చోళ, చేర, పాండ్య రాజ్యాలు ఆధిపత్యం వహించాయి. గుప్త యుగంలో తమిళ ప్రాంతాన్ని పల్లవులు పరిపాలించారు. రాజపుత్ర యుగంలో తమిళ ప్రాంతంలో నవీన చోళులు కీలకపాత్ర పోషించారు. క్రీ.శ.9వ శతాబ్దంలో విజయాలయుడు నవీన చోళ సామ్రాజ్యాన్ని స్థాపించాడు.

★ విజయాలయుడు క్రీ.శ.846లో పల్లవులకు సామంతులుగా ఉన్న ముత్తరాయర్లను ఓడించి, కావేరి డెల్టాపై అధికారాన్ని స్థాపించాడు.

★ ఒరైయూర్‌కు చెందిన విజయాలయుడు తంజావూరు పట్టణాన్ని, నిశుంభసూదిని దేవాలయాన్ని నిర్మించాడు.

★ నవీన చోళుల రాజధాని తంజావూరు.

★ విజయాలయుడి కుమారుడైన చోళ ఆదిత్యుడు చివరి పల్లవ చక్రవర్తి అపరాజిత వర్మను ఓడించి, పల్లవ రాజ్యాన్ని ఆక్రమించాడు.

★ మొదటి పరాంతకుడు స్థానిక స్వపరిపాలనకు ఆధారమైన ఉత్తర మేరూర్ శాసనాన్ని వేయించాడు (చోళులు స్థానిక స్వపరిపాలనా పితామహులుగా పేరు పొందారు).

★ ఉత్తర మేరూర్ శాసనం తమిళనాడులోని చెంగల్పట్టు జిల్లాలో లభించింది.

★ మొదటి పరాంతకుడు మధురను ఆక్రమించి, మధురైకొండ అనే బిరుదు పొందాడు.

★ మొదటి పరాంతకుడి కాలంలోనే రాష్ట్రకూటులతో వైరం ఏర్పడింది. రాష్ట్రకూట రాజు మూడో కృష్ణుడు మొదటి పరాంతకుడిని క్రీ.శ.949 నాటి తక్కోలం యుద్ధంలో ఓడించాడు.

★ నవీన చోళ రాజుల్లో మొదటి గొప్ప పాలకుడు మొదటిరాజరాజు (క్రీ.శ.985 – 1014).

★ మొదటి రాజరాజు అసలు పేరు అరుమోలి వర్మ. తంజావూరు శాసనం ఇతడి విజయాలను వివరిస్తుంది.

★ బృహదీశ్వర ఆలయాన్ని శివుడికి అంకితం చేశారు. ఈ దేవాలయాన్ని రాజరాజేశ్వర దేవాలయం అని కూడా పిలుస్తారు.

★ మొదటి రాజరాజు పొలోన్నరావాలో (సింహళం) శివాలయాన్ని నిర్మించాడు.

★ తమిళ దేవాలయ వాస్తులో విమానాల నిర్మాణం ప్రత్యేక ఆకర్షణ.

★ భారతదేశ చరిత్రలో తొలిసారిగా నౌకా దండయాత్ర చేసి విదేశాలను జయించిన తొలి పాలకుడిగా రాజరాజు పేరొందాడు. (బిరుదులు – జయంగొండ, చోళమార్తాండ, ముమ్మిడి చోళ)

★ ఇతడు సింహళంపై (శ్రీలంక) దండెత్తి ఉత్తర సింహళాన్ని ఆక్రమించాడు.

★ మాల్దీవులను ఆక్రమించాడు.

★ రాజరాజు తన కుమార్తె కుందవ్వను తూర్పు చాళుక్యరాజైన విమలాదిత్యుడికి ఇచ్చి వివాహం చేశాడు.

★ తూర్పు చాళుక్య రాజ్యంపై దాడి చేసిన కళ్యాణి చాళుక్యులను ఓడించాడు.

★ శ్రీ విజయరాజ్య పాలకుడైన శ్రీమార విజయోత్తుంగునకు నాగపట్నంలో చౌఢామణి విహార నిర్మాణానికి అనుమతి ఇచ్చింది మొదటి రాజరాజే

★ మొదటి రాజరాజు అనంతరం అతడి కుమారుడు మొదటి రాజేంద్రచోళ అధికారంలోకి వచ్చాడు.

★ నవీన చోళుల్లో ప్రసిద్ధిచెందిన చక్రవర్తి మొదటి రాజేంద్ర చోళుడు (1014 – 1044)

★ మొదటి రాజేంద్ర చోళుడు గంగైకొండ, కడారంకొండ, పండితచోళ లాంటి బిరుదులను పొందాడు.

★ మొదటి రాజేంద్ర చోళుడు తన కుమార్తె అమ్మాంగదేవిని తూర్పు చాళుక్య రాజు రాజరాజ నరేంద్రుడికి ఇచ్చి వివాహం చేశాడు.

★ గంగానది వరకు వెళ్లి పాలవంశ రాజు మహీపాలుడిని ఓడించి, "గంగైకొండ" అనే బిరుదు పొందాడు.

★ నౌకా దండయాత్రలు చేసి శ్రీలంక, శ్రీ విజయ రాజ్యాలను జయించాడు.

★ శ్రీ విజయ రాజ్య రాజధాని కడారంను జయించి కడారంకొండ అనే బిరుదును పొందాడు.

★ మొదటి రాజేంద్ర చోళుడు 'గంగైకొండ చోళపురం' అనే నూతన రాజధానిని, 1030లో గంగైకొండ చోళపురం దేవాలయాన్ని నిర్మించాడు.

★ తిరువాలంగాడు, తిరుమలై శాసనాలు మొదటి రాజేంద్ర చోళుడి విజయాలను వివరిస్తాయి.

★ మొదటి రాజేంద్ర చోళుడు 1025లో శ్రీ విజయరాజ్య రాజు శైవేంద్రుడిని, 1029లో సింహళ రాజు మహేంద్రుడిని ఓడించాడు.

★ సుమత్రా, మలయా, బోర్నియో లాంటి ప్రాంతాలను ఆ రోజుల్లో శ్రీ విజయరాజ్యంగా పిలిచేవారు.

★ అరేబియా సముద్రంపై నౌకాదళ ఆధిపత్యాన్ని నెలకొల్పిన తొలి భారతీయ పాలకుడు మొదటిరాజేంద్రచోళుడు (చైనాకు వాణిజ్య రాయబారులను పంపించాడు.)

★ ఎన్నాయిరం వైదిక కళాశాలను నిర్మించింది మొదటి రాజేంద్ర చోళుడు.

★ మొదటి రాజేంద్ర చోళుడి అనంతరం అతడి కుమారుడు రాజాధిరాజు "విజయ రాజేంద్ర" బిరుదుతో రాజ్యపాలన చేశాడు.

★ కానీ మొదటి రాజాధిరాజు క్రీ.శ. 1052 నాటి కొప్పం యుద్ధంలో మరణించాడు.

★ రాజాధిరాజు అనంతరం అతడి సోదరుడు రెండో రాజేంద్రుడు పాలనకు వచ్చాడు.

★ రెండో రాజేంద్రుడు క్రీ.శ. 1062 నాటి కుడల సంగం యుద్ధంలో కళ్యాణి చాళుక్యులను ఓడించాడు.

★ అనంతరం వచ్చిన పాలకుడు వీర రాజేంద్రుడు, ఇతడి తర్వాత అతడి కుమారుడు అధిరాజేంద్రుడు పాలించాడు.

★ రాజరాజ నరేంద్రుడి కుమారుడైన రాజేంద్రుడు "కులోత్తుంగ చోళుడు" అనే బిరుదుతో అధిరాజేంద్రుడి అనంతరం చోళరాజ్య పాలన చేపట్టాడు.

★ కులోత్తుంగ చోళుడు చివరి తూర్పు చాళుక్య రాజైన ఏడో విజయాదిత్యుడి మరణానంతరం 'చోళ – చాళుక్య' రాజ్యాలను కలిపి పాలన ప్రారంభించాడు.

★ విశాఖపట్నం నగరాన్ని నిర్మించింది కులోత్తుంగ చోళుడే.

★ కళింగట్టు సరణి గ్రంథాన్ని రాసిన జయంగొండార్ కులోత్తుంగ చోళుడి ఆస్థానంలో ఉండేవాడు.

★ మూడో కులోత్తుంగ చోళుడు, మూడో రాజరాజు, నాలుగో రాజేంద్రుడు చివరి చోళ చక్రవర్తులు.

## ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక అంశాలు

★ చోళులు వ్యవసాయ, వాణిజ్య రంగాలకు అధిక ప్రాధాన్యం ఇచ్చారు.

★ వ్యవసాయాభివృద్ధి కోసం పెద్దసంఖ్యలో చెరువులను తవ్వించారు.

★ చోళులు అధికంగా భూములను వివిధ వర్గాలకు దానం చేయడం ద్వారా భూస్వామ్య వ్యవస్థ పటిష్టమైంది

★ నాటి భూస్వాములను మువ్వేందవేలన్, అరయ్యార్ అని పిలిచేవారు.

★ మువ్వేంద వేలన్ అంటే ముగ్గురు రాజులకు సేవలు అందించిన భూస్వామి

★ అరయ్యార్ అంటే ముఖ్యుడు అని అర్థం.

★ చోళుల కాలం నాటి గ్రామీణ జీవితాన్ని శెక్కిలార్ రచించిన పెరియ పురాణం గ్రంథం వివరిస్తుంది.

★ పెరియ పురాణం గ్రంథంలో ముఖ్యంగా అదనూరు అనే గ్రామంలో నివసిస్తున్న పులయులు అనే నిమ్న కులం గురించి వివరించారు.

★ మొదటి రాజేంద్ర చోళుడు చైనా దేశానికి రెండు రాయబార బృందాలను పంపి రాజకీయ, వాణిజ్య సంబంధాలను మెరుగుపరిచాడు.

★ చోళుల కాలంలో ద్రవిడ/ దక్కన్ శైలి ఎంతో అభివృద్ధి చెందింది.

## పుదుక్కోటి జిల్లాలోని ప్రధాన ఆలయాలు

★ చోళుల ప్రారంభ ఆలయాలు పుదుక్కోటి జిల్లాలో ఎక్కువగా కనిపిస్తాయి.

★ విజయాలయ చోళేశ్వరాలయం – నార్థమలై

★ నాగేశ్వరస్వామి ఆలయం – కుంభకోణం

★ కురంగనాథ ఆలయం – శ్రీనివాస నల్లూరు

★ మొదటి రాజరాజు 1009లో తంజావూరులో బృహదీశ్వర ఆలయాన్ని నిర్మించాడు.

★ చోళుల కాలంనాటి నటరాజ కాంస్య విగ్రహం తమిళనాడులోని చిదంబరంలో ఉంది.

★ చోళుల అధికార మతం శైవం. (శివారాధకులు)

★ కుంభకోణం సమీపంలోని త్రిభువనంలో కంపహరేశ్వర దేవాలయాన్ని నిర్మించారు.

★ తంజావూరు జిల్లాలోని దారాసురాం వద్ద అయితేశ్వర దేవాలయాన్ని నిర్మించారు.

★ సిబక చింతామణి, శివకాశీ నందమణి, కంబ రామాయణం లాంటి గ్రంథాలు ఈ కాలంలో బాగా ప్రాచుర్యం పొందాయి.

★ చోళుల కాలంలో యజ్ఞాల కంటే దానాలకు అధిక ప్రాధాన్యం ఇచ్చేవారు.

★ అద్వైత సిద్ధాంతాన్ని చెప్పిన శంకరాచార్యుడు, విశిష్టాద్వైతాన్ని చెప్పిన రామానుజాచార్యుడు ఈ యుగంలో ప్రాచుర్యం పొందారు.

★ కులోత్తుంగ చోళుడి కాలంలో నివసించిన రామానుజాచార్యులు హొయసల రాజ్యానికి వెళ్లి, వైష్ణవ మతాన్ని, విశిష్టాద్వైతాన్ని ప్రచారం చేశారు.

★ దక్షిణ భారతదేశ సంస్కృతికి చోళులు ఎనలేని సేవలు అందించారు.

## చోళుల కాలంలో దానం చేసిన భూములు – పేర్లు

బ్రహ్మదేయ – బ్రాహ్మణులకు దానం చేసిన భూమి

వెల్లన్ వాగై – బ్రాహ్మణేతరులకు దానం చేసిన భూమి

దేవమేయ/ తిరునాముత్తక్కని – దేవాలయానికి దానం చేసిన భూమి

శాలభోగ – పాఠశాలలకు ఇచ్చిన భూమి

పళ్లిచ్చరిదం – జైన సంస్థలకు దానం చేసిన భూమి.

## బృహదీశ్వర ఆలయం

తంజావూరులో బృహదీశ్వర ఆలయాన్ని మొదటి రాజరాజు నిర్మించాడు. కళ్యాణి చాళుక్యులను ఓడించి తెచ్చిన ధనంతో ఈ ఆలయాన్ని నిర్మించాడు. తమిళ వాస్తురీతిలో నిర్మితమైన బృహదీశ్వర ఆలయం మహోన్నతమైంది. ఈ దేవాలయ గోపురంపై అతి పెద్ద విమానాన్ని నిర్మించారు.

## పరిపాలనా విశేషాలు

★ చోళులు తమ సామ్రాజ్యాన్ని మండలాలు – వలనాడులు – నాడులు – గ్రామాలుగా విభజించారు.

★ చోళుల పాలనలో అత్యంత విశిష్టమైంది గ్రామపాలన/ స్థానిక పాలన.

★ మొదటి పరాంతకుడు వేయించిన ఉత్తర మేరూర్ శాసనం నాటి స్థానిక పాలన విశేషాలను వివరిస్తుంది.

★ నాటి గ్రామాలను "కుర్రం, కొట్టం" అని కూడా పిలిచేవారు.

★ గ్రామాల సముదాయాన్ని 'నాడు' అనేవారు. ప్రతినాడులో సుమారు 50 గ్రామాలు ఉండేవి

★ నాడుల పాలన ధనవంతులైన 'వెల్లాలు' అనే రైతుల ఆధీనంలో ఉండేది.

★ గ్రామాన్ని కుటుంబాలు / కుడుంబాలు అనే వార్డులుగా విభజించేవారు.

★ గ్రామ కమిటీని వరియం / వారియం అనేవారు.

★ గ్రామ కమిటీకి పోటీ చేసే అభ్యర్థులకు అర్హతలు, అనర్హతలు నిర్ణయించారు.

**అర్హతలు:**

1. సొంత ఇల్లు కలిగి ఉండాలి.
2. శిస్తు చెల్లించే సొంత భూమి కలిగి ఉండాలి.
3. 35 – 70 సంవత్సరాల మధ్య వయసు ఉండాలి.
4. వేదాల్లోని అంశాలపై అవగాహన ఉండాలి
5. నిజాయతీపరుడై ఉండాలి.

**అనర్హతలు:**

1. గతంలో వరుసగా మూడు సంవత్సరాలు గ్రామకమిటీ సభ్యుడిగా పని చేసి ఉండకూడదు.
2. గతంలో పని చేసి లెక్కలు చూపనివారై ఉండకూడదు.

★ అర్హత ఉన్న వారందరి చీటీలను కుండలో వేసి ఒక బాలుడితో లాటరీ తీసి విజేతలను / కమిటీని ప్రకటిస్తారు.

★ ఇలా ఎన్నుకున్న కమిటీని వారియం అంటారు. ప్రతి గ్రామ కమిటీలో మొత్తం 30 మంది సభ్యులుంటారు.

★ వారియం మళ్లీ ఆరు ఉపకమిటీలుగా విడిపోయి వివిధ అంశాలను పరిశీలిస్తుంది.

★ లాటరీద్వారా ఎన్నికైన సభ్యుడిని ఆలుముముక్కల్ అంటారు.

★ కుండలో వేసే పేర్ల చీటీలను 'కుడవోలై' అంటారు.

★ ఎన్నుకున్న గ్రామకమిటీ సభ్యుల పదవీకాలం సంవత్సరం మాత్రమే

★ చోళుల గ్రామపాలనలో ఉర్, సభ, నగరం/ నకరం అనే మూడు సభలు ప్రధాన పాత్ర పోషించేవి.

★ రైతు ప్రతినిధులతో కూడిన సభను ఉర్ అనేవారు.

★ బ్రాహ్మణ ప్రతినిధులు ఉండేది "సభ".

★ వ్యాపార/ వాణిజ్య/ వైశ్య ప్రతినిధులతో కూడిన సభను నగరం/ నకరం అనేవారు.

★ ఉన్నత అధికారులను "ఉదంకుట్టమ్" అని పిలిచేవారు

★ గ్రామసభ సాధారణంగా దేవాలయ ప్రాంగణంలో జరిగేది.

★ నాటి సైనిక పటలాలను కడియాలు అనేవారు.

★ నౌకాదళ అవసరాన్ని గుర్తించిన తొలి భారతీయ పాలకులు చోళులు.

★ పట్టణాల్లో ఉండే స్వయం ప్రతిపత్తి పాలనా వ్యవస్థలను 'తాన్‌కుర్రమ్' అనేవారు

**రచయిత: బొత్స నాగరాజు**

# చరిత్ర

## ఢిల్లీ సుల్తానులు

- ఢిల్లీ సుల్తానుల పరిపాలనా కాలం 1206 – 1526
- ఢిల్లీ సుల్తానత్‌ను పాలించిన వంశాలు 5. అవి:
  - బానిస వంశం
  - ఖిల్జీ వంశం
  - తుగ్లక్ వంశం
  - సయ్యద్ వంశం
  - లోడీ వంశం
- బానిస వంశ స్థాపకుడు, ఢిల్లీ సుల్తానత్ రాజ్య స్థాపకుడు – కుతుబుద్దీన్ ఐబక్ (1206 – 10)
- కుతుబుద్దీన్ ఐబక్ బిరుదు – లాక్ భక్ష్
- బానిస వంశానికి ఉన్న మరో పేరు – మామ్లూక్ వంశం
- ఢిల్లీ ఆక్రమణకు గుర్తుగా కుతుబుద్దీన్ ఐబక్ ప్రారంభించిన కట్టడం – కువ్వత్ ఉల్ ఇస్లాం
- భారతదేశంలో ఇస్లాం రాజ్యస్థాపనకు గుర్తుగా కుతుబుద్దీన్ ఐబక్ ప్రారంభించిన కట్టడం – కుతుబ్‌మీనార్ (1199)
- కుతుబుద్దీన్ ఐబక్ అజ్మీర్‌లో నిర్మించిన మసీదు – అర్హిదిన్–కా–జోంప్రా
- బెంగాల్‌లో తిరుగుబాటు చేసిన అలీమర్దాన్‌ను ఓడించిన ఐబక్ మహ్మద్‌షేరాన్‌ను పాలకుడిగా నియమించాడు
- ఐబక్ మామ పేరు – తాజుద్దీన్ ఎల్‌డజ్
- ఐబక్ బావ పేరు – నాసిరుద్దీన్ కుబాబా
- లాహోర్‌లో చౌగాన్/ పోలో ఆడుతూ గుర్రంపై నుంచి పడి మరణించిన సుల్తాన్ – కుతుబుద్దీన్ ఐబక్.
- ఐబక్ అనంతరం పాలకుడైన అతడి కుమారుడు – ఆరామ్‌షా.
- ఆరామ్‌షాను పదవి నుంచి తొలగించి పాలనకు వచ్చింది – ఇల్‌టుట్‌మిష్ (1211 – 36)
- ఖలీఫాతో ఢిల్లీ సుల్తాన్‌గా గుర్తింపు, అనుమతి పత్రం పొందిన తొలి వ్యక్తి – ఇల్‌టుట్‌మిష్ (1229)
- ఢిల్లీ సుల్తానుల కాలం నాటి సైనిక విధానం – ఇక్తా పద్ధతి (ఇక్తా అధిపతి – ముక్తీ). దీన్ని ప్రవేశపెట్టిన పాలకుడు – ఇల్‌టుట్‌మిష్
- కుతుబ్‌మీనార్ నిర్మాణాన్ని పూర్తి చేసింది – ఇల్‌టుట్‌మిష్
- 1214 నాటి తరైన్ యుద్ధంలో ఇల్‌టుట్‌మిష్ చేతిలో ఓడిపోయిన పాలకుడు – తాజుద్దీన్ ఎల్‌డజ్
- ఇల్‌టుట్‌మిష్ ప్రవేశపెట్టిన వెండి నాణెం టంకా, రాగి నాణెం – జటాల్
- 40 మంది తురుష్క సర్దారుల కూటమి చిహల్‌గనీ ఇల్‌టుట్‌మిష్ కాలంలో ఏర్పడింది
- 1217లో ఇల్‌టుట్‌మిష్ చేతిలో ఓడిపోయిన ముల్తాన్ గవర్నర్ – నాసిరుద్దీన్ కుబాబా
- రాజధానిని లాహోర్ నుంచి ఢిల్లీకి మార్చింది – ఇల్‌టుట్‌మిష్
- ఇల్‌టుట్‌మిష్ అసలు పేరు – షంషుద్దీన్ ఇల్‌టుట్‌మిష్
- కుతుబుద్దీన్ ఐబక్ ఇల్‌టుట్‌మిష్‌ను మొదట బదక్షాన్ ప్రాంతానికి గవర్నర్‌గా నియమించాడు
- ఐబక్ మరణించే సమయానికి ఇల్‌టుట్‌మిష్ బరద్వాన్ గవర్నర్‌గా ఉన్నాడు

- ఢిల్లీలో నిజమైన తురుష్క (టర్కీ) పాలనను పటిష్ఠంచేసిన వ్యక్తిగా పేరొందింది – ఇల్‌టుట్‌మిష్
- ఉజ్జయినిలోని మహంకాళి దేవాలయాన్ని ధ్వంసం చేసిన సుల్తాన్ – ఇల్‌టుట్‌మిష్
- 1236లో బనియన్ రాజపుత్రులతో యుద్ధం చేస్తూ ఇల్‌టుట్‌మిష్ మరణించాడు.
- ఇల్‌టుట్‌మిష్ అనంతరం పాలనకు వచ్చిన అతడి కుమార్తె – సుల్తానా రజియా
- రజియా సుల్తానా పదవీకాలం: 1236 – 40
- భారతదేశాన్ని పరిపాలించిన ఏకైక ముస్లిం మహిళ – సుల్తానా రజియా
- పరదా పద్ధతిని కాదని పరదాను తొలగించి ఏనుగుపై ఊరేగింది – రజియా సుల్తానా
- రజియా సుల్తానా తన అశ్వదళాధిపతిగా (అమీర్–ఇ–అబూఖత్) మాలిక్ జమాలుద్దీన్ యాకూత్‌ను (అబిసీనియా దేశస్థుడు) నియమించింది
- లాహోర్ తిరుగుబాటును అణచింది – రజియా సుల్తానా
- రజియా సుల్తానా వజీర్ – నిజామ్ ఉల్‌ముల్క్ జునైడీ
- రజియాను వివాహం చేసుకున్న భటిండా పాలకుడు – అల్‌తునియా
- రజియా, అల్‌తునియా 1240లో హత్యకు గురైన ప్రదేశం – ఖైతాల్
- రజియా అనంతరం సుల్తాన్ అయిన ఆమె సోదరుడు – బహరాంషా
- బాల్బన్ బహరాంషాను తొలగించి నాసిరుద్దీన్ మహ్మద్‌ను సుల్తాన్‌గా నియమించాడు –
- తబాకాత్-ఇ-నాసిరి గ్రంథాన్ని రాసింది – మిన్హజుద్దీన్ షిరాజ్
- నాసిరుద్దీన్ అనంతరం సుల్తాన్ అయింది – బాల్బన్ (1266 – 87)
- బాల్బన్ అసలు పేరు – బహవుద్దీన్ (ఉలూగ్‌ఖాన్)
- బానిస వంశంలో గొప్పపాలకుడు – బాల్బన్
- బాల్బన్ ఇల్బారీతెగకు చెందినవాడు
- బానిసగా, నీరు మోసేవాడిగా, కట్టెలు కొట్టే పనివాడిగా, సైనికుడిగా, సేనానిగా, ప్రధానిగా చివరికి సుల్తాన్‌గా బహుముఖ పాత్రలు పోషించిన వ్యక్తి – బాల్బన్
- అడవులను నరికించి, వ్యవసాయ భూములుగా మార్చిన తొలి ఢిల్లీ సుల్తాన్ – బాల్బన్
- బాల్బన్‌కు వ్యతిరేకంగా తిరుగుబాటు చేసిన బెంగాల్ గవర్నర్ – తుగ్రిల్‌ఖాన్
- తుగ్రిల్‌ఖాన్ తిరుగుబాటును అణచి బెంగాల్‌కు నూతన పాలకుడిగా బుగ్రాఖాన్‌ను నియమించాడు
- ఇస్లాం సిద్ధాంతమైన 'సర్వ సమానత్వం' నుంచి వైదొలగిన తొలి ఢిల్లీ సుల్తాన్ – బాల్బన్
- 'జిల్లీ ఇల్లాహే' (చక్రవర్తి భగవంతుడి నీడ) అనే సిద్ధాంతాన్ని ప్రకటించిన ఢిల్లీ సుల్తాన్ – బాల్బన్ (నియాబత్–ఇ–ఖుదాయ్ = సుల్తాన్ దేవుని ప్రతినిధి)
- సామాన్య ప్రజలతో మాట్లాడటానికి ఇష్టపడని సుల్తాన్ – బాల్బన్
- బాల్బన్ ప్రజలతో సంభాషించడానికి నియమించిన అధికారులు – చాంబర్లీన్లు
- బాల్బన్ ప్రవేశపెట్టిన పర్షియన్ రాజరిక పద్ధతులు – పైబోస్, సిజ్దా
- సిజ్దా అంటే – సాష్టాంగ నమస్కారం చేయడం
- పైబోస్/ జమ్నిబోస్ అంటే /సుల్తాన్ పాదాలనుగానీ, సింహాసనాన్నిగానీ ముద్దుపెట్టుకోవడం.
- నౌరోజ్ పండుగను భారతదేశానికి పరిచయం చేసింది – బాల్బన్

- నాణేలపై ఖలీఫా పేరును ముద్రించిన సుల్తాన్ – బాల్బన్
- సైనికులకు వృద్ధాప్య పెన్షన్ విధానాన్ని ప్రవేశపెట్టింది – బాల్బన్
- 40 మంది తురుష్క సర్దారుల కూటమి 'చిహల్‌గనీ'ని నిర్మూలించింది – బాల్బన్
- బాల్బన్ ఏర్పాటు చేసిన గూఢచారి శాఖ – దివాన్ ఇ బరీద్
- మియోలు/ మేవాటీలు అనే దొంగలను నిర్మూలించిన సుల్తాన్ – బాల్బన్
- బాల్బన్ ప్రవేశపెట్టిన సైనిక/ యుద్ధశాఖ – దివాన్ ఇ అర్జ్
- బాల్బన్ తన ఆస్థానంలో పోషించిన ప్రముఖ పారశీక కవి – అమీర్ ఖుస్రూ
- అమీర్ ఖుస్రూ బిరుదు – భారతదేశపు చిలుక (ఇండియన్ ప్యారెట్)
- సితార్, ఖయి, తబలా లాంటి వాద్య పరికరాలు రూపొందించింది – అమీర్ ఖుస్రూ
- బాల్బన్ కాలంలో దివాన్–ఇ, అర్జ్ శాఖకు మంత్రిగా పనిచేసింది – ఇమ్మాద్ ఉల్‌ముల్క్
- బాల్బన్ కాలంలో ఆదరించిన కవులు – అమీర్ ఖుస్రూ, అమీర్ హసన్
- బాల్బన్ తన ఆస్థానానికి ఆహ్వానించిన త్రిమతాచార్యుడు – మధ్వాచార్యులు
- చివరి బానిస వంశ సుల్తాన్ – కైకూబాద్

## ఖిల్జీ వంశం (1290 – 1320)

- 1290లో చివరి బానిస వంశ పాలకుడు కైకూబాద్‌ను హత్య చేసి, ఖిల్జీ వంశపాలనను ప్రారంభించింది – జలాలుద్దీన్ ఖిల్జీ
- 1290లో జలాలుద్దీన్ ఖిల్జీ పట్టాభిషేకం జరిగిన ప్రాంతం – నౌషహోర్/ కైలుఘరీ/ కిలోకారి
- 1291లో మాలిక్ చజ్జూ (కారా) తిరుగుబాటును అణిచింది – జలాలుద్దీన్ ఖిల్జీ
- సిద్దిమౌలా అనే మతగురువును ఏనుగులతో తొక్కించి, చంపించిన సుల్తాన్ – జలాలుద్దీన్ ఖిల్జీ
- జలాలుద్దీన్ ఖిల్జీ కాలంలో ఓడిపోయిన మంగోలులు ఉలూగ్‌ఖాన్ నాయకత్వంలో నయాముస్లింలు అనే పేరుతో భారతదేశంలో స్థిరపడ్డారు.
- ధగ్గులు అనే దోపిడీ దొంగలను నిర్మూలించిన సుల్తాన్ – జలాలుద్దీన్ ఖిల్జీ
- జలాలుద్దీన్ ఖిల్జీ వజీర్ – ఖ్వాజా ఖతీర్
- ఢిల్లీ కొత్వాల్‌గా నియమితుడైన వ్యక్తి – మాలిక్ ఫక్రుద్దీన్
- 1294లో యాదవ రాజ్యంపై దాడికి అల్లావుద్దీన్ ఖిల్జీ (గుర్షాస్ప్ మాలిక్) నాయకత్వంలో సైన్యాలను పంపాడు.
- అల్లావుద్దీన్ ఖిల్జీ 1296లో జలాలుద్దీన్ ఖిల్జీని కారా ప్రాంతంలో చంపించి సుల్తాన్ అయ్యాడు.
- అల్లావుద్దీన్ పరిపాలనా కాలం: 1296 – 1316
- అల్లావుద్దీన్ ఖిల్జీ అసలు పేరు – గుర్షాస్ప్ మాలిక్
- మతం నుంచి రాజకీయాలను వేరుచేసిన తొలి ఢిల్లీ సుల్తాన్ – అల్లావుద్దీన్ ఖిల్జీ
- ఢిల్లీ సుల్తానుల్లో గొప్పవాడు – అల్లావుద్దీన్ ఖిల్జీ
- అల్లావుద్దీన్ ఖిల్జీ బిరుదులు: సికిందర్–ఇ–సాని, రెండో అలెగ్జాండర్, అమీర్–ఉల్–ముమూనిన్
- హిందువులపై అధిక పన్నులు విధించిన ఏకైక సుల్తాన్ – అల్లావుద్దీన్ ఖిల్జీ
- 1299లో గుజరాత్‌పై దండెత్తిన అల్లావుద్దీన్ ఖిల్జీ అక్కడి రాజు కర్ణదేవుడిని ఓడించాడు.
- కర్ణదేవుడి భార్య కమలాదేవిని అల్లావుద్దీన్ ఖిల్జీ వివాహం చేసుకున్నాడు.

- కర్ణదేవుడు తన కుమార్తె దేవలదేవితో కలిసి యాదవ రాజ్యంలో ఆశ్రయం పొందాడు.
- నాటి యాదవ రాజ్య రాజు – రామచంద్ర దేవుడు
- గుజరాత్‌లోని కాంబే ప్రాంతం నుంచి అల్లావుద్దీన్ కొనుగోలు చేసిన వ్యక్తి – మాలిక్ కాఫర్
- మాలిక్ కాఫర్ వాస్తవంగా హిందూమతానికి చెందినవాడు. కానీ ఇస్లాం మతంలోకి మార్చారు. అతడిని హజార్దీనారి పేరుతో పిలిచేవారు.
- అల్లావుద్దీన్ ఖిల్జీ చేతిలో ఓడిపోయిన రణతంభోర్ రాజు – రాజా హంవీరదేవుడు
- అల్లావుద్దీన్ ఖిల్జీ చేతిలో ఓటమి చెందిన మేవాడ్/ చిత్తోడ్ రాజు – రాణా రతన్ సింగ్
- రాణా రతన్‌సింగ్ భార్య – రాణి పద్మిని
- రాణి పద్మిని శత్రువు చేతికి చిక్కకుండా ఉండటానికి జౌహార్ చేసింది.
- జౌహార్ అంటే అగ్నిగుండంలోకి దూకి ఆత్మహత్య చేసుకోవడం.
- చిత్తోడ్ ఆక్రమణ అనంతరం దానికి పెట్టిన పేరు – ఖిజీరాబాద్
- చిత్తోడ్ దండయాత్రలో పాల్గొన్న ప్రముఖ కవి – అమీర్ ఖుస్రూ
- పద్మావత్ గ్రంథాన్ని రాసింది – మాలిక్ మహ్మద్ జాయసీ

**అల్లావుద్దీన్ ఉత్తర భారతదేశ దండయాత్రలో ఓడించిన ఇతర రాజులు**

★ మాల్వా – మహలక్ దేవుడు

★ జాలోర్ – కనేరా దేవుడు

★ పరమారరాజు – శీతల్ దేవుడు

- అల్లావుద్దీన్ ఖిల్జీ కూడా సోమనాథ దేవాలయాన్ని కొల్లగొట్టాడు.
- అల్లావుద్దీన్ ఖిల్జీ దక్షిణ భారతదేశ దండయాత్రకు నాయకత్వం వహించింది – మాలిక్ కాఫర్

**మాలిక్ కాఫర్ చేతిలో ఓటమిపాలైన దక్షిణ భారత రాజ్యాలు – రాజులు**

యాదవ రాజ్యం – రామచంద్ర దేవుడు

కాకతీయ రాజ్యం – రెండో ప్రతాపరుద్రుడు

హోయసల రాజ్యం – మూడో భల్లాలదేవుడు

పాండ్య రాజ్యం – వీర పాండ్యుడు

- గుర్రాలపై రాజముద్రలు వేసే పద్ధతి – దాగ్
- మార్కెట్ సంస్కరణలు ప్రవేశపెట్టిన ఢిల్లీ సుల్తాన్ – అల్లావుద్దీన్ ఖిల్జీ
- అల్లావుద్దీన్ ఖిల్జీ ఏర్పాటు చేసిన మార్కెట్ శాఖ – దివాన్–ఇ–రియాసత్
- మార్కెట్ సంస్కరణల అమలు కోసం నియమించిన ప్రత్యేక అధికారి పేరు – షహనా–ఇ–మండి
- దివాన్–ఇ–రియాసత్‌గా పనిచేసిన వ్యక్తి – మాలిక్ యాకూబ్
- మార్కెట్ శాఖ, దివాన్–ఇ–రియాసత్ మార్కెట్‌లపై అధికారి – షహనా–ఇ–మండి
- ఇక్తా పద్ధతిని రద్దు చేసి, సైనికులకు జీతాలు ఇచ్చే పద్ధతిని ప్రవేశపెట్టింది – అల్లావుద్దీన్ ఖిల్జీ
- సైనికులకు నిర్వహించే హాజరుపట్టీ – చెహ్రా
- అల్లావుద్దీన్ ఖిల్జీ కాలంలో సైనికుడి సంవత్సర జీతం – 234 టంకాలు

- ✤ అల్లావుద్దీన్ ఖిల్జీ మార్కెట్ సంస్కరణల ప్రధాన లక్ష్యం – సైనికుల సంక్షేమం
- ✤ అల్లావుద్దీన్ ఖిల్జీ మార్కెట్ సంస్కరణలు దేశమంతటా ఉన్నాయని పేర్కొన్నది – జియావుద్దీన్ బరౌనీ
- ✤ అల్లావుద్దీన్ ఖిల్జీ ఆస్థానంలో ఉన్న ప్రసిద్ధ చరిత్రకారులు – బరౌనీ, ఇస్సామీ
- ✤ అల్లావుద్దీన్ ఖిల్జీ ఏర్పాటు చేసిన రెవెన్యూ శాఖ – దివాన్–ఇ–మస్తక్‌రాజ్
- ✤ దివాన్–ఇ–మస్తక్‌రాజ్ ప్రధాన విధి – రెవెన్యూ విధానంలో ఉద్యోగుల అవినీతిని నిర్మూలించడం
- ✤ అల్లావుద్దీన్ కాలంలో భూమి శిస్తు – 1/2వ వంతు
- ✤ అల్లావుద్దీన్ ఖిల్జీ సర్వే చేసిన భూములను బిస్వాలు (నేటి ఎకరాలు) పేరుతో వర్గీకరించాడు.
- ✤ అల్లావుద్దీన్ ఖిల్జీ ప్రజల సంక్షేమం కోసమే ధరల నియంత్రణను ప్రవేశపెట్టాడు అన్నది – అమీర్ ఖుస్రూ
- ✤ మార్కెట్‌లపై నియమించిన నిఘా అధికారులు – బరీద్‌లు/ మాన్హీలు
- ✤ అల్లావుద్దీన్ కాలంలో ధరలు స్థిరంగా ఉన్నాయని షాజహాన్ కాలంలో పేర్కొన్న చరిత్రకారుడు – పెరిస్తా
- ✤ అల్లావుద్దీన్ ఖిల్జీ కాలంలో జరిగింది – జలాలీ ప్రభువుల తిరుగుబాటు
- ✤ అల్లావుద్దీన్ ఖిల్జీ నిర్మాణాలు – సిరి నగరం (రెండో రాజధాని), అలై దర్వాజా (కుతుబ్‌మీనార్ గేటు), అలైమీనార్ (మధ్యలో నిలిచిపోయింది)
- ★ నయా ముస్లింలను పూర్తిగా నిర్మూలించిన సుల్తాన్ – అల్లావుద్దీన్ ఖిల్జీ
- ★ ఘరీ అంటే – ఇంటి పన్ను
- ★ చరాయ్/ చరి అంటే పచ్చిక బయళ్లపై పన్ను
- ★ అల్లావుద్దీన్ ఖిల్జీ మరణానంతరం పాలకులైనవారు – కుతుబుద్దీన్ ముబారక్ ఖిల్జీ (1316 – 20), నాసిరుద్దీన్ ఖుస్రూషా (1320)
- ★ తనను తాను ఖలీఫాగా ప్రకటించుకున్న ఢిల్లీ సుల్తాన్ – ముబారక్ ఖిల్జీ

**రచయిత: బొత్స నాగరాజు**

# భారతదేశ చరిత్ర

## ఆంగ్ల సామ్రాజ్య విస్తరణ

భారతదేశంపై బ్రిటిషర్లు దశలవారీగా ఆధిపత్యాన్ని సాధించారు. అందుకోసం ఎన్నో యుద్ధాలు చేశారు. రాజ్యతంత్రాలు ప్రయోగించారు. వాటిలో ముఖ్యమైనవి మరాఠా, మైసూర్, సిక్కు యుద్ధాలు. వీటిపై అభ్యర్థులు తగిన అవగాహన ఏర్పరచుకోవాలి.

- సుగంధ ద్రవ్యాలు, వస్త్ర వ్యాపారం కోసం వచ్చిన ఐరోపా దేశాలు క్రమంగా వలస, వాణిజ్య, సామ్రాజ్యవాదాలను పెంపొందించుకుని పరస్పరం కలహించుకున్నాయి. ఆంగ్లేయులు మిగిలిన ఐరోపా దేశాలను ఓడించి భారతదేశంపై ఆధిపత్యాన్ని పొందారు.
- పోర్చుగీసు, డచ్, డెన్మార్కులు ఓడిపోయిన తర్వాత వారి వర్తక స్థావరాలను ఆంగ్లేయులు స్వాధీనం చేసుకున్నారు.
- ఫ్రెంచివారు ఆంగ్లేయులతో సుదీర్ఘ పోరాటం చేశారు.
- భారత భూభాగంలో ఆంగ్లేయులకు, ఫ్రెంచివారికి మధ్య జరిగిన సంఘర్షణలను కర్ణాటక యుద్ధాలు అంటారు.
- ఆంగ్లేయులు భారతదేశాన్ని ఆక్రమించడానికి యుద్ధాలు, సైన్య సహకార పద్ధతి, రాజ్య సంక్రమణ సిద్ధాంతం లాంటివి ఆచరించడం, బిరుదులు, భరణాలు రద్దు చేయడం, దుష్పరిపాలన నెపంతో రాజ్యాలు ఆక్రమించడం లాంటి సామ్రాజ్యవాద విధానాలు అవలంబించారు.
- ఆంగ్లేయులకు ఫ్రెంచివారికి మధ్య భారతదేశంలో మూడు కర్ణాటక యుద్ధాలు జరిగాయి. ఆర్కాటు పట్టణం  రెండు కంపెనీల మధ్య యుద్ధాలకు కారణమైంది.
- మొదటి కర్ణాటక యుద్ధం 1740 – 48 మధ్య జరిగింది. ఆస్ట్రియా వారసత్వ యుద్ధం కారణంగా 1740లో ఇంగ్లాండ్, ఫ్రాన్స్‌ల మధ్య ప్రారంభమైన ఈ యుద్ధం 1748లో ఎక్స్–లా–ఛాపెల్ సంధి ద్వారా ముగిసింది.
- మొదటి కర్ణాటక యుద్ధం నాటికి కర్ణాటక నవాబు అన్వరుద్దీన్, ఫ్రెంచి గవర్నర్ డూప్లే, అప్పటి మద్రాస్ ఆంగ్ల గవర్నర్ నికోలస్ మోర్స్.
- మొదటి కర్ణాటక యుద్ధంలో భాగంగా 1746లో డూప్లే–అన్వరుద్దీన్ సైన్యాల మధ్య శాంథోమ్ యుద్ధం జరిగింది.
- 1749 – 52 మధ్య రెండో కర్ణాటక యుద్ధం జరిగింది. ఈ యుద్ధానికి కారణం హైదరబాద్ కర్ణాటక రాజకీయాల్లో ఆంగ్ల, ఫ్రెంచి కంపెనీల జోక్యమే.
- హైదరాబాద్‌లో నాజర్‌జంగ్, ముజఫర్‌జంగ్‌ల మధ్య, కర్ణాటకలో అన్వరుద్దీన్, చందా సాహెబ్‌ల మధ్య వారసత్వ పోరు మొదలైంది.
- నాజర్‌జంగ్ (N), అన్వరుద్దీన్ (A), ఆంగ్లేయులు (E) ఒక కూటమిగా ఏర్పడితే, ముజఫర్‌జంగ్ (M), చందాసాహెబ్ (C) ఫ్రెంచివారు (F) ఒక కూటమిగా ఏర్పడ్డారు.
- రెండో కర్ణాటక యుద్ధంలో భాగంగా 1749లో అన్వరుద్దీన్, ఫ్రెంచి సేనల మధ్య 'అంబూరు యుద్ధం' జరిగింది. డిఅతుల్ నాయకత్వంలోని సైన్యం అన్వరుద్దీన్‌ను వధించింది.
- ఫ్రెంచివారు అన్వరుద్దీన్ స్థానంలో చందాసాహెబ్‌ను కర్ణాటక నవాబుగా నియమించారు.
- 1752లో రాబర్ట్‌క్లైవ్ ఆర్కాటుపై దాడి చేసి, చందాసాహెబ్‌ను వధించి అన్వరుద్దీన్ కుమారుడైన మహ్మదాలీని కర్ణాటక నవాబుగా నియమించాడు.
- ఫలితంగా రాబర్ట్‌క్లైవ్ 'ఆర్కాటు వీరుడు'గా పేరొందాడు.
- హైదరాబాద్ నవాబులైన నాజర్‌జంగ్, ముజఫర్‌జంగ్‌లు కడప నవాబు చేతిలో హత్యకు గురవడంతో ఫ్రెంచివారు సలాబత్‌సింగ్‌ను పాలకుడిగా నియమించారు. ఇతడికి సహాయంగా ఫ్రెంచివారు బుస్సీ నాయకత్వంలో సైన్యాన్ని ఉంచారు.
- రెండో కర్ణాటక యుద్ధం పాండిచ్చేరి సంధితో ముగిసింది.

- 1756 – 63 మధ్య మూడో కర్ణాటక యుద్ధం జరిగింది. ఈ యుద్ధానికి కారణం సప్తవర్ష సంగ్రామం.
- మూడో కర్ణాటక యుద్ధం నాటి ఫ్రెంచి గవర్నర్ కౌంట్–డి–లాలీ.
- మూడో కర్ణాటక యుద్ధంలో భాగంగా 1758లో చందుర్తి యుద్ధం, 1759లో మచిలీపట్నం యుద్ధం, 1760లో వందవాసి (వాండివాష్) యుద్ధం జరిగాయి.
- చందుర్తి, మచిలీపట్నం యుద్ధాల్లో ఆంగ్లసేనాని కల్నల్‌ఫోర్డ్ ఫ్రెంచివారిని ఓడించాడు.
- వందవాసి యుద్ధంలో ఫ్రెంచివారిని ఓడించిన ఆంగ్ల సేనాని సర్ ఐర్‌కూట్.
- ఆంగ్లేయులు ప్లాసీ, బక్సార్ యుద్ధాల విజయం ద్వారా బెంగాల్‌ను ఆక్రమించారు.
- భారతదేశంలో ఆంగ్ల సామ్రాజ్య స్థాపనకు ప్లాసీ యుద్ధం (1757) పునాది వేసింది.
- బెంగాల్‌లో ఆలీవర్ధీఖాన్ మొగలులను ధిక్కరించి స్వతంత్ర రాజ్యస్థాపన చేశాడు.
- ఆలీవర్ధీఖాన్ అనంతరం సిరాజ్ ఉద్దౌలా బెంగాల్ పాలకుడయ్యాడు.
- 1756 నాటి కలకత్తా చీకటిగది ఉదంతం ప్లాసీ యుద్ధానికి కారణమైంది. కలకత్తా చీకటిగది ఉదంతం గురించి తెలియజేసిన వ్యక్తి హాల్‌వెల్.
- 1757, జూన్ 23న ప్లాసీ యుద్ధం జరిగింది. సిరాజ్ ఉద్దౌలా సేనాని మీర్జాఫర్ ఆంగ్లేయులతో చేరి మోసం చేయడంతో సిరాజ్ ఉద్దౌలా మరణించాడు.
- రాబర్ట్‌క్లైవ్, మీర్జాఫర్‌ల మధ్య ఒమీన్‌చాంద్/ అమీన్‌చంద్ రాయ్‌దుర్లభ్, జగత్‌సేత్‌లు ఒప్పందం కుదిర్చారు.
- ప్లాసీ యుద్ధం భగీరథీ నదీ తీరంలో జరిగింది. ప్లాసీ యుద్ధం గురించి పేర్కొంటూ బెంగాలీ కవి నబీన్ చంద్రసేన్ "భారతదేశానికి అంతమెరుగని విషాద కాళరాత్రి సంభవించింది" అన్నారు.
- 1757లో రాబర్ట్‌క్లైవ్ చందర్‌నగర్‌ను ఆక్రమించడంతో బెంగాల్‌లో ఫ్రెంచివారి ప్రాబల్యం అంతమైంది.
- 1759లో చిన్సూరా ఆక్రమణతో భారతదేశంలో డచ్చి వారి ప్రాబల్యం అంతమైంది.
- ఆంగ్లేయులు మీర్జాఫర్‌ను తొలగించి మీర్‌ఖాసింను బెంగాల్ నవాబుగా నియమించారు.
- మీర్‌ఖాసిం భారతీయ వర్తకులపై అధికంగా ఉన్న కస్టమ్స్ పన్నులను తగ్గించాడు.
- ఆంగ్లేయులు మళ్లీ మీర్‌ఖాసింను తొలగించి మిర్జాఫర్‌ను నవాబుగా చేశారు.
- పదవి కోల్పోయిన మీర్‌ఖాసిం అప్పటి అయోధ్య నవాబు షుజాఉద్దౌలా, మొఘల్ చక్రవర్తి రెండో షా ఆలంతో ఒక కూటమిని ఏర్పాటుచేశాడు.
- 1764లో ఆంగ్లేయులకు, భారతీయ కూటమికి మధ్య 'బక్సార్ యుద్ధం' జరిగింది.
- బక్సార్ యుద్ధంలో ఓడిపోయిన భారతీయ కూటమి ఆంగ్లేయులతో 1765లో అలహాబాద్ సంధి చేసుకుంది.
- అలహాబాద్ సంధి ద్వారా మొగల్ చక్రవర్తి ఆంగ్లేయులకు బీహార్, బెంగాల్, ఒరిస్సాల్లో శిస్తు వసూలు చేసుకునే దివానీ అధికారాన్ని కల్పించాడు.
- భారతదేశంలో ఆంగ్లేయుల ఆర్థిక అధికారానికి పునాది వేసింది 'బక్సార్ యుద్ధం' (1764).
- బక్సార్ యుద్ధంలో భారతీయ కూటమిని ఓడించిన ఆంగ్ల సేనాని మేజర్ మన్రో.
- రాబర్ట్‌క్లైవ్ బెంగాల్‌లో ద్వంద్వ పాలనను ప్రవేశపెట్టాడు (తర్వాతి కాలంలో ఈ ద్వంద్వ పాలనను వారన్ హేస్టింగ్స్ రద్దు చేశాడు).
- నిజామత్ అంటే పరిపాలనాధికారం. దివానీ అంటే భూమి శిస్తు వసూలు అధికారం. ఆంగ్లేయులు భారతీయ పాలకుల నుంచి పొందే ఉచిత వ్యాపార లైసెన్సులను దస్తక్‌లు అనేవారు.

## ఆంగ్ల మరాఠా యుద్ధాలు

★ ఆంగ్లేయులు మూడు ఆంగ్ల – మరాఠా యుద్ధాల ద్వారా మహారాష్ట్రులను ఓడించి వారి రాజ్యాన్ని ఆక్రమించారు.

★ 1775 – 82 మధ్య మొదటి ఆంగ్ల – మరాఠా యుద్ధం జరిగింది. మొదటి ఆంగ్ల – మరాఠా యుద్ధ కాలంలో నానా ఫడ్నవీస్ "బారాభాయి" కూటమిని ఏర్పాటు చేశాడు.

★ నానాఫడ్నవీస్‌ను మహారాష్ట్ర మాకియవెల్లి అంటారు. ఇతడి అసలు పేరు బాలాజీ పండిట్.

★ 1775లో రఘోభా, బొంబాయి గవర్నర్‌ల మధ్య సూరత్ సంధి జరగ్గా, 1776లో నానాఫడ్నవీస్, వారన్ హేస్టింగ్‌ల మధ్య పురంధర్ సంధి జరిగింది.

★ మొదటి ఆంగ్ల – మరాఠా యుద్ధం 1782లో సాల్బేసంధి ద్వారా ముగిసింది. ఆంగ్లేయులు ఈ సంధి ద్వారా సాల్‌సెట్టి, బేస్టిన్ ప్రాంతాలను పొందారు.

★ మహారాష్ట్రులు 4 ప్రధాన వర్గాలుగా విడిపోయారు. గ్వాలియర్ – సింధియాలు, ఇండోర్ – హోల్కార్‌లు, బరోడా – గైక్వాడ్‌లు, నాగపూర్ – భాన్స్లేలు

★ రెండో ఆంగ్ల – మరాఠా యుద్ధం 1803 – 05 మధ్య జరిగింది.

★ ఓడిపోయిన సింధియా సిర్జి అంజన్‌గావ్ సంధి, భాన్స్లే దేవ్‌గాన్ సంధి చేసుకున్నారు.

★ మొదటి ఆంగ్ల మరాఠా యుద్ధం నాటి గవర్నర్ జనరల్ వారన్‌హేస్టింగ్స్.

★ రెండో ఆంగ్ల మరాఠా యుద్ధం నాటి గవర్నర్ జనరల్ లార్డ్ వెల్లస్లీ.

★ మూడో ఆంగ్ల మరాఠా యుద్ధం 1818లో జరిగింది. నాటి ఆంగ్ల గవర్నర్ జనరల్ మార్క్విస్ ఆఫ్ హెమ్మింగ్ హేస్టింగ్స్.

★ 1818లో పీష్వా పదవిని రద్దు చేసిన గవర్నర్ జనరల్ హెమ్మింగ్ హేస్టింగ్స్.

## మైసూర్ యుద్ధాలు

★ ఆంగ్లేయులు నాలుగు మైసూర్ యుద్ధాల ద్వారా హైదర్‌అలీ, టిప్పు సుల్తానుల నుంచి మైసూర్ రాజ్యాన్ని స్వాధీనం చేసుకున్నారు.

★ 1767 – 69 మధ్య జరిగిన మొదటి మైసూర్ యుద్ధంలో ఆంగ్లేయులు ఓడిపోయి హైదర్ అలీతో 1769లో మద్రాస్ సంధి చేసుకున్నారు.

★ 1780 – 84 మధ్య జరిగిన రెండో మైసూర్ యుద్ధంలో ఓడిపోయిన ఆంగ్లేయులు 1784లో మంగళూరు సంధి చేసుకున్నారు.

★ కానీ 1790 – 92 మధ్య జరిగిన మూడో మైసూర్ యుద్ధంలో హైదరాబాద్, మహారాష్ట్ర పాలకులతో కలిసి కారన్‌వాలీస్ టిప్పుసుల్తాన్‌ను ఓడించి శ్రీరంగపట్నం సంధి చేసుకున్నాడు.

★ రెండో మైసూర్ యుద్ధం నాటి బెంగాల్ గవర్నర్ జనరల్ వారన్ హేస్టింగ్స్, మూడో మైసూర్ యుద్ధం నాటి బెంగాల్ గవర్నర్ జనరల్ లార్డ్ కారన్‌వాలీస్.

★ టిప్పుసుల్తాన్ శ్రీరంగపట్నంలో ఫ్రెంచి విప్లవానికి గుర్తుగా స్వేచ్ఛా వృక్షాన్ని నాటాడు.

★ 1799లో జరిగిన నాలుగో మైసూర్ యుద్ధంలో ఆర్థర్ వెల్లస్లీ టిప్పుసుల్తాన్‌ను వధించి అతడి రాజ్యాన్ని ఆక్రమించాడు. నాలుగో మైసూర్ యుద్ధంనాటి బెంగాల్ గవర్నర్ జనరల్ లార్డ్ వెల్లస్లీ.

★ "మతంలేని మడ్డి వెధవల మీద ఆధారపడి బతకడం కన్నా వీరుడిగా మరణించడమే మేలు" అన్నాడు టిప్పుసుల్తాన్.

★ టిప్పుసుల్తాన్ 'మైసూర్ పులి'గా పేరొందాడు.

## సిక్కు యుద్ధాలు

★ ఆంగ్లేయులు రెండు సిక్కు యుద్ధాలు చేసి వారి రాజ్యాన్ని కూడా బ్రిటిష్ సామ్రాజ్యంలో విలీనం చేసుకున్నారు.

★ స్వతంత్ర్య సిక్కు రాజ్య స్థాపకుడు రంజిత్‌సింగ్.

★ 1845 – 46 మధ్య మొదటి సిక్కుయుద్ధం జరిగింది. నాటి ఆంగ్ల గవర్నర్ జనరల్ మొదటి హార్డింగ్ సిక్కులతో లాహోర్ సంధి చేసుకున్నాడు.

★ 1848 – 49 మధ్య రెండో సిక్కు యుద్ధం జరిగింది. డల్హౌసీ రంజిత్ సింగ్ కుమారుడు దిలీప్ సింగ్‌కు భరణం ఇచ్చి సిక్కు రాజ్యాన్ని ఆక్రమించాడు.

★ ఈ విధంగా ఆంగ్లేయులు యుద్ధాల ద్వారా కర్ణాటక, హైదరాబాద్, బీహార్, బెంగాల్, ఒరిస్సా, మైసూర్, మహారాష్ట్ర, సిక్కు రాజ్యాలను ఆక్రమించారు.

★ వెల్లస్లీ సైన్య సహకార పద్ధతి, డల్హౌసీ రాజ్య సంక్రమణ సిద్ధాంతం ద్వారా అనేక భారతీయ రాజ్యాలను ఆంగ్ల సామ్రాజ్యంలో విలీనం చేశారు.

**రచయిత: బొత్స నాగరాజు**

# భారతదేశ చరిత్ర

## భారతదేశంలో ఆంగ్ల పాలనా ప్రభావాలు

భారతదేశంపై ఆధిపత్యాన్ని సాధించడంలో భాగంగా ఆంగ్లేయులు వివిధ చట్టాలను రూపొందించారు. ఆయా చట్టాలను ఏయే సంవత్సరాల్లో రూపొందించారు. వాటి ద్వారా ఆర్థిక, సాంఘిక, రాజకీయ, మత, సాంస్కృతిక రంగాల్లో వచ్చిన మార్పులను గురించి పోటీ పరీక్షలకు హాజరయ్యే అభ్యర్థులు స్పష్టంగా తెలుసుకోవాలి.

సుగంధ ద్రవ్యాల వ్యాపారం కోసం భారతదేశానికి వచ్చిన ఐరోపా దేశాల్లో ఇంగ్లండ్ మిగిలిన దేశాలను అధిగమించి భారతదేశాన్ని ఆక్రమించి తన వలసగా మార్చుకుంది.

- బ్రిటిష్ సామ్రాజ్య స్థాపన అనంతరం ఆంగ్లేయులు మన దేశంలో పాలన, ఆర్థిక, సాంఘిక, మత, సాంస్కృతిక రంగాలను బాగా ప్రభావితం చేశారు.

### 1773 రెగ్యులేటింగ్ చట్టం

- భారతదేశంలో ఆంగ్లేయులు ప్రవేశపెట్టిన మొదటి పాలనా చట్టం 1773 నాటి రెగ్యులేటింగ్ చట్టం.
- దీని ద్వారా బెంగాల్ గవర్నర్ జనరల్ పదవిని ఏర్పాటు చేసి వారన్ హేస్టింగ్స్‌ను తొలి బెంగాల్ గవర్నర్ జనరల్‌గా నియమించారు.
- దీని ద్వారానే కలకత్తాలో 1774లో తొలిసారిగా ఫెడరల్ న్యాయస్థానాన్ని (సుప్రీంకోర్టు) ఏర్పాటు చేశారు.
- ఈ చట్టం ద్వారా కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ సంఘం, నలుగురు సభ్యుల గవర్నర్ జనరల్ సలహా సంఘం ఏర్పడింది.
- ఆంగ్లేయులు బ్రిటిష్ ఇండియాను ప్రెసిడెన్సీలు, జిల్లాలు, తాలూకాలుగా విభజించారు.
- ప్రెసిడెన్సీకి గవర్నర్, జిల్లాకు కలెక్టర్, తాలూకాకు తహశీల్దార్‌లను అధిపతులుగా నియమించారు.
- జిల్లా మెజిస్ట్రేట్ శాంతి భద్రతల నిర్వహణ చేస్తే జిల్లా జడ్జి న్యాయ నిర్వహణ చేసేవాడు.

### 1784 పిట్ ఇండియా చట్టం

- ఆంగ్ల ప్రభుత్వం 1784లో పిట్ ఇండియా చట్టం చేసి ఆరుగురు సభ్యుల బోర్డ్ ఆఫ్ కంట్రోల్‌ను ఏర్పాటు చేసింది. గవర్నర్ జనరల్ సలహా సంఘం సభ్యుల సంఖ్యను 4 నుంచి 3కి తగ్గించారు.
- ఆంగ్ల ప్రభుత్వం 20 సంవత్సరాల కాలపరిమితితో 1793, 1813, 1833, 1853 సంవత్సరాల్లో నాలుగు చార్టర్ చట్టాలను ప్రవేశపెట్టింది.

### 1813 చార్టర్ చట్టం

- 1813 చార్టర్ చట్టం ద్వారా భారతదేశంలో విద్యాభివృద్ధికి సంవత్సరానికి లక్ష రూపాయలు కేటాయించింది. ఈ చట్టం ద్వారానే క్రైస్తవ మిషనరీలకు మత ప్రచార హక్కును కల్పించింది.
- 1813 చార్టర్ చట్టం ద్వారా భారతదేశంలో ఈస్ట్ ఇండియా కంపెనీ గుత్తాధికార వ్యాపార హక్కులను రద్దుచేశారు.

### 1833 చార్టర్ చట్టం

- దీని ద్వారా బెంగాల్ గవర్నర్ జనరల్ పదవిని భారతదేశ గవర్నర్ జనరల్‌గా మార్చారు. విలియం బెంటింక్‌ను తొలి భారతదేశ గవర్నర్ జనరల్‌గా నియమించారు.
- దీని ద్వారానే తేయాకు వర్తకం, చైనాతో కంపెనీ గుత్తాధికారాలను తొలగించారు. ఈ చట్టం ద్వారా విద్యాభివృద్ధికి సంవత్సరానికి రూ. 10 లక్షలు కేటాయించారు.
- గవర్నర్ జనరల్ సలహా సంఘంలో ఒక న్యాయ సభ్యుడిని (మెకాలేను) నియమించారు. శాసన నిర్మాణ, కార్యనిర్వాహక శాఖల్ని వేరు చేశారు.

## 1853 చార్టర్ చట్టం

- దీని ద్వారా భారతదేశంలో శాసన నిర్మాణ సభ ఏర్పాటుకు అంకురార్పణ జరిగింది. భారతదేశంలో సివిల్ సర్వీసుల్లో అన్ని నియామకాలు పోటీ పరీక్షల ద్వారానే జరగాలని నిర్ణయించారు. (12 మంది సభ్యులతో శాసన నిర్మాణాశాఖను ఏర్పాటు చేశారు.)
- ఈ చట్టం ద్వారానే కేంద్ర పాలన నుంచి బెంగాల్‌ను వేరుచేసి దానికి అసిస్టెంట్ గవర్నర్ జనరల్‌ను నియమించారు. కేంద్ర శాసనసభ ఏర్పడింది.

## 1858 భారత ప్రభుత్వ చట్టం

- దీని ద్వారా భారతదేశంలో పాలనాపరంగా మరిన్ని మార్పులు ప్రవేశపెట్టారు. భారతదేశ గవర్నర్ జనరల్ పదవిని భారత రాజప్రతినిధి/ వైస్రాయ్‌గా మార్చి, లార్డ్ కానింగ్‌ను తొలి వైస్రాయ్‌గా నియమించారు.
- దీని ద్వారా ఈస్ట్ ఇండియా కంపెనీ పాలనను రద్దుచేసి ఇంగ్లాండ్ రాజు/ రాణి ప్రత్యక్ష పాలనలోకి భారతదేశం వెళ్లేలా చేశారు.
- ఇంగ్లండ్ భారత రాజ్య కార్యదర్శి పదవిని, అతడికి పదిహేను మంది సభ్యులతో సలహా సంఘాన్ని (ఇండియా కౌన్సిల్) ఏర్పాటు చేశారు.
- బ్రిటిష్ పార్లమెంటులోని మంత్రివర్గ సభ్యుడిని భారత రాజ్య కార్యదర్శి/ సెక్రటరీ ఆఫ్ స్టేట్‌గా నియమించాలని పేర్కొన్నారు.

## 1861 భారత కౌన్సిళ్ల చట్టం

- ఈ చట్టం ద్వారా భారతదేశంలో ఆంగ్లేయులు పోర్ట్ ఫోలియో పద్ధతిని (మంత్రిత్వశాఖల కేటాయింపు) ప్రవేశపెట్టారు. ఈ చట్టం ద్వారానే రాష్ట్ర శాసన సభలను ఏర్పాటు చేశారు.
- దీని ద్వారానే వైశ్రాయ్ సలహా సంఘం సభ్యులను 5కి పెంచారు.

## 1892 భారత కౌన్సిళ్ల చట్టం

- దీని ద్వారా పరోక్ష ఎన్నిక విధానం ప్రవేశపెట్టడమే కాకుండా శాసన సభ్యులు బడ్జెట్‌పై చర్చ జరపడానికి అనుమతించారు.

## 1909 చట్టం

- ఆంగ్ల ప్రభుత్వం 1909లో మింటో మార్లే సంస్కరణలను (1909 చట్టం) ప్రవేశ పెట్టింది. దీని ప్రకారం భారతదేశంలో ముస్లింలకు మత ప్రాతిపదికపై ప్రత్యేక నియోజకవర్గాలు కేటాయించారు.
- లార్డ్ రెండో మింటోను 'మత నియోజకవర్గాల పిత'గా పేర్కొంటారు.
- ఈ చట్టం ద్వారానే భారతదేశంలో ప్రత్యక్ష ఎన్నికల విధానాన్ని ప్రవేశపెట్టారు.
- కేంద్ర శాసనసభను ఇంపీరియల్ లెజిస్లేటివ్‌గా మార్చి దాని సభ్యుల సంఖ్యను 69కి పెంచారు.

## 1919 మాంటెగ్ ఛేమ్స్‌ఫర్డ్ చట్టం

- ఈ చట్టాన్ని 1919లో ప్రవేశపెట్టారు. దీని ద్వారా రాష్ట్రాల్లో ద్వంద్వ పాలన/ ద్వంద్వ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు. ప్రభుత్వ పాలనాంశాలను కేంద్ర, రాష్ట్ర జాబితాలుగా విభజించారు. భారత హైకమిషనర్ పదవి ఏర్పాటు చేశారు.
- దీని ద్వారానే కేంద్రంలో ద్విసభా విధానాన్ని ప్రవేశపెట్టారు. ఎగువ సభలో 60 మంది, దిగువ సభలో 145 మంది సభ్యులుగా నిర్ణయించారు.

## 1935 భారత ప్రభుత్వ చట్టం

- దీని ద్వారా రాష్ట్రాల్లో స్వయం పాలన ఏర్పాటు చేసి కేంద్రంలో ద్వంద్వ పాలన ప్రవేశపెట్టారు. ఇండియా కౌన్సిల్‌ను (1858) రద్దు చేశారు.
- రాష్ట్రాల్లో ద్విసభా విధానాన్ని ప్రవేశపెట్టారు. ఉమ్మడి జాబితాను కూడా రూపొందించారు.

- అఖిల భారత సమాఖ్యను ఏర్పాటు చేశారు. ఎగువసభలో 260 మందిని, దిగువ సభలో 375 మందిని సభ్యులుగా నిర్ణయించారు.
- మొత్తం ఆరు రాష్ట్రాల్లో ద్విసభా విధానం, అయిదు రాష్ట్రాల్లో ఏక సభా విధానాన్ని కొనసాగించారు.
- 1935 చట్టాన్ని నెహ్రూ "ఇంజనులేని యంత్రం"గా విమర్శించారు.
- భారతదేశంలో ఆంగ్ల ప్రభుత్వం రూపొందించిన చివరి చట్టం 1948 భారత ప్రభుత్వ చట్టం.

**రచయిత: బొత్స నాగరాజు**

# భారతదేశ చరిత్ర

## భారతదేశంలో ఆంగ్ల పాలనా ప్రభావాలు ఆర్థిక విధానాలు

ఆంగ్లేయుల పాలనలో ఆర్థిక విధానాలన్నీ వారి స్వలాభాలకు అనుగుణంగానే రూపొందాయి. రకరకాల శిస్తు విధానాలను రైతులను పీడించడానికే ప్రయోగించారు. కరవు కాటకాల నివారణకు కమిషన్లు వేసి, ప్రాజెక్టులు కట్టినా ప్రయోజనం లేకపోయింది. ప్రజలు అర్ధాకలితో అలమటించారు.

- ఆంగ్లేయుల రాకతో భారత వ్యవసాయ వాణిజ్యీకరణ పెరిగింది.
- గ్రామీణ చేనేత, చిన్నతరహా కుటీర పరిశ్రమలు దెబ్బ తిన్నాయి.
- 1860లో బడ్జెట్ విధానం, ఆదాయపన్ను విధింపు పద్ధతులను భారతదేశంలో ప్రవేశపెట్టారు.
- 1869లో సూయజ్ కాలువ తెరవడంతో భారత-ఆంగ్లేయ వాణిజ్య సంబంధాలు మెరుగుపడ్డాయి.
- 1870లో భారత్, ఇంగ్లండ్‌ల మధ్య టెలిగ్రాఫ్‌లైన్‌ను వేశారు.
- ఆంగ్లేయుల ఆర్థిక విధానాలను రమేష్ చంద్ర దత్ (ఆర్.సి.దత్) మూడు ముఖ్యమైన దశలుగా విభజించారు. అవి:
  1. వాణిజ్య ప్రధాన దశ (1757 – 1813)
  2. స్వేచ్ఛా వ్యాపార దశ (1813 – 1858)
  3. పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద దశ (1858 – 1947)
- భారతదేశంలో ఆంగ్లేయులు అనుసరించిన వాణిజ్యవాదాన్ని మర్కంటైలిజం అంటారు.
- ఆంగ్లేయుల ఆర్థిక విధానాల వల్ల 30 సంవత్సరాల కాలవ్యవధిలో భారతదేశంలో మనిషికి లభించే ఆహారం 29 శాతం తగ్గిపోయిందని డీఆర్ గాడ్గిల్, విలియం హంటర్ లాంటి వారు విచారం వ్యక్తం చేశారు.
- 1834లో భారతదేశ ఎగుమతుల విలువ రూ.15 కోట్లుగా ఉండగా అది 1934 నాటికి రూ.758 కోట్లకు పెరిగింది.
- భారత వ్యవసాయ రంగంలో ఆంగ్లేయులు తీన్‌కథియా విధానాన్ని ప్రవేశపెట్టారు.
- 1771లో ఒక్కో కుటుంబానికి సరాసరి 40 ఎకరాల భూమి ఉండేది. కానీ 20వ శతాబ్ద ప్రారంభానికి (1901 నాటికి) 7 ఎకరాలకు తగ్గిపోయింది.
- 1925 – 34 మధ్య భారతదేశ తలసరి ఆదాయం ప్రపంచంలోకెల్లా అతి తక్కువగా ఉందని కోలిన్‌క్లార్క్ అనే ఆర్థికవేత్త పేర్కొన్నాడు.
- ఆంగ్లేయులు ప్రవేశపెట్టిన భూమి శిస్తు విధానాలు భారత వ్యవసాయ రంగాన్ని మరింత దెబ్బతీశాయి.
- వారన్ హేస్టింగ్స్ కాలంలో వేలం పద్ధతి ద్వారా భూమిశిస్తు వసూలు చేసేవారు.
- 1793లో లార్డ్ కారన్ వాలీస్ శాశ్వత శిస్తు విధానం/ జమీందారీ విధానాన్ని ప్రవేశపెట్టారు. ఇందులో 10 సంవత్సరాలకు శాశ్వతంగా శిస్తు నిర్ణయించేవారు.
- 1800 సంవత్సరంలో రైత్వారీ విధానాన్ని థామస్‌మన్రో ప్రవేశపెట్టారు.
- 1822లో హోల్ట్‌మెకంజీ నివేదికను అనుసరించి హెమ్మింగ్ హేస్టింగ్స్ వాయవ్య భారతదేశంలో మహల్వారీ విధానాన్ని ప్రవేశపెట్టారు.
- రైత్వారీ విధానం మొదట ప్రయోగాత్మకంగా తమిళనాడు, సేలం జిల్లాలోని బారామల్ ప్రాంతంలో కెప్టెన్‌రీడ్, థామస్‌మన్రోలు ప్రవేశపెట్టారు.
- జమీందారులు రైతుల నుంచి వసూలు చేసిన మొత్తం భూమి శిస్తులో 90 శాతాన్ని బ్రిటిష్ ప్రభుత్వానికి చెల్లించాలి. దీన్ని పేష్కష్ అనేవారు.



R-23-8-18

- ఆంగ్లేయుల భూమి శిస్తు విధానాల వల్ల బెంగాల్ రాష్ట్రంలో మూడో వంతు ప్రదేశం క్రూరమృగాలు నివశించే అరణ్య సీమగా మారిపోయిందని స్వయంగా కారన్‌వాలిస్ పేర్కొన్నారు.
- రైత్వారీ, జమీందారీ పద్ధతులు కేవలం కంపెనీ ప్రయోజనాలకే తప్ప, రైతాంగ సంక్షేమానికి కాదని కారల్‌మార్క్స్ పేర్కొన్నారు.
- 'మనం విధించినంత భూమి శిస్తు ఏ స్వదేశీ రాజుకూడా విధించలేదనేది వాస్తవం' అని బిషప్ హెబెర్ పేర్కొన్నారు.
- 1815లో లార్డ్ హేస్టింగ్స్ కాలంలో లెఫ్టినెంట్ బ్లేక్ పశ్చిమ జమునా కాలువ పునరుద్ధరణ పనులు ప్రారంభించి, ఢిల్లీకి తాగునీటి వసతి కల్పించారు.
- 1830 నాటికి పశ్చిమ జమునా కాలువ పునరుద్ధరణ పనులను కల్నల్ రాబర్ట్‌సన్, బేర్డ్‌స్మిత్‌లు పూర్తి చేశారు.
- 1856 నాటి నీటిపారుదల శాఖ డైరెక్టర్ జనరల్ కల్నల్ బేర్డ్‌స్మిత్.
- 1847 – 1852 మధ్య సర్ ఆర్థర్ కాటన్ గోదావరి నదిపై ధవళేశ్వరం వద్ద ఆనకట్ట నిర్మించారు. వీనం వీరన్న అనే ఆంధ్రుడు కాటన్‌కు సహాయపడ్డారు.
- కాటన్ సలహాతో 1855 నాటికి కెప్టెన్ ఓక్ విజయవాడ వద్ద కృష్ణానదిపై ఆనకట్టను (ప్రకాశం బ్యారేజి) నిర్మించారు.
- లార్డ్ రిప్పన్ కాలంలో వెయ్యిమైళ్ల పొడవైన కాలువలు తవ్వించి, పదిలక్షల ఎకరాల భూమిని కొత్తగా సాగులోకి తెచ్చారు.
- భారతదేశంలో 1660 – 1750 మధ్య 14 కరవులు సంభవించాయి.
- 1854 – 1901 మధ్య సంభవించిన కరవు కాటకాల వల్ల 2,88,35,000 మంది మరణించారని విలియం డిగ్బే అనే ఆంగ్లేయుడు పేర్కొన్నాడు.
- 1866 – 67 ఒరిస్సా కరవు, 1877లో డొక్కల కరవు, 1803లో దక్కన్ కరవు, 1943లో బెంగాల్ కరవు సంభవించాయి.
- డల్హౌసీ కాలంలో పబ్లిక్ వర్క్స్ డిపార్ట్‌మెంట్ ఏర్పడింది. ఇతడు గంగానదికి కాలువ తవ్వించారు.
- 1866 ఒరిస్సా కరవు కాలంలో కాంప్‌బెల్ క్షామ నివారణ సంఘాన్ని ఏర్పాటు చేశారు.
- 1880లో లార్డ్ లిట్టన్, సర్ రిచర్డ్ స్ట్రాచీ క్షామ నివారణ సంఘాన్ని ఏర్పాటు చేశారు.
- రెండో లార్డ్ లిట్టన్ కాలంలో 1898లో సర్ జేమ్స్ లయన్ క్షామ నివారణ సంఘాన్ని ఏర్పాటు చేశారు.
- 1901లో లార్డ్ కర్జన్ సర్ ఆంథోనీ మెక్‌డొనాల్డ్ క్షామ నివారణ సంఘాన్ని ఏర్పాటు చేశారు.
- లార్డ్ వేవెల్ 1945లో సర్ జాన్ ఉడ్‌హెడ్ క్షామ నివారణ కమిషన్‌ను ఏర్పాటు చేశారు.
- 1943 (రెండో ప్రపంచ యుద్ధకాలం) నాటి బెంగాల్ కరవులో 15 లక్షల మంది భారతీయులు మరణించారని కె.పి. ఛటోపాధ్యాయ అనే రచయిత పేర్కొన్నారు.
- రిచర్డ్ స్ట్రాచీ క్షామ నివారణ సంఘం సూచనల మేరకే 1883లో కరవు కోడ్ (ఫామిన్ కోడ్) రూపొందించారు. (లార్డ్ రిప్పన్)
- ఫామిన్ కోడ్ ప్రకారం కరవు సంక్షేమ నిధి, ఇన్సూరెన్స్ ఫండ్‌లను ఏర్పాటు చేశారు.
- 1899 నాటి కరవును పేర్కొంటూ గత 200 సంవత్సరాల్లో ఇలాంటి కరవు సంభవించలేదని జాన్ ఇలియట్ అనే వాతావరణ శాస్త్రవేత్త పేర్కొన్నారు.
- ఆంగ్లేయులు లార్డ్ కర్జన్ కాలంలో 1903లో బిహార్‌లోని పూసా వద్ద ఇంపీరియల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అగ్రికల్చర్ అనే పరిశోధనా సంస్థను ఏర్పాటు చేశారు.
- వ్యవసాయరంగ అభివృద్ధికి ఆంగ్ల ప్రభుత్వం కృషిచేయాలని 1928 నాటి రాయల్ కమిషన్ ఆన్ అగ్రికల్చర్ పేర్కొంది.
- అఖిల భారత ఆహార సమితిని ఏర్పాటు చేయాలని జాన్ ఉడ్‌హెడ్ క్షామ నివారణ సంఘం సూచించింది.
- 'వ్యవసాయమే వృత్తిగా ఉన్న భారతీయుల్లో సగం మంది ఏడాదిలో సగం రోజుల్లో సగం తిండి తిని జీవిస్తారు' అని చార్లెస్ ఇలియట్ పేర్కొన్నారు.

- ఆంగ్లపాలనలో నాటి భారత జనాభాలో నాలుగు కోట్ల మంది అర్ధాకలితో బతికేవారని విలియం హంటర్ తన ఇంపీరియల్ గెజిట్ అనే పత్రికలో పేర్కొన్నారు.
- 1930 నాటికి భారతదేశంలో సగటు ఆయుఃప్రమాణం 32 సంవత్సరాలు ఉండగా అదే కాలంలో ఐరోపాలో సగటు ఆయుఃప్రమాణం 60 సంవత్సరాలుగా ఉండేది.

## ప్రాక్టీస్ బిట్స్

**1.** భారతదేశంలో విద్యాభివృద్ధి కోసం ఏడాదికి లక్ష రూపాయలు కేటాయించిన చట్టం?

1) 1813 చార్టర్ చట్టం　2) 1833 చార్టర్ చట్టం
3) 1853 చార్టర్ చట్టం　4) 1793 చార్టర్ చట్టం

**2.** 1793లో భారతదేశంలో ప్రవేశపెట్టిన భూమి శిస్తు విధానం?

1) వేలం పద్ధతి　2) రైత్వారీ　3) మహల్వారీ　4) జమీందారీ

**3.** కేంద్రంలో ద్వంద్వ పాలనను ప్రవేశపెట్టిన చట్టం?

1) 1861 కౌన్సిళ్ల చట్టం　2) 1909 చట్టం　3) 1919 చట్టం　4) 1935 చట్టం

**4.** రైత్వారీ విధానం ప్రయోగాత్మకంగా ప్రవేశపెట్టిన ప్రాంతం?

1) ఉత్తర సర్కారులు　2) దత్త మండలాలు　3) సేలం　4) బారా మహల్

**5.** పోర్టుఫోలియో విధానం ప్రవేశ పెట్టిన చట్టం?

1) 1861 చట్టం　2) 1773 రెగ్యులేటింగ్ చట్టం
3) 1909 చట్టం　4) 1919 చట్టం

**6.** భారత హై కమిషనర్ పదవిని ఏ చట్టం ద్వారా ఏర్పాటు చేశారు?

1) 1909　2) 1919　3) 1935　4) 1948

**7.** జమీందారులు ప్రభుత్వానికి చెల్లించే శిస్తు భాగం?

1) ఖుద్‌ఖాస్త్　2) జమ　3) నజర్　4) పేష్కష్

**8.** మొదటి భారత వైద్య విద్యార్థి

1) మహేంద్రలాల్ సర్కార్　2) పి.సి.సర్కార్
3) కాదంబిని గంగూలీ　4) పి.సి.రే

**జవాబులు**

1-1; 2-4; 3-4; 4-4; 5-1; 6-2; 7-4; 8-1.

## గత పరీక్షల్లో వచ్చిన ప్రశ్నలు

**1.** భారతదేశ గవర్నర్ జనరల్‌గా నియమితులైన తొలి వ్యక్తి? (ఎస్.ఐ. – 2012)

1) వారన్ హేస్టింగ్స్　2) విలియం బెంటింక్
3) కారన్ వాలిస్　4) కానింగ్

**2.** భారతదేశంలో బడ్జెట్ విధానాన్ని ఎప్పుడు ప్రవేశ పెట్టారు? (గ్రూప్–2, 2008)

1) 1860　2) 1870　3) 1869　4) 1879

**3.** బొంబాయిలో తొలిసారిగా ఏ పరిశ్రమను స్థాపించారు? **(గ్రూప్-2, 2008)**

1) వస్త్ర 2) జనపనార 3) ఇనుము-ఉక్కు 4) ఏదీకాదు

**4.** 1847-52 మధ్య కాలంలో పూర్తి చేసిన ఆనకట్ట? **(డీఎస్సీ - 2012)**

1) ధవళేశ్వరం 2) విజయవాడ 3) ఇడిక్కి 4) పెరియార్

**5.** పబ్లిక్ వర్క్స్ డిపార్ట్‌మెంట్‌ను ఏ గవర్నర్ జనరల్ కాలంలో స్థాపించారు? **(కానిస్టేబుల్, 2010)**

1) హేస్టింగ్స్ 2) వెల్లస్లీ 3) డల్హౌసీ 4) కర్జన్

**6.** తొలి ఇనుము ఉక్కు కర్మాగారాన్ని TISCO ఏ సంవత్సరంలో స్థాపించింది. **(డీఎస్సీ - 2012)**

1) 1905 2) 1907 3) 1909 4) 1919

**7.** భారతదేశంలో తొలి రైల్వేలైన్‌ను ఎప్పుడు వేశారు? **(గ్రూప్ 1, ప్రిలిమ్స్, 2008)**

1) 1852 2) 1853 3) 1861 4)1835

**జవాబులు**

1-2; 2-1; 3-1; 4-1; 5-3; 6-2; 7-2;.

**రచయిత: బొత్స నాగరాజు**

# భారతదేశ చరిత్ర

## భారతదేశంపై ఆంగ్ల పాలనా ప్రభావాలు

భారత పరిశ్రమలు, వర్తక వాణిజ్యాలు, విద్యా, భాషా, సాహిత్య, కళారంగాలపై ఆంగ్లేయుల పాలన ఎంతో ప్రభావాన్ని చూపింది. జనపనార, వస్త్రాల మిల్లులు ప్రారంభం కావడంతో చేనేత, కుటీర పరిశ్రమలు దెబ్బతిన్నాయి. పారిశ్రామిక విప్లవంతో బాలకార్మిక వ్యవస్థ ప్రారంభమైంది. చరిత్ర అధ్యాయంలో ఇలాంటి అంశాలపై అభ్యర్థులు ప్రధానంగా దృష్టి పెట్టాలి.

### పరిశ్రమలు, వర్తక వాణిజ్యాలు

ఆంగ్లేయుల రాకతో భారతదేశంలో చేనేత, చిన్న తరహా కుటీర పరిశ్రమలు నాశనమయ్యాయి. రైలు మార్గాల నిర్మాణం ద్వారా గ్రామీణ చేతి వృత్తులు దెబ్బతిన్నాయి. "బయటి ప్రపంచంతో సంబంధం లేకుండా వేరుగా ఉన్న స్వయం సంపూర్ణ గ్రామ కవచాన్ని ఉక్కు పట్టాలు తూట్లు పొడిచాయి. వాటి జీవ రక్తం కారిపోయింది" అని డి.హెచ్. బుకానన్ అనే అమెరికన్ రచయిత వ్యాఖ్యానించాడు.

### మొదటి రైల్వే లైన్

భారతదేశంలో మొదటి రైల్వే లైన్‌ను 1853లో డల్హౌసీ కాలంలో బాంబే-థానేల మధ్య వేశారు. 1853లోనే తొలి బట్టల మిల్లును కౌస్జీ నానాభాయ్ బొంబాయిలో ఏర్పాటుచేశాడు. మొదటి జనపనార మిల్లును 1855లో బెంగాల్‌లోని రిష్రా వద్ద నెలకొల్పారు. 1907లో జంషెడ్‌పూర్ కేంద్రంగా తొలి ఉక్కు కర్మాగారం టాటా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీని (TISCO) ఏర్పాటుచేశారు. 1879 నాటికి మన దేశంలో 56 బట్టల మిల్లులు, 1882 నాటికి 20 జనపనార మిల్లులను ప్రారంభించారు. 1845లో భారతదేశ బొగ్గు గనుల్లో పనులు ప్రారంభమయ్యాయి. ఇంగ్లాండ్‌లో వచ్చిన పారిశ్రామిక విప్లవం వల్ల భారతదేశంలో చేనేత, కుటీర పరిశ్రమలు నాశనమయ్యాయి. వస్త్ర, జనపనార పరిశ్రమలు, టీ తోటల్లో మాత్రమే కొంత పారిశ్రామిక ప్రగతి చోటు చేసుకుంది.

భారతదేశం నుంచి ప్రధానంగా నీలి మందు ఎగుమతి అయ్యేది. 1860లో దీనబంధుమిత్ర 'నీల్ దర్పణ్' అనే నాటకాన్ని రాశాడు. "1833 తర్వాత ఆంగ్లేయులు భారతదేశంలోని వస్తువులు, మార్కెట్లను కాజేయడం ప్రారంభించారు" అని ఇర్ఫాన్ హబీబ్ అనే చరిత్రకారుడు పేర్కొన్నాడు. "భారతీయ వస్త్రాలు మన ఇళ్లు, బీరువా, చివరికి కప్పుకునే దుప్పట్ల జాబితాలోకి కూడా వచ్చి చేరాయి" అంటూ డేనియల్ డెఫో అనే రచయిత తన 'రాబిన్‌సన్ క్రూసో' నవల్లో పేర్కొన్నాడు. పారిశ్రామిక విప్లవ ఫలితంగా భారతదేశంలో ఏర్పడిన మురికివాడల దుర్భర పరిస్థితుల్ని ఛార్లెస్ డికెన్స్ తన నవలల్లో వర్ణించాడు. "భారతీయ వస్త్రాలపై అధిక సుంకాలు, నిషేధాలు విధించకుండా ఉంటే పైస్లే, మాంచెస్టర్ మిల్లులు ఆదిలోనే మూతపడి ఉండేవి" అని హెచ్. హెచ్. విల్సన్ అన్నాడు. ఆంగ్లేయుల వాణిజ్య విధానాలను గురించి పేర్కొంటూ నాటి మద్రాస్ బోర్డ్ ఆఫ్ రెవెన్యూ అధ్యక్షుడైన సుమలివాన్ "గంగ ఒడ్డున ఉన్న సంపదనంతా పీల్చేసి థేమ్స్ నది ఒడ్డున కక్కే స్పాంజి లాంటిది" అని రాశాడు.

### బాలకార్మిక వ్యవస్థ

లార్డ్ డల్హౌసీ కాలంలో 1853లో భారతదేశంలో తంతి–తపాలా వ్యవస్థలు ప్రారంభమయ్యాయి. పబ్లిక్ వర్క్స్ డిపార్ట్‌మెంటు ఏర్పాటు చేసి కలకత్తా – పంజాబ్ గ్రాండ్‌ట్రంక్ రోడ్డుతోపాటు 2 వేల మైళ్ల రహదారులను డల్హౌసీ కాలంలో నిర్మించారు. 1905 నాటికి భారతదేశంలో 28 వేల మైళ్ల రైలు మార్గాలు వేశారు. 1853 లోనే కలకత్తా నుంచి ఆగ్రా వరకు టెలిగ్రాఫ్ లైన్ వేశారు. మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో మాత్రం భారతదేశంలో భారీ పరిశ్రమల స్థాపన పెరిగి పారిశ్రామికాభివృద్ధి చెందింది. ఆంగ్లేయుల పారిశ్రామిక విప్లవ ప్రభావం, పరిశ్రమల అభివృద్ధి అనేది భారతదేశంలో బాలకార్మిక వ్యవస్థ ఏర్పాటుకు ప్రధాన కారణమైంది.

### ఆంగ్ల భాష

1835, మార్చి 7న భారతదేశంలో మెకాలే కమిటీ నివేదిక మేరకు ఆంగ్ల విద్యను విలియం బెంటింక్ ప్రవేశపెట్టాడు. "మనకు భారతీయులకు మధ్య పనిచేసే దుబాషీ వర్గాన్ని సృష్టించాలి. వారు రక్తం, రంగుల్లో భారతీయులుగా, అభిప్రాయాలు, గుణగణాలు, బుద్ధుల్లో ఆంగ్లేయులుగా ఉండాలి" అని మెకాలే పేర్కొన్నాడు. 'భారతదేశంలోని మొత్తం సాహిత్యం యూరోపియన్ షెల్ఫ్‌లోని ఒక అల్మరా సాహిత్యానికి సరిపోద'ని మెకాలే వ్యాఖ్యానించాడు. హెన్రీ డెరోజియా అనే ఆంగ్లేయుడు కూడా భారతదేశంలో ఆంగ్ల విద్యాభివృద్ధికి కృషిచేశాడు. 1844 నుంచి ఆంగ్లం నేర్చుకున్న భారతీయులకు ఉద్యోగాలు ఇవ్వడం ప్రారంభించారు. 1854లో చార్లెస్ ఉడ్స్ కమిటీని డల్హౌసీ నియమించి విద్యాభివృద్ధికి సూచనలు చేయమన్నాడు. ఉడ్స్ కమిటీ నివేదిక ప్రకారమే విశ్వవిద్యాలయాల స్థాపన, ఉపాధ్యాయ

శిక్షణా సంస్థల ఏర్పాటు, గ్రాంట్-ఇన్-ఎయిడ్ కల్పన, ఉపకార వేతనాల మంజూరు లాంటివి జరిగాయి. 1857లో కలకత్తా, బొంబాయి, మద్రాస్ విశ్వ విద్యాలయాలను స్థాపించారు. చరిత్రకారులు ఉడ్స్ నివేదికను 'మాగ్నాకార్టా ఆఫ్ ఇంగ్లిష్ ఎడ్యుకేషన్ ఇన్ ఇండియా' అని పేర్కొన్నారు. 1882లో లార్డ్ రిప్పన్ విద్యా రంగంలో సూచనలపై హంటర్ కమిటీని నియమించాడు. 1902లో లార్డ్ కర్జన్ థామస్ రాలీ విద్యా కమిటీని నియమించాడు. 1904లో లార్డ్ కర్జన్ విశ్వవిద్యాలయాల చట్టాన్ని ప్రవేశపెట్టారు. లార్డ్ రెండో హార్డింజ్ కాలంలో విద్యాభివృద్ధి కోసం ఏటా 50 లక్షల రూపాయలను కేటాయించారు. గవర్నర్ జనరల్ కార్యనిర్వాహక సంఘంలో కూడా ఒక విద్యాశాఖ సభ్యుడిని నియమించారు. అలా నియమించిన మొదటి వ్యక్తి హెన్రీ బట్లర్.

1869లో లాహోర్ విశ్వవిద్యాలయం, 1882లో పంజాబ్ విశ్వవిద్యాలయం, 1887లో అలహాబాద్ విశ్వవిద్యాలయం స్థాపించారు. 1901లో లార్డ్ కర్జన్ విద్యా రంగంపై సిమ్లా సమావేశాన్ని ఏర్పాటుచేశాడు. 1901 నాటికి భారతదేశంలో పురుషుల్లో ప్రతి వెయ్యి మందికి తొంభై మంది, స్త్రీలలో 1000కి ఏడుగురు మాత్రమే అక్షరాస్యులుగా ఉన్నారు. 1919లో ఉస్మానియా విశ్వవిద్యాలయం, 1920లో లక్నో విశ్వవిద్యాలయం, 1921లో శాంతినికేతన్ (రవీంద్రనాథ్ ఠాగూర్) 1922లో ఢిల్లీ విశ్వవిద్యాలయాలను స్థాపించారు. 1916లో డి.కె. కార్వే పూనాలో మహిళా విశ్వవిద్యాలయాన్ని స్థాపించాడు. 1941 నాటికి భారతీయ అక్షరాస్యత కేవలం 12 శాతం మాత్రమే. 1937లో గాంధీజీ సేవాగ్రామ్ (వార్ధా) విద్యా ప్రణాళికను రూపొందించి బేసిక్ విద్యా విధానాన్ని ప్రవేశపెట్టారు. వృత్తి విద్యకు ఇందులో అధిక ప్రాధాన్యమిచ్చారు. విద్యా రంగంపై 1943లో సార్జెంట్ కమిషన్, 1949లో రాధాకృష్ణ కమిషన్‌లను నియమించారు.

## భాష, సాహిత్యం, కళారంగాలపై ప్రభావం

వారన్ హేస్టింగ్స్ కాలంలో విలియం జోన్స్ అధ్యక్షతన 'ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్' అనే సంస్థను ఏర్పాటు చేశారు. కాళిదాసు రచించిన 'అభిజ్ఞాన శాకుంతలం' గ్రంథాన్ని విలియం జోన్స్ ఆంగ్లంలోకి అనువదించాడు. భరతేంద్రు హరిశ్చంద్ర ఆధునిక హిందీ సాహిత్యాభివృద్ధికి కృషిచేశాడు. 1913లో రవీంద్రనాథ్ ఠాగూర్ సాహిత్యంలో నోబెల్ బహుమతి పొందిన తొలి భారతీయుడిగా ఖ్యాతి గడించాడు. రవీంద్రనాథ్ ఠాగూర్ 'జనగణమన' గీతాన్ని, బంకించంద్ర ఛటర్జీ 'వందేమాతరం' గేయాన్ని, మహ్మద్ ఇక్బాల్ 'సారే జహాసే అచ్ఛా' గీతాన్ని రాశారు. ఆంగ్ల విద్యా ప్రభావంతో భారతదేశంలో దేశభక్తి ప్రధానమైన సాహిత్యాన్ని ఎక్కువగా రాశారు. తెలుగులో గురజాడ అప్పారావు, మరాఠీలో హరినారాయణ, తమిళంలో సుబ్రహ్మణ్య భారతి, అస్సామీలో హేమచంద్ర బారువా, ఒడిస్సీలో ఫకీర్‌మోహన్ సేనాపతి, కన్నడలో కె.వి. పుట్టప్ప లాంటి రచయితలు ఎంతో ప్రసిద్ధిచెందారు.

## భారతీయుల ఘనత

రవీంద్రనాథ్ ఠాగూర్ పెయింటింగ్‌ను అభ్యసించారు. రాజా రామ్మోహన్‌రాయ్ రామాయణ, మహాభారత గాథల్ని చిత్రాలుగా గీసేవాడు. వృత్తి పనివారి నిత్య జీవితాలను, స్వాతంత్రోద్యమ ఘట్టాలను నందాలాల్ బోస్ చిత్రించేవాడు. వైద్య విద్యలో భారతీయులు ప్రావీణ్యం సాధించారు. భారతదేశంలో మొదటి వైద్య విద్యార్థిగా పేరుపొందిన మహేంద్రలాల్ సర్కార్ 1876లో ఇండియన్ సైన్స్ అసోసియేషన్ అనే సంస్థను స్థాపించాడు. 1930లో సర్ సి.వి. రామన్ భౌతికశాస్త్రంలో నోబెల్ బహుమతిని పొందిన తొలి భారతీయుడిగా 20వ శతాబ్దపు గొప్ప గణిత మేధావిగా శ్రీనివాస రామానుజన్ ప్రసిద్ధిచెందాడు. జల విద్యుత్ ఉత్పత్తి, నదులకు ఆనకట్టలు కట్టడం, పట్టు పరిశ్రమ అభివృద్ధి, ఆర్థిక ప్రణాళికా రూపకల్పన లాంటి అనేక రంగాల్లో ప్రావీణ్యం పొందిన భారతీయుడిగా మోక్షగుండం విశ్వేశ్వరయ్య పేరొందారు. ప్రేమ్‌చంద్ అనే రచయిత తన రచనల్లో గ్రామీణ పేదరికాన్ని గురించి ఎక్కువగా రాశాడు.

## విద్యా, సారస్వతాల అభివృద్ధి - ప్రభావం

ప్రాచీన భారతదేశంలో గురుకుల విద్యా వ్యవస్థ అమల్లో ఉండేది. ముస్లిం పాలకుల కాలంలో మదర్‌సాల ప్రాధాన్యం పెరిగింది. ఆంగ్లేయుల పాలనలో భారతీయ విద్యారంగం అనేక మార్పులకు గురైంది. 1700 నాటికే బెంగాల్‌లో ప్రతి 400 మందికి ఒక పాఠశాల ఉండేదని మాక్స్ ముల్లర్ అనే జర్మన్ పండితుడు పేర్కొన్నాడు. 1781లో వారన్ హేస్టింగ్స్ కలకత్తాలో ఒక మదర్సాను స్థాపించాడు. బెనారస్‌లో ఆంగ్ల రెసిడెంట్‌గా ఉన్న జోనాథన్‌డంకన్ బెనారస్ సంస్కృత కళాశాలను స్థాపించాడు. 1817లో హెమ్మింగ్ హేస్టింగ్స్ (లార్డ్ హేస్టింగ్స్) కలకత్తాలో హిందూ కాలేజ్‌ను స్థాపించాడు. 1813 చార్టర్ చట్టం ద్వారా విద్యాభివృద్ధికి ఏటా లక్ష రూపాయలు కేటాయించారు. 1833 చార్టర్ చట్టం ద్వారా దాన్ని పది లక్షల రూపాయలకు పెంచారు. కలకత్తా హిందూ కాలేజ్ స్థాపనలో డేవిడ్‌హేర్, రాజా రామ్మోహన్‌రాయ్, హైడ్‌ఈస్ట్‌లు ప్రధాన పాత్ర పోషించారు. రాజా రామ్మోహన్‌రాయ్ కూడా 1817లో కలకత్తాలో ఒక ఆంగ్ల పాఠశాలను స్థాపించాడు. 1818లో విలియంకేరీ సెరాంపూర్‌లో బాప్టిస్ట్ మిషనరీ కాలేజీని ఏర్పాటు చేశాడు. 1833లో పూనా, 1834లో బొంబాయిలో ఎల్ఫిన్‌స్టన్ కాలేజీలను ప్రారంభించారు. "భారతీయులను విద్యావంతులను చేయడం అంటే మనల్ని ఐరోపాకు తిరిగి పంపే రహదారి వేయడం అన్నమాటే" అని ఎల్ఫిన్‌స్టన్ వ్యాఖ్యానించాడు. తాళంచెవి లాంటి ఆంగ్లభాషను కంపెనీ భారతీయులకు అందించాలని చార్లెస్‌గ్రాంట్ పేర్కొన్నాడు.

**రచయిత: బొత్స నాగరాజు**